# తెలుగు సాహిత్యం మరో చూపు

(1979 అక్టోబరు నుంచి, 1980 సెప్టెంబరు వరకు జరిగిన
'సారస్వత వేదిక' ఉపన్యాస వ్యాసాల సంకలనం)




సంపాదకుడు

కె. కె. రంగనాథాచార్యులు

సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్ - హైదరాబాద్

ప్రథమ ముద్రణ : 1981

ప్రతులు : 2000



వెల రూ. 8-00

Paper used for the Printing of this book was made available by the Government of India at Concessional rate.

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,
హైదర్‌గూడ, హైదరబాదు-500 001.

# మా మాట

ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రతి నెలా మొదటి ఆదివారం ఉదయం పది గంటలకు 'సారస్వత వేదిక' సాహిత్య సమావేశాలు జరుపుతుంది. హైదరాబాదు నగరంలోని సాహితీ మిత్రులు, యువకులు, విద్యార్థులు ఉత్సాహంతో ఈ సమావేశాలలో పాల్గొంటున్నారు. ఒక ప్రత్యేక సాహిత్య విషయంపైన ఒక ప్రధాన వక్త మాట్లాడటం, తరువాత చర్చ జరగటం ఈ సమావేశాల ప్రత్యేకత. 1979 అక్టోబరు నుంచి 1980 సెప్టెంబరువరకు నాలుగవ సంవత్సరంలో జరిగిన ఉపన్యాస వ్యాసాల సంకలనం ఇది. ప్రాచీన సాహిత్యాన్ని ఇంతకాలం శైలి, అలంకారం, రసం మొదలైన కళాత్మక విలువల దృష్ట్యా మాత్రమే ప్రధానంగా పరిశీలించటం జరుగుతూ వస్తున్నది. కాని సామాజిక, రాజకీయ, చారిత్రక భూమికతో తెలుగు సాహిత్యాన్ని పరిశీలించాలనే దృష్టితో పన్నెండు శీర్షికలపైన ఉపన్యాస చర్చాకార్యక్రమాలను 'సారస్వత వేదిక' ఏర్పాటు చేసింది.

ఈ ప్రణాళికకు 'తెలుగు సాహిత్యం-మరోచూపు' అన్న పేరును సూచించింది శ్రీదేవులపల్లి రామానుజరావుగారు. ఉపన్యాసవ్యాసకర్తలందరూ విభిన్న దృక్పథాలకు సంబంధించిన వారు కావటంవల్ల వ్యాసాలన్నీ ఒకే తోవలో నడిచాయని చెప్పలేం. వాటిని సమన్వయంచేసే ప్రయత్నం సంపాదకీయ వ్యాసంలో జరిగింది. మొత్తం మీద ఈ తోవలో కొత్త ప్రయత్నమిది. తరువాత పరిశోధనలకు ఇది ఏమాత్రం ఉపయోగించినా మేం కృతకృత్యులమైనట్లే. ఒకటి రెండు వ్యాసాల సంక్షిప్తపాఠాలు తయారుచేయటంలో మిత్రుడు శ్రీ డి. చంద్రశేఖరరెడ్డి తోడ్పడ్డాడు. ప్రూపులు దిద్దటంలో శ్రీ డి. చంద్రశేఖరరెడ్డి, శ్రీ ఎమ్. నరహరి సహాయం చేశారు. అయినా అచ్చు తప్పులు తప్పలేదు. శ్రీ ఎమ్. నరహరి తయారుచేసిన ముఖ్యమైన తప్పొప్పుల పట్టికను పుస్తకం చివర చేర్చాం. ఉపన్యాస వ్యాసకర్తలకి, సారస్వతవేదిక కార్యక్రమాలలో, పుస్తకం ప్రచురణలో తోడ్పడ్డ వారికి కృతజ్ఞతలు.

హైదరాబాదు
30-3-1981

కె. కె. రంగనాథాచార్యులు
సంచాలకుడు
సారస్వత వేదిక.

# ఇందులో ....

# ఇందులోని రచయితలు

కె. కె. రంగనాథాచార్యులు
ఎమ్.ఏ. (తెలుగు), ఎమ్.ఏ. (సంస్కృతం), ఎమ్.ఏ. (లింగ్విస్టిక్స్)
పిహెచ్.డి. (లింగ్విస్టిక్స్)
ప్రిన్సిపాల్, ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల,
తిలక్‌రోడ్, హైదరాబాదు.

**ముదిగొండ వీరభద్రశాస్త్రి**
ఎమ్ ఏ. (తెలుగు), పిహెచ్.డి. (తెలుగు)
డిప్యూటీ డైరెక్టర్
అంతర్జాతీయ తెలుగు సంస్థ,
బర్కత్‌పురా, హైదరాబాద్

కె. సంపత్కుమారాచార్య
ఎమ్. ఏ. (తెలుగు), పిహెచ్.డి. (తెలుగు)
లెక్చరర్, తెలుగు శాఖ,
కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్

రావి భారతి
ఎమ్. ఏ. (తెలుగు), పిహెచ్.డి. (తెలుగు)
తెలుగు లెక్చరర్, ఆర్.బి.వి.ఆర్. మహిళా కళాశాల,
నారాయణగూడ, హైదరాబాద్

గంగిశెట్టి లక్ష్మీనారాయణ
ఎమ్. ఏ. (తెలుగు)
డిప్యూటీ డైరెక్టర్
అంతర్జాతీయ తెలుగు సంస్థ,
బర్కత్‌పురా, హైదరాబాద్

ఇరివెంటి కృష్ణమూర్తి

ఎమ్.ఏ (తెలుగు), పిహెచ్.డి (తెలుగు)

రీడర్, తెలుగుశాఖ, పి.జి. సెంటర్

(ఉస్మానియా విశ్వవిద్యాలయం)

బషీర్‌బాగ్, హైదరాబాద్

ఎస్. వి. రామారావు

ఎమ్.ఏ. (తెలుగు), పిహెచ్.డి. (తెలుగు)

రీడర్, తెలుగుశాఖ

ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్

ఎమ్. నరహరి

ఎమ్.ఏ. (తెలుగు), ఎమ్.ఫిల్. (తెలుగు)

లెక్చరర్, ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల,

తిలక్‌రోడ్, హైదరాబాద్

బూదరాజు రాధాకృష్ణ

ఎమ్.ఏ. (తెలుగు), పిహెచ్.డి.

డిప్యూటీ డైరెక్టర్, తెలుగు అకాడమీ,

హిమాయత్‌నగర్, హైదరాబాద్

ఎన్. గోపి

ఎమ్.ఏ. (తెలుగు), పిహెచ్.డి. (తెలుగు)

తెలుగు లెక్చరర్, సైఫాబాద్ సైన్స్ కళాశాల,

మాసాబ్‌టాంక్, హైదరాబాద్

నాయని కోటేశ్వరి

ఎమ్.ఏ. (తెలుగు), పిహెచ్.డి. (తెలుగు)

లెక్చరర్, ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల,

తిలక్‌రోడ్, హైదరాబాద్

డి. చంద్రశేఖరరెడ్డి

ఎమ్.ఏ. (తెలుగు), ఎమ్.ఏ. (లింగ్విస్టిక్స్), ఎమ్.ఫిల్. (తెలుగు)

లెక్చరర్, ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల,

తిలక్‌రోడ్, హైదరాబాదు.

సంపాదకీయ వ్యాసం

# తెలుగు సాహిత్యం - మరో చూపు

— కె. కె. రంగనాథాచార్యులు

## చరిత్ర - సాహిత్యం

తెలుగు సాహిత్యాన్నే కాదు, ఏ భారతీయ భాషా సాహిత్యాన్నైనా చారిత్రక దృష్టితో అధ్యయనం చేయాలంటే భారత ఉపఖండం మొత్తం చరిత్రను భూమికగా తీసుకోవలసి ఉంటుంది. తెలుగు సాహిత్యంతోపాటు అనేక భారతీయ ప్రాంతీయ భాషా సాహిత్యాలు ఫ్యూడల్ యుగంలో ప్రారంభం అవుతాయి. ఫ్యూడల్ యుగంలో భారత దేశంలోని పెద్ద పెద్ద సామ్రాజ్యాలు విచ్ఛిన్నమై చిన్న చిన్న రాజ్యాలుగా ఏర్పడినా, ఈ రాజ్యాల ఎల్లలు, సరిహద్దులు ఎప్పటికప్పుడు మారుతూ రాజకీయాలు, భౌగోళిక స్వరూప స్వభావాలు అస్థిరంగా ఉన్నా అధికార వర్గం స్వరూప స్వభావాలలో, ఆర్థిక సంబంధాలలో, భూముల స్వత్వ స్వామ్యాలకు సంబంధించిన విషయాలలో ఇంచుమించు దేశం అంతా ఒకే విధమైన వ్యవస్థ కనిపిస్తుంది. దీనికి ప్రధాన కారణం భారత దేశంలోని ప్రాంతీయ రాజ్యాల భూభాగాలన్నీ ద్వీపాలుగా, చీలికలుగా కాక సన్నిహితంగా ఉండటమే. యూరోపియన్ ఫ్యూడలిజానికి భారతదేశపు ఫ్యూడలిజానికి కల ప్రధాన భేదానికి కారణం కూడా ఇదే. యూరప్ ఖండంలోని రాజ్యాలు సన్నిహితంగా చేరి లేక చిన్నచిన్న ద్వీపాలుగా చీలి ఉండటం, సముద్రతీరాల ద్వారా వస్తువుల ఎగుమతి, దిగుమతి వ్యాపారం మీద వాటి ఆర్థిక వ్యవస్థ ఆధారపడి ఉండటం కనిపిస్తుంది. వాటి ఆర్థిక వ్యవస్థ వ్యవసాయంపైన ఆధారపడిలేదు బానిసవిధానం ప్రధానంగాఉండి బానిసలతో తయారు చేయించిన వస్తువులకు ఎగుమతి చేయటం, ప్రతిగా తమకు అవసరమైన ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకోవటం జరిగేవి. యూరోపియన్ ఫ్యూడల్ వ్యవస్థలో రాజకీయాలతో, పరిపాలనతో సంబంధం

ఉన్న పురోహిత వర్గం లేదు. రోమన్ చట్టం మొదలైన వాటిలో మతానికి, నైతిక విషయాలకు ప్రాధాన్యం లేదు. అందువల్ల బ్రాహ్మణ సాహిత్యంలాంటిది అక్కడ కనిపించదు. ఇదే దశలో భారతదేశ పరిస్థితి దీనికి భిన్నంగా ఉంటుంది. భారత ఉపఖండం సన్నిహితంగా చేరిఉన్న విస్తృతమైన భూభాగం. పరస్పర వ్యాపార సంబంధాల కారణంగా, అభివృద్ధి చెందిన రేవుల కారణంగా ఉపఖండంలోని అసంఖ్యాకంగా ఉన్న ప్రాంతీయ రాజ్యాలు సంబంధాలులేని విడి భాగాలుగా చీలిపోలేదు విభిన్న రాజ్యాలను పరిపాలిస్తుండిన అధికార వర్గం ఆర్థికంగా, సాంస్కృతికంగా, పరిపాలనాపరంగా సమాన స్వభావం కలిగి ఉండేది. ఫ్యూడల్ యుగం నాటి భారత దేశపు ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా భూమిపైన, వ్యవసాయంపైన ఆధారపడి ఉంది. కర్షకుల, రైతుల శ్రమశక్తి పైననే భూస్వాములు ఆధారపడి ఉన్నా యూరోపియన్ దేశాలలో కనిపించే కఠినమైన బానిస విధానం ఇక్కడ కనిపించదు. భారతదేశ చరిత్రలో, ముఖ్యంగా ఫ్యూడల్ యుగంనాటి రాజకీయాలలో, పరిపాలనలో పురోహిత బ్రాహ్మణ వర్గానికి, మతానికి ప్రాధాన్యం ఉంది. ఈ కాలంనాటి భారతదేశం లోని ప్రాంతీయ భాషా సాహిత్యాలు ఆస్థాన, ఆస్థానేతరసాహిత్యాలుగా అభివృద్ధి చెందాయి. ఆస్థాన సాహిత్యం ఫ్యూడల్ వ్యవస్థకు అనుకూలమై దానిని బలపరచటానికి ఉపయోగిస్తే, ఆస్థానేతర సాహిత్యం ఫ్యూడల్ వ్యవస్థను, దానికనుకూలమైన కుల వ్యవస్థనూ వ్యతిరేకిస్తూ భక్తి సాహిత్యంగా జనంలో వ్యాపించింది ఆయా ప్రాంతాలకు సంబంధించిన ప్రత్యేకమైన చారిత్రక కారణాల వల్ల కొన్ని భాషలలోని లిఖిత సాహిత్య చరిత్రలో ఆస్థాన సాహిత్యానికి ప్రాధాన్యం ఏర్పడగా, కొన్ని భాషలలో ఆస్థానేతర సాహిత్యానికి సమప్రాధాన్యం, మరి కొన్నింటిలో ఎక్కువ ప్రాధాన్యం కూడ కనిపిస్తుంది. ఫ్యూడల్ శక్తులు బలంగా ఉన్నచోట ఆస్థాన సాహిత్యం, ఫ్యూడల్ వ్యతిరేకమైన భక్తి ఉద్యమాల్లాంటివి ఎక్కువగా ఉన్నచోట ఆస్థానేతర సాహిత్యం ప్రాధాన్యాన్ని పొందాయి. తెలుగులో ఆస్థాన సాహిత్యానికి, ఔత్తరాహ సాహిత్యాలలో ఆస్థానేతర సాహిత్యానికి ప్రాధాన్యం కనిపిస్తుంది. ఆస్థాన సాహిత్యానికైనా, ఆస్థానేతర సాహిత్యానికైనా మతమే ప్రధాన ప్రాతిపదికగా కనిపిస్తుంది

పై పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని తెలుగు సాహిత్యాన్ని పరిశీలించవలసి ఉంటుంది. ఉత్పత్తి సాధనాలు, ఉత్పత్తి సంబంధాల్లో కాలక్రమంలో వచ్చిన పరిణామాన్ని చెప్పటమే దేశ చరిత్ర అయితే, ఆ సంబంధాలు సాహిత్యంలో ఎట్లా ప్రతిబింబించాయో, దానికి అనుగుణంగా సాహిత్యరూపాలు ఎట్లా సంతరించుకున్నాయో చెప్పటమే సాహిత్య చరిత్ర శిష్ట సాహిత్యం పేరుతో మనకి అందుబాటులో ఉన్న తెలుగులోని లిఖిత సాహిత్యం ఇలాంటి సాహిత్య చరిత్ర నిర్మాణానికి ఎంతవరకు ఉపకరిస్తుందో చెప్పటం కష్టమే. సంస్కృతీ సభ్యతలు మేధావి వర్గం సృష్టి అని, వారికి, వారిపైన ఆధారపడిన పాలక వర్గానికి మాత్రమే అవి సంబంధించినవనీ భారతదేశానికి సంబంధించినంతవరకు ఆ సంస్కృతి ఆధ్యాత్మిక విలువలు ప్రధానంగా కలిగిఉందని, మతం, తత్వం, చట్టం, సాహిత్యం, సంగీతం, చిత్రకళ మొదలైన ఉపరితల విషయాలన్నింటిలో ఆధ్యాత్మికత ప్రతిబింబిస్తుందనే అభిప్రాయం ఒకటి ఉంది ఈ సంస్కృతిని ప్రతిబింబించే సాహిత్యమే నిజమైన సాహిత్యమనీ, దానికి సంబంధించిన చరిత్రే నిజమైన చరిత్ర అనీ వారి నమ్మకం సాహిత్యంలో సామాజిక పంస్థితుల పేరిట నగలలో, వస్త్రాలలోని రకాలు, భోజన పదార్థాలలోని వైవిధ్యాలు, కోప గృహాలు, వేశ్యావాటికలు మొదలైన సంపన్న వర్గాల భోగవస్తువుల వివరాలు మాత్రమే సాహిత్య విమర్శలలో కనిపిస్తున్నాయి. సమకాలీన సమాజ నిర్మాణం, ఆర్థిక వ్యవస్థ, ఉత్పత్తి సంబంధాలు-వీటివల్ల ఉత్పన్నమయ్యే వివిధ వర్గాల మధ్య సంబంధాలు వీటి దృష్టితో సాహిత్య పరిశీలన జరుగవలసి ఉన్నది. తెలుగు సాహిత్యానికే, ఆ మాటకు వస్తే భారతీయ భాషా సాహిత్యాలకు సంబంధించిన విమర్శ, చరిత్ర, పరిశీలన రూపానికిచ్చిన ప్రాధాన్యం విషయానికివ్వ లేదు. ఇప్పటికీ పరిశోధనలు రూపంలో, ఒక విషయాన్ని చెప్పడంలో కవి ప్రదర్శించిన నైపుణ్యాన్ని, చమత్కారాన్ని, ప్రతిభను వివరించటంతో సంతృప్తి పడుతున్నాయి. యాంత్రికంగా కొలత బద్దల ప్రకారం రచనా శైలి, అనువాద పద్ధతులు మొదలైన వాటిని గురించి చెప్పటం, ఇతర సామాజిక దృగ్విషయాల నుంచి వేరుచేసి సాహిత్యానికి ఒక ప్రత్యేక అస్తిత్వాన్నిచ్చి చర్చించటం జరుగుతున్నది ఒక విషయాన్ని అభివ్యక్తీకరించే పద్ధతిలోని కళాత్మక విలువలనుబట్టి ఒక రచనను సాహిత్యం అని, సృజనాత్మక రచన అని అంటున్న మాట నిజమే కాని అభివ్యక్తీకరణ పద్ధతిని, రచనా రూపాన్ని

నిర్ణయించేది కవియొక్క సాంఘిక అస్తిత్వం, కవి ఆశించే ప్రయోజనం అని గుర్తించగలిగినప్పుడే నిజమైన సాహిత్య చరిత్ర నిర్మాణం జరుగుతుంది.

భారతదేశానికి సంబంధించిన సామాజిక చరిత్రను పరిశీలించినప్పుడు ప్రతి మారిన దశలోను ఆ దశకు సరిపడకపోయినా పూర్వ పూర్వ దశలలోని సంప్రదాయ భావాల ప్రభావం కనిపిస్తుంది. ఉత్పత్తి సంబంధాలలో, సామాజిక సంబంధాలలో ప్రధానమైన మార్పులు వచ్చినా, వస్తున్నా మారిన దశలోని అధికార వర్గానికి పూర్వ దశలలోని ఉత్పత్తి సంబంధాల మూలంపైన ఏర్పడ్డ మత సంబంధమైన భావజాలం ఆదర్శం అవుతున్నది. మతమే చరిత్ర కాక పోయినా, భారతదేశానికి సంబంధించినంతవరకు మత స్వరూప స్వభావాలలోని మార్పులు చరిత్ర నిర్మాణానికి బాగా దోహదం చేస్తున్నాయి. దేశ చరిత్రలో, ఆ నేపథ్యంలో వచ్చిన సాహిత్యంలో మతానికంత ప్రాధాన్యముంది. ఏ భారతీయ భాషా సాహిత్యానికీ, మరీ ముఖ్యంగా ఆస్థాన సాహిత్యానికి వాస్తవాలతోను, నిజమైన చరిత్రతోను సంబంధం చాలా తక్కువ. చారిత్రక గ్రంథాలని చెప్ప దగ్గ వాటిలో కూడా చాలా వరకు కల్పనలు చోటు చేసుకున్నాయి. దీనికితోడు ప్రతి దశలోను అధికార వర్గ భావ జాలంలో వైరుధ్యాలు కనిపిస్తాయి. ఈ వైరుధ్యాలన్నీ సాహిత్యంలో దర్శన మిస్తాయి. అనేక వృత్తులవారినుంచి, ఇతర జాతులనుంచి అసంఖ్యాకంగా కొత్త కులాలు ఏర్పడ్డ ఫ్యూడల్ దశలో కూడా సైద్ధాంతికంగా, సాంప్రదాయికంగా, మతపరంగా చాతుర్వర్ణ్య వ్యవస్థ కొనసాగింది. ఫ్యూడల్ యుగపు పరిపాలకులకు సామ్రాజ్యయుగం నాటి చక్రవర్తులు ఆదర్శం. సమకాలీన సమాజం, సమాజంలో తమ అస్తిత్వం-సంప్రదాయ భావజాలం-వీటివల్ల వైరుధ్యాలు ఉత్పన్నమౌతాయి. ఈవైరుధ్యాలు సాహిత్యంలో ప్రతిబింబించటం సహజం. అందులో కవి రచన ప్రాచీన సంస్కృత సాహిత్యగ్రంథాలకు అనుసరణో, అనువాదమో అయినప్పుడు ఈ వైరుధ్యం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. తను నివసిస్తున్న సమాజం, నాటి పరిస్థితులు, తాను అనుసరణకు, అనువాదానికి గ్రహించిన గ్రంథంలోని భావ జాలం-వీటి పరస్పర వైరుధ్యాలు కవిని వెంటాడుతుంటాయి. తన కాలం నాటి సమాజం ఒక రకంగా ఉంటే తను కోరుతున్నది, గొప్పదనుకుంటున్నదేమో తనకంటే వేయి సంవత్సరాలముందు నెలకొన్న మత సంప్రదాయాలు సిద్ధాంతాలు, భావాలు. విషయంతోపాటు సాహిత్యరూపం విషయంలోను ఈ వైరుధ్యాలు

కనిపిస్తాయి. ఈ వైరుధ్యాలను గుర్తించి వేరు చేయగలిగినప్పుడే సమకాలీన పరిస్థితులను, సాహిత్య స్వరూప స్వభావాలను సరిగ్గా అంచనా వేయగలం మత, సామాజిక విషయాలకు సంబంధించి మూలం భారతంలో, నన్నయ భారతంలో కనిపించే భేదాలకు కారణం ఏమిటి? ప్రాంతీయ భాషగా తెలుగులో నన్నయతో ప్రారంభమైందని చెప్తున్న లిఖిత సాహిత్య స్వరూప స్వభావాలు ఆ విధంగా ఉండటానికి కారణం ఏమిటి ? దేశి, జాను తెనుగు మార్గాన్ననుసరిస్తున్నానని చెప్పుకున్నా పాల్కురికి సోమన రచనలపైన మార్గ ప్రభావం అంతగా ఎందుకు ఉంది? తిక్కన సాధించిన సమన్వయం ఏమిటి? తెలుగులో ఆస్థాన సాహిత్యాన్ని పరాకాష్ఠ దశకు చేర్చటంలో శ్రీనాథుని పాత్ర ఏమిటి? భక్త కవి అయిన పోతన ఔత్తరాహ భక్త కవులలా కాకుండా కవితా రూపాన్ని ఎన్నుకోవటంలో సంస్కృతీ కృతమైన మార్గ పద్ధతినే ఎందుకు ఎన్నుకున్నాడు ? అన్నమయ్య కీర్తనల స్వరూప స్వభావాలను నిర్ణయిస్తున్నదేమిటి ? ఏ ఆర్థిక, సామాజిక పరిస్థితులు ప్రబంధాల్లాంటి రచనలు రావటానికి కారణం అయ్యాయి ? ప్రబంధ యుగంలో ధూర్జటికి గల ప్రత్యేకతలకు కారణం ఏమిటి ? యక్షగానాలేం చెప్తున్నాయి? వేమనకున్న ప్రత్యేకత ఏమిటి? అతనిలోనే కనిపించే వైరుధ్యాలకు కారణంఏమిటి? 18,19 శతాబ్దుల నాటి శతకాలు ఆవిధంగా రావటం యాదృచ్ఛికమేనా?-ఇలాంటి ప్రశ్నలకు యాంత్రికంగా సమాధానాలు చెప్పటం సాధ్యం కాదు. సమకాలీన చరిత్రను, సమాజాన్ని, భావ జాలాన్ని, అందులో కనిపించే వైరుధ్యాలను అర్థంచేసుకోగలిగినప్పుడే కొంతవరకైనా సమాధానాలు లభిస్తాయి. సాహిత్యాన్ని బట్టి సమకాలీన సమాజాన్ని, చారిత్రక స్థితిగతులను మనం తెలుసుకోగలిగింది చాలా తక్కువ. ఏ చారిత్రక పరిస్థితులలో అలాంటి సాహిత్యం వచ్చిందో చెప్పటమే మనం చేయగలిగిన పని. ఆయా రచనలకు గల చారిత్రక భూమికను తెలుసుకోవటానికి ఆ రచనలపైన మాత్రమే ఆధారపడి లాభంలేదు. ఇతరత్ర పురావస్తు పరిశోధన, చరిత్రకు సంబంధించిన ఇతర రంగాలలోని ఆధారాలపైన నిర్మితమైన చరిత్రతో కొంత పూర్వ పరిచయం ఉన్నప్పుడు మాత్రమే గ్రంథ రచనాకాలంనాటి చారిత్రక పరిస్థితులకు, గ్రంథ రచనకు గల సంబంధం బోధపడుతుంది. విషయంలోను, రూపంలోను రచన ఆ విధంగా ఎందుకు ఉందో అర్థం అవుతుంది. దేశ చరిత్రకారునిలాగే, సాహిత్య చరిత్రకారుడు కూడా చేయవలసింది గతాన్ని, గత సాహిత్యాన్ని గుడ్డిగా అభిమానించ

టమో లేక పూర్తిగా దాన్నుంచి తెగతెంపులు చేసుకోవడమో కాదు- వర్తమానాన్ని, వర్తమాన సాహిత్యాన్ని అవగాహన చేసుకోవటానికి కీలకంగా గత సాహిత్యాన్ని అర్థంచేసుకొనేట్టు చేయటం మాత్రమే.

## ఇరుగు పొరుగు సాహిత్యాలు

భారతదేశ చరిత్రలో ఫ్యూడల్ యుగంలో సుమారుగా పది, పదకొండు శతాబ్దాలలో ప్రాంతీయ భాషా సాహిత్యాలు ప్రారంభమయ్యాయి. ఇది ఫ్యూడల్ అనుకూల ఆస్థాన సాహిత్యం గాను, ఫ్యూడల్ వ్యతిరేక ఆస్థానేతర సాహిత్యం గాను వచ్చింది. ఫ్యూడల్ వ్యతిరేక సాహిత్యం ముఖ్యంగా భక్తి సాహిత్యంగా పెంపొందింది. తెలుగు, కన్నడాలలో ఆస్థాన సాహిత్యానికి లిఖిత సాహిత్య చరిత్రలో ప్రాధాన్యం లభిస్తే, ఆర్య భాషా కుటుంబానికి చెందిన ఔత్తరాహ భాషల్లో ఆస్థానేతర సాహిత్యానికి ప్రాధాన్యం లభించింది. ఉత్తర భారతంలో ఆస్థాన సాహిత్యం ముఖ్యంగా సంస్కృత సాహిత్యంకాగా, ఆస్థానేతర సాహిత్యం దేశీయ భాషలలో, దేశీయ పద్ధతులలో వచ్చింది. తెలుగు, కన్నడాలలో ఆస్థాన, ఆస్థానేతర సాహిత్యం ప్రధానంగా ఆ భాషలలోనే రెండు మార్గాలకు సంబంధించిన పద్ధతులలో కనిపిస్తుంది. భాషలో, రూపంలో, ఛందంలో సంస్కృతీకృతమైన పండిత మార్గంలో ఆస్థాన సాహిత్యమూ, దేశీయమైన గీతాల రూపంలో, సాధారణ భాషలో ఆస్థానేతర సాహిత్యమూ వచ్చింది. తమిళ సాహిత్య పరిస్థితి వీటికి భిన్నంగా కనిపిస్తుంది. ఇతర ప్రాంతీయ భాషా సాహిత్యాలకు చాలాకాలం ముందే, ఆర్యమతపు గాలులు తీవ్రంగా వీయకముందే క్రీ. శ. ప్రారంభ శతాబ్దాలలోనే తమిళ లిఖిత సాహిత్య చరిత్ర ప్రారంభమౌతుంది. సంస్కృతీకరణ లేకుండా భాషలోను, ఛందంలోను తన ప్రత్యేకతను మొదటి నుంచీ నిలుపుకుంది తమిళం. తిరువళ్లువర్, అవ్వయ్యార్ దేశీయ భాషలో, దేశీయ ఛందంలో సరళ రీతిలో సామాన్యులకు నీతి బోధ చేస్తూ రచనలు చేశారు. ఆ సాహిత్యం గ్రంథస్థమై లిఖితరూప శిష్ట సాహిత్య ప్రవాహంలో భాగం అయింది. క్రీ. శ. 7,8, శతాబ్దుల నుంచే శైవ భక్తులైన నయనార్ల భక్తి గీతాలు, వైష్ణవులైన ఆళ్వారుల భక్తి ప్రబంధాలు వచ్చాయి. జైన, బౌద్ధ సాహిత్యాలు కూడా క్రీ.శ. 8,9 శతాబ్దుల్లో కనిపిస్తాయి. నయనార్లలో, ఆళ్వార్లలో విభిన్న కులాలకు సంబంధించిన వాళ్లున్నారు. భక్తి మార్గంలో కుల

భేదాలు, ఉచ్చ నీచ భేదాలు లేవని బోధించారు. సామాన్యులందరికీ ఉద్దేశించిన ఈ సాహిత్యం దేశీయ రూపాన్నే సంతరించుకుంది.

ఔత్తరాహ ప్రాంతీయ భాషలలోని సాహిత్యాలు తెలుగు, కన్నడ సాహిత్యాల తరువాత క్రీ. శ. 12వ శతాబ్ది నుంచీ ప్రారంభమౌతాయి. మొదట వీర గాథల రూపంలో, తరువాత భక్తి సాహిత్యంగా ఈ సాహిత్యాలు వచ్చాయి. కుల భేదం లేకుండా అన్ని రకాల కులాల వాళ్ళూ ఈ భాషా సాహిత్యాలలో కనిపిస్తారు. సంపన్న భూస్వాముల, మతాధికారుల ఆధిక్యాన్నీ, ప్రాబల్యాన్ని నిరసించారీ కవులు. ఇవన్నీ మత రూపంలోనే జరిగాయి. స్థానిక భాషలలో దేశీయమైన గీతాలు, గేయాలు, కీర్తనల రూపంలో ఈ సాహిత్యం వచ్చింది. హిందువులు, ముస్లిములు ఇద్దరూ ఈ భక్తి మార్గంలో కలిశారు. విదేశాల నుంచి మహమ్మదీయుల దండయాత్రలు, స్థానికంగా చిన్నచిన్నరాజుల, భూస్వాముల ఆగడాలు ఈ రెంటికీ వ్యతిరేకంగా పోరాడవలసిన చారిత్రక అవసరంగా ఈ సాహిత్యం వచ్చింది. స్థానిక జాతులకు సంబంధించిన చాలామంది మహమ్మదీయులుగా మతాంతరీకరణ పొందారు. మహమ్మదీయ మతంలో కుల భేదాలు లేకపోవటంవల్ల, కింది కులాలవాళ్ళకు చిన్న చిన్న వ్యాపారాలు చేసుకొనే హక్కుతో పాటు కొత్త జీవన మార్గాలను అనుసరించే అవకాశం ఆ మతం ఇవ్వటంవల్ల చాలామంది నిమ్న కులాలవారు ఆ మతంలో చేరారు. కాని దీనివల్ల వారి ఆర్థిక, సామాజిక స్థితిగతులలో అంతగా మార్పు వచ్చినట్టు కనిపించదు. ఆర్థిక ఆధిపత్యం మతంకంటే అంత బలవత్తర మైంది. ఆర్థికంగా బడుగువర్గానికి సంబంధించిన ముస్లింలు కూడా ఈ భక్తి మార్గంలో చేరటానికి కారణం ఇదే. భూస్వామ్య వ్యవస్థలో పీడకులను పీడితులు ఎదురు తిరగటంగా, చిన్న చిన్న వ్యాపారులనుంచి, వృత్తులవారినుంచి భక్తి ఉద్యమం, సాహిత్యం బయలుదేరింది. ఫ్యూడల్ వ్యతిరేక సాహిత్యానికి మత, సామాజిక రూపాన్నిచ్చారు భక్త కవులు. వైరుధ్యాలను మాని ఐక్యతను ప్రచారం చేశారు. మత కర్మకాండలకంటే భక్తికి ప్రాధాన్యం ఇచ్చారు. హిందువులలోని వర్ణభేదాలను నిరసించారు. ముస్లింలలో ఉండే అధికార వర్గాన్ని ఎదిరించారు. రాజులనే కాదు మతాధికారులను కూడా ఎదిరించారు. వ్రజభాషలో సాహిత్యాన్ని వెలయించిన కబీరు మహమ్మదీయుడైన దూదేకుల వాడు. మరాఠీలో దర్జీవాడైన నామ్‌దేవ్ కుల విధానంలో ఉన్న దుర్మార్గాలను

వ్యతిరేకించాడు. ఇతని రచనలు సిక్కుల మతగ్రంథాలలో కూడా చేరాయి. కుమ్మరి గోరాకుంభార్, కంసాలి నరహరి సోనార్, అస్పృశ్యుడైన చోఖామేళా, మంగలి సేనాన్హవీ, చిన్న వ్యాపారి తుకారాం మొదలైనవాళ్ళకు మరాఠీ సాహిత్యంలో విశిష్టస్థానం ఉంది. బెంగాలీలో 'శూన్యపురాణం' అనే బౌద్ధ గ్రంథాన్ని రాసినవాడు అస్పృశ్యుడైన రామాయి పండితుడు. సంస్కృత 'గీత గోవింద' కర్త జయదేవుడు స్థానిక భాషలో భక్తి గీతాలు రచించాడు. బెంగాల్‌లో చైతన్యుడు వైష్ణవాన్ని కృష్ణ భక్తితో జోడించి అన్ని కులాల వాళ్ళకి ప్రవేశం ఇచ్చాడు. అంతకుముందే చండీదాసు రాధాకృష్ణుల ప్రణయ తత్వాన్ని ఆవిష్కరించాడు. బెంగాలీ సాహిత్యం 18వ శతాబ్దివరకు చైతన్య యుగంగా, వైష్ణవ భక్తియుగంగా కొనసాగింది. అస్సామీలో శంకరదేవ్ ఈ మార్గానికి సంబంధించినవాడే. ఒరియాలో కూడా ఈ వైష్ణవ ప్రభావం ఉంది. సంస్కృతం తెలియని సిద్ధేశ్వరి పిరిడియా అనే శూద్ర కర్షకుడు సరళాదాసు అనే పేరుతో సరళ భారతాన్ని ఒరియా భాషలో రచించాడు. మూలానికి ఏ మాత్రం సంబంధంలేని ఈ గ్రంథంలో ఒరియా ప్రజల సామాజిక జీవనం దర్శనమిస్తుంది. మరొక ఒరియా కవి బలరామదాసు హరిజనులను ఉద్ధరించ టానికి రచనలు చేశాడు. పంజాబ్‌లో మహమ్మదీయులతో పాటు సకల వర్ణాల వారికి యోగమార్గ ద్వారాలు తెరిచాడు గోరఖ్‌నాథ్. సామాన్యులకుపయోగించే సూక్తులతో కవయిత్రి లల్ ద్యేత్ మొదలైన వారితో కాశ్మీరీ సాహిత్యం మొద లయింది. ఇదే కాలంలో కర్ణాటకలో శివభక్తులైతే చాలు కులభేధం లేకుండా అందరూ సమానమేనని వీరశైవ మతానికి సంబంధించిన బసవడు బోధించాడు. క్రీ.శ. 16వ శతాబ్దం నాటి దాస సాహిత్యం కూడా కుల వ్యవస్థను వ్యతి రేకించింది.

## తెలుగు లిఖిత సాహిత్య ప్రారంభం

చరిత్ర కందినంతవరకు తెలుగు లిఖిత సాహిత్యం ప్రధానంగా ఆస్థాన సాహిత్యంగా, మార్గ పద్ధతిలో ప్రారంభమైంది. ఈ విషయంలో తెలుగు సాహిత్యానికి కన్నడ సాహిత్యంతో ఎక్కువగా పోలికలున్నాయి. మొదటి కన్నడ కవులు చాలామంది జైనులైనా సామాజిక, రాజకీయ, ఆర్థిక స్వరూప స్వభావాలను పరిశీలించినప్పుడు కన్నడ సాహిత్యం తెలుగు సాహిత్యం కంటే

భిన్నమైందికాదు. రెండింటిలోనూ రాచరికాన్ని కీర్తించే గుణం ప్రధానంగా కనిపిస్తుంది. సంస్కృతీకరణ ప్రధానాంశాలు రెండింటిలోనూ సమానమే. కాని కన్నడంలో కుల భేదాలులేవని చెప్పిన వీరశైవ సాహిత్యం, దాస సాహిత్యం వంటి దేశీయ సాహిత్యమార్గాలు లిఖిత సాహిత్య ప్రవాహంలో కొంతవరకైనా చోటు చేసుకున్నాయి. తెలుగులో అటువంటి సాహిత్యం లభించినంతవరకు చాలా తక్కువ. ఉన్న వాటిని కూడా ప్రధాన సాహిత్య మత మార్గాలు చరిత్రకు అందనివ్వకుండా కబళించి ఉంటాయి. కర్మ ప్రధాన స్మార్తశైవం లేక బ్రాహ్మణ మతం [1] ప్రధానంగా, వర్ణాశ్రమ ధర్మ రక్షణ ఆదర్శంగా, ఫ్యూడల్ వ్యవస్థను బలపరచటం లక్ష్యంగా, పురాణ పద్ధతులూ, కావ్యరచనా ధోరణులు మిశ్రితమై, భావజాలంలో, భాషలో, రూపంలో సంస్కృతీకరణం ప్రధానంగా, ఆస్థాన పండిత సాహిత్యంగా తెలుగు సాహిత్యం ప్రారంభమౌతుంది. సంస్కృత పండితుల అధీనంలో పండిత సాహిత్య భాషా, శైలులు సాధారణ భాషా, శైలుల కంటే భిన్నంగా నన్నయకు రెండు మూడు వందల సంవత్సరాలకు ముందే స్థిరపడ్డాయి.

సుమారు ఇతర ప్రాంతీయ భాషలలో వచ్చిన భారతాలకంటే భిన్నమైందీ, విస్తృతమైందీ తెలుగులో తొలి లిఖిత రచన అయిన భారతం. అనేక ప్రయోజనాల సమాహార రూపంగా వచ్చింది నన్నయ భారతం. బ్రాహ్మణ మత ధర్మానికి ప్రతీకగా, ఉపాఖ్యానాలతోపాటు అనువర్తించిన ధార్మిక కావ్యంగా, రాచరిక వ్యవస్థను కీర్తించే గ్రంథంగా, కావ్యధోరణులను కూడా కలుపుకున్న లౌకిక కావ్యంగా, సంస్కృతీకరణకు ప్రతీకగా, దేశీయ రచనామార్గానికి భిన్నంగా తెలుగు భారతం దర్శనమిస్తుంది. చదువుకున్నవారితో సంబంధంలేని సాహిత్యం తప్పిస్తే దేశిమార్గాన్ని అనుసరిస్తున్నామని చెప్పుకున్న కవులను కూడా ఈ

1. చారిత్రకదశలో ఒక ప్రత్యేక వ్యవస్థను సూచించేదిగా మాత్రమే 'బ్రాహ్మణ మతం' అనే పేరును వాడుతున్నాను. ఇది మౌలికంగా వైదిక కాలంనాటి వ్యవస్థకు భిన్నమైంది. ఈరోజు 'హిందూ మతం' అని వ్యవహరిస్తున్న దానికున్నంత విస్తృత పరిధి దీనికి లేదు. స్మృతులు ప్రమాణంగా కలిగి చదువుకున్న బ్రాహ్మణ వర్గానికి లేక మేధావి వర్గానికి, వారి తోడ్పాటుగల ఫ్యూడల్‌పాలక వర్గానికి ప్రాధాన్యం గల వ్యవస్థే 'బ్రాహ్మణ మత' వ్యవస్థ.

మార్గం ప్రభావితం చేసింది. తమిళంలో నన్నయకు చాలాకాలం ముందే లిఖిత సాహిత్యంలో భాగమైన సాహిత్య విధానాలకు, నన్నయకు సమకాలంలోనూ, తరువాతా ఔత్తరాహ భాషలలో వచ్చిన భక్తి ప్రధానమైన సాహితీరీతులకు ఇది భిన్నమైంది. గతకాలంనాటి ఆదర్శాలు, సమకాలంనాటి పరిస్థితులు-వీటి వైరుధ్యాలు నన్నయ భారతంలో కనిపిస్తాయి. రాజకీయంగా సామ్రాజ్యాలు ఛిన్నాభిన్నమైనా, రాజ్యాల భౌగోళిక స్వరూప స్వభావాలు ఎప్పటికప్పుడు మారుతూఉన్నా, ఆర్థిక సంబంధాలలో మార్పులు వచ్చినా సామ్రాజ్యాల కాలం నాటి భావజాలం, స్పృహ నన్నయాది కవులను వెంటాడటం చూడవచ్చు. భాష ప్రాంతీయ భాష అయినా, వస్తువు, భావాలు, రచనా విధానం మొదలైన అన్ని విషయాలను సామ్రాజ్యకాలంనాటి సంస్కృత సాహిత్యం నుంచి దిగుమతి చేసుకోవటం తెలుగు సాహిత్యంలో కనిపిస్తుంది. మతంలో, మతస్థాపకుల బోధన పరిస్థితులలో మార్పులు వచ్చినా తరువాతి వారికి ప్రమాణాలైనట్టే-నన్నయ సాహిత్య స్వరూప స్వభావాలు నన్నయ తరువాత సుమారు తొమ్మిది వందల సంవత్సరాల వరకు తరువాత కవులకు ప్రమాణాలయ్యాయి.

పదకొండవ శతాబ్దంనాటి తెలుగు దేశంలోని అస్థిర రాజకీయ పరిస్థితులలో ఫ్యూడల్ పాలకవర్గంపైన, బ్రాహ్మణ వర్గంపైన విశ్వాసాన్ని కలిగించే ప్రయత్నంలో జరిగిన కళాత్మక రచనే తెలుగు భారతం.

## నన్నయకు తిక్కనకు మధ్య

నన్నయ కాలానికే ఉన్న రాజకీయ అస్థిరత్వం నన్నయ తరువాత మరింత విస్తరించింది. చోళ సామ్రాజ్యానికి రాజై అక్కడినుంచే వేంగి దేశాన్ని కూడా పరిపాలించాడు రాజరాజనరేంద్రుని కొడుకైన కులోత్తుంగ చోళుడు. కులోత్తుంగచోళుని తరువాత వేంగి పశ్చిమ చాళుక్యుల వశం అయింది. పశ్చిమ చాళుక్యుల ప్రతినిధులుగా వెలనాటి చోడులు వేంగిని పరిపాలించారు. వెలనాటి చోడులతోపాటు పాకనాటి పొత్తపి చోడులు, ఇంకా ప్రాబల్యానికి రాని తెలుగు చోడులు, హైహయవంశీయులు ఆంధ్రదేశంలోని భిన్నప్రాంతాలను పరిపాలిస్తున్నారు. కాకతి ప్రోలరాజు కూడా పశ్చిమ చాళుక్యులకు ప్రతినిధిగా ఉన్నాడు. రుద్రదేవు (క్రీ.శ. 1158-1195)ని కాలంలో కాకతీయ సామ్రాజ్యం

విస్తరించి నిలదొక్కుకునేవరకు తెలుగుదేశంలో చాలా భాగం చాళుక్య చోడులకు, పశ్చిమ చాళుక్యులకు మధ్య చేతులు మారుతూ వచ్చింది.

మతపరంగా కూడా ఈ అస్థిర స్థితి కనిపిస్తుంది. బౌద్ధం సుమారుగా తన అస్తిత్వాన్ని ఎప్పుడో కోల్పోయింది. జైనం, శైవం, వైష్ణవం ఈ కాలంలో కనిపిస్తాయి. విభిన్న శైవ శాఖలు జైనానికి వ్యతిరేకంగా పోరాడాయి. ఉత్తరంలో ఒరిస్సా, బెంగాల్, అస్సాంలలోని వైష్ణవం, దక్షిణంనుంచి రామానుజుని వైష్ణవం యొక్క గాలులు వీస్తున్నాయి. ఆయా మతాలకు జనంలో ఉండే పలుకుబడిని బట్టి మతాలను గాని, మత శాఖలనుగాని పాలకులు అనుసరించారు. వీటిల్లో వివిధ శాఖలకు చెందిన శైవానిదే పైచేయిగా ఉంది. తెలుగుదేశంలో సహజంగా దీనికి సంబంధించిన సాహిత్యమే ఎక్కువగా వచ్చింది. భక్తి ప్రధానమైన వైష్ణవం ఉత్తర భారతంలో వ్యాపించినట్టుగానే దక్షిణంలో శైవం వ్యాపించింది. పాశుపత, కాలాముఖ, వీరశైవ, ఆరాధ్య శాఖలకు చెందిన శైవాలలో పాశుపత శైవం క్రీ.శ. ఒకటవ శతాబ్దం నుంచి తెలుగు దేశంలో కనిపిస్తుంది. ఉత్తర భారతంలో పాశుపత శైవం బౌద్ధాన్ని అణచిరాగా, పాశుపత శైవానికి వ్యతిరేకంగా భక్తి ప్రధానమైన వైష్ణవం వ్యాపించింది. దక్షిణంలో జైనానికి పోటీగా శైవం అనేక శాఖలతో, రూపాలతో వ్యాపించింది. తమిళ దేశంలో భక్తి ప్రధానంగా ప్రారంభమైన నయనార్ల శైవం తరువాత కాలంలో కర్ణాటక, తమిళ దేశాలలో కాలాముఖ శైవంగా రూపొందింది. ఆ కాలంలో సైద్ధాంతికంగానైనా సర్వసమానత్వాన్ని బోధిస్తూ, భోజన, వైద్య, విద్యా, వసతి సౌకర్యాలను కలిగిస్తూ జనంపైన పలుకుబడి కలిగి పాలకుల అండను కూడా పొందిన జైన వసదులకు పోటీగా కాలాముఖ శైవ మఠాలు ఏర్పడ్డాయి. నయనార్ల భక్తి శైవానికి 8, 9 శతాబ్దుల నాటికి రాజపోషణ కూడా లభించే సరికి దీనికి అనుకూలమైన వాతావరణం ఏర్పడింది. కాలాముఖులు వర్ణ ప్రాధాన్యాన్ని అంగీకరిస్తూనే బ్రాహ్మణేతరులకుకూడా స్థానాన్ని కల్పించారు. జైనంలో లాగే స్త్రీలకూ స్థానం ఇచ్చారు. శూద్రులు దాసభావంతో తగిన స్థానాన్ని పొందవచ్చు. 'కుమారసంభవ' కర్త నన్నెచోడుడు, 'కుమార సంభవం'లోని దారిద్ర్య విద్రావణదశకంలో కనిపించే రామేశ్వర పండితుడు కాలాముఖానికి చెందినవారే. కాకతీయులలో గణపతి దేవ చక్రవర్తి వరకు కాలాముఖ శైవం ఉంది. శ్రీశైలం, అలంపురం కాలాముఖ శైవానికి కేంద్రాలుగా ఉండేవి.

కర్ణాటకలో కాలాముఖం తరువాత బసవడితో వీరశైవం వ్యాపించింది. బసవడు కుల, స్త్రీ భేదం లేకుండా శివభక్తులైన వారందరూ సమానమేనన్నాడు. ''ఎట్టి కులమైననేమీ? శివలింగమున్నవాడె కులజుండు'' అని బోధించాడు. వైదిక కర్మకాండను, జంతుబలిని తన రచనలలో నిరసించాడు. ఉపనయన దీక్షను విసర్జించాడు. జైనానికి వ్యతిరేకంగా సామాన్యులందరినీ ఆకర్షించటానికి అనుకూలంగా ఉన్నందున కాలాముఖ లందరూ వీరశైవాన్ని అంగీకరించారు. క్రమంగా కాలాముఖులు చాలా మంది వీరశైవంలో కలసిపోయారు. బసవడు తన భావాలను ప్రచారం చేయటానికి సరళమైన భాషలో, వచనాలలో రచన చేశాడు జైనం మాత్రమే అందరినీ సమానంగా గుర్తిస్తుందనే సిద్ధాంతాన్ని ఖండించటానికి వీరశైవం పోటీ పడింది జైనం, శైవం రెండూ పరిపాలకులపైన తమ ప్రభావాన్ని నిలబెట్టుకోవటానికి పోటీ పడుతున్న రోజులవి. అవసరమైతే హింసను కూడా అవలంబించటంవల్ల శైవానిది పైచేయి అయింది.

తెలుగుదేశంలోని శైవం దీనిని కొంత భిన్నంగా కనిపిస్తుంది. గణపతి దేవుని దగ్గరనుంచి పాశుపతశైవానికి ప్రాచుర్యం ఏర్పడింది. శైవమార్గంలో పండిత త్రయంగా గుర్తింపు పొందిన శ్రీపతి, మల్లికార్జున, మంచన పండితులు ముగ్గురూ శైవం సవైదికమని నిరూపించే ప్రయత్నం చేశారు. మొదటి శైవ కవిగా చెప్పుకోదగిన మల్లికార్జున పండితారాధ్యుడు వర్ణాశ్రమ ధర్మాలనుతిరస్కరించకుండా ఆరాధ్య శైవ మార్గాన్ననుసరించాడు. బసవడి వీరశైవ భక్తి మీద ఆసక్తి, వర్ణ వ్యవస్థపైన అభిమానం ఈ రెంటినీ సమన్వయం చేయలేక ''భక్తి మీఁది వలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తుపాయలేను నేను బసవలింగ'' అని మొరపెట్టుకున్నాడు పండితుడు. రాజకీయంగా పాశుపతానికి చెందిన గోళకి మఠాలకు పలుకుబడి ఉండేది. ఈ మఠాలు చిన్న చిన్న సంస్థానాలుగాను, మఠాధిపతులు సంస్థానాధిపతులుగానూ బలపడటం కనిపిస్తుంది. శైవమతాచార్యులు రాజగురువులుగా ఉంటూ రాజకీయాలలో ప్రధాన స్థానం వహించేవారు. కాకతీయ గణపతిదేవుడు రాజగురువైన విశ్వేశ్వర శివాచార్యుడి చెప్పు చేతలలో ఉండేవాడు. గణపతిదేవుడి దగ్గరికి రాచకార్యానికి వచ్చిన తిక్కన విశ్వేశ్వరుణ్ణి దర్శించి ఆయనను అపర శివుడుగా ప్రశంసించినట్లు 'సిద్ధేశ్వర చరిత్ర' వల్ల తెలుస్తుంది.

బసవడి వీరశైవ ప్రభావం తెలుగు దేశంపైన చాలా తక్కువగానే కనిపిస్తుంది. కర్ణాటకలో ఉన్నంత జైనం బలంగా లేకపోవటమే దానికి పోటీగా వచ్చిన వీరశైవం అంతగా వ్యాపించక పోవటానికి కారణమేమో తెలుగు దేశంలో. ఇంతవరకు పాల్కురికి సోమనను వీరశైవ శాఖకు చెందిన వాడుగా పేర్కొనటం జరుగుతున్నది. అతనిదైనా అచ్చమైన వీరశైవమార్గంగా కనిపించదు. బసవడి భక్తి మార్గ ప్రధానమైన వీరశైవానికి ప్రాధాన్యం ఇస్తూనే పండితారాధ్యుణ్ణి కూడా సమానంగా ఆదరించాడు సోమన... భక్తి విషయంలో బసవడిని, వేద ప్రామాణ్యాది విషయాలలో పండితుణ్ణి అనుసరిస్తూ 'బసవ పురాణాన్ని', 'పండితారాధ్య చరిత్ర'నూ రచించాడు. సోమన ఎక్కడా వైదికాచార గర్హణ చేయలేదు. తెలుగు దేశంలో సమన్వయం ఈ విధంగా మొదలైంది. మొదటినుంచీ వైరుధ్యాల సంగమాన్నే సమన్వయంగాపేర్కొనటం జరుగుతున్నది. ఈ వైరుధ్యాలన్నీ సమన్వయం పేరిట సోమన సాహిత్యంలో కూడా కనిపిస్తాయి. వీరశైవ మార్గాన్నవలంబించినా సోమనది శుద్ధ వీరశైవం కానట్టుగానే రచనలో దేశి మార్గాన్ననుసరిస్తున్నానని చెప్పుకున్నా అది శుద్ధదేశి మార్గం కాదు. వీటన్నింటికి ప్రధాన కారణం సోమన పండితుడు కావటమే. దేశిమార్గమని ద్విపదని అనుసరించినా "తొమ్మిది రసములు తొలుకాడు దాని, యిమ్మడి వర్ణన లెసగంగ ద్విగుణ, మగు నలంకారంబులసలారు దాని, ద్విగు ణార్థ భావముల్ దీటుకొనంగ" అని సంస్కృత అలంకార శాస్త్ర మర్యాదల్ని పేర్కొనకుండా ఉండలేక పోయాడు. "అల్పాక్షరముల ననల్పార్థ రచన, కల్పించుటయె కాదె కవి వివేకంబు" అంటూనే అలాంటి రచన చేయలేక పోయాడు. జాను తెనుగు ప్రసన్నతకు కారణం అంటూనే సంస్కృత భూయిష్ఠ మైన పండిత భాషనే వాడాడు. సమకాలంలో కవి అస్తిత్వంపైన ఆధారపడిన భావజాలం అందులో కనిపించే వైరుధ్యాలు సాహిత్యంలో ఎట్లా ప్రతిబింబి స్తాయో, సాహిత్య రూపాన్ని నిర్ణయించటంలో ఎట్లా ప్రధాన పాత్రను వహిస్తాయో చెప్పటానికి పాల్కురికి సోమన సాహిత్యం ప్రధాన నిదర్శనం.

ఇదే కాలంలో తెలుగు దేశంలో వైష్ణవంకూడా కొంత కనిపిస్తుంది. దాయాదులమధ్య జరిగిన 'పల్నాటి యుద్ధా'న్ని శైవ, వైష్ణవాల మధ్య జరిగిన పోరాటంగా పేర్కొనటం సంప్రదాయంగా ఉంది. శైవానికి సంబంధించిన నాగమ నాయకురాలు, వైష్ణవానికి సంబంధించిన బ్రహ్మనాయుడు ఇరువైపులా

నాయకత్వం వహించారు. ఇక్కడ కుల, శాఖా భేదాలు లేనిది శైవంకాదు, బ్రహ్మనాయడు అనుసరించిన వైష్ణవం. దీనితోపాటు అన్ని మతాలను కలుపుకొని వచ్చే ప్రయత్నం కూడా మరొకవైపు కనిపిస్తుంది. రుద్రదేవుని కాలంలో మల్లిరెడ్డి అనే దండనాథుడు శైవ, వైష్ణవ, జైన, బౌద్ధాలు అనే మత భేదాలు సమస్యా హేతువులనీ, అన్నిటికీ దేవుడొక్కడే అని పేర్కొంటూ ఇరవైయొక్క శివాలయాలు కట్టించాడని శాసనాలు చాటుతున్నాయి.

## సమన్వయం

మత, రాజకీయ, సామాజిక రంగాలతో పాటు సారస్వత రంగంలో కూడా ఏర్పడిన అనైక్యతను తొలగించి సమన్వయాన్ని సాధించటానికి జన్మించిన అవతారపురుషునిగా తిక్కనను సాహిత్య చరిత్రలు, దేశ చరిత్రలు పేర్కొంటున్నాయి. భారతంలో హరిహరనాథ తత్వాన్ని ఆశ్రయించటాన్ని ఆధారంగా చేసుకొని ఈ సిద్ధాంతం బయలుదేరింది. ఈ సమన్వయ సిద్ధాంతాన్ని చర్చించేముందు హరిహరనాథ తత్వం తిక్కన స్వోపజ్ఞమా ? అనే విషయాన్ని పరిశీలించ వలసి ఉంటుంది. హరిహర తత్వం శివుడూ, విష్ణువు ఒకడే అనే 'శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే' వంటి స్తోత్రాల నుంచి ఉదయించింది కాదు. హరిహరులను మిశ్రరూపంలో దర్శించే ప్రయత్నంలో పుట్టింది ఈ తత్వం. క్రీ. శ. 6వ శతాబ్దినాటికే హరిహరనాథతత్వం నేపాల్‌లో ఉందని చెప్పటానికి ఆధారాలు ఉన్నాయి. అర్ధ నారీశ్వరుని పద్ధతిలో హరిహరుల మిశ్రరూపాన్ని చెక్కవలసిందిగా ఒక శిల్పిని ఆదేశించినట్టు క్రీ. శ. 6వ శతాబ్దినాటి ఒక శాసనంలో ఉంది. 'స్కాందపురాణం' లోని నేపాల మాహాత్మ్యంలో ఈ హరిహర తత్వానికి సంబంధించిన అంశాలు ఉన్నాయి. బుద్ధుడితో పాటు, ఇతర స్థానిక దేవతలనందరినీ అవతారాల రూపంలో కలుపుకున్న వైష్ణవం, బౌద్ధాన్ని రూపుమాపిన శైవం - ఈ రెండు మతాలను సమన్వయం చేసే రూపంలో హరిహర తత్వం ఉత్తర భారతంలో బయలుదేరింది. రెండు భిన్న ఆర్థిక వర్గాలను కలిపే ప్రయత్నంలో హరిహర తత్వం రూపొందిందని కొందరి అభిప్రాయం. చిన్న చిన్న రైతులు, వ్యాపారులు, వృత్తులవారు భక్తి ప్రధానమైన వైష్ణవ మతానుయాయులు. పెద్ద పెద్ద భూస్వాములు, ఫ్యూడల్ పాలకులు శైవులు. ఈ రెండు వర్గాల మధ్య

సయోధ్యకూర్చే ప్రయత్నమే మతపరంగా హరిహర రూపాన్ని పొందిందని, భిన్న ఆర్థిక వర్గాల స్వప్రయోజనాలు ఎప్పుడూ భిన్నంగానే ఉంటాయి కాబట్టి ఈ సయోధ్య ఎక్కువకాలం నిలువలేకపోయిందని కొందరు చారిత్రకులు భావిస్తున్నారు. తిక్కన కాలానికి ఒక ప్రత్యేక ఆర్థిక పునాదిమీద ఏర్పడ్డ తత్వంగా కాక ఒక ప్రత్యేక దైవంగా హరిహర నాథుడు మిగిలాడు. దానికి అద్వైత పరమైన తాత్వికతను సమన్వయించే ప్రయత్నం చేశాడు తిక్కన. తిక్కనకు ముందే కర్ణాటకలోను, ప్రస్తుత తెలంగాణంలోను హరిహరారాధన ఉండి ఉండాలి. రెండవ ప్రోలరాజు కొడుకులలో ఒకడికి హరిహర రాజనేపేరుంది. గణపతి దేవుడి పట్టమహిషి కాక మరొక భార్యకు జనించిన కొడుకులలో ఒకడికి కూడ హరిహరుడనే పేరుంది. నిర్వచనోత్తర రామాయణ కాలంనాటికి తిక్కన 'మహేశ్వరాంఘ్రి కమలధ్యానైక శీలుడు' మాత్రమే. ఓరుగల్లుకు వచ్చిన తరువాతే హరిహరనాథుడిపైన భక్తి కుదిరి ఉండాలి. కాని తిక్కన ప్రధానంగా స్మార్త మార్గానికి చెందినవాడు.

అయితే తిక్కన సాధించాదనుకుంటున్న సమన్వయం ఏమిటి? ''గణపతి దేవుడు తిక్కన మంత్రాంగ ఫలంగా మనుమసిద్ధికోసం సేనాసహాయం చేయటం కాకతీయ సామ్రాజ్య నిర్మాణ–పటిష్ఠతలకు ఆయన చేసిన, చేస్తున్న ప్రయత్నంలోని ఒక భాగం'' అయినప్పుడు తిక్కన సాధించిన రాజకీయ సమన్వయం అంటూ ప్రత్యేకంగా ఏమీలేదు. ఇక మతపరమైన సమన్వయం సంగతి. శైవ వైష్ణవాలతోపాటు జైనం కూడా తిక్కన కాలంలో ఉంది. కాని ఈ సమన్వయంలో జైనం లేదు. తాను వైదికం అనుకుంటున్న విభిన్న వర్గాలను మాత్రమే తిక్కన కలిపే ప్రయత్నం చేశాడని చెప్పాలి. ''పాప సమృద్ధులు, వేద విరుద్ధులు,వాద సమృద్ధులు జైన బౌద్ధులఁ బిలిపించి పట్టి వాదించి యోడించె''... ''ఆ వసదులెల్లఁ గూలద్రోయించియుఁ గూడ నా దైవముల నామమంతయు మనుమట్ట నణచి...మునిజైనఁ వసతు లొప్పగాఁ గూలద్రోయించి నఱికించి యందఱ జైనులనటుఁ జంపి చెండి చిందరవందర చేసి చక్కాడె'' అని సిద్ధేశ్వర చరిత్ర చెప్తున్నది. ఇందులో ఉత్తర భాగాన్ని తిక్కన విషయంలో ఉండే ఉదాత్త భావనకారణంగా అంగీకరించలేకపోయినా పూర్వభాగంలో కొంతైనా సత్యం ఉన్నదని అంగీకరిస్తే అవైదికమైన జైన, బౌద్ధాలకు విరుద్ధంగా,

హరిహరతత్వం పేరిట అద్వైతాన్ని, వైదికమతం పేరిట కర్మప్రధానమైన బ్రాహ్మణమతాన్ని నన్నయ మార్గంలో నిలబెట్టే ప్రయత్నమే తిక్కన చేశాడని తెలుస్తుంది. అందుకే "వేదములకు నఖిలస్మృతి, వాదములకు బహుపురాణ వర్గంబులకున్, వాదైన చోటులను దా, మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్" అని భారత రచన కొనసాగించాడు. అయితే "వైదికమార్గనిష్ఠమగు వర్తన ముందగ నిర్వహించు" నే "భేదములేని భక్తిమతినిర్మల వృత్తిగా" నన్నయ తరువాత, తనకుముందు విస్తరించిన భక్తి మార్గాన్ని కూడా జోడించే ప్రయత్నం చేశాడు. నన్నయలాగే తిక్కనకూడా ఆస్థాన కవిగానే మొదలయ్యాడు. ఒక చిన్న రాజ్యాన్ని పాలించిన మనుమసిద్ధిని సూర్యవంశానికి చెందినవాడిగా పేర్కొని "అమ్మనుమనృప్రతికభ్యుదయమ్ము"గ 'నిర్వచనోత్తర రామాయణ' రచన చేయటంలో అది కనిపిస్తుంది. తనకుముందు, తన సమకాలంలో కర్ణాటక వీరశైవంలో, తమిళదేశపు ఆళ్వార్ల సాహిత్యంలో; ఉత్తరాది వైష్ణవంలో కనిపించే కులభేద రాహిత్యం అనే ప్రధానాంశాన్ని గుర్తించని తిక్కన సామాజిక సమన్వయం సాధించాడనటానికి ఆధారాలు లేవు. రచనారూపంలో కూడా ప్రధానంగా నన్నయ మార్గాన్నే అనుసరించిన తిక్కన సారస్వత రంగంలో సాధించిన సమన్వయం అంటూకూడా ఏదీలేదు. అయితే మార్గసాహిత్యంలో తిక్కనకు ప్రత్యేకస్థానం ఉన్నది. దానికి కారణం ఆయన జీవన విధానం, అనుభవ పరిధి విస్తృతమైంది కావటమే. ఆయన లోకానుభవం, రాజకీయ జీవితం, వివిధ రంగాల వారితో అతనికి ఉండే సంబంధం విషయ వైవిధ్యం కల భారత రచనకు తోడ్పడ్డాయి. నెల్లూరునుంచి ఓరుగల్లు వరకు ఆయనచేసిన పర్యటనం, కొంతవరకైనా అతనికి జనంతో ఉండే సంబంధం తెలుగు భాష జీవాన్ని, నుడికారాన్ని పట్టియిచ్చిన కారణంగా దేశ్యపద ప్రధానమైన భాషను భారత రచనలో అనుసరించటానికి అవకాశం లభించింది.

## భక్తి సాహిత్యం

శ్రీనాథునితో తెలుగులో ఆస్థాన కవిత్వం పరాకాష్ఠను పొందింది. శ్రీనాథుడు ఈశ్వరార్చన కళా శీలుడు. ఆయన గ్రంథాలన్నీ శివపారమ్యబోధకాలు. శ్రీనాథుడు ప్రధానంగా స్మార్తశైవానికి సంబంధించిన వాడు. తెలుగుదేశం చిన్న చిన్న రాజ్యాలుగా విడిపోయి ఉన్న దశలో అస్థానం అస్థానం తిరిగాడు.

రాజులకు, మంత్రులకు, శ్రేష్ఠులకు అవసరాన్ని బట్టి తన రచనలను అంకితం చేశాడు. కాబట్టి పురాణాలను ఖండాలుగా, భాగాలుగా రచించవలసి వచ్చింది. కవిత జీవికగా, గ్రంథ రచనా ప్రయోజనం ఉదరపోషణంగా పరిణమించింది. తెలుగు సాహిత్యంలో ఏకవస్తుకమైన కావ్యకవితకు బీజం పడింది. శ్రీనాథుడి అంత్యదశకు ఆనాటి రాజకీయ, ఆర్థిక, మత పరిస్థితుల దృష్ట్యా చూచినప్పుడు మాత్రమే కారణాలు లభిస్తాయి. రాజమహేంద్రవరం రెడ్డి రాజ్యాన్ని జయించిన ఓఢ్రగజపతులు సాహిత్యాన్ని అంతగా పోషించినవారు కారు. సుమారు పద్దెనిమిదో శతాబ్దంవరకు ఒరియా సాహిత్యం రాజుల నాశ్రయించిన సాహిత్యంగా రాలేదు. కాబట్టి ఓఢ్రరాజులు తెలుగు సాహిత్యాన్ని పోషించే ప్రసక్తేలేదు ఆ కాలంలో ఒరియా సాహిత్యం వైష్ణవ మత ప్రాబల్యంతో నిండి ఉంది. కుల తారతమ్యాలు లేకుండా అందరినీ ఆకట్టుకున్న వైష్ణవ భక్తి ఆకాలంలో వ్యాపించింది. ఓఢ్ర గజపతులకాలంలో ఒరియాలో ప్రజారంజకంగా భారతాన్ని రచించిన సరళా దాసు ఆస్థాన కవి కాదు; శూద్రుడై కర్షక వృత్తిని చేపట్టినవాడు. కాబట్టి ఆస్థాన పోషణను కోల్పోయిన శ్రీనాథుడు బ్రతుకు తెరువుకు మార్గాంతరంగా భూమిని ఆశ్రయించక తప్పలేదు.

ఆస్థాన కవితకు పరాకాష్ఠగా నిలచిన శ్రీనాథుడికి ఇంచుమించు సమకాలంలో భిన్నమైన వ్యక్తిత్వంతో నిలచినవాడు పోతన. పోతనను గురించిన కథలలోని సత్యాసత్యాలు, ''ఇమ్మనుజేశ్వరాధముల కమ్మి'' అన్న పద్యం పోతన రచించిందేనా కాదా ? అన్న విషయంలోని వివాదాలు పక్కన పెడితే భాగవతాన్ని సమకాలీన పాలకుల కెవరికీ అంకితం ఇవ్వలేదన్నది గ్రంథం అవతారికవల్లనే స్పష్టం. పోతన భక్త కవిగా తెలుగు దేశంలో ప్రసిద్ధుడు. కాని క్రీ. శ. 8,9 శతాబ్దులకే తమిళ దేశంలో కనిపించే ఆళ్వారుల భక్తి మార్గానికి, తనకు సమకాలంలోను, తరువాతా ఉత్తర భారతంలోని వైష్ణవ భక్త కవుల మార్గానికి భిన్నంగా కనిపిస్తాడు. క్రీ.శ. 12వ శతాబ్ది నాటి బెంగాల్-ఒరిస్సా ప్రాంతపు 'గీత గోవింద' కర్త జయదేవుని రాధాకృష్ణ ప్రణయతత్వ ప్రభావం పోతనమీద ఉంది. కాని ప్రధాన మత మార్గాల విషయంలోగాని, రచనా మార్గంలోగాని 'ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీయుర్విన్ పురాణావళుల్ తెలుగు' చేసిన మార్గమే పోతనది. దక్షిణదేశపు ఆళ్వారులలో, ఉత్తర దేశపు వైష్ణవ భక్తకవులలో కుల నిరసన రూపంలో కనిపించే సాంఘికాంశ కాని,

వారనుసరించినట్లు దేశీయ రచనా మార్గాలు కాని పోతనలో లేవు. సంస్కృతం లోను, తెలుగు భాగవతంలోను ఏకాదశ స్కంధంలో ఆళ్వారుల ప్రసక్తి ఉన్నా ఆ మార్గంలోనివాడు కాదు పోతన. కులంతో సంబంధం లేకుండా, జ్ఞాన, కర్మ మార్గాలతో సంబంధం లేకుండా ప్రపన్నుడెవడైనా మోక్షార్హుడని బోధించిన రామానుజుడి మార్గానికి కూడా సంబంధించినవాడు కాదాయన. "పురుషులు వర్ణాశ్రమ ధర్మ భేదంబులం జేయు ధర్మంబునకు మాధవుడు సంతోషించుటయే సిద్ధి" అన్నది పోతన భక్తికి లక్ష్యం. ఉత్తరాదిలో వైష్ణవ మతానుయాయులు శివానుయాయుల్ని సుమారు అస్పృశ్యులుగా చూసిన సందర్భాలున్నాయి. దానికి కారణం ఒక దశలో ఈ రెండు మతాలు రెండు భిన్న ఆర్థిక వర్గాలకు ప్రాతినిధ్యం వహించటం కావచ్చు. ఈ వైరుధ్యం పోతనలో కనిపించదు. 'చేతులారంగ శివుని పూజించా'లన్న పోతన వంశానుగతంగా స్మార్త శైవుడు. ఉత్తర దేశంలో చెప్పులు కుట్టేవాడైన రాయిదాస్ దూదేకుల వాడైన కబీర్ మొదలైనవారిని బ్రాహ్మణ తాత్వికుడు గురువు అయిన రామానందుడు అంగీ కరించాడు. కాని పోతన ఒక ఆర్థిక వర్గానికి ప్రాతినిధ్యం వహించే భక్తి ఉద్యమ నిర్మాత కాడు పోతనకు ముందే తెలుగు దేశంలో 'సింహగిరి వచన ములు' రచించిన కృష్ణమాచార్యులు కులప్రసక్తిలేని వైష్ణవాన్ని ప్రచారం చేశాడు "శ్రీ వైష్ణవులే పరమ సాధకులు. శ్రీ వైష్ణవులే బ్రాహ్మణులు. హరిభక్తి లేని విద్వాంసుని కంటెను, హరి కీర్తనలు సేయునతఁడె కులజుండు. శ్వపచుండైననేమి ? ఏ వర్ణంబైననేమి ? ద్విజునికంటె నాతడె కులజుండు" అని బోధించాడు కృష్ణమాచార్యులు. పోతన ఈ మార్గంలోని భక్తుడు కూడా కాడు. పోతన భాగవతంలో భక్తి పారవశ్యంతో తొణకిసలాడే భాగాలు వదిలేస్తే తక్కిన భాగాలు వర్ణాశ్రమ ప్రాధాన్యసూచకాలు, క్షత్రియ ప్రాధాన్య బోధకాలు. పోతన రాచరిక వ్యవస్థనే వ్యతిరేకించినవాడు కాదు. భాగవతానికి కృతిపతి అయిన రాముణ్ణి 'రాజముఖ్యుడ'ని, 'రాజశేఖరుడ'ని పేర్కొంటాడు పోతన. బహుశా సమకాలీనులైన చిన్న చిన్న పరిపాలకులు క్షత్రియులు కానందున అతని దృష్టిలో పరిపాలనార్హతలేని వాళ్ళేమో ? కారణం ద్వాదశ స్కంధంలోని భవిష్యన్నరపాల రాజ్యపరిపాలన కాల నిర్ణయానువర్ణనంలోని "బలవంతుఁడైన వాఁడే, కులహీనుండైన దొడ్డగుణవంతుడగున్, గలిమియు బలిమియుఁగలిగిన, నిలలోపల రాజతండె యేమనవచ్చున్", "శూద్రులును, మ్లేచ్ఛ

లును, బ్రహ్మతేజోహీనులయిన బ్రాహ్మణులును భూభాగంబులు పరిపాలింతురు'' అన్న అభిప్రాయాలు కావచ్చు. అయినా పోతనకు వచ్చిన ప్రచారానికి, ప్రజలలో అభిమానానికి కారణం కనీసం సమకాలీన పరిపాలకులకు భాగవతాన్ని అంకితం చేయకపోవటం, ఆస్థాన కవిగా కొనసాగకపోవటం, భక్తి మార్గాన్ని అనుసరించటం. పోతన భక్తి పారవశ్యానికి తార్కాణమైన భాగాలే భాగవతంలో ఎక్కువగా ప్రచారాన్ని పొందాయి. పోతనది ప్రధానంగా మార్గ పద్ధతికి సంబంధించిన కవిత అయినా భక్తి దానికి ఆశు లక్షణాన్ని, గీత లక్షణాన్ని ఆపాదించింది. ప్రాచీన కవులలో పోతనకు ఉండే ఈ ప్రత్యేకతల వలననే అతణ్ణి గురించి కథలనేకం ప్రచారంలోకి వచ్చాయి. చాటువులు వచ్చాయి. ఈ కథలకనుకూలంగా ఉండే ఇతరుల పద్యాలు కూడా పోతన పేరిట ప్రచారంలోకి వచ్చాయి.

కాని ఆళ్వారుల, ఔత్తరాహులైన వైష్ణవ భక్త కవుల మార్గంలో కుల నిరసన, కీర్తనల రూపంలో దేశీయ రచన, సాధారణ భాష - వీటిని అనుసరించిన కవిగా అన్నమాచార్యులను గుర్తించవలసి ఉంటుంది. ''మెండైన బ్రాహ్మణుఁడు-మెట్టు భూమి యొకటే చండాలుఁడుండేటి సరి భూమి యొకటే'', ''కందువగు హీనాధికములిందు లేవు, అందరికీ శ్రీహరే అంతరాత్మ'', "పరమగు వేదాంత పఠన దొరకియు సదా హరిఁదలచలేని సన్యాసికంటే, మరగి పసురము దినడి మాలయైనను వాఁడె పరమాత్మ గొలచినను బ్రాహ్మణోత్తముఁడు'', ''ఎలమి హరిదాసు లేజాతియైననేమి ? తలమేల ? కులమేల ? తపమె కారణము'' అని కుల భేదాలను నిరసించాడు అన్నమయ్య. వెంకటేశ్వరుని ప్రణయతత్వం, భక్తి, సామాజికాంశమిశ్రమై భాషలో, రచనలో సారళ్యాన్ని, దేశీయతను, సామాన్యతను సంతరించుకున్న అన్నమాచార్యుల సంకీర్తనలు ఇతర భాషలలోని వైష్ణవ భక్తి గీతాల్లాంటివే.

## ప్రబంధ సాహిత్యం

తెలుగు దేశంలో 15, 16 శతాబ్దాలనాటికి క్రమంగా శైవం స్థానంలో వైష్ణవం బలపడింది. కాని భక్తిమార్గంలోని వైష్ణవంలో ప్రధానమైన కుల నిరసన మాత్రం ఈ వైష్ణవానికి లేదు. దానికి కారణం అది రాజమతం కాటమే భారతదేశపు భూస్వామ్య రాచరిక వ్యవస్థలో అనివార్యంగా ఉండే

చాతుర్వర్ణ్య వ్యవస్థ పేరిటి అధికారవర్గ ప్రాబల్యం, బ్రాహ్మణవర్గ ప్రాధాన్యం పటిష్ఠం అయింది విజయనగర సామ్రాజ్యకాలంలో. అనేక శాసనాలు విజయనగర రాజులను వర్ణాశ్రమ ధర్మరక్షకులుగా పేర్కొంటున్నాయి. విజయనగర సామ్రాజ్యం విస్తరించి అధికారం కేంద్రీకృతమైనా రాజుకు ప్రతినిధులుగా రాజ్యంలోని భిన్న ప్రాంతాలను పరిపాలించిన అమరనాయకులు, పాలెగాళ్లు భూమిసాగుపైన పన్నులను నిర్ణయించే అధికారం కలిగి ఉండేవారు. పద్నాలుగవ శతాబ్ది మధ్యభాగంనుండి డబ్బు రూపంలో పన్నులు వసూలు చేయటం మొదలైంది. దీనికితోడు చెల్లించవలసిన పన్ను చట్ట ప్రకారం ఆరింట ఒకవంతే అయినా అమర నాయకుల ఇష్టం ప్రకారం అది మారుతుండేది. ఒక్కొక్కసారి ఈ పన్ను తొంభై శాతం వరకు ఉండేది. వీటిని భరించలేని రైతులు భూములను వదలి ఇతర ప్రాంతాలకు తరలి వెళ్తుండేవారు. ఎక్కువమంది తరలివెళ్ళిపోయే సందర్భాలలో కొన్ని మినహాయింపులు ఇస్తుండేవారు. ఆముక్తమాల్యదలోని కొన్ని పద్యాలు (IV 287) ఈ విషయాన్ని బలపరుస్తున్నాయి. స్థానిక భూస్వాములకు వ్యతిరేకంగా రైతులు తిరుగుబాట్లు చేసినట్లు కూడా శాసనాలు చెప్తున్నాయి. దేవాలయాలకు విస్తారమైన భూఖండాలుండేవి. ఈ కాలంలో దేవాలయాలు ఆర్థిక, సాంస్కృతిక కేంద్రాలుగా ఉండేవి. ఉత్సవాలు, యాత్రికుల రాకపోకల కారణంగా చేతివృత్తులవారు, వ్యాపారవర్గాలు దేవాలయాలచుట్టు పట్ల స్థిరపడ్డారు. దేవాలయాల ఆదాయంతో వ్యాపారం, వడ్డీ వ్యాపారం కూడా సాగేవి డబ్బురూపంలో పన్నులు వసూలు చేయటం, వాణిజ్య వ్యాపారాలు, వాణిజ్య వస్తువులను తయారుచేసే చేతివృత్తులవారి కేంద్రీకరణ- వీటి కారణంగా పట్టణ జీవితం, నగర సంస్కృతి అభివృద్ధి చెందింది. అందుకే ఈ కాలపు నగరాలు సంపన్నంగా, ఆహ్లాదకరంగా, వజ్రవైడూర్యాలతో, రకరకాల ప్రజలతో, వివిధ వృత్తులవారితో చూడముచ్చటగా ఉండేవి. విజయనగర రాజుల రాణీవాసపు సంఖ్య వేల సంఖ్యలో ఉండేవి. రాజులకు నచ్చిన స్త్రీలంతా రాణీవాసంలో చేరవలసిందే వేశ్యావృత్తి చట్టబద్ధమైంది. ఈనాటి సాహిత్యం నగర సంస్కృతినే ప్రతిబింబిస్తున్నది. మాహాత్మ్య గ్రంథాలతో పాటు ప్రబంధాలుగా పేర్కొంటున్న రచనలన్నీ ఈ కోవలోనికే వస్తాయి నిగమశర్మలాంటి వారందరూ ఈ పట్టణ జీవితంనుంచి వచ్చినవారే. కవిత్వం సుమారు ఆస్థానాలకే పరిమితమౌతున్న దశ. 'నిరుప

హతిస్థలం, రమణీప్రియదూతికలు' అవసరమయ్యాయికవులకు. దీనితోపాటు వైష్ణవ మతప్రాబల్యం, వైష్ణవమతాచార్యులకు మతానుయాయులను శిక్షించటానికి, అవసరమైతే వెలివేయడానికి అధికారాలుండేవి. ఈ దశలో ధూర్జటివంటి కవు లొకరిద్దరు ఉన్న పరిస్థితులను నిరసించినవారు కనిపిస్తారు. 'రాజుల్మత్తులు వారి సేవ నరకప్రాయంబు' అని వ్యక్తిగతంగా తాను చూసిన దుర్మార్గాలను నిరసించినవాడే కాని రాచరిక వ్యవస్థనే కాదన్నవాడు కాదు. ధూర్జటి. అందుకే 'సత్యదానదయాదుల్గల రాజున్ నా కొసగ'మంటాడు. తన కాలపు వైష్ణవ మతా చార్యుల నిరంకుశత్వాన్ని 'అయగారై చరియింప వచ్చు'ననే పద్యంలో నిర సించాడే కాని సంప్రదాయ వ్యవస్థను కాదనలేదు. కనీసం అన్నమయ్యలాగా కులభేదం లేని భక్తిని బోధించలేదు. అందుకే అతడనుసరించిన రచనామార్గం మార్గ పద్ధతికి సంబంధించిందే. ధూర్జటితో ప్రారంభమైన పరిపాలకుల, అధికారుల నిరసన ఫ్యూడల్ పాలన సుమారు విచ్ఛిన్నమౌతుండిన 19వ శతాబ్ది వరకు ఉన్న శతకకవులలో పరాకాష్ఠను పొందింది. సుమారుగా ఇటువంటి కవులు చాలామంది బ్రాహ్మణ కవులు. కులనిరసనవంటి సామాజికాంశ వీరిలో చాలామంది కవులలో కనిపించదు. వ్యక్తిగత కోణంనుంచి. తమ అస్తిత్వం దృష్ట్యా మాత్రమే పాలకులను నిందించారు. విజయనగర రాజుల కాలంలో, ఆ తరువాతా రైతులనుంచీ, వృత్తిపనులవారినుంచీ తిరుగుబాట్లనేకం వచ్చినట్లు శాసనాలు చెప్తున్నా వారిని సంఘటితపరచే భక్తి ఉద్యమంగాని, దేశీయమైన నిరసన కవిత్వంగాని వచ్చినట్లు కనిపించదు. వచ్చినా అది శిష్ట సాహిత్య చరిత్రలో స్థానం సంపాదించుకోలేదు. బ్రాహ్మణేతర కవులైన రామరాజ భూషణుడు, చేమకూర వేంకటకవి వంటివారు ఆస్థాన కవులుగా ప్రధాన సాహిత్య ప్రవాహంలో భాగమయ్యారు. తాళ్ళపాక తిమ్మక్క, మొల్లవంటివారు ఇంతకుముందే భక్త కవయిత్రులుగా సాంఘిక పునరుజ్జీవనానికి దోహదం చేస్తే 16వ శతాబ్దితరువాత కవయిత్రులు ఆస్థాన కవయిత్రులుగా రాజుల శృంగా రాన్ని వర్ణించటంలో పోటీ పడ్డారు.

## ప్రజాకవులు

ఈ పరిస్థితులలో ప్రధాన లిఖిత కవితా మార్గానికి భిన్నంగా కనిపించే కవి వేమన. వేమనవని సంకలనం చేసిన పద్యాలలో వైరుధ్యాలనేకం కనిపిస్తున్నా

సామాజిక, ఆర్థిక రంగాలలో వేమనవి ఆ నాటికి విప్లవాత్మక భావాలు. కులం విషయంలో, మూఢ సంప్రదాయాలు, ఆచారాల విషయంలో ఆయన భావాలు హేతువాదం నుంచి ఉద్భవించాయి. మతాధిపతుల, మతాధికారుల నిరంకుశ త్వాన్ని, వర్ణాధిక్యత పేరిట కొనసాగుతున్న అగ్రజాతుల అహంకారాన్ని తీవ్రంగా ఖండించాడు వేమన. 'తోటకూరకి, దొగ్గలాకులకి' కవిత్వం చెప్పే కవులను నిరసించాడు గ్రామాలను పట్టి పీడిస్తున్న కాపు, కరణాలను విమర్శిం చాడు. కుండన్నా, కుంభమన్నా-కొండన్నా, పర్వతంఅన్నా పరతత్వం ఒకటే అని భాష విషయంలో ఉండే వివాదాలను పరిహసించాడు. అయితే స్త్రీలను గురించిన అతని అభిప్రాయాలు, వాళ్ళను గురించి పలికిన అవాచ్యాలు ఆయన అరాచక జీవితం నుంచి వచ్చినవై ఉండాలి. ఆ మాటలు తెలిసిన సామాజిక స్పృహగల కవినుంచి వచ్చే మాటలు కావు. అందుకే వేమన 'రియాక్షన్' కవి. తాను చూచిన దానికి వెంటనే స్పందించి కవిత్వం చెప్పాడు. అందుకే వైరుధ్యా లనేకం అతని భావాలలో కనిపిస్తాయి. అంతస్సూత్రంగా ఒక విధమైన 'డైరె క్షన్' కనిపించదు. 'శైవ వైష్ణవాది షణ్మతాలకు దేవుడొక్కడే' అని, 'తత్వం ఒకటే' అని చెప్తూనే ''శివుడు బ్రహ్మమనుచు స్మృతులెల్ల బలుకంగ వేరె దైవములను వెలయగొల్చి బ్రహ్మజనులు జూడ భ్రష్టమయిపోయిరి'' అంటాడు. దీనికి కారణం ''బహుళ పాపియైన బ్రహ్మఘ్నుడైనను, నిర్దయాత్ముడైన, నీచుడైన మరణకాలమందు మమతలన్నియు మాని హరునిఁదలప ముక్తుడవును వేమ'' అనే అభిప్రాయం గల శైవుడు కావటం కావచ్చు. ''తల్లి శూద్రురాలు కొడుకు బ్రాహ్మణుడెట్లా'అని ప్రశ్నించిన వేమన పద్యాలలోనే ''చెలగి గృహము వనము క్షేత్రము ద్విజులకు దానమిచ్చినట్టి ధర్మపరుడు, బహుళకాలమిలను పాలనజేయుచు, నిండు భోగములను నుండు వేమ'' అనే పద్యం కూడా కని పిస్తుంది. ఈ వైరుధ్యాలకు కొంతవరకు ఈ పద్యాలు వేమన వేరువేరు దశలలో చెప్పటం కారణం కావచ్చు. వేమన పేరిట భిన్న వ్యక్తులు రాసినవి వేమన పద్యాలలో చేరటం కూడా మరొక కారణం కావచ్చు. శైలిని బట్టి, భావాలనుబట్టి అసలు వేమన పద్యాలను వేరుచేయగలిగినప్పుడు వేమన వ్యక్తిత్వాన్ని మరింత స్పష్టంగా అంచనా వేయటానికి వీలుకలుగవచ్చు. ఏమైనా తన కాలపు సామాజిక మత పరిస్థితులను అద్దంపట్టిన కవిగా వేమన తెలుగుదేశపు సామాజిక చరిత్రను ఆ నేపథ్యంలో సాహిత్యాన్ని అంచనా కట్టటానికి ఎంతో ఉపకరించే కవి.

పదిహేడవ శతాబ్దపు తెలుగు సాహిత్యంలో మరొక అభ్యుదయకరమైన అంశం కాలజ్ఞానతత్వాల రూపంలో వచ్చిన సాహిత్యం. కుల భేదాలను తిరస్కరించటం, అస్పృశ్యతను వ్యతిరేకించటంతోపాటు హిందూ, మహమ్మదీయ సమైక్యతను కూడా బోధించాడు పోతులూరి వీరబ్రహ్మం. విజయనగర సామ్రాజ్యం పతనమై తెలుగుదేశంలో మహమ్మదీయ పరిపాలన ఏర్పడ్డ దశలో ఈ సాహిత్యం వచ్చింది. ఇతని శిష్యుడైన సిద్దప్ప దూదేకులవాడైన మహమ్మదీయుడు. వీరబ్రహ్మం మార్గంలోనే తత్వాలను రచించినవాడు. వీరిద్దరు తమ కులవృత్తులను అనుసరిస్తూనే తమ భావాలను తమ రచనల ద్వారా ప్రచారం చేశారు. వివిధ వృత్తులకు సంబంధించిన ఔత్తరాహ భక్త కవుల కోవలోకి వస్తారు వీరు. ఈ కోవలోని కవులెవ్వరు భక్తులనుంచి, శిష్యులనుంచి కట్నాలను కానుకలను స్వీకరిస్తూ మఠాధిపతులుగా రూపొందలేదు. అందుకే ఫ్యూడల్ పాలకుల అండదండలు వీరికి లభించలేదు. మఠాల రూపంలో చిన్న చిన్న సంస్థానాలను రూపొందించుకున్న మఠాధిపతులు, ఫ్యూడల్ పాలకులు మాత్రమే పరస్పరం అండదండల నిచ్చుకున్నారు. వీరబ్రహ్మం వంటి వారి సాహిత్యం రాజపోషణతో సంబంధం లేకుండా సామాన్యజనుల నాలుకపై ప్రచారాన్ని పొందింది. ఆస్థాన సాహిత్యం, పండిత సాహిత్యం ప్రధానంగా సాగిన తెలుగు లిఖిత సాహిత్య చరిత్రలో ఈ కవులకి తగిన గుర్తింపు లేకపోవటం సహజమే.

## ఆధునిక సాహిత్య బీజాలు

వేమనలో ప్రతిబింబించే పరిస్థితులు నెంకొన్న కాలంలో వచ్చిన సాహిత్యమే దక్షిణాంధ్ర వాఙ్మయం. విజయనగర సామ్రాజ్యం విచ్ఛిన్నమైన తరువాత తెలుగు నాయక రాజులు స్వతంత్రులై తమిళ దేశంలో రాజ్యాలు స్థాపించి తెలుగు సాహిత్యానికి అండనిచ్చారు. రాజకీయ, ఆర్థిక పరిస్థితులలోని అస్తవ్యస్త స్థితే సాహిత్య రంగంలోను కనిపిస్తుంది. సంప్రదాయంగా వస్తున్న ఆస్థాన సాహిత్యంతోపాటు, యక్షగానాలు, కీర్తనలు వంటి జనరంజక సాహిత్య రూపాలు కూడా వచ్చాయి. ఈ కాలంలో ఆస్థాన సాహిత్యం శృంగారైక సాహిత్యంగా, చిత్రబంధ కవితారూపంగా దిగజారింది. మరొకవైపు తెలుగు దేశంలో కుతుబ్ షాహీల పరిపాలనలో అచ్చతెనుగు కావ్యాలు వచ్చాయి. అంతకుముందు జాను తెనుగు పేరుతో ప్రారంభమైన సాహిత్యం సంస్కృతీ

కరణ ప్రభావం నుంచి తప్పించుకోలేకపోయింది. తరువాత సంస్కృత భాషా ప్రభావం మరింతగా సాహిత్యంలో పాతుకుపోయిన దశలో తమనిరసనకు ప్రతీకగానో, లేక ప్రయోగాత్మకంగానో అచ్చ తెనుగు కావ్యాలు రాసే ఉద్యమం బయలుదేరి ఉండాలి. ఇది కేవలం భాషాపరంగా మాత్రమే జరిగి ఉండాలి. కాని క్రమంగా అచ్చతెనుగు కావ్యాలు ఓష్ఠ్య, నిరోష్ఠ్య రచనల కోవలో భాగమైపొయ్యాయి. నాయకరాజులకు కూడా వర్ణాశ్రమ ధర్మరక్షణ సాంప్రదాయికమైన ఆదర్శం అయినా బ్రాహ్మణ ప్రాధాన్యం క్రమంగా తగ్గింది. ఇంతకుముందులాగా ధన, కనక, భూదానాలతో సంతృప్తిపరచే ఆర్థిక పరిస్థితులు పొయ్యాయి. పన్నులు పెంచినా ఆదాయం యుద్ధాలకు, సైన్య రక్షణకు మాత్రమే సరిపోతున్నది. దానికి తోడు బ్రాహ్మణులతోపాటు, బ్రాహ్మణేతరులు లౌకిక విద్యలు నేర్చుకోవటం, రాజోద్యోగాలలో ప్రధాన స్థానం ఆక్రమించటం, కొందరు కవులు కూడా కావటం అంతకుముందు బ్రాహ్మణులకుండే ప్రత్యేకతను, ప్రాధాన్యాన్ని తగ్గించింది. క్రమంగా దేశీయ ఆర్థిక వ్యవస్థలో విదేశీయులు ప్రవేశించారు. సామ్రాజ్యవాదానికి బీజాలు పడ్డాయి. ఆర్థికంగా, పరిపాలనా పరంగా స్వదేశీ సంస్థానాధిపతులు విదేశీయుల ప్రాబల్యంలోకి వచ్చారు. వార సత్వాల, అధికారాల పంపకాల లావాదేవీలలో కవుల్ని, పండితుల్ని పోషించగల స్తోమతను కోల్పోయారు సంస్థానాధిపతులు. గ్రామస్థాయిలో మాత్రం మునసబు కరణాల పెత్తనం జనాన్ని పీడిస్తూనే ఉంది. మారిన పరిస్థితులకు తట్టుకోలేని కవులు, ముఖ్యంగా బ్రాహ్మణ కవులు సంస్థానాధీశ్వరులు మొదలుకొని కాపు కరణాల వరకు దూషిస్తూ శతకాలు రాశారు. వ్యక్తిగతంగా తమ అసంతృప్తిని ప్రకటించారు. కులవ్యవస్థ మిశ్రితం అవుతున్నందుకు విచారించారు. బ్రాహ్మణేతర కవులను 'కాపు కవిత్వం' అని అవహేళన చేయటం రామరాజ భూషణుడి దగ్గరే మొదలయింది. ఈ కాలం శతకాలలో ఇలాంటి అవహేళనలు ఇంకా ఎక్కువగా కనిపిస్తాయి. పై పరిస్థితులనుంచి పారిపోయిన కొందరు భక్తి, వైరాగ్య శతకాలు రాశారు. ఈ కవులందరూ భాషలో, అభివ్యక్తిలో స్వేచ్ఛను సాధించారు. పాప్యులర్ సాహిత్యంగా యక్షగానాలు మొదలైన దేశీయ రచనలు, వాటిల్లో ప్రతిబింబించే సమకాలీన సమాజం, వచన గ్రంథాలు, వ్యావహారిక భాషను విస్తృతంగా వాడటం, శతకకవులలో కనిపించే స్వేచ్ఛ, వేమన,

వీరబ్రహ్మం, సిద్దప్ప మొదలైనవారి రచనలు- వీటితో క్రీ॥శ॥ 17 వ శతాబ్ది నాటికే ఆధునిక సాహిత్య లక్షణాల ఛాయలు తెలుగులో పడ్డాయని చెప్పవచ్చు.

## ఉపసంహారం

తెలుగు లిఖిత సాహిత్యం భారతదేశపు ఇతర ప్రాంతీయ భాషా సాహిత్యాల కంటే భిన్నంగా కనిపిస్తుంది. ఇతర ప్రాంతీయ భాషా సాహిత్యాలు ప్రధానంగా దేశీయ సాహిత్యాలుగా, సామాన్య జనంకోసం వచ్చిన రచనలుగా కనిపిస్తే తెలుగు లిఖిత సాహిత్యం ప్రధానంగా ఆస్థాన సాహిత్యంగా, పండిత సాహిత్యంగా కొనసాగింది. ఒక దశలో చాలా కృత్రిమంగా పరిణమించినా ఆస్థాన సాహిత్యంలో కళా విలువలు ఉన్నతంగా రూపొందిన మాట కాదనటా నికి వీలులేదు. ఏ కళా సృష్టి అయినా మానవుని శక్తి, సామర్థ్యాలకు చిహ్నమే. అయితే చరిత్ర గమనంలో సాహిత్యంగాని, ఇతర కళలుగాని నిర్వహించిన పాత్రను బట్టి వాటి స్వభావాన్ని నిర్వచించవలసి ఉంటుంది. దేశ చరిత్రలో పాలకవర్గ భావజాలంలో కనిపించే వైరుధ్యాలన్నీ బ్రాహ్మణ మత ప్రధానంగా సాగిన తెలుగు సాహిత్యంలోనూ ప్రతిబింబించాయి. అచ్చదేశీయమైన భాషలో గీతాలు, కీర్తనలు రాసిన అన్నమయ్య మొదలైన వారికి, నిజమైన ప్రజాసాహిత, నిర్మాతలైన వేమన, వీరబ్రహ్మం, సిద్దప్ప మొదలైన వారికి ప్రధాన లిఖిత సాహిత్యంలో సరియైన గుర్తింపు లేదు. భావ విషయంలో స్వల్పమైన అప్రా మాణికతల కారణంగా భక్తి మార్గానికి సంబంధించిన పాల్కురికి సోమన్న పోతనలనే పండిత మార్గం హృదయ పూర్వకంగా కలుపుకోలేదు. ఈ కవు లందరూ రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలకు చెందిన కవులై ఉండటం గమ నార్హం. అక్కడి ఆర్థిక పరిస్థితులు, సరిహద్దు ప్రాంతాలలోని ఉద్యమాల ప్రభావం దీనికి కారణం కావచ్చు. వస్తువు, ధ్యేయం రచనారూపాన్ని, భాషను నిర్ణయించటంలో ప్రధాన పాత్ర వహిస్తాయనటం సోమన, పోతన, అన్నమయ్య, వేమన, వీరబ్రహ్మం, సిద్దప్ప మొదలైన వారి రచనలను తుల నాత్మక పరిశీలనచేస్తే స్పష్టమౌతుంది.

iii)

తమిళ దేశంపైన ఆర్యమతపు గాలులు తీవ్రంగా వీయకముందే తమిళ సాహిత్యం ప్రారంభమైనందున ఆ సాహిత్యం, దేశీయతను, ప్రత్యేకతను నిలుపుకొని ఉండాలి. ఉత్తర భారతంలో స్థానిక భూస్వాములు అనుసరించిన దమన నీతితో పాటు, ఎప్పటి కప్పుడు ఉప్పెనలావచ్చే విదేశీయుల, మహమ్మదీయుల దండయాత్రలు కారణంగా, నిమ్న వర్గాలవారు, వృత్తిపనులవారు భక్తిమార్గంలో ఏకం కావటంవల్ల తదనుగుణమైన దేశీయ సాహిత్యం ప్రచారంలోకివచ్చి ఉండాలి. ఈ పరిస్థితులలో ప్రాంతీయ సాహిత్యంగా తెలుగు సాహిత్యం ఒక సాహిత్య ద్వీపంలా కనిపిస్తుంది. భాష ప్రాంతీయమైందైనా ఉత్తర భారతంలో ఆస్థాన సాహిత్యంగా పెంపొందిన సంస్కృత సాహిత్య మార్గాలను కలుపుకొని తెలుగు లిఖిత సాహిత్యం కనిపిస్తుంది. దీనికితోడు ఉత్తర భారతంలో వ్యతిరేకతను ఎదుర్కొంటున్న వర్ణ ప్రధానమూ, కర్మ ప్రధానమైన బ్రాహ్మణ మతం దక్షిణ సరిహద్దు ప్రాంతమైన తెలుగు దేశంలో కొంచెం నిందొక్కుకున్నది. మొత్తం మీద తెలుగు లిఖిత సాహిత్య పరిణామం, స్థూలంగానే చెప్పగలిగినా, దేశ రాజకీయ, ఆర్థిక పరిణామాలను ప్రతిబింబిస్తున్నదనటం స్పష్టం. తెలుగు దేశానికి సంబంధించిన చరిత్రను గురించి ఇంకా వివరమైన పరిశోధనలు జరిగితే ఈ సంబంధాన్ని మరింత సుస్పష్టంగా నిర్వచించటానికి వీలు కలుగుతుంది.

# సంప్రదించిన చారిత్రక గ్రంథాలు

1. Amita Ray. 1976. The Siva cult in Nepal. in Subrahmanyam, R. & Rameshan, N. (Ed.) 1976. PP 257-274.

2. Antonova, K. Bongard Levin, G. Kotovsky, G. 1979. A History of India. Moscow: Progrees Publcations.

3. Kosambi, D. D. 1957. Introduction: Vidyakara's Subhashita Ratnakosa. Cambridge: Harward University.

4. Kosombi, D. D. 1962. Myth and Reality: Studies in formation of Indian Culture. Bombay: Popular Prakashan.

5. Kosambi, D. D. 1970. The Culture & Civilization of India in Historical outline. New Delhi: Vikas Publishing home (First Published in 1965.)

6. Mahalingam, T. V. 1940. Administration and Social life under Vijayanagar. Madras: Madras University.

7. Nandi, R. N. 1974. Origin and Nature of Saivite Monasticism. The case of Calamukhas. in Sharma, R. S. (Ed.) 1974: 95-123.

8. Parabrahma Sasthry, P. V. 1978. The Kakatiyas. Hyderabad: The Government of Andhra Pradesh.

9. Sharma, R. S. (Ed.) 1974. Indian Society: Historical Probings in Memory of D. D. Kosambi. New Delhi: peoples Publishing home.

10. Subrahmanyam, R. & Ramesan, N. (Ed.) 1976. Sri Mallampalli Somasekara Sarma Commemoration Volume. Hyderabad: Government of Andhra Pradesh.

11. కాసె స్వర్వప్ప. సిద్ధేశ్వర చరిత్ర.

12. తెలుగు భాషా సమితి. విజ్ఞాన సర్వస్వము ౩ వ భాగం.

---

# నన్నయచారిత్రక భూమిక

—కె. కె. రంగనాథాచార్యులు

భారతదేశ చరిత్ర మధ్యయుగంలో తెలుగులో మొదటి సమగ్ర లిఖిత సాహిత్య రచన నన్నయ భారతం వచ్చింది. ఈ మధ్యయుగంలో క్రీ. శ. 7వ శతాబ్ది నుంచి 12వ శతాబ్ది వరకూ ఫ్యూడల్ యుగం మొదటి దశ అని చారిత్రకుల అభిప్రాయం. ఈ కాలాన్ని ఫ్యూడల్ యుగం అనడానికి ముఖ్యంగా కారణాలు రెండు. 1. రాజ్యాన్నంతా తమ ప్రత్యక్ష ఆధ్వర్యంలో పరిపాలించిన మహా సామ్రాజ్యాలు విచ్ఛిన్నమై, చిన్న చిన్న రాజ్యాలు ఏర్పడి, ప్రతి అంతరంలో కొంత స్వాతంత్ర్యం కలిగిన మండలాధీశుల, పాలెగాళ్ళ పరిపాలన ప్రారంభం కావడం, 2. భూమికి సంబంధించిన స్వత్వస్వామ్యాలు, శిస్తులు, వ్యవసాయం మొదలైనవాటికి సంబంధించిన ఆర్థిక వ్యవస్థ స్వరూప స్వభావాలు. ఈ ఆర్థిక పరిస్థితులపైనే మతం, సాహిత్యం, సమాజం, చట్టం మొదలైనవాటి స్వరూప స్వభావాలు ఆధారపడి ఉంటాయి.

మౌర్య సామ్రాజ్యం నుంచి ప్రారంభమైన సామ్రాజ్య యుగంలో క్రీ.శ. 3, 4, 5 శతాబ్దాలలో భారతదేశాన్ని పాలించిన గుప్తుల సామ్రాజ్యం చివరిది. గుప్త వంశీయులు క్రీ. శ. 7వ శతాబ్ది వరకూ రాజ్యాన్ని పరిపాలించినా మహా సామ్రాజ్యంగా అది క్రీ. శ. 5వ శతాబ్ది నాటికే అస్తిత్వాన్ని కోల్పోయింది. గుప్తుల తర్వాత కొంచెం పెద్ద రాజ్యాలను పరిపాలించిన రాజవంశాలవారిలో గౌడులు, ఘూర్జరులు, మౌఖరులు మొదలైనవారు చెప్పుకోదగ్గవారు. ఫ్యూడల్ సంబంధాలు లేకుండా గ్రామస్థాయి వరకు స్వయంగా పరిపాలనను చూసుకున్న చివరి చక్రవర్తి హర్షవర్ధనుడు. హర్షుడికి చాలా గొప్ప సైన్యం ఉండేదనీ, రాజ్యానికి వచ్చిన ఆరు సంవత్సరాలలో దాదాపు ఉత్తర దేశమంతా జయించాడనీ చరిత్ర చెప్తున్నది. దక్షిణ భారతాన్ని కూడా జయించాలన్న అతని ఆశ నర్మదానదీ తీరంలో పశ్చిమ చాళుక్య రాజు రెండవ పులకేశి చేతిలో ఓడిపోవడంతో విఫలమైంది. మొత్తంమీద భారతదేశంలోని ఎక్కువ భాగాలు కలిసిన

రాజ్యాలలో సుమారు హర్ష సామ్రాజ్యమే చివరిది. హర్షుడి తర్వాత అతని సామ్రాజ్యం ముక్కలై చిన్న చిన్న రాజ్యాలుగా విడిపోయింది. ఈ చిన్న చిన్న రాజ్యాలు పరస్పరం యుద్ధాలు చేసుకుంటూ, అవసరమైనప్పుడు సంధులు చేసుకుంటూ ఉండేవి. ఎప్పటికప్పుడు రూపురేఖలు మారుతూ స్థిరంగా లేని రాజకీయ దశ ఇది.

బౌద్ధ సాహిత్యాన్ని బట్టి దక్షిణదేశ చరిత్రను క్రీ. పూ. 6వ శతాబ్ది నుంచి మాత్రమే పునర్నిర్మించడాని కవకాశం ఉంది. కోసల దేశానికి సంబంధించిన బావరి అనే బ్రాహ్మణుడు దక్షిణాపథానికి వచ్చి గోదావరీ తీరంలో అస్సకజాతివారు నివసించే ప్రాంతంలో స్థిరపడ్డాడు. అతను తన శిష్యులతో బాటు ఉంఛ వృత్తితో జీవించేవాడు. క్రమంగా ఒక గ్రామం వెలసింది. ఒక మహాయజ్ఞం కూడా నిర్వహించాడు. ముసలితనంలో తన శిష్యులను బుద్ధుడి దగ్గరకు పంపించి సందేహాలను తీర్చుకుని బౌద్ధుడయ్యాడు. బావరి దక్షిణానికి వచ్చిన తర్వాతనే దక్షిణదేశం ఆహారాన్ని సేకరించుకునే దశనుంచి ఆహారోత్పత్తి చేసుకునే దశకు వచ్చిఉండాలని చారిత్రకుల ఊహ. పైన పేర్కొన్న అస్సక జాతివారే తరువాత శాతవాహన వంశంగా రూపుదిద్దుకున్నారు. బావరి సాంప్రదాయంలో శాతవాహనులు బ్రాహ్మణులను గౌరవించి యజ్ఞాలు చేశారు. శాతవాహనులు క్రీ. పూ. 221 నుంచి క్రీ. శ. 218 వరకు 439 సంవత్సరాలు దక్షిణాపథాన్ని పాలించారు. మొదటి పులోమావి, గౌతమీపుత్ర శాతకర్ణుల కాలంలో ఈ సామ్రాజ్యం పూర్వాపర సముద్రాల వరకూ, ఉత్తరంలో వింధ్య వరకూ వ్యాపించింది. తరువాత ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు, ఆనంద గోత్రులు, విష్ణుకుండినులు, పల్లవులు, చాళుక్యులు, పాండ్యులు, చోళులు, రాష్ట్రకూటులు దక్షిణ దేశాన్ని పరిపాలించినవారిలో చెప్పుకోదగ్గవారు. వీరిలో చాళుక్య వంశానికి చెందిన రెండవ పులకేశి హర్షవర్ధనుణ్ణి ఎదుర్కొని దక్షిణంలో తన సామ్రాజ్యాన్ని విస్తరింపజేశాడు. ఈ ప్రధాన చాళుక్య వంశం నుంచి అనేక శాఖలు బయల్దేరాయి. వీటిలో పూర్వాంధ్రాన్ని పరిపాలించిన వేంగి లేక తూర్పు చాళుక్య వంశం ప్రధానమైంది. ఈ వంశంలో మొదటివాడు రెండవ పులకేశి తమ్ముడైన కుబ్జ విష్ణువర్ధనుడు. కోస్తా ఆంధ్ర ప్రాంతం అంతా తూర్పు చాళుక్యుల పరిపాలనలో ఉండేది. రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలు

మాత్రం ప్రధాన చాళుక్య వంశం అయిన బాదామి చాళుక్యుల అధీనంలోనే ఉండేవి. తరువాత కర్ణాటకతోపాటు ఈ ప్రాంతాన్ని రాష్ట్రకూటులు, అనంతర లేక కళ్యాణి చాళుక్యులు పరిపాలించారు. వీళ్లుకాక వేములవాడ చాళుక్యులు తెలంగాణంలోని వేములవాడ పరిసర ప్రాంతాలనూ, ముదిగొండ చాళుక్యులు తెలంగాణా తూర్పుప్రాంతంలో కొంత భాగాన్ని పరిపాలించారు. తమిళదేశంలో పాండ్యులనూ, పల్లవులనూ జయించి చోళులు తమిళనాడంతా తమ రాజ్యాన్ని వ్యాపింప జేశారు.

క్రీ. శ. 7-12 శతాబ్దుల మధ్య సుమారు 500 సంవత్సరాలు స్వతంత్ర రాజ్యాల మధ్య ఆధిపత్యం కోసం జరిగిన యుద్ధాలు చరిత్రలో ప్రధానంగా కన్పిస్తాయి ఇద్దరు శత్రు రాజుల మధ్యా, సామంతుల మధ్యా, పాలెగాళ్ళ మధ్యా పోరాటాలు మాత్రమేగాదు- పరస్పర విధ్వంసాలు, దోపిళ్లు, కొల్లగొట్ట డాలు- ఇవి ఈ కాలపు దక్షిణ భారతదేశ చరిత్రలో, ముఖ్యంగా తెలుగుదేశానికి సంబంధించిన చరిత్రలో ప్రధానాంశాలు. రెండవ పులకేశి రాష్ట్రకూట, కదంబ, గాంగ వంశీయులను జయించి సామ్రాజ్యాన్ని విస్తరింప జేశాడు. తరువాత పల్లవులు బాదామితో సహా చాళుక్య రాజ్యాన్ని జయించి కొంతకాలం పాలించారు. మళ్ళీ రాజ్యం చాళుక్యుల అధీనంలోకి వచ్చింది. 8 వ శతాబ్ది మధ్యభాగంలో సామంతులైన రాష్ట్రకూటులు పశ్చిమ చాళుక్యులకు ఎదురుతిరిగి మొత్తం రాజ్యంమీద తమ ఆధిపత్యాన్ని స్థిరపరచుకున్నారు. రాష్ట్రకూటులకూ, తూర్పు చాళుక్యులకూ మధ్య పరస్పరం యుద్ధాలూ, సంధులూ జరుగుతూ, ఈ రాజ్యాల రాజకీయ భౌగోళిక స్వరూపం స్థిరంగా ఉండేదికాదు. రెండవ విజయాదిత్యుడు రాష్ట్రకూటులతో 12 సంవత్సరాలు 108 యుద్ధాలు చేసి యుద్ధం జరిగిన ప్రాంతాల్లో 108 శివాలయాలు కట్టించాడట. గుణగ విజయాదిత్యుడి కాలంలో సామ్రాజ్యాధిపత్యం కోసం రాష్ట్రకూటులకూ, తూర్పు చాళుక్యులకూ మధ్య పోటీ పెరిగింది. గుణగ విజయాదిత్యుడి కాలంలో జరిగిన అనేక దోపిళ్ళను గురించీ, దహనకాండను గురించీ శాసనాలు చాటి చెప్తున్నాయి. అతని సేనాధి పతి పండరంగడు నెల్లూరు దగ్గర 12 బోయ కొట్టాలను ముట్టడించి నెల్లూరికి నిప్పు పెట్టాడు. అతడే డాహల ప్రాంతాన్ని ముట్టడించి రాజధాని కిరణ పురాన్ని దహించడమే కాకుండా ఆధునిక బస్తరుకు రాజధాని అయిన చక్ర

కూటాన్ని కూడా భస్మం చేశాడు. చోళ రాజులు కూడా దోపిడీలూ, దహనాలూ అనేకం చేయించినట్లు చరిత్ర చెప్తున్నది. మొత్తంమీద తూర్పు చాళుక్య వంశీయు లెవరూ స్థిరంగా, శాంతితో రాజ్యాన్ని పాలించినట్లు కనపడదు. తెలుగు చోడుడయిన జటాచోడ భీముడు (క్రీ. శ. 972-1002) తూర్పు చాళుక్య పరిపాలకుడు దానార్ణవుణ్ణి చంపి 27 సంవత్సరాలు రాజ్యాన్ని పరిపాలించాడు. దానార్ణవుని పుత్రులు మొదటి శక్తివర్మ, విమలాదిత్యులు చోళ రాజుల్ని ఆశ్రయించారు. చోళ రాజైన ఒకటవ రాజరాజు సహాయంతో శక్తివర్మ వేంగీ రాజ్యాన్ని మళ్ళీ గెల్చుకొని క్రీ. శ. 999 నుంచి 1011 వరకూ పాలించాడు కానీ సుమారు చోళులకు సామంత స్థితిలోనే ఉన్నాడు. ఇతని తరువాత రాజరాజు కూతురు కుందవాంబను పెళ్ళి చేసుకున్న శక్తివర్మ తమ్ముడు విమలాదిత్యుడు 1018 వరకు రాజ్యం చేశాడు. విమలాదిత్యుడి పుత్రుడూ, ఆంధ్ర మహాభారత రచనకు మూల కారకుడూ అయిన రాజరాజ నరేంద్రుడు తండ్రి తర్వాత వెంటనే సింహాసనా న్నధిష్ఠించలేకపోయాడు. అతని సవతి తమ్ముడు విజయాదిత్యుడు కళ్యాణి చాళుక్యులూ, కళింగ గాంగుల సహాయంతో రాజ్యాన్ని ఆక్రమించడమే దీనికి కారణం. రాజరాజ నరేంద్రుడు చోళరాజూ, తనకు మేనమామా అయిన రాజేంద్ర చోళ చక్రవర్తి సహాయంతో రాజ్యాన్ని సంపాదించుకొని 22-8-1022 న పట్టాభిషేకం చేసుకున్నాడు. కాని రాజ్యంలో అతడు చాలాకాలం స్థిరంగా ఉండలేకపోయాడు. 1031 లో కళ్యాణి చాళుక్యుల సహాయంతో విజయాదిత్యుడు వేంగిని మళ్ళీ ఆక్రమించు కున్నాడు. బావమరది రాజాధిరాజు కళ్యాణి చాళుక్యులను ఓడించగా 1035లో మళ్ళీ రాజరాజు సింహాసనం సంపాదించాడు. క్రీ. శ. 1044 లో కళ్యాణి చాళుక్యులు మళ్ళీ వేంగిపైన దండయాత్ర చేసి కొంత భాగం స్వాధీనం చేసు కున్నట్లు కన్పిస్తుంది. క్రీ శ. 1056లో గాని రాజరాజ నరేంద్రుడు రాజ్యంలో శాంతితో స్థిరపడలేదు. పోరాటం కొనసాగించలేక రాజరాజ నరేంద్రుడు కళ్యాణి చాళుక్యరాజు ఆహవమల్ల సోమేశ్వరునితో సంధి చేసుకున్న తర్వాతనే స్థిరపడ్డట్టు కన్పిస్తుంది. దీనికోసం కళ్యాణి చాళుక్యుల బిరుదాలు సత్యాశ్రయ కులశేఖర, సమస్త భువనాశ్రయ మొదలైన వాటిని రాజరాజు ధరించాడు. ఇది పదకొండవ శతాబ్దిలో రాజరాజ నరేంద్రుని నాటి రాజకీయ పరిస్థితి. ఇదిలా ఉండగా నన్నయ రాజరాజ నరేంద్రుణ్ణి ''ఘోరాజి ముఖోపలబ్ధ విజయ

ప్రమదాశ్రిత బాహాదండ'', ''నిస్త్రైజిత వైరివీర", (ఆది. 1-161), ''వీరశ్రీవనితాశ్రిత భూరి స్థిర బాహాదండ'' (ఆది.3-227), ''వైరివేదండ గండ విదారి ఘోరతరాసి భాసిభుజార్గళా" (ఆది.3-228), ''సప్తసముద్ర ముద్రితాఖిల వసుధాజనగీతకీర్తి" (ఆది.5-260), ''వైరి భయంకరశౌర్య" (ఆది.8-409), ''ఘోరాజి మదకుంభి కుంభవిదారణ దారుణ కృపాణ దక్షిణ హస్త'' (అరణ్య.2-1) అని సంబోధించడం, ''నిజమహీమండల ప్రజఁబ్రీతిఁ బెంచుచుఁ, బర మండలంబుల ధరణిపతుల, నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును, బలిమినీయని భూమివలయపతుల, నుక్కడఁగించుచు దిక్కులఁ దన యాజ్ఞ, వెలుఁగించుచు......" (ఆది.1-7) అని ప్రశంసించడం రాజరాజ నరేంద్రుని రాజ్యాధికార యోగ్యతను అతిశయోక్తులతో చాటి చెప్పే ప్రయత్నం తప్ప మరొకటి కాదు. ఈ ప్రయత్నంలోని భాగమే ఈ కింది పద్యంకూడా.

ఉ. రాజకులైక భూషణుఁడు రాజమనోహరుఁడన్యరాజ తే
జోజయశాలి శౌర్యుఁడు విశుద్ధ యశశ్శరదిందు చంద్రికా
రాజిత సర్వలోకుఁ డపరాజిత భూరిభుజా కృపాణ ధా
రాజలశాంత శాత్రవ పరాగుఁడు రాజమహేంద్రుఁడున్నతిన్.
( ఆది. 1-3 )

మౌర్య సామ్రాజ్యం తర్వాత భారత దేశ ఆర్థిక చరిత్రలో ప్రధానంగా రెండు రకాల పరిణామాలు సంభవించాయి. దీన్లో మొదటి దశ స్వయం సమృద్ధమైన గ్రామీణ వ్యవస్థ. రైతులు స్వతంత్రంగా వ్యవసాయం చేసుకుంటూ జీవించిన వ్యవస్థ. బౌద్ధుల కాలంలోనూ, కేంద్రీకృతమైన మౌర్యుల పరిపాలనలోను వాణిజ్యాభివృద్ధివల్ల పట్టణ నాగరికత పెరిగి రకరకాల వృత్తుల వాళ్ళు వ్యాపించారు. కుమ్మరం, కమ్మరం మొదలైన వృత్తి నైపుణ్యాలు పెరిగాయి. తరువాత ఈ రక రకాల వృత్తుల వాళ్ళు క్రమంగా గ్రామాలకు తరలారు. వృత్తులు గ్రామీణం అయ్యాయి. పట్టణాలు వదలి ఊళ్ళు చేరుకుని స్వంత భూమిని దున్నుకుంటూ, తమ వృత్తులను కొనసాగించారు చాలామంది. తమకు అవసరమైన పనిముట్లూ, వస్తువులూ అందుబాటులో ఉండడం వల్ల శూద్రులూ, కర్షకులూ గ్రామాల్లో స్థిరపడి వ్యవసాయం చేసుకోవడం వల్ల గ్రామాలు స్వయంసమృద్ధం అయ్యాయి. గ్రామాధికారులు, భూస్వాముల పెత్తనం

లేకుండా కర్షక ప్రధానమైన గ్రామీణ వ్యవస్థ క్రీ. శ. మొదటి శతాబ్దులలో కని పిస్తుంది. క్రీ.పూ. 1 వ శతాబ్దం/ క్రీ. శ. 1 శతాబ్దం వరకు అడవులను కొట్టు కొని భూమిని ఎవరు సాగుచేస్తే ఆ భూమి వారిదే అయ్యేది. గ్రామీణులకు మధ్య దళారీలతో సంబంధం లేకుండా రాజులతోనే, ఉద్యోగుల ద్వారా ప్రత్యక్ష సంబంధం ఉండేది. నిరాడంబరమైన ఈ గ్రామీణ వ్యవస్థ రాజులు సామంతు లకూ, పాలెగాళ్ళకూ, గ్రామాధికారులకూ అధికారాన్ని దత్తం చేయడం వల్లా, గ్రామీణులపైన వీరికి ప్రత్యక్షంగా పెత్తనం ఏర్పడ్డం వల్లా దెబ్బతిన్నది. క్రమంగా క్రీ. శ. 7 వ శతాబ్ది నాటికి గ్రామాల్లో భూమిపైన అధికారంగల ఒక వర్గం ఏర్పడింది. ఇది ప్రధానంగా రెండు మార్గాలలో జరిగింది.

మౌర్యులకాలంలో రాజాధికారులకుజీతాలుండేవి. కౌటిల్యునిఅర్థశాస్త్రంలో కూడా ఈ విషయం కన్పిస్తుంది. క్రీ. పూ. 1/క్రీ. శ. 1 శతాబ్దుల కాలం నాటికి ఆయా ప్రాంతాల్లో నియమింపబడిన అధికారులకు అక్కడి భూమి పైన శిస్తును పొందే అధికారాన్నివ్వడం జరిగింది. క్రమంగా కింది దశలోని ఉద్యో గులకే కాకుండా పై దశలోని ఉద్యోగులకు కూడా భూమి శిస్తులను ఇవ్వడం ప్రారంభమైంది మొదటి దశలో ఇది తాత్కాలికంగా మాత్రమే ఉండేది. అంటే ఉద్యోగులు ఉద్యోగం నిర్వహిస్తున్నంత వరకు మాత్రమే శిస్తును పొందే అధి కారం ఉండేది. క్రీ.శ. 9 వ శతాబ్ది నుంచి ఈ అధికారాలు వంశ పారం పర్యంగా సంక్రమించి క్రీ.శ. 11 వ శతాబ్ది నాటికి బాగా వ్యాపించింది. శిస్తుల మీద అధికారం వంశ పారంపర్యం కావడంతో అది మొత్తం భూమిపైన అధి కారంగా మారిపోయింది. ఆచంద్ర తారార్కంగా భూదానాలు చేయడం ప్రారం భమయింది. ఈ విధంగా స్వంత ఆస్తి హక్కు ఏర్పడింది. క్రమంగా గ్రామాధి కార్లకూ, పాలెగాళ్ళకూ మధ్య భేదం పోయింది. వంశ పారంపర్యంగా వచ్చే పాలెగాళ్ళను రాజాధికారులుగా నియమించడం రాజాధికారులకు వంశ పారంపర్యంగా వచ్చే పాలెగాళ్ళ బిరుదులనూ, అధికారాలనూ దత్తం చేయడం మొదలయింది. దీని తర్వాత దశలో ఈ భూములకు సంబంధించిన పరిపాలనా సంబంధమైన అధికారాలను కూడా వారికే దత్తం చేయడం జరిగింది. భూమి పైన మాత్రమే కాదు, భూమిలో పనిచేసే వారిపైన కూడా పాలెగాళ్ళకూ, భూస్వాములకూ అధికారాలు సంక్రమించాయి. రైతులూ, కౌలుదార్లూ వారిచెప్పు

చేతల్లో మెలగ వలసిన పరిస్థితి ఏర్పడింది. తమ అధీనంలో ఉన్న ప్రాంతంలోని వాద వివాదాలను పరిష్కరించే హక్కు, అధికారం పాలెగాళ్ళకూ, భూస్వాములకూ ఉండేది. దీని ఫలితం కేంద్ర ప్రభుత్వంలో ప్రత్యక్ష సంబంధం లేకుండా, కింది స్థాయిలోని పాలకులు బలపడడం, రాజకీయ స్థిరత్వం లేకపోవడం. ఆర్థికంగా పెద్ద సైన్యాలను పోషించే శక్తి రాజులకు పోయింది. పాలెగాళ్ళు, మండలాధిపతులూ తమ అధీనంలో చిన్నచిన్న సైన్యాలను పోషిస్తూ, యుద్ధాలలో రాజుకు సహాయం చేస్తూండేవాళ్ళు. రాజోద్యోగులుగా భూములపైనా, గ్రామాల పైనా అధికారం సంపాదించిన వాళ్ళలో బ్రాహ్మణులూ, బ్రాహ్మణేతరులూ కూడా ఉండేవాళ్ళు.

మతపరమైన కారణాల వల్లకూడా ఈ కాలంలో బ్రాహ్మణులకు భూదానాలూ, గ్రామదానాలూ మొదలయ్యాయి. క్రీ.శ. 2వ శతాబ్ది నాటికే మత సంస్థలయిన బౌద్ధారామాలకూ, బ్రాహ్మణమత సంబంధమైన దేవాలయాలకూ భూ, గ్రామ దానాలు మొదలైనట్లు శాసనాలు చెప్తున్నాయి. బ్రాహ్మణులకు దానం చేసిన భూములపైన సర్వాధికారాలూ బ్రాహ్మణులకే ఉండేవి. మత సంస్థలైన ఆరామాలకూ, దేవాలయాలకూ ఇచ్చిన భూములపైన కూడా ఆ సంస్థలకే అధికారాలూ, పన్నులనుంచీ, రాజ సంబంధమైన పరిపాలనా వ్యవహారాలనుంచీ మినహాయింపులూ, అమ్ముకోవడానికీ, మార్చుకోవడానికీ హక్కులూ ఉండేవి. సాధారణంగా బంజరు భూములను దానాలు చేయడం జరిగేదనీ, దీనివల్ల వ్యవసాయం పెరగడానికి అవకాశం లభించేదనీ చారిత్రకుల అభిప్రాయం. దున్నుకోవడానికి కానీ, దున్నించుకోవడానికి గానీ ఈ దానాలు చేసినట్లు శాసనాల్లో కనిపిస్తుంది రాజే కాకుండా, సామంతులూ, మండలాధీశ్వరులూ, పాలెగాళ్ళు కూడా బ్రాహ్మణులకూ, దేవాలయాలకూ దానాలు చేసేవాళ్ళని తెలుస్తుంది. దక్షిణ భారతంలో క్రీ.శ. 7 వ శతాబ్దినుంచీ ముఖ్యంగా పల్లవుల కాలంలో దేవాలయ నిర్మాణం, దేవాలయాలకు భూదానాలు విస్తృతంగా జరిగినట్లు కన్పిస్తుంది. ఈ విధంగా మత సంస్థలు తమ భూములపైన వచ్చే అదనపు రాబడితో తమ సంపదను పెంచుకున్నాయి. పూజారులతో పాటు అనేక మంది ఉద్యోగులు దేవాలయాలపైన ఆధారపడి ఉండేవారు. గ్రామీణులపైన దేవాలయాల ప్రభావం ఎక్కువగా ఉండేవి. రాజులు దేవాలయాలనూ, మత

సంస్థలనూ పోషించడం, దాని ప్రతిఫలంగా వాటి అండదండలు పరిపాలకులకు లభించడం, శాంతి భద్రతలు స్థిరపడడానికి కూడా అవి తోడ్పడడం జరిగింది. కాని బౌద్ధారామాలు మాత్రం మొదటి దశలో తమ ఆస్తి పాస్తులపైన వచ్చే అదనపు రాబడిని వాణిజ్య వ్యాపారాలకు పెట్టుబడిగా పెట్టినట్లు కనిపిస్తుంది. క్రీ.శ. ఆరంభ శతాబ్దాలలో బౌద్ధారామాలు వాణిజ్యాభివృద్ధికీ, పట్టణ నాగరికతా భివృద్ధికీ తోడ్పడగా, తర్వాత దశలో దేవాలయాలు గ్రామీణ వ్యవస్థకీ, ఆ తర్వాత ఫ్యూడల్ వ్యవస్థకీ తోడ్పడ్డాయి. దేవ భోగాలకు రాజుల నుండి పరిపాలనా సంబంధం వల్ల చేకూరిన మినహాయింపుల వల్ల రైతులు, ఇతర వృత్తులవారు దేవాలయాలకే ఆర్థిక విషయాలలో కట్టుబడి ఉండే వారు. కొన్ని సందర్భాలలో దేవాలయాలకు అధీనంలో ఉండే ప్రాంతాలూ, గ్రామాలూ, భూములూ కేంద్ర ప్రభుత్వ అధికారానికే దెబ్బ పెట్టేవిగా ఉండేవి. ఈ విధంగా దక్షిణ భారతం లోని దేవాలయాలు ఫ్యూడల్ స్వభావాన్ని సంతరించుకున్నాయి. బౌద్ధా రామాలూ,జైన వసతులు కూడా ఈ కాలంలో ఇదే స్వభావాన్ని కలిగి ఉండేవని చెప్పవచ్చు.

నన్నయ భారతంలో బ్రహ్మదేయాల ప్రసక్తి, మూల భారతంలో లేని దేవభోగాల ప్రసక్తి కనిపిస్తుంది. "అగ్రజన్ముల ననుగ్రహంబునఁ జారుతర మహాగ్రహారంబులిచ్చుచు", "దేవభోగముల మహా విభూతిఁ దనరఁ జేయుచు" (ఆది. 1-7) మనుమార్గ దయినాడని నన్నయ రాజరాజును ప్రశంసించాడు. దీనినిబట్టి 11 వ శతాబ్ది నాటికి బ్రాహ్మణులకు అగ్రహారాలూ, దేవాలయాలకు గ్రామాలూ ఇవ్వడం ఎక్కువ ప్రచారంలో ఉందని చెప్పవచ్చు మూల భారతంలో ఆనుశాసనిక పర్వంలో భూమిదాన ప్రశంసను గూర్చి ఒక ప్రత్యేక అధ్యాయమే ఉంది. కాని అది క్రీ. శ. 1 వ శతాబ్దిలో ప్రక్షిప్తం చేసిందని చారిత్రకుల అభిప్రాయం. అవతారికలోనే కాకుండా ప్రధాన గ్రంథంలో కూడా మూల భారతంలో చెప్పని దేవభోగాల ప్రసక్తి నన్నయ భారతంలో కనిపిస్తుంది. ధర్మరాజు జూదంలో బ్రాహ్మణ ధనం తప్ప తక్కిన ధనాన్ని, బ్రాహ్మణులు తక్క తక్కిన పరివారాన్ని పణంగా ఒడ్డినట్లు మూల భారతంలో ఉంది.

''పురం జనపదో భూమి ర(బ్రాహ్మణ ధనై స్సహ,
అబ్రాహ్మణాశ్చ పురుషా రాజ శ్శి్ష్టం ధనం మమ''
(సభా. అధ్యా. 65-8)

నన్నయ భారతంలో దీనికి దేవభోగాలూ, బ్రాహ్మణ వృత్తులూ చేరాయి.

''వ. ఇట్లు దేవభోగ బ్రాహ్మణ వృత్తులు దక్కఁ దక్కిన మహీతలంబును, బ్రాహ్మణులు దక్క సర్వ ప్రకృతి జనులను, రాజపుత్త్రిల నొక్కొక్క యొద్దున నొడ్డి యోటువడి వెండియు.'' (సభా. 2-195)

మధ్యయుగంలో బౌద్ధ జైనులకూ, వైదిక మతం పేరిట నిలదొక్కుకున్న బ్రాహ్మణ మతానికీ ఆర్థిక, రాజకీయ, తాత్విక, సామాజిక పరమైన స్వరూప స్వభావాల్లో పెద్దగా భేదమేమీ లేదు. ఫ్యూడల్ వ్యవస్థలో భాగంగా ఈ మతాలూ ఫ్యూడల్ స్వరూపాన్నే సంతరించుకున్నాయి. దేశంలో బౌద్ధం నుంచి మళ్ళీ బ్రాహ్మణ మతంవైపు మార్పు రావడానికి ప్రధాన కారణం ఆర్థిక స్థితిగతులు. పట్టణ నాగరికతకూ, వాణిజ్య వ్యాప్తికీ తోడ్పడిన బౌద్ధం స్వయం సంపూర్ణమైన గ్రామీణ ఆర్థిక వ్యవస్థకు దోహదం చేయలేదు. అపారమైన భూములూ, సంపదా కలిగిన బౌద్ధారామాలు వాణిజ్యానికి పెట్టుబడులు పెట్టి ప్రోత్సహించాయి. బౌద్ధం చైనా మొదలైన దేశాల్లోకి వ్యాపించడానికి కారణం వాణిజ్య సంబంధాలే అని చరిత్రకారులు భావిస్తున్నారు. తమ ఆధిపత్యాన్ని గుర్తింపజేసి నిలబెట్టడానికి పరిపాలకులకు బ్రాహ్మణుల అవసరం రాగా, మరొకవైపు వ్యవసాయ ప్రధానమైన గ్రామీణ వ్యవస్థలో ఋతువుల పరిజ్ఞానం, భూములూ, విత్తనాలూ మొదలైన వాటిని గురించి పరిచయం, మత సంబంధమైన కర్మకాండలు మొదలైన వాటికోసం బ్రాహ్మణులకు మళ్ళీ ప్రాధాన్యం వచ్చింది. కొత్త ప్రాంతాల్లో వ్యవసాయం వ్యాపించడానికే కాకుండా కింది కులాలవారు రాజుకీ, భూస్వాములకూ విధేయులుగా ఉండడానికి బ్రాహ్మణ వర్గం, బ్రాహ్మణ మతం తోడ్పడ్డాయి.

బౌద్ధం క్రీ. శ. మొదటి శతాబ్దుల నాటికే ఆ మతం మొదలైన నాటి స్వరూప స్వభావాలను కోల్పోయింది. భిక్షాటనం చేస్తూ, అతి సాధారణ జీవి

తాన్నే గడుపుతూ సామాన్యుల భాషలో సామాన్యాలకు బోధించేదశ ఈ రోజుల్లో పోయింది. బౌద్ధారామాల్లోని భిక్షువులు ఖరీదైన భోగజీవితాన్ని గడపకం ప్రారంభించారు. బ్రాహ్మణ మతంలోని ఆచారాలూ, నమ్మకాలూ బౌద్ధంలో ప్రవేశించాయి. దీనికి మహాయాన బౌద్ధం ముఖ్య కారణం. మహాయాన బౌద్ధం ఆచార్య నాగార్జునితో ఆంధ్ర దేశంలోనే ఉచ్ఛస్థితికి రావడం గమనించదగిన విషయం. అసలైన బౌద్ధ స్వరూపాన్ని నిల్పుకున్న మార్గాన్ని హీనయానంగా పేర్కొనడం జరిగింది. గణపతి, శివుడు, విష్ణువు మొదలైన దేవతల్ని బుద్ధుడి విధేయులుగా నైనా మహాయానం అంగీకరించింది. అశోకుడు కళింగ యుద్ధం తర్వాత అహింసా మార్గాన్ని అవలంబించాడు. కానీ క్రీ. శ. 7వ శతాబ్దికి చెందిన చక్రవర్తి హర్షుడు తన సామ్రాజ్యాన్ని విస్తరింప జేసికోవడానికి చాలా కాలం యుద్ధాలు చేశాడు. నలందా బౌద్ధ విశ్వవిద్యాలయాన్ని ఉచ్ఛస్థితికి తీసి కొని వచ్చిన ఈ హర్షుడే 'పరమ మాహేశ్వరుణ్ణ'నీ, 'పరమ భట్టారకుణ్ణ'నీ చెప్పుకున్నాడు. తాను రాసిన నాగానంద నాటకంలో నాయకుడు బౌద్ధుడైనా, గౌరీ అరాధన కూడా కనిపిస్తుంది. కాబట్టి బౌద్ధాన్ని అణచివేసి బ్రాహ్మణ మతాన్ని నిలబెట్టడమన్న మాటకు అర్థంలేదు. ఈ కాలంలో ఈ రెండింటికీ స్వరూప స్వభావాల్లోనే భేదం లేదు. ఎందరో రాజులు ప్రాచీనమైన బ్రాహ్మణ దేవతల నారాధిస్తూనే, బౌద్ధారామాలకూ, జైన వసదులకు భూములనూ, గ్రామాలనూ దానం చేశారు ఆంధ్ర చక్రవర్తులైన శాతవాహనులు కొందరు యజ్ఞ యాగాదులు చేసి ఏక బ్రాహ్మణులమని చెప్పుకున్నా, బౌద్ధులకూ, బౌద్ధా రామాలకూ దానాలు చేశారు. గుప్త వంశీయులు బ్రాహ్మణులకు దానాలివ్వడంతో పాటు బౌద్ధుల్ని పోషించారు. తాత్త్వికంగా బౌద్ధం, బ్రాహ్మణ మతం రెండూ కలిసి పోయాయి. రెండూ యథార్థ జీవితాన్నంగీకరించలేదు. బుద్ధుడు అవతా రాల్లో ఒకడయినాడు.

మౌలికంగా బౌద్ధ మతంలో అన్ని వర్ణాలవారికీ ప్రవేశం ఉండేది. సృష్టికి కారణమై మనిషి భవిష్యత్తును నిర్మించే దేవుడి అవసరాన్ని బుద్ధుడు గుర్తించలేదు. దేవుడి మీద మాత్రమే విశ్వాసం ఉన్నవాడికి ఆత్మ విశ్వాసం, ప్రయత్నం ఉండవని అన్నాడు బుద్ధుడు. బ్రాహ్మణమతం మనిషి భవిష్యత్తునీ, జీవితాన్నీ నిర్మించేది దేవుడేననీ, మనిషి ఉద్దేశ్యాలనూ, గమ్యాలనూ అతడే నిర్ణ

యిస్తాడనీ విశ్వసిస్తుంది. మహాయానం ప్రారంభం కావడంతో బౌద్ధంలో కూడా దీనిని పోలిన విశ్వాసాలు ప్రవేశించాయి. హీనయానంలో బుద్ధుడు సామాన్య మానవుడు, చారిత్రక పురుషుడు. మహాయానంలో ఆయన అతీత శక్తి సంపన్నుడు, దేవుడు. హీనయానంలో ప్రతివాడూ తన అర్హత పదానికి, నిర్వాణానికి కృషి చేస్తాడు. మహాయానంలో ప్రతివాడికీ నిర్వాణం ఉంది. కాని బోధిసత్వుణ్ణి ఆశ్రయించాలి, తనను తాను అర్పించుకోవాలి. అవలోకితేశ్వరుడు బోధిసత్వుల్లో ఒకడు. ఆయనను అర్థిస్తే, తనను తాను అర్పించుకుంటే నిస్సహాయులకు సహాయం చేస్తాడు. కష్టసమయాల్లో ఆదుకుంటాడు. దీనివల్ల అంతకుముందు బౌద్ధంలో ప్రతి మనిషికీ ఉందని చెప్పిన స్వయం బాధ్యతా ప్రతిపత్తి దెబ్బ తిన్నది. తనకు తాను అర్పించుకొనడమన్నది ఫ్యూడల్ పరిపాలకునికి సేవ చేయడానికి మార్గాన్ని సుగమం చేసింది. ప్రభువులను శరణనాలి. ఇంకేమీ ఆలోచించకూడదు. దీంతో బోధిసత్వభక్తి సంప్రదాయం ప్రారంభమైంది. క్రీ.శ. 8వ శతాబ్ది నాటికి బౌద్ధంలో విజ్ఞాన వాదం అభివృద్ధి చెందింది. జ్ఞానమే శాశ్వత సత్యం తక్కినవన్నీ ఊహాజనితాలు. ప్రపంచంలో కనిపిస్తున్నదంతా భ్రమ. మనం ఉందనుకుంటున్న దుఃఖం, విచారం లేనే లేవు. అవి ఊహాజనితాలు. అంతా సవ్యంగానే ఉంది. అట్లా ఆలోచించడంలోనే మానవునికి విముక్తి ఉంది. మొత్తం మీద తత్త్వ విచార ప్రధానంగా మహాయానం ప్రారంభమై శూన్యవాదం నుంచి విజ్ఞాన వాదానికి, క్రీ. శ. 6వ శతాబ్ది నాటికి వజ్రయానం లేక తాంత్రిక వాదానికి దారి తీసింది. కొన్ని రకాల క్రియాకాండల ద్వారా దివ్యానందాన్ని పొందటం, శాశ్వత సత్యంతో మమేకం కావటం తాంత్రికత లక్ష్యం. ఈ తాంత్రికత బౌద్ధంతోపాటు జైన, శైవ, వైష్ణవాలలో కూడా ప్రవేశించడం గుర్తింపదగిన అంశం. బౌద్ధం అశోకుని కాలం నాటికే ఆంధ్ర దేశంలో ప్రవేశించిందనడానికి ఆధారాలున్నాయి. క్రీ. శ. 7వ శతాబ్ది నాటికే భారత దేశంలో బౌద్ధం క్షీణదశకు వచ్చినట్లు చైనా యాత్రికుడు హ్యూయన్‌త్సాంగ్ రాతలవల్ల తెలుస్తుంది. ఆంధ్ర దేశంలో క్రీ. శ. 12వ శతాబ్ది వరకు బౌద్ధం అక్కడక్కడా చెదురు మదురుగా కొనసాగిందని చెప్పడానికి సాహిత్యాధారాలున్నా, అది ఒక ప్రధాన మతంగా తన అస్తిత్వాన్ని ఫ్యూడల్ దశ ప్రారంభ కాలం నాటికే కోల్పోయిందని చెప్పవచ్చు.

బౌద్ధంతోపాటు క్షత్రియులలో బుద్ధునికంటే మొదలే ప్రారంభమయిన జైనం ప్రధాన మతంగా ఆంధ్రదేశంలో చాలాకాలం కొనసాగింది. జైనంలో దిగంబర, శ్వేతాంబర శాఖలున్నా, బౌద్ధంలో లాగా తాత్వికమైన భేదాలు వీటికి లేవు. ఒకవిధంగా జైనం నాస్తిక మతం. కాని క్రమంగా జినుణ్ణి దేవుడిగా భావించడం, విగ్రహారాధన ప్రారంభమయ్యాయి. బౌద్ధంలోలాగా బ్రాహ్మణ మతసంప్రదాయాలు, తాత్వికత జైనాన్ని పూర్తిగా కబళించలేదు. జైనంలో వర్ణ, కులభేదాలు లేకుండా సామాన్యులకు స్థానం ఉంది. సామాన్యులను గురించి ఆలోచిస్తుంది. బహుశా ఈ కారణం వల్లనే జైనం ఆంధ్రదేశంలో బౌద్ధం దాదాపు తొలగిపోయింతర్వాత కూడా నిలదొక్కుకుని, శైవ, వైష్ణవాలకు ఇతర బ్రాహ్మణ మత మార్గాలకు పోటీగా నిలబడగలిగింది. విజయనగర సామ్రాజ్య కాలం వరకు ఆంధ్రదేశంలో జైనం కొనసాగింది. మౌర్య చంద్రగుప్తుని కాలంలో భద్రబాహుముని ద్వారా దక్షిణ దేశానికి వచ్చిన జైనం తెలుగు దేశంలో తెలంగాణా, రాయలసీమ ప్రాంతాల్లో ఎక్కువగా వ్యాపించింది. శాత వాహనుల్లో కొందరు జైన ధర్మాన్ని అనుసరించారు. వైదిక బౌద్ధమతాలకు పోటీగా జైనం ఉత్తర భారతంలో నిలదొక్కుకో గలిగినట్లు కన్పించదు. క్రీ.శ. 5 వ శతాబ్దిలో దడిగ, మాధవులనే రాజకుమారులు ఉత్తరంనుండి దక్షిణానికి వచ్చి కడప జిల్లా ఒంటిమెట్ట దగ్గరి గంగపేరూరు గ్రామంలోని సింహనంది అనే జైనాచార్యుల సహాయంతో కోలారు రాజధానిగా గంగ వంశాన్ని స్థాపించార్లు. తెలుగు దేశంలోకంటే కన్నడ దేశంలో ఈ మతం ఎక్కువగా వ్యాపించింది. బాదామి చాళుక్యులలో చివరి రాజులు, రాష్ట్రకూటులు జైన మతాన్ని అవలం బించారు. తూర్పు చాళుక్యులు చాలామంది జైనాన్ని అనుసరించారు. రాజరాజ నరేంద్రుడి తండ్రి విమలాదిత్యుడు చివరి కాలంలో జైనాన్ని అనుసరించాడు క్రమంగా కుల భేదాలూ, వర్ణ భేదాలూ జైనమతంలో కూడా ప్రధాన స్థానాన్ని వహించినట్లు కనిపిస్తుంది. అందుకే జైన బ్రాహ్మణులూ, జైన వైశ్యులూ మనకు కనిపిస్తారు. తూర్పు చాళుక్య కుబ్జ విష్ణువర్ధనుని సేనాపతి కాలకంపడు అనే బ్రాహ్మణుడు జైనుడు. ఈ కాలకంపని వంశానికి చెందిన చాలామంది మొదట జైనులుగా ఉన్నట్లు తెలుస్తుంది. వేములవాడ అరికేసరిని ఆశ్రయించు కొని ఉన్న కన్నడ కవి పంపడు జైన బ్రాహ్మణుడు. రాష్ట్రకూట సామంతు డైన కమ్మనాటిలోని పుంగనూరు పరిపాలకుని ఆస్థానంలో ఉన్న కన్నడ కవి

పొన్నడుకూడా జైన బ్రాహ్మణుడే. క్రమంగా జైన వసదులుకూడా బౌద్ధా రామాల్లాగా ఆస్తిపాస్తుల్ని పెంచుకొని ఫ్యూడల్ వ్యవస్థకు తోడ్పడ్డాయి. ఆర్థికంగా, రాజకీయంగా బౌద్ధ, జైన, బ్రాహ్మణ మతాల స్వరూప స్వభావాలలో భేదం పోయింది. రాజులు, కొంతవరకు బ్రాహ్మణులూ కూడా మతాలను మార్చుకోవడం అవసరాలనుబట్టి జరిగి ఉంటుందని చెప్పవచ్చు. ఒకవైపు రాజకీయ పోషణ కోసం మతాలు, సమాజంపైన పలుకుబడి ఉన్న మత సంస్థల అండదండల కోసం రాజులు పోటీ పడ్డారు. జైనులకూ, శైవులకూ వాగ్వివాదా లనేకం జరుగుతుండినట్లు సాహిత్యమూ, చరిత్ర చెప్తున్నాయి. రాజులు గెలిచిన మతాన్ని అవలంబించేవారు. అనేక ఆర్థిక కారణాలవల్లా, అవసరమైతే హింసను కూడా అవలంబించడంవల్లా అనంతర కాలంలో వీరశైవానిదే పైచేయి అయి జైనం క్రమక్రమంగా క్షీణించింది. రాజకీయమైన పాత్రలో ఇతర మతాలకూ, బ్రాహ్మణ మతానికి పెద్దగా భేదం లేకపోయినా బ్రాహ్మణ మతం బలం పుంజుకోవడానికి ప్రధాన కారణం ఆర్థిక, సామాజిక పరమైనది. తమకుండే పరిజ్ఞానంతో వ్యవసాయాభివృద్ధికి తోడ్పడం వల్ల ఫ్యూడల్ వ్యవస్థను నిలబెట్ట డంలో,పరిపాలకులకు అండదండలివ్వడంలో తక్కిన మతాలవారికంటే బ్రాహ్మణ మతం ముందంజ వేయడంవల్ల ఈ మతం స్థిరపడింది. దీనితోపాటు స్థానిక జాతుల ఆచార విధానాలనూ, విశ్వాసాలనూ, సంప్రదాయాలనూ కూడా జీర్ణించు కుని ప్రధానమతంలో కలుపుకోవడంవల్ల స్థానికంగా కిందిస్థాయివరకూ తన స్థానాన్ని నిలబెట్టుకోగలిగింది. దీనికితోడు కర్మకాండకు, యజ్ఞాలకు, వేదాలకు, బ్రాహ్మణ పూజకు ప్రాధాన్యం ఇచ్చే పూర్వమీమాంసా పద్ధతి కుమారిల భట్టు ద్వారా ఆంధ్రదేశంలో ఈ కాలంలో ప్రచారంలోకి వచ్చింది. నన్నయ భారతంలో అనేక ఘట్టాలు ఇందుకు నిదర్శనాలు. అర్జునుడు తీర్థయాత్రలో దర్శించిన వేంగి వైభవం ''అనఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై ధరణీసురోత్త మాధ్వరనిధాన పుణ్య సమృద్ధమై'' (ఆది. 8-139) ఉన్నదట. అర్జునుడు కావేరీ మహాసముద్ర సంగమంలో 'భూసురేశ్వరుల కభిమతార్థదానం బుఁజేసి కృతార్థుడై 'నాడట (పై). రాజురాజుకు 'భూదేవకులాభితర్పణ మహీయః ప్రీతి' (ఆది. 1-'1) కరంబిష్టమైన వాటిలో ఒకటి. 'ధరాదేవాశీఃపరంపరా వర్ధిత నిత్యోదయు' (ఆది. 1-162) అని రాజరాజును సంబోధించాడు నన్నయ. నన్నయ తనను 'అవిరళ జప హోమ తత్పరుడు'గా, 'సంహితా

ఖ్యాసుడు'గా, 'బ్రహ్మాండాది నానా పురాణా విజ్ఞాన నిరతుడు'గా, 'పరమ ధర్మ విదుడు'గా వర్ణించుకున్నాడు

చాతుర్వర్ణ్య వ్యవస్థ బ్రాహ్మణ మతంలో ముఖ్యాంశమని చాలామంది అభిప్రాయం. నన్నయ రాజరాజనరేంద్రుణ్ణి 'సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమన్ మహినొప్పి' (ఆది. 1-6) న వాడని ప్రశంసించాడు. కాని చరిత్రను పరిశీలిస్తే వర్ణాల భావనను ప్రవేశపెట్టిన నాటినుంచి నేటి వరకు వాటి స్వరూప స్వభావాలు ఇదమిత్థంగా లేవు. క్రీ.శ. పదకొండవ శతాబ్దినాటికి 'వర్ణాశ్రమ ధర్మరక్షణ' అనేది ఒక పడికట్టు పదబంధం మాత్రమే. వర్ణాశ్రమ ధర్మరక్షణ అంటే బ్రాహ్మణాధిక్యత, పరిపాలకుల నియంతృత్వం అని మాత్రమే ఈ కాలంలో అర్థం. మొదటినుంచీ నాలుగు వర్ణాలలో బ్రాహ్మణ వర్ణం మాత్రమే స్పష్టంగా గుర్తించగలిగిన వర్ణంగా ఉండేది. మొదట్లో క్షత్రియవర్ణం కూడా గుర్తించగలిగిన వర్ణంగా ఉండేది కాని తర్వాత అది స్పష్టతను కోల్పోయింది. పంచములు నాలుగు వర్ణాలకు అనుబంధంగా చేరిన తరువాత అస్పృశ్యవర్గంకూడా స్పష్టంగా గుర్తించగలిగిన వర్ణం అయింది. తక్కిన వారికి వారి వారి ఆర్థిక, సామాజిక హోదాలను బట్టి ఆయా వర్ణాలలో స్థానం లభించేది. అంటే, మొదటినుంచీ నాలుగువర్ణాల విభాగం సైద్ధాంతికమైన విభాగమే కాని అసలైన విభాగం కాదు. దీనికి చాతుర్వర్ణ్య వ్యవస్థకు సంబంధించిన చరిత్రను కొంత తెలుసుకోవటం అవసరం.

ఆర్యులు అనార్య జాతులను లోబరచుకొని వారికి యజమానులుగా స్థిరపడటంతో ప్రాచీన భారతదేశంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే నాలుగంచెల సమాజం ఏర్పడింది. మొదటి మూడు తరగతులు ఆర్యజాతికి సంబంధించినవి. నాలుగవది అనార్యజాతికి సంబంధించింది వర్ణాల ప్రసక్తి మొదట ఋగ్వేదంలోని పదవ మండలంలోని 'పురుష సూక్తం'లో కనిపిస్తుంది. ఈ పదవ మండలం మొత్తంగా ప్రక్షిప్తం అని పరిశోధకుల అభిప్రాయం. ఋగ్వేదంలో ఇతరత్రా మొదటి మూడు వర్ణాల ప్రసక్తి మాత్రమే కనిపిస్తుంది. చాతుర్వర్ణ్య వ్యవస్థకు ప్రామాణికత్వం కలిగించటానికి ఈ భాగాన్ని ఋగ్వేదంలో చేర్చి, ఈ నాలుగు వర్ణాలూ ప్రజాపతినుంచి పుట్టాయని వర్ణించి ఉంటారు.

బ్రాహ్మణులు మతసంబంధమైన కార్యకలాపాలు నిర్వహించేవారు. రాజన్యులు లేక క్షత్రియులు భుజబలంలో పరిపాలనా బాధ్యతలను నిర్వహించేవారు. ఆర్యులలో చివరివారైన వైశ్యులు గ్రామస్థాయిలో వ్యవసాయం, పశుపోషణ, చేతిపనులు చేసుకొనేవారు. తరువాత పట్టణాల్లో మాత్రం వైశ్యులు వాణిజ్య రంగంలో చేరి పై వర్గంలో భాగం అయ్యారు. శూద్రులు కూడా గ్రామ స్థాయిలో వ్యవసాయదారులుగా, వృత్తిపనివారుగా స్థిరపడి తమ స్థాయిని పెంచు కున్నారు. భారతీయ సమాజం మొదటి నుంచి నాలుగు వర్ణాలుగా విభజించబడిన సమాజంగా కనిపిస్తున్నా ప్రధానంగా రెండు ఆర్థిక వర్గాలు అందులో కనిపి స్తాయి. బ్రాహ్మణులు, క్షత్రియులు పై వర్గంలో వారు కాగా, వైశ్యులు ఆర్థిక పరిస్థితులను బట్టి పైవర్గంతో గాని, కిందివర్గమైన శూద్రులతో గాని చేరేవారు. చాతుర్వర్ణ్య వ్యవస్థలో అంతర్గతంగా ఎన్ని మార్పులు వచ్చినా సమాజం రెండు వర్గాలుగా విభజింపబడటంలో మాత్రం ఎలాంటి మార్పు కనిపించదు. క్రమంగా అనార్యులైన శూద్రులు ఆర్యులను ఎదుర్కొవటంతో వ్యవస్థను స్థిరపరచటానికి, పటిష్ఠం చేయటానికి నియంతృత్వంతో కూడిన సామ్రాజ్యాలు అవసరమయ్యాయి. సామ్రాజ్యాల కాలంలో ఆయా వర్ణాల వారికి కర్తవ్యాలను నిర్దేశించారు. శాస్త్రాలు వర్ణాలను వదలి వర్ణ ధర్మాలను బోధించాయి. ధర్మశాస్త్రాలు మత పరంగా బ్రాహ్మణులకు గల ఆధిక్యతను ప్రబోధించాయి. రాజులు శాంతి భద్రతలను కాపాడి న్యాయ చట్టాలను అమలు చేయాలి. శూద్రులతో పని చేయించాలి. వారి కృషి ఫలితాన్ని తక్కిన వర్ణాలవారికి పంచాలి. వర్ణవ్యవస్థను కాపాడటం, స్పష్టంగా శ్రమశక్తిని విభజించి విభిన్నవృత్తుల వారి మధ్య అంతస్తులను పాటించటం, విభిన్న జాతుల మధ్య భేదాన్ని కొనసాగింప జేయటం ధ్యేయం అయింది.

పుట్టుక, ఆచార వ్యవహారాలలో స్వచ్ఛత ప్రధానమైన ఆధారంగా మొదలైన చాతుర్వర్ణ్య వ్యవస్థ స్వరూపాన్ని ఆర్థికంగా, రాజకీయంగా ఎప్పటికప్పుడు మార్పులు వచ్చే సమాజంలో ఖచ్చితంగా నిలబెట్టటం సాధ్యం కాదు. మొదటి నుంచీ ఒక వర్ణంలో సభ్యుడు కావటానికి పుట్టుక, మత సంస్కారానికి సంబం ధించిన హోదా వీటికే ప్రాధాన్యం ఉన్నా, క్రమంగా వీటికి ఆర్థిక, రాజకీయ హోదాలకు కూడా సంబంధం ఏర్పడింది. ఆర్థిక హోదా లేకపోయినా మత

సంబంధమైన ఆచార కాండకు సంబంధించిన హోదానుబట్టి, పుట్టుకనుబట్టి బ్రాహ్మణులకు వ్యవస్థలో ప్రాముఖ్యం ఉండేది. బౌద్ధయుగం వరకూ క్షత్రియులు కూడా పుట్టుకను బట్టి గుర్తింపబడేవారు. క్షత్రియ అనేది గణరాజ్య విధానం కలిగిన ఒక జాతికి పేరు. మొదట 'పురుషసూక్తం'లోని 'రాజన్య'కు సమానంగా క్షత్రియ పదాన్ని వాడటం జరిగింది. క్రమంగా ఈ పేరు పరిపాలకులైన రాజులకు స్థిరపడింది. బుద్ధుని తరువాత ఎందరో క్షత్రియేతరులు తమకు లభించిన ఆర్థిక,రాజకీయ హోదాల కారణంగా క్షత్రియులుగా గుర్తింపు పొందటం చరిత్రలో చూడవచ్చు దీనిని మత సంస్కారానికి, ఆచారకాండకు సంబంధించిన హోదా, బ్రాహ్మణుల సమ్మతి అవసర మయ్యేది. వైశ్యులు కూడా ఆచారకాండకు సంబంధించిన హోదాతోపాటు, ఆర్థికమైన హోదా ఉన్నప్పుడు మాత్రమే పై వర్గంలో చేరేవారు. మతానికి, ఆచారకాండకు సంబంధించిన హోదా బ్రాహ్మణులకు ఒక ప్రత్యేక స్థానాన్ని ఇచ్చినందువల్ల, బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులు కావటం చాలా తక్కువ. స్థానిక జాతుల మతాలకు సంబంధించిన పూజారులు ఆ మత విధానాలు ప్రధానమత విధానంలో భాగమై 'ఆర్య' కరణం కావటం వల్ల బ్రాహ్మణులైన సందర్భాలు లేకపోలేదు. 'ఫ్యూడల్' యుగం నాటికి చాతుర్వర్ణ్య విభాగం ఒక సైద్ధాంతిక విభాగం మాత్రమే. అనేక జాతుల నుంచీ, వృత్తిపని వారి నుంచీ ఏర్పడిన కులాలు బయలుదేరిన ఈ కాలంలో సమాజంలో నాలుగంచెల విభాగం సరిపోదు. మహా సామ్రాజ్యాలను పరిపాలించిన చక్రవర్తుల స్థాయిని కోరుకున్న 'ఫ్యూడల్' కాలం నాటి పరిపాలకులు ప్రధాన విభాగాన్ని సైద్ధాంతిక విభాగంగా యథాతథంగా కాపాడుతున్నట్టు ప్రకటించుకున్నారు. సాంప్రదాయికమైన వర్ణ వ్యవస్థను రక్షిస్తున్నవారుగా, రాజులు కావటానికి తగిన అర్హత కలవారుగా వారికి 'గుర్తింపు' కలగ చేశారు బ్రాహ్మణులు. దాని కనుగుణంగా సాహిత్య సృష్టి చేశారు. మతానికి, ఆచార కాండకు సంబంధించిన 'సమ్మతి'ని కలిగింపజేశారు. మంత్రులుగా, అవసరమైతే సేనాధిపతులుగా వివిధ రాజకీయోద్యోగాలలో వారు పని చేశారు. ఇంకా అవసరమైతే క్షత్రియ ధర్మాన్ని నిర్వహించి పరిపాలకులు కూడా అయ్యారు. శుంగులు, కాణ్వులు, కదంబులు బ్రాహ్మణ వర్ణానికి సంబంధించినవారు. అయితే ఇతర రంగాలలో పాల్గొనటానికి బ్రాహ్మణులకు ఎవరి సమ్మతీ అవసరం లేదు.

దక్షిణ భారతంలో, ముఖ్యంగా తెలుగు దేశంలో క్షత్రియ జాతి అంటూ ప్రత్యేకంగా ఏదీలేదు. శాతవాహనులనుంచి దక్షిణదేశంలోని పరిపాలకు లందరూ స్థానిక జాతులకు సంబంధించినవారో, ఇతర క్షత్రియేతరులో అయి ఉన్నారు. ఆర్థిక హోదా, రాజకీయ హోదా కలిగిన ఎవరికైనా క్షత్రియులుగా 'సమ్మతి' కలిగించటం, దానికి తగిన ఆచారకాండకు సంబంధించిన హోదాను కల్పించటం జరిగింది. దానికి ప్రతిగా పరిపాలకులు బ్రాహ్మణులను గౌర వించారు. దానాలు చేశారు. క్షత్రియులుగా సమ్మతి కలిగించటానికి చేసే కర్మకాండలలో 'హిరణ్య గర్భోత్సవం' ఒకటి. దీనిద్వారా చాలా జాతులు క్షత్రియత్వాన్ని పొందటాన్ని గురించి చరిత్ర చెప్తున్నది. ఈ ఉత్సవం కోసం ప్రత్యేకంగా చేయించిన ఒక పెద్ద బంగారు పాత్రలో జాతికి సంబంధించిన నాయకుడు కూర్చుంటాడు. బ్రాహ్మణ పురోహితులు గర్భధారణకు, జననానికి సంబంధించిన మంత్రాలను చదివి ఆచారకాండను నిర్వహిస్తారు. తరువాత జాతి నాయకుడు క్షత్రియ వర్ణానికి సంబంధించినవాడుగా బయటికి వస్తాడు. ఇలాంటి వారు బ్రాహ్మణదిగోత్రాన్ని ధరిస్తారు. బంగారు పాత్రను బ్రాహ్మణులకు దానం చేయడం జరుగుతుంది. పరిపాలకులకు క్షత్రియులుగా గుర్తింపు లభింపజేసిన తరువాత వారు నిర్వహించే కార్యాలకు ప్రామాణికత కలిగించ టానికి పురాణ వంశాలలో ఒకదానికి సంబంధాన్ని కలపటం, దానికి అనుగుణంగా కథలను కల్పించటం అవసరమైంది బ్రాహ్మణులకు. పురాణాలు రాజ వంశాలను ప్రధానంగా రెండు వంశాలకు సంబంధించిన వారినిగా వర్గీకరించాయి. ఈ రెండు వంశాలకూ మూలం మను వంశం. రాజరాజ నరేంద్రుడి వంశానికి చంద్రవంశంతో సంబంధం కలపటం శాసనాలలోనూ, నన్నయ భారతంలోనూ చూడవచ్చు. భారతాన్ని తెలుగులో రచించమని అడుగుతూ రాజరాజు-

చం ॥ హిమకరుఁ దొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్టమెంతయున్.
(ఆది. 1—14)

2)

అని భారత కథను తమ వంశ పురుషుల చరిత్రగా చెప్పుకున్నట్టు నన్నయ పేర్కొన్నాడు. తూర్పు చాళుక్య వంశానికి చంద్ర వంశాన్ని మూలంగా పేర్కొనటం మొదటి సారిగా విమలాదిత్యుని కాలం నాటి శాసనాల్లోనూ, రాజ రాజుకు సంబంధించిన శాసనాల్లోనూ మాత్రమే కనిపిస్తుంది. దీనితో పాటు చాళుక్య వంశోద్భవానికి సంబంధించిన కథ ఒకటి మొదటి సారిగా ఈ శాస నాల్లో కనిపిస్తుంది. ''ఒకసారి బ్రహ్మదేవుడు ప్రాతఃకాల కృత్యాలు తీర్చుకుం టుండగా ఇంద్రుడు వచ్చి ప్రపంచంలో ఎవరూ యజ్ఞ యాగాది క్రతువులను నిర్వహించి దేవతలకు హవిర్భాగాలను అర్పించకపోవటం వల్ల పాపం పెరిగి పోతున్నదని మొరపెట్టుకున్నాడు. బ్రహ్మ అర్ఘ్యం కోసం పట్టిన చులుకాన్ని చూశాడు. ఆ చులుకం నుంచి ఒక మహాయోధుడు జన్మించి చాళుక్య వంశానికి కర్తఅయ్యాడు. అతని వంశంలో కొంత కాలానికి మానవ్యుడు, హారీతుడు అనే ఇద్దరు మహాయోధులు జన్మించి జగద్విఖ్యాతి పొందారు. వీరి మొదటి రాజధాని అయోధ్య. తరువాత ఆ శాఖలో ఒక వంశం వారు దక్షిణాపథానికి వచ్చారు.'' ఇంతవరకు కథ బిల్హణుని విక్రమాంకదేవ చరితంలో ఉంది. కళ్యాణి చాళుక్య వంశానికి చెందిన ఆరవ విక్రమార్కుడి చరిత్రే విక్రమాంకదేవచరితం. దీనికి తరువాతి కథ విమలాదిత్య, రాజరాజ నరేంద్రుల శాసనాలలో కనిపిస్తుంది. పైన చెప్పినట్టు దక్షిణాపథానికి వచ్చిన విజయాదిత్యుడనే చాళుక్యరాజు త్రిలోచన పల్లవుడనే వాడితో యుద్ధం చేసి యుద్ధంలో మరణించాడు. గర్భవతి అయిన అతని భార్య పురోహితుడైన విష్ణుభట్ట సోమయాజి ఇంట్లో తలదాచుకుంది. ఆక్కడ ఒక పిల్లవాణ్ణికన్నది. ఆ పిల్లవాడు పెరిగి పెద్దవాడై తల్లి వల్ల విషయం అంతా తెలుసుకుని చళుక్య పర్వతంపైన తపస్సుచేసి శివుడితో వరాలుపొంది, తండ్రిశత్రువులైన గాంగులను, కదంబులను జయించి పోయిన రాజ్యాలను మళ్ళీ సంపాదించాడు. విష్ణుభట్ట సోమయాజి పెంచటం వల్ల ఈయనకు విష్ణువర్ధనుడనే పేరు వచ్చింది. చాళుక్య వంశానికి రాజవంశంగా, క్షత్రియ వంశంగా 'సమ్మతి' కల్పించటానికి ఈ కథ కల్పించారనటం స్పష్టం. తూర్పు చాళుక్య వంశానికి సంబంధించిన రాజులు సుమారు ఇరవైయారుగురు ఉన్నారు. విమలాదిత్య, రాజరాజ నరేంద్రుల శాసనాలలో తప్ప అంతకు ముందెక్కడా ఈ కథ కనిపిం చదు. ఈ విధంగా రాజకీయాధికారాన్ని సంపాదించి ఆచార కాండకు సంబంధిం చిన హోదాను పెంచుకొని క్షత్రియులుగా గుర్తింపు పొందటాన్ని, దానికి దగిన

వంశావళిని, కథలను బ్రాహ్మణుల ద్వారా ప్రచారం చేయించుకొని క్షత్రియేత రులు క్షత్రియ ధర్మాన్ని అనుసరించటాన్ని సంస్కృతీకరణవిధానంలో ఒక టిగా సామాజిక శాస్త్రజ్ఞులు పేర్కొన్నారు.

ఈ పరిస్థితులలో బ్రాహ్మణ, క్షత్రియ ప్రధానమైన సాంప్రదాయిక భారతీయ సామాజిక వ్యవస్థను చాటి చెప్పటానికి, ఆ వ్యవస్థకు సంబంధించిన ధర్మశాస్త్రం, మత, తాత్త్విక విషయాలు, వ్యవస్థకు అనుకూలంగా సామాన్యులకు బోధించవలసిన నీతి, దానికి తగిన ఉపాఖ్యానాలు మొదలైనవాటితో నిండి పంచమ వేదంగా ప్రసిద్ధి పొందిన మహాభారతం తప్ప ప్రచారం లోకి తీసుకొని రావటానికి పురాణాలలో, ఇతిహాసాలలో అనువైన గ్రంథం మరొకటిలేదు.

'ధర్మే చార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ,
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్ క్వచిత్ ॥
(సం. భా. ఆది. అధ్యా. 58)

అని ప్రసిద్ధి పొందింది మహాభారతం.

మ ॥ అమితాఖ్యానక శాఖలం బొలిచి వేదార్థామలచ్ఛాయమై
సుమహద్వర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణ కీర్తనార్థ ఫలమై ద్వైపాయనోద్యాన జా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసురప్రార్థ్యమై.
(ఆది. 1-66)

అని ప్రశంసలు పొందింది. మొదట 'జయ' అనే పేరుతో రచింపబడిన (సం. భా. ఆది. అధ్యా-1-1) మహాభారత రచన క్రీ. పూ. 7,6 శతాబ్దాలలో బుద్ధుని కంటే పూర్వమే ప్రారంభమై, క్రీ. శ. మొదటి శతాబ్దాలలో గుప్త సామ్రాజ్య కాలం నాటికి ప్రస్తుత రూపాన్ని పొందింది. గుప్తుల శాసనాలలో 'శత సాహస్రీ సంహిత'గా భారతాన్ని పేర్కొనటం జరిగింది. ఈ మధ్య కాలంలో అనేక ఉపాఖ్యానాలు, భగవద్గీత మొదలైన తాత్త్విక, నైతిక విషయాలకు సంబంధించిన ఘట్టాలు, ఆనుశాసనిక పర్వం లాంటి ధర్మశాస్త్ర విషయ

ప్రధానమైన భాగాలు భారతంలో చేరాయి. మహాభారతమే కాదు, అంతకు ముందు సూతులు, మాగధుల రచనలుగా ఉన్న అనేక పురాణాలు కూడా గుప్తుల కాలం నాటికి బ్రాహ్మణుల చేతులలో అనేకమైన మార్పులతో కొత్త రూపాలను సంతరించుకున్నాయి. ముఖ్యంగా భృగువంశీయ బ్రాహ్మణులు మహా భారత ప్రస్తుత రూపానికి కారకులు. అందుకే భార్గవుడైన శౌనకుడు "తత్రవంశమహం పూర్వం శ్రోతుమిచ్ఛామి భార్గవం" (సం భా.ఆది) అని తన వంశాన్ని గురించి వినటానికి కుతూహలం చూపించాడు. సుమారు ఏడెనిమిది వందల సంవత్సరాల కాలంలో పెరిగి ప్రస్తుత రూపాన్ని పొందిన మహాభారతం బ్రాహ్మణమతసంప్రదాయాలకు ప్రతీకగా నిలచింది. గుప్తులకాలం నాటి బ్రాహ్మణ భూమిదాన శాసనాల్లో భారతాన్ని ప్రమాణ గ్రంథంగా పేర్కొనటం జరిగింది. పల్లవరాజు మొదటి పరమేశ్వర వర్మ కాలంలో దేవాలయోద్యోగులలో రోజూ మహాభారత పారాయణం చేసేవాడొకడని శాసనాలవల్ల తెలుస్తుంది. రాజ రాజ నరేంద్రుడి కాలంలో అతని మాతృ వంశీయులు చోళు లేర్పరచిన వేద పాఠశాలలలో 'మహాభారతం' పఠనీయ గ్రంథంగా ఉండేదట. "భారత బద్ధ స్పృహులగువారికి నెప్పుడు బహుయాగంబుల ఫలంబు పరమార్థమగున్" (ఆది. 1-17) అని నమ్మిన రాజరాజు నన్నయను "కృష్ణ ద్వైపాయన మునివృషభాభిహిత మహాభారతబద్ధ నిరూపితార్థ మేర్పడ తెనుంగున రచియింపు" (ఆది. 1-16) మన్నాడు.

కుషాణులు, స్థానిక జాతులకు చెందిన శాతవాహనులు మొదటి నుంచీ ప్రాకృతాన్నే శాసనాల్లో ఉపయోగించారు. శాతవాహనుల కాలంలో ప్రాకృత సాహిత్యం ఉన్నత దశలో ఉంది. హాలుడు గ్రంథించిన 'గాథా సప్తశతి' అలంకార శాస్త్రానికి అనేక లక్ష్యాలను ప్రసాదించింది. లౌకిక సాహిత్యం ప్రాకృత భాషలో ఈ కాలంలో ఉచ్చస్థితికి చేరుకున్నదని చెప్పవచ్చు. బౌద్ధమత గ్రంథాలు అంతవరకూ పాలీ, ప్రాకృతాలలోనే ఉండేవి. బ్రాహ్మణ మతానికి సంబంధించిన ధర్మశాస్త్రాలు మాత్రం సరళ సంస్కృతంలో రాయబడుతూ వచ్చాయి. క్రీ.శ. 150 సంవత్సరం నాటి గిరినార్ శాసనం మొదటి సంస్కృత శాసనం. శకవంశీయుడైన రుద్రదాముడు చంద్రగుప్త మౌర్యుడు నిర్మించిన ఆనకట్ట నొకదాన్ని బాగుచేసినట్టు ఈ శాసనంలో ఉంది. దీనితోపాటు రుద్ర

దాముడు తనకుగల సంస్కృత భాషా పరిజ్ఞానాన్ని ప్రశంసించుకున్నాడు. విదేశీయులైన శకులు మొదలైనవారు బ్రాహ్మణ మతాన్ని అనుసరించటం ద్వారా, సంస్కృతం ద్వారా సంస్కృతీకరణం పొందుతుండగా, స్థానిక జాతులకు చెందిన శాతవాహనులు ప్రాకృతాన్ని రాజభాషగా అనుసరించారు. క్రమంగా సంస్కృతం భారత దేశంలో విభిన్న ప్రాంతాలలోని ఉన్నత వర్గంవారిని కలిపే భాషగా స్థిరపడింది. ప్రాంతీయ భాషలుగా విడిపోతున్న ప్రాకృతాలు ఈ ప్రయోజనాన్ని సాధించలేక పొయ్యాయి. బౌద్ధులు బుద్ధుని మార్గాన్ని వదలి ప్రాకృతాన్ని కాక సంస్కృతాన్ని అనుసరించారు ముఖ్యంగా మహాయాన శాఖకు సంబంధించిన బౌద్ధులు తమ మత గ్రంథాలను సంస్కృతంలోనే రాశారు రాజాస్థానాలలో అనేక రంగాలలో ప్రభుత్వ కార్యకలాపాలకు సంస్కృతాన్ని ఉపయోగించటం ప్రారంభమైంది. సంస్కృత లౌకిక సాహిత్యం కూడా ఈ కాలంలోనే ఉన్నత స్థితికి వచ్చింది. కాళిదాసు మొదలైన వారితో పాటు బౌద్ధులైన అశ్వఘోషుడు, హర్షుడు సంస్కృతంలోనే కావ్య, నాటకాలను రచించారు. ఈ విధంగా ప్రాకృతాల నుంచి ప్రాంతీయ భాషలలోకి ప్రత్యక్షంగా మార్పు రాకుండా మధ్య కాలంలో లౌకిక సంస్కృత సాహిత్యం అభివృద్ధి చెందింది. పరిపాలనాంగాలైన లౌకిక విద్యలపైన, జాతకర్మ, వివాహాలు, అంత్యక్రియలు మొదలైన ఆచార కాండలపైన తమ అధికారాన్ని కొనసాగించుకోవటానికి, వాటిని రహస్య విద్యలుగా కాపాడటానికి, బ్రాహ్మణులకు, ఇతర ఉన్నత వర్గాల వారికి సామాన్యుల భాషలు కాకుండా సంస్కృతమే ఉపయోగించింది. తెలుగు దేశానికి సంబంధించినంత వరకు ఇక్ష్వాకు వంశానికి చెందిన ఎహువల శాంతమూలుడి (క్రీ. శ. 260-84) కాలంలో సంస్కృతం రాజభాషగా, శాసన భాషగా మొదటిసారి కనిపిస్తుంది. తరువాత క్రమంగా సంస్కృత శాసనాలు ఎక్కువయినాయి. బౌద్ధ మతానికి చెందిన నాగార్జునుడు, దిఙ్నాగుడు మొదలైనవారు, వైదిక మతానికి చెందిన కుమారిలభట్టు మొదలైనవారు తమ తమ గ్రంథాలను సంస్కృతంలోనే రాశారు. క్రమంగా చిన్న చిన్న రాజ్యాలకు సంబంధించిన పరిపాలకులకు సామాన్యులతో, గ్రామీణులతో సంబంధం పెట్టుకోవలసిన అవసరం రావటంవల్ల, తమ అధికారాన్ని గురించి, విజయాలను గురించి తెలియజెప్పటానికి స్థానిక భాషలను అనుసరించవలసిన అవసరం వచ్చింది ఈ పరిస్థితులలో క్రీ శ. 6 వ శతాబ్ది నుంచీ తెలుగును శాసన భాషగా

ఉపయోగించటం ప్రారంభం అయింది. అంతకుముందే తోటి దక్షిణ దేశ భాషలలో శాసనాలు వచ్చాయి తమిళంలో ఆనాటికే లిఖిత సాహిత్యం ఉంది. క్రమంగా చిన చిన్న రాజ్యాలు ఏర్పడిన దశలో ప్రాంతీయ భాషలలో లిఖిత సాహిత్యం ప్రారంభమైంది. ప్రాంతీయ రాజులు సామ్రాజ్య యుగంనాటి చక్రవర్తులను అనుకరించటంలో భాగంగా ప్రాంతీయ భాషలలో సాహిత్యం వచ్చింది. నన్నయ సంస్కృత భూయిష్ఠమైన భారత భాష అంతకు రెండు మూడు వందల సంవత్సరాలకు ముందే రూపుదిద్దుకున్న పండితుల భాష. నన్నయకు పూర్వం నుంచే కావ్య, వ్యావహారిక భాషలుగా రెండుగా చీలింది తెలుగు. నన్నయ భారత భాష కావ్యభాషగా సుమారు ఆధునిక సాహిత్యయుగ ప్రారంభం వరకు కొనసాగింది. ఆర్థిక, రాజకీయ, సామాజిక హోదాల పరంగా, సంప్రదాయ పరంగా, సంస్కృతి పరంగా, మత పరంగా, భాషా పరంగా జరిగిన సంస్కృతీకరణ ఫలితం తెలుగులో నన్నయ భారతావరణ.

దక్షిణ భారత భాషలలో తమిళ సాహిత్యం ప్రాకృత సాహిత్యం ఉచ్ఛస్థితిలో ఉన్న కాలంనాటికే కనిపిస్తుంది. ప్రాకృతంలో గాథా సప్తశతి లాగే తమిళంలోని 'పత్తుప్పాట్టు', 'ఎట్టుత్తొగై' మొదలైన సంకలన గ్రంథాలు వచ్చాయి. వీటిలోని భావాలు 'గాథా సప్తశతి'లో లాగే చాలా సరళంగాను, నిరాడంబరంగాను ఉంటాయి. ప్రేమ గీతాలు, వీర గీతాలు ఇందులో కనిపిస్తాయి. మౌఖిక సాహిత్యంలో భాగాలైన ఈ రచనలను సంకలనం చేసి లిఖితరూపం చేసినందున మౌఖిక, లిఖిత సాహిత్యలలో అంతరం తక్కువగా ఉండవచ్చు. అందుకే తమిళంలో దేశి సాహిత్య సంప్రదాయం నిలదొక్కుకుంది. తమిళం పైన సంస్కృత వ్యాకరణం, అలంకార శాస్త్ర ప్రభావాలు కనిపిస్తున్నా, అది తన ప్రత్యేకతను నిలుపుకున్నది. సంస్కృత పదాలను ఎక్కువగా తద్భవాలనుగా మాత్రమే తమిళం గ్రహించింది. సంస్కృత, తమిళాలకు సంబంధాన్ని కలిపే ప్రయత్నం కూడా ఎవరూ చేసినట్టు కనిపించదు తమిళం ప్రాచీన సాహిత్య యుగం అయిన సంగయుగం నాటి కవులు కావ్య వస్తువులను సంస్కృత గ్రంథాలనుంచి గ్రహించ లేదు. సాహిత్యంలో మత ప్రసక్తి లేదు. ఛందస్సు పూర్తిగా దేశీయమైంది బ్రాహ్మణేతర కవులు, కవయిత్రులు సమానంగా వర్ధిల్లారు. అందే తమిళ సాహిత్యం మొట్ట మొదటి దశలలో సంస్కృతీకరణ విధానం

కనిపించదు. క్రీ.శ 4, 5 శతాబ్దులనాటి తిరువళ్ళువర్ పంచముడు. అతని రచన 'తిరుక్కురళ్' తమిళ వేదంగా గుర్తింపు పొందింది. సామాన్యుల నీతి సంగ యుగపు సాహిత్యం ప్రధాన లక్షణం. రాజ్యాంగ విధానం, కర్షకుడు, గృహస్థుడు మొదలైన అంశాలెన్నో 'తిరుక్కురళ్' లో చోటు చేసుకున్నాయి. క్రీ.శ. 8 వ శతాబ్ది నుంచి మొదలైన జైన, బౌద్ధ సాహిత్యంలో భాషలో, వస్తువులో సంస్కృత ప్రభావం కనిపిస్తుంది. క్రీ.శ. 850—1200 సంవత్సరాల మధ్య చోళులకాలంలో శైవ, వైష్ణవుల భక్తి సాహిత్యంతో పాటు భారత, రామాయణాలు తమిళంలోకి వచ్చాయి. కన్నడ, తెలుగు సాహిత్య పరిస్థితులు దీనికి భిన్నంగా కనిపిస్తాయి. కన్నడ లిఖిత సాహిత్యంలో సుమారుగా మొదటి తరపు కవులందరూ జైనులు. పరిపాలకులు జైనులు కాకపోయినా జైన కవులకు ఆశ్రయ మిచ్చారు. ప్రారంభదశ నుంచే కన్నడ సాహిత్యంలో సంస్కృతీకరణం కనిపిస్తుంది. కన్నడంలో కనిపిస్తున్న మొదటి గ్రంథం సంస్కృత లక్షణాలను అనుసరించి రాసిన లక్షణ గ్రంథం'కవిరాజ మార్గ'.రాష్ట్రకూట రాజు నృపతుంగుడి (క్రీ శ. 825) పేరిట ఈ గ్రంథం కనిపిస్తుంది. కన్నడంలో ప్రారంభ దశలో ప్రతి కవీ తను అవలంబించిన మతాన్ని బట్టి ఒక ధార్మిక లేక ఆగమిక కావ్యాన్ని, పరిపాలకుడి కోసం పురాణేతిహసాలు ఇతివృత్తాలుగా ఒక లౌకిక కావ్యాన్ని రాయటం సంప్రదాయంగా ఉండేది. సుమారు క్రీ.శ. 900 కాలంనాడే గుణవర్మ అనే కవి హరివంశం అనే ఒక ధార్మిక కావ్యాన్ని, శూద్రక అనే లౌకిక కావ్యాన్ని రచించాడు. 'హరివంశం' జైన మతాన్ననుసరించి రాసిన భారత కథ. 'శూద్రక' శూద్రక రాజ చరితం. ఈ రెండు గ్రంథాలూ లభ్యం కావటం లేదు. కన్నడంలో ఆదికవిగా పేరుపొందిన పంపడు జైన బ్రాహ్మణుడు. జైన ఆది నాథుని చరిత్ర ప్రధానంగా అతడు రచించిన 'ఆది పురాణ' ధార్మిక కావ్యం; 'విక్రమార్జున విజయ' పేరుతో రచించిన భారతం లౌకిక కావ్యం. పంపడికి ఆశ్రయదాత, మిత్రుడు అయిన వేములవాడ చాళుక్య వంశానికి చెందిన అరి కేసరి బ్రాహ్మణ మతానికి చెందినవాడు. రాష్ట్రకూటులకు సామంతు డీయన; బోధన్ ఇతని రాజధాని. పంపడు జైన మతస్థుడు. అందువల్ల విడిగా రెండు కావ్యాలు రచించవలసివచ్చి ఉంటుంది. కొంతకాలంవరకు జైన కవులకు రెండు రకాల కావ్యాలను రాయటం సంప్రదాయం అయింది. ఈ కాలంలో జైన, బ్రాహ్మణ మతాలకు తాత్త్వికంగా కొంత భేదం ఉన్నా వాటికి సంబం

ధించిన సాహిత్యాలు నిర్వహించిన రాజకీయ, సామాజిక పాత్రలో భేదం లేదు. కులాలు, వర్ణాలు లేవని చెప్పుకుంటున్న జైన మతంలో జైన బ్రాహ్మణులు, జైన వైశ్యులు ఉన్నారు. జైన మతానికి సంబంధించిన కన్నడ కవులు సుమారుగా అందరూ బ్రాహ్మణులే. పంపడి పూర్వీకులు బ్రాహ్మణ మతాన్ని అనుసరించినవారు. అహింసా సిద్ధాంతంవల్ల జైనానికి ఆకర్షితుణ్ణి అయ్యానని చెప్పుకున్నా, పంపడు అరికేసరికి యుద్ధాలలో తోడుగా ఉండి పాల్గొన్నాడు. అరికేసరి వీర విహారాలను, యుద్ధాలను, శత్రుమారణాలను యథేచ్ఛగా వర్ణించాడు పంపడు. జాతి భేదాలు లేవనీ మానవులందరూ ఒకటేనని చెప్తూనే బ్రాహ్మణ జాతి ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పాడు. ''జాతులలో బ్రాహ్మణ జాతి ఉత్తమం అంటారు. అందులో జిన ధర్మాన్ననుసరిస్తే అది మరీ ఉత్తమం అవుతుంది'' (విక్ర.14-48) అంటాడు పంపడు. సామంతుడు మాత్రమే అయిన అరికేసరి ప్రాశస్త్యాన్ని కొండంతలుచేసి చెప్పటం, దాని ద్వారా పాలితులకు అతని విషయంలో విధేయతను కలిగించటం మొదలైన 'ఫ్యూడల్' లక్షణాలకు పరాకాష్ఠ విక్రమార్జున విజయం. తాను జైనుడైనా కృతి ప్రారంభంలో అరికేసరికోసం నారాయణ, మహేశ్వర, సూర్యులను స్తుతిస్తూ వారికంటే ఉత్తముడుగా అరికేసరిని ప్రశంసిస్తాడు. అర్జునుణ్ణి నాయకుణ్ణి చేసి అతని పాత్రతో అరికేసరి చరిత్రను జోడించటం ప్రధాన లక్ష్యం పంపడికి. నిజానికి అరికేసరికే అర్జునుడికంటే ప్రాధాన్యం ఇచ్చాడు. అరికేసరి విశేషణాలన్నింటినీ అర్జునుడికి వాడాడు. విక్రమార్జున విజయాన్ని సమస్త భారతంగా పేర్కొన్నాడు. భారత కథతో చారిత్రకాంశాలను కలపటమే సమస్త భారతం. పంపడు భగవద్గీతను ఒక్క వాక్యంలో చెప్పినా దాన్ని ''ఆదిమవేద రహస్యదోళ్ నిరంతరద పరిచర్యయిం నరయ యోజిసిదం కదన త్రినేత్రనం' (విక్ర.10-64) అని గీతను వేదరహస్యంగా పేర్కొన్నాడు. వేద రహస్యాన్ని చెప్పి అర్జునుణ్ణి యుద్ధానికి ప్రోత్సహించాడు కృష్ణుడు. మొత్తం మీద ఉపాఖ్యానాలు లేకుండా ప్రధాన భారత కథను మాత్రమే తీసుకొని (విక్ర.1-11) అరికేసరికి అంకితంగా రచించిన పద్నాలుగు ఆశ్వాసాల చారిత్రక కావ్యమే 'విక్రమార్జునవిజయం' లేక 'పంప భారతం'.

కన్నడ కవులు ధార్మిక కావ్యాలను, లౌకిక కావ్యాలను విడి విడిగా రచిస్తే, రెండు విధానాలను సమన్వయంగా వచ్చిన తొలి తెలుగు లిఖిత రచన

నన్నయ భారతం. సుమారు ఇతర ప్రాంతీయ భాషలలో వచ్చిన భారతాల కంటే భిన్నమైంది, విస్తృతమైంది తెలుగు భారతం. అనేకమైన ప్రయోజనాల సమాహార రూపం నన్నయ భారతం. బ్రాహ్మణ మత ధర్మానికి ప్రతీకగా ఉపాఖ్యానాలతోపాటు అనువర్తించిన ధార్మిక కావ్యంగా, రాచరిక వ్యవస్థను కీర్తించే గ్రంథంగా, కావ్యధోరణులను కూడా కలుపుకొన్న లౌకిక కావ్యంగా నన్నయ భారతం దర్శనమిస్తుంది. పంపడిలాగా భారతాన్ని రాజరాజుకు అంకితం చేయకుండా వినిపించటం మాత్రమే చేశాడు నన్నయ దీనికి కారణం ఇది ధార్మిక కావ్యం కూడా కావటం కావచ్చు. ఇతిహాస కథను నిర్వహించే కథా కథనం, శైలీ రమ్యతను చేకూర్చే అక్షర రమ్యత, నైతిక బోధ చేసే సూక్తి నిధిత్వం, రాచరికాన్ని నిలబెట్టే వంశానుకీర్తనం కలగా పులగమైన రచన తెలుగు భారతం. కళాత్మకంగా ప్రాంతీయ భాషలలో వచ్చిన భారతాలలో ఈ తెలుగు భారతానికి ఉన్నత స్థానం ఉంది. నన్నయ భారతంలో ప్రధానంగా కనిపించే అంశాలు (1) ఫ్యూడల్ వ్యవస్థకు ప్రధానమైన రాజుల కీర్తన, (2) వర్ణాశ్రమ (ధర్మ) ప్రాధాన్యం, (3) బ్రాహ్మణ ప్రాశస్త్యం, (4) కథాకథనంతోపాటు కావ్యరచనాపద్ధతి. వీటిలో కొన్ని మూలభారతంలో లేనివి, కొన్ని మూల భారతంలో కంటే పెంచి రాసినవీ ఉన్నాయి.

1. అవతారికతోనే కాకుండా ప్రధాన గ్రంథంలో కూడా భరత వంశ రాజులను, ఇతర రాజులను వర్ణిస్తూ మూలంలో లేని అనేక విశేషణాలను చేర్చటం నన్నయ భారత భాగంలో కనిపిస్తుంది. ఈ విశేషణాలు రాజరాజ నరేంద్రుడికి కూడా అన్వయిస్తాయి. సంస్కృత భారతంలో ''జనమేజయః పారిక్షితః సహభ్రాతృభిఃకురుక్షేత్రే దీర్ఘసత్రముపాస్తే'' (ఆది.అధ్యా. 3-111) అన్నచోట తెలుగులో జనమేజయుడికి అనేక విశేషణాలను చేర్చటం చూడవచ్చు.

చ॥ ప్రతిహత విక్రముఁడు పాండవ వంశ వివర్ధనుండు సు
వ్రతుఁడు పరీక్షిదాత్మజుఁ డవద్యవిదూరుఁడు దారకీర్తి ని
ర్మిత వివిధాధ్వరుండు జనమేజయుఁడన్ జనపాలుఁ డుత్తమ
స్తుతమతి దీర్ఘ సత్త్రి మఖతుం ధొనరించె శుభాకాంక్షియై (ఆది 1-82)

భరతవంశం తన వంశానికి మూలం అని చెప్పుకున్నాడన్న రాజరాజ నరేంద్రుడికి పై విశేషాణాలన్నీ సరిపోతాయి. జనమేజయుడి పేరుతో నన్నయ రాజరాజును దృష్టిలో ఉంచుకుని చెప్పినవే కింది మాటలు కూడా.

ఉ॥ ఆయత కీర్తితో వివిధ యాగములన్ సురధారుణీ సురా
మ్నాయము నాహితాహుతి సమంచిత దక్షిణ లిచ్చి తన్పుచుం
జేయుచు నుండె రాజ్యము విశిష్ట జనస్తుత వర్ధమాన ల
క్ష్మీయుతుఁడుత్తముండు జనమేజయుఁ డాది నరేంద్ర మార్గుడై
(ఆది. 1-89)

సభా పర్వంలో నారదుడు చేసిన హరిశ్చంద్రుని ప్రశంస కూడా అమూలకమే.

ఉ॥ దీపిత సత్యసంధుఁడు ధృతిస్మృతి ధర్మ పరాయణుండయో
ధ్యాపుర నాయకుండు జలజాప్తకులైక విభూషణుండు వి
ద్యా పరమార్థవేది శరదభ్ర సముజ్జ్వల కీర్తి చంద్రికా
స్నాపిత సర్వలోకుఁడు త్రిశంకు నరేంద్ర సుపుత్త్రుఁడున్నతిన్.
(సభా. 1-84)

దీనికి సంస్కృత మూలం చాలా సామాన్యంగా కనిపిస్తుంది.

సరాజా బలవానాసీత్ సమ్రాట్ సర్వమహీక్షితామ్,
తస్యసర్వే మహీపాలాః శాసనావనతా స్థితాః॥
(సం.భా.సభా-అధ్యా. 12-11)

రాజుల ప్రసక్తి వచ్చినప్పుడల్లా మూలం కంటే భిన్నంగా అతిశయించి కీర్తించటం జనానికి పరిపాలకుల విషయంలో విశ్వాసం కలిగించి, విధేయతను పెంచటాని కనేది స్పష్టం.

(3) "చాతుర్వర్ణ్యః విధానం చ పురాణానాంచ కృత్స్నశః" (సం. భా. ఆది-అధ్యా. 1-65) అని మూలభారతంలో చాతుర్వర్ణ్య విధాన ప్రశంస ఉన్నా మూలంలో లేనిచోట్ల కూడా చాతుర్వర్ణ్య ప్రశంస చేయడం నన్నయ భారతంలో

కనిపించే ప్రధానాంశం. మూలంలో ధర్మం అని పేర్కొన్న చోటెల్లా 'వర్ణాశ్రమ ధర్మా'లని వ్యాఖ్యానిస్తాడు నన్నయ పరీక్షిత్తుకు శాపం ఇచ్చిన శృంగిని మందలిస్తూ శమీకుడుచెప్పిన 'రాజ్ఞా ప్రతిష్ఠితోధర్మః' (సం. భా. ఆది. అధ్యా. 41–29) వాక్యంలోని 'ధర్మః' అన్నమాటకు నన్నయ వివరణ ఇది.

ఉ॥ క్షత్రియ వంశ్యులై ధరణిఁ గ్రావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియవైశ్య శూద్రుల నఁగాఁగల నాలుగు జాతులన్ స్వచా
రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితు కాచినయట్లు రామమాం
ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యే యుగంబునన్.
(ఆది. 2-175)

ఇంద్రప్రస్థ పుర నిర్మాణం తరువాత రాజ్యం ఏలిన ధర్మరాజు తమ్ములతో పాటు 'ధర్మం'తో రాజ్యం ఏలాడు అని మాత్రమే ఉంది మూలంలో.

ప్రాప్య రాజ్యం మహాతేజాః సత్యసంధోయుధిష్ఠిరః,
పాలయామాసధర్మేణ ప్రథివీంభ్రాత్రభి స్సహ
(సం.భా. ఆది.అధ్యా 207-6)

దీన్ని సుమారు అయిదు పద్యాలలో వివరించాడు నన్నయ. వీటిలో ధర్మరాజును రాజుగా కీర్తిస్తూ 'సర్వపావన శుభమూర్తి', 'భువనవంద్యుఁడు', 'ధర్మపరుండు' (ఆది–8-81), 'అనఘుఁడు', 'వేదాధ్యయనాసక్తుఁడు', 'అరభ్యమాణ మహాధ్వరుఁడు', 'మనుచరిత్రుఁడు', 'సర్వ వర్ణాశ్రమ సంరక్షణక్షముఁడు', 'సత్య సంధానుఁడు', 'భరతవంశోత్తముఁడు' (ఆది-8-82) అని విశేషణాలను వాడటంతో పాటు, 'అనుజులు నల్వురుం దనకు నత్యనురాగమునన్ విధేయులై తనరుచునుం'డు ధర్మనందనుఁణ్ణి 'వేద విహితంబగు యజ్ఞం' (ఆది–8-81)తో పోల్చాడు. "తద్దేశంబున ననవరతము యజన యాజనాధ్యయనాధ్యాపన దానములుఁ బ్రతిగ్రహంబును ననుషట్కర్మములను భూసురవంశ్యుల్ తనరి" (ఆది-8-84) అనీ, 'బ్రాహ్మణప్రియమయి ధర్మ్యంబయి క్షత్రియ వైశ్యకులంబవిరత పుణ్యకర్మలాలసమగుచున్ యజనాధ్యయనదానంబుల వర్తిల్లె' (ఆది–8-85) అనీ, 'పరమద్విజ శుశ్రూషా పరులయి శూద్రాదులవనిఁ బరగిరి' (ఆది-8-86) అనీ నాలుగు వర్ణాలవారు స్వధర్మాన్ననుసరించారని వర్ణించాడు.

బ్రాహ్మణమత యథాస్థితివాదం, వైదిక యజ్ఞయాగాది కర్మకాండలు, వర్ణాశ్రమ ధర్మరక్షణ పేరిట బ్రాహ్మణ ప్రాశస్త్యం, ధర్మపాలన పేరిట పాలకులైన రాజుల అధికృత- వీటితో తెలుగు భారత రచన ముడిపడి ఉన్నదని చెప్పటానికి ఇది పరాకాష్ఠ అయిన తార్కాణం.

సమాజాన్ని మొదట అంతస్తులుగా విభజించినప్పుడు అప్పటి పరిస్థితులలో నాలుగు వర్ణాల విభజన సరిపోయి ఉండాలి. తరువాత అనేక జాతులు, వృత్తులవారు, మిశ్రవర్ణాలవారు వచ్చారు వారిని ఉన్న చట్రంలో ఇమడ్చటానికి వర్ణసంకరం అనే భావనను ప్రవేశపెట్టారు. నాలుగు వర్ణాలు అనే ప్రధాన విభాగంలో ఎలాంటి మార్పు చేయలేదు తరువాత. వేద ప్రామాణ్యం లభించిన చాతుర్వర్ణ్యవ్యవస్థను మార్చటానికి వీలులేదు. అప్పుడు వర్ణ ధర్మాలు మొదలయ్యాయి. వైదిక సంస్కారం, ఆచారకాండకు సంబంధించిన హోదాలతోవున్న వర్ణాలలో తక్కినవారిని బిగించవలసిన అవసరం ఉంది. సంస్కృత భారతంలో నహుష ప్రశ్నలకు సమాధానం ఇస్తూ ధర్మరాజు ఇచ్చిన సమాధానం ఇది—

జాతిరత్ర మహాసర్ప మనుష్యత్వే మహామతే,
సంకరాత్సర్వవర్ణానాందుష్పరీక్ష్యేతిమేమతిః॥ (వన. 180-31)
సర్వే సర్వాస్వపత్యాన్ని జనయంతి సదానరాః,
వాఙ్మైధున మథోజన్మ మరణంచ్ఛ సమంన్నృణామ్॥ (వన-180-32)

ఇద మార్షం ప్రధానంచ యేయజామహ ఇత్యపి,
తస్మాచ్ఛీలం ప్రధానేష్టం విదుర్యేతత్త్వదర్శినః॥ (వన. 180-33)

ఈ లోకంలో వర్ణ సంకరం ఏర్పడటం వల్ల జాతిని పరీక్షించటం కష్టం. మొదటి నుంచీ మనుష్యులందరూ అన్ని వర్ణాలకు సంబంధించిన స్త్రీలవల్లా సంతానాన్ని కంటున్నారు. వాక్ మైథున, జనన, మరణాలు అందరికీ సమానమే. అందువల్ల తత్త్వం తెలిసినవారు శీలానికి, ఆచారానికి ప్రాధాన్యం ఇచ్చారు అంటాడు ధర్మరాజు మొదట బ్రాహ్మణుని లక్షణాలేమిటో అడిగిన నహుషుని ప్రశ్నకు సత్యం, దానం, క్షమ, శీలం, అహింస, తపస్సు, దయ-ఇవి

బ్రాహ్మణుని ప్రధాన లక్షణా' (సం. భా. అధ్యా. 180-21) అని సమాధానం ఇస్తాడు ధర్మరాజు. దానిపైన నహుషుడు ఈ గుణాలన్నీ ఉండే శూద్రుడు కూడా బ్రాహ్మణుడు కాగలుగుతాడా? (పై. 23) అని ప్రశ్నిస్తాడు. దానికి ధర్మరాజు సమాధానం ఇది—

శూద్రేతు యద్భవేల్లక్ష్మ ద్విజేతచ్చ నవిద్యతే,
నవై శూద్రోభవేచ్ఛూద్రో బ్రాహ్మణోనచ బ్రాహ్మణః॥ (పై. 25)

యత్రై 9తల్లక్ష్యతే సర్పవృత్తం సబ్రాహ్మణః స్మృతః,
యత్రై 9తన్న భవేత్సర్ప తం శూద్రమితి నిర్దిశేత్॥ (పై. 26)

'శూద్రుడి లక్షణం బ్రాహ్మణుడిలో ఉండదు. సాధారణంగా శూద్రుడు శూద్రుడూకాడు, బ్రాహ్మణుడు బ్రాహ్మణుడూ కాదు పైన చెప్పిన లక్షణాలుండే బ్రాహ్మణుడవుతాడు. లేనినాడు అతడు శూద్రుడే అవుతాడు' అని దానిభావం. అయితే పైలక్షణాలున్నా శూద్రుడు బ్రాహ్మణుడు కావటానికి వైదిక సంస్కారం ద్వారా ఆచార కాండకు సంబంధించిన హోదా కూడా కావాలి. (పై. 34-37). ఆర్థిక, సామాజిక హోదా ఉండి, వైదిక సంస్కారానికి, ఆచార కాండకు సంబంధించిన హోదా తోడైనప్పుడు కింది వర్ణంవాడు పైవర్ణంలోకి పోవటానికి అవకాశం ఉన్న దశను ఇది సూచిస్తుంది. నన్నయ భారతంలోని కింది పరస్పర విరుద్ధంగా ఉన్న సమాధానంలో బ్రాహ్మణజాతి ప్రత్యేకతను యథాతథంగా నిలబెట్టే ప్రయత్నం కన్పిస్తుంది.

వ॥ ప్రమాదంబున వర్ణసంకరం బయినప్పుడు వర్ణపరీక్షార్థంబుగా బ్రాహ్మణాదులకు వృత్తంబు వేఱువేఱ స్వాయంభువుండైన మనువు సెప్పె; సత్యాది గుణంబులు శూద్రునందుఁ గలిగెనేని వాఁడు సచ్ఛూద్రుండగుఁగాక బ్రాహ్మణుండు గానేర్చునే ? యవియు బ్రాహ్మణునందు లేనినాఁడు శూద్రుండ యనంబడుం; గావున వృత్తంబుల యుత్తమంబులు" (అరణ్య-4-129).

3. బ్రాహ్మణ ప్రాధాన్యాన్ని, ప్రత్యేకతను పేర్కొనే సందర్భాలు మూల భారతంలోనే ఎక్కువగా కనిపిస్తాయి. కాని నన్నయ భారతంలో బ్రాహ్మణ ప్రసక్తి వచ్చిన ప్రతి సందర్భంలోను మూలంకంటే ఎక్కువగా పెంచి చెప్పిన

ఉదాహరణ లనేకం ఉన్నాయి. బ్రాహ్మణ శాపంనుంచి విముక్తుడైన కల్మాష పాదునితో వసిష్ఠుడు, 'వెళ్ళి రాజ్యంచేసుకో' ఇకముందు ఎప్పుడూ బ్రాహ్మణులను అవమానించకు, అంటాడు. తెలుగులో వసిష్ఠుడు దీనికి వన్నె పెట్టి బ్రాహ్మణ ప్రాశస్త్యాన్ని మరింత వర్ణించి చెప్తాడు.

చ. గుణముల నొప్పి బ్రాహ్మణులకుంగడు భక్తుడవై సమస్త ధా
రుణి ప్రజగూర్చఁగా విగత రోషుఁడవై సుఖముండుమింక బ్రా
హ్మణుల కవజ్ఞ సేయక శమంబును చేకొను మింద్రుఁడైన బ్రా
హ్మణుల కవజ్ఞసేసి యవమానముఁ బొందుఁ బ్రతాపహీనుడై.
(ఆది.7-129)

పులోముడనే రాక్షసుడికి తన పత్నిని గురించిన వృత్తాంతాన్ని తెలిపినందుకు భృగువు అగ్నికి శాపం ఇచ్చాడు. దానికి అగ్ని 'మళ్ళీ నిన్ను శపించగలను, కాని బ్రాహ్మణులు నాకు మాన్యులు' అంటాడు.

శక్తోఽహమపి శక్తుం త్వాం మాన్యాస్తు బ్రాహ్మణామమ (సం.భా. ఆది. అధ్యా. 7-5)

నన్నయ భారతంలో ఇదే సందర్భంలో అగ్ని పలికిన మాటలు బ్రాహ్మణులకు గల ఎదురులేని స్థానాన్ని సూచిస్తుంది.

వ... నీవు నాకు శాపంబిచ్చిన నేనలిగి నీకుఁ బ్రతిశాపంబీ నోపని వాఁడను గాను వినుము. (ఆది. 1-137)

చ॥ అడిచినఁదిట్టినన్ మఱి మహాపరుషంబులు పల్కి యల్కతోఁ
బొడిచిన నుత్తమ ద్విజులు పూజ్యులు వారలకెగ్గు సేసినం
జెడు నిహముం పరంబునిది సిద్ధముగావు దెఱింగి భక్తినె
ప్పుడు ధరణీసురోత్తములఁ బూజలఁ దన్పుదునల్గనోడుదున్
(పై. 138)

వ. నీవు బ్రాహ్మణుండవు నేనెద్దిసేసిన నీక చను... (పై. 139)

గరుడుడు సముద్రోదరంలో నిషాదులను మింగినప్పుడు వాళ్ళతోపాటు బ్రాహ్మణు డొకడు గొంతులో పడి దిగక కాలుతుంటే బ్రాహ్మణుడే అనుకొని

అతణ్ణి త్వరగా గొంతునుంచి బయటకు రమ్మన్నాడు. దానికి బ్రాహ్మణుడు 'నాతో పాటు నా భార్య నిషాదికూడా బయటికి రావాలి' అంటాడు. గరుడుడు 'ఆమెతోపాటు త్వరలో బయటకు వచ్చేయ' మంటాడు.సంస్కృత శ్లోకం ఇట్లా ఉంది.

నిషాదీమమ భార్యేయం నిర్గచ్ఛతు మయాసహ...

(సం.భా.ఆది అధ్యా 29-3)

గరుడ ఉవాచ

ఏతా మపి నిషాదీం త్వం పరిగృహ్యాశు నిష్పత (పై. 4)

సామాన్యంగా చెప్పిన ఈ విషయాన్ని మరింత విస్తృతీకరించి బ్రాహ్మణ ప్రాశస్త్యాన్ని ప్రకటిస్తారు నన్నయ.

ఉ॥ విప్రుఁడ నున్నవాఁడ నపవిత్ర నిషాది మదీయ భార్య కి
ద్ధ్రిప్రియ దీనిఁబెట్టి చనుదెంచుట ధర్మమె నాకు నావుడన్
విప్రులఁబొంది యున్న యపవిత్రులుఁ బూజ్యులు గారె గావునన్
విప్రకులుండ వెల్వడము వేగమ నీవును నీనిషాదియున్ (ఆది-2-63)

మూలంలో నిషాది నా భార్య అని మాత్రమే బ్రాహ్మణుడంటాడు. తెలుగులో నిషాదికి అపవిత్ర అనే విశేషణాన్ని తగిలించాడు. నిషాదితోపాటు త్వరగా బయటికి రమ్మని గరుడుడంటాడు మూలంలో. తెలుగులో పవిత్రులను పొంది ఉన్న అపవిత్రులు కూడా పూజ్యులవుతారు కాబట్టి నువ్వూ నీ నిషాదీ వేగంగా బయటికి రమ్మంటాడు బ్రాహ్మణులు పవిత్రులన్న ప్రత్యేకతను కాపాడే పద్ధతిలో ఉంది నన్నయ రచన. మూలభారతంలో సహస్రపాదుడు డుండుభ రూపంలో సర్ప శాపవిముక్తి జరిగింతరువాత రురుడితో అహింస, సౌమ్యస్వభావం, వేదవేదాంగ వేత్తృత్వం, సత్య, క్షమ మొదలైనవి బ్రాహ్మణ లక్షణా (సం.భా. ఆది. ఆధ్యా. 11-3-19) లని పేర్కొంటాడు. కాని తెలుగులో,

ఉ॥ భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టుడుఁదోడన పుట్టు నుత్తమ
జ్ఞానము సర్వభూతహిత సంహిత బుద్ధియుఁజిత్తశాంతియున్
మాన మద ప్రహాణము సమత్వము సంతత వేద విద్యను
ష్ఠానము సత్యవాక్యము దృఢవ్రతముంగరుణాపరత్వమున్(ఆది-1-157)

అని ఈ లక్షణాలన్నీ బ్రాహ్మణుడికి పుట్టుకతోనే ఏర్పాటయంటాడు. బ్రాహ్మణ వర్ణంలో స్థానం పుట్టుకతోనే లభించేదన్న విషయాన్ని ఇది బలపరుస్తున్నది.

4. తెలుగులో భారతం వచ్చిన కాలం నాటికే సంస్కృతంలో భారతాది ఇతిహాసాలలోని ఇతివృత్తాలను ఆధారం చేసుకొని అనేక కావ్య, నాటకాల రూపంలో లౌకిక సాహిత్యం అభివృద్ధి చెందింది. సుమారు నన్నయ కాలంనాటికి అది ఆలంకారిక మార్గంలో పడి క్షీణ దశకు కూడా చేరిందని చెప్పవచ్చు. సంస్కృతంలో లౌకిక సాహిత్యం కేవలం మత ప్రధానమైన సాహిత్యానికి భిన్నంగా పట్టణ జీవిత విధానంలో వ్యక్తిగత కవులు తమ ప్రతిభా సంపదలను ప్రదర్శించే ప్రయత్నంలో బయలుదేరింది. కాంతా సమ్మితంగా, సరసంగా ఉపదేశం చేయటం లౌకిక కావ్యాల ప్రయోజనం అని ఒక వైపు చెప్తున్నా, అనందం పరమ ప్రయోజనం అని అలంకార శాస్త్రాలు స్పష్టం చేస్తున్నాయి. దృశ్య, ప్రకృతి వర్ణనలు, అంగాంగ వర్ణనలు, కల్పనలు, రసం, శైలీ ప్రాధాన్యం ఇవి లౌకిక కావ్య లక్షణాలు నన్నయ తన కాలం వరకు వచ్చిన లౌకిక సాహిత్యాన్నంతా బాగా అధ్యయనం చేసి ఉండాలి. సంస్కృత, కావ్య నాటకాలలోని భావాలు కొన్ని యథాతథంగా అప్రయత్నంగా నన్నయ భారతంలో చోటు చేసుకోవటమే కాకుండా, కావ్యాలలోని వర్ణనా వైఖరులు, సంస్కృత గద్య కావ్యాలలోని శైలీ విధానాలు కూడా తమ ప్రభావాన్ని ప్రదర్శించాయి. అనంతర కాల ప్రబంధాలలో కనిపించే అనేక రచనా, వర్ణనా పద్ధతులకు మూలం నన్నయ భారతంలో కనిపిస్తుంది. మొత్తం మీద కథన ప్రధానమైన ఇతిహాసమైనా సంస్కృత లౌకిక సాహిత్య ప్రభావం వల్ల కావ్యలక్షణాలు చోటు చేసుకున్నాయి నన్నయ భారతంలో.

భీమ దుర్యోధనుల గదా కౌశల ప్రదర్శనను వర్ణించే కింది పద్యంలో రెండు రకాలైన కావ్య ధోరణులు కనిపిస్తాయి. మొదటిది వర్ణన, రెండవది గదా కౌశల ప్రదర్శనం భావి పాండవ కౌరవ్య రణాన్ని సూచిస్తున్నదని చెప్పటం.

మ. అవనీ చక్రము పాదఘాతహతి నల్లాడంగ నత్యుగ్రభై
రవ హుంకార రవంబునన్ వియదగారంబెల్ల భేదిల్లఁ బాం

దవ కౌరవ్యగదావిఘట్టన మకాండ ప్రోత్థమై భావి పాం
దవ కౌరవ్య రణాభి సూచన పటిష్ఠంబయ్యె ఘోరాకృతిన్.(ఆది-6-14)

ఇలాంటి వర్ణనాత్మక ఘట్టాలు నన్నయ భారతంలో అనేకం కనిపిస్తాయి. కాని స్త్రీలకు సంబంధించిన వర్ణనలలోకూడా మూలంలో అతి సాధారణంగా చెప్పిన చోట్ల నన్నయ కచకుచ వర్ణనలతో విస్తృతీకరించటం చూడవచ్చు. తాత్త్వికంగా బ్రాహ్మణ మత సంప్రదాయాలు, సమకాలీన 'ఫ్యూడల్' పరిపాలకుల ప్రాశస్త్యాన్ని ఉగ్గడిస్తూ పురాణంలాంటి ఇతిహాసరచన చేసిన నన్నయ, సాహిత్య పరంగా తనకాలంనాటికి విస్తృతంగా అభివృద్ధి చెందిన సంస్కృత లౌకిక కావ్య ధోరణులకు కూడా లొంగకుండా ఉండలేక పోయాడు. స్త్రీ వర్ణనలకు సంబంధించిన పద్యాలను వేరుచేసి చూపిస్తే అది ఏ ప్రబంధంలోనిదనో అనుకునే అవకాశం ఉంది. దీనికి ముఖ్యంగా కింది మూడు ఉదాహరణలు చాలు.

ఋతుమతి అయిన గిరికకు మృగ మాంసం తెచ్చిపెట్టమని పితృదేవతలు పంపగా వసురాజు ఆమెనే మనస్సులో తలచుకుంటూ వేటకు వెళ్ళాడు. అది సంస్కృతంలో ఇట్లా ఉంది.

చచార మృగయాం కామీ గిరికామేవ సంస్మరన్,
అతీవ రూప సంపన్నాం సాక్షాచ్ఛ్రియ మివాపరామ్ (సం. భా. ఆది. అధ్యా. 63-42)

తెలుగు భారతంలో ఇదే విషయాన్ని అంగాంగి వర్ణనలతో పెంచి చెప్పటం జరిగింది.

సీ. పలుకులు ముద్దును గలికి క్రాల్గన్నుల
తెలివును వలుఁద చన్నుల బెడంగు
నలఘు కాంచీ పద స్థలముల యొప్పును
లలితాననేందు మండలము రుచియు
నళినీలకుటిల కుంతలముల కాంతియు
నెలజవ్వనంబున విలసనమును

3)

నలస భావంబునఁ బొలుపును మెలుపును
గలుగు నగ్గిరికను దలఁచి తలఁచి

ఆ. ముదితయందుఁ దనదు హృదయంబు నిలపుటఁ
జేసి రాగమదర భాసురముగ
రమణతో వనాంతరమున రేతస్స్యంద
మయ్యె నవని పతికి నెయ్యమొనర (ఆది-3-27)

తీర్థయాత్రలు చేస్తూ పరాశరుడు మత్స్యగంధిని చూసి కామించాడు.

తీర్థయాత్రాం పరిక్రామన్నపశ్యత్ వై పరాశరః,
అతీవ రూపసంపన్నాం సిద్ధానామపి కాంక్షితామ్ (సం.భా. ఆది. అధ్యా 63-70)

దృష్ట్వైవ స చ తాం ధీమాంశ్చకమే చారుహాసినీమ్,
దివ్యాం తాం వాసవీం కన్యాం రంభోరుం మునిపుంగవః (పై. 71)

ఇదే ఘట్టం నన్నయ భారతంలో కావ్య ప్రబంధ ధోరణిలో కనిపిస్తుంది.

సీ. చపలాక్షి చూడ్కుల చాడ్పునకెడ మెచ్చుఁ
జిక్కని చనుఁగవఁ జీఱఁగోరు
నన్నువ కౌఁదీగ యందంబు మది నిల్పు
జఘన చక్రంబుపైఁ జలుపుదృష్టి
యభిలాషమేర్పడు నట్లుండఁగా బల్కు
వేడ్కతో మఱుమాట వినఁగఁదివురు
నధిక లజ్జాన్వితయైన యక్కన్యక
కైఁబడి లజ్జయుఁ బాపఁదలఁచు

ఆ. నెంతశాంతులయ్యు నెంత జితేంద్రియు
లయ్యుఁ గడు వివిక్తమయినచోట
సతుల గోష్ఠిఁ జిత్తచలన మొందుదు రెందుఁ
గాముశక్తినోర్వఁగలరెజనులు. (ఆది-3-38)

మేనకను చూచిన విశ్వామిత్రుడు కామవశుడయ్యాడు.

గృద్ధాం వాససి సంభ్రాంతాం మేనకాం మునిసత్తమః,
అనిర్దేశ్యవయోరూపామపశ్యత్ వివృతాం తదా(సం.భా.ఆది.అధ్యా.72-6)

తస్యాఃరూపగుణాన్ దృష్ట్వా సతు విప్రర్షభ స్తదా,
చకారభావం సంసర్గాత్ తయాకామవశం గతః (పై. 7)

**తెలుగులో** దీనికి వర్ణనాత్మక వివరణ ఇట్లా ఉంది :

చ. అలసత యొప్పఁగాఁ దరుణి యమ్మునివల్లభు మ్రోలనున్న సం
మిళిత సుగంధ బంధుర సమీర వశంబునఁ దూలి బాలపై
వలువెడలన్ బయల్పడియె వర్ధ కుచంబుఁ గక్షయుగ్మమున్
లలిత కృశోదరంబుఁ దరళ త్రివళీయుత రోమరాజియున్
(ఆది. 4-44)

క. అందుఁ దనదృష్టి నాటుడుఁ
గందర్ప నిశాత సాయకంబులు పెలుచన్
డెందముఁగాఁడిన ధృతిసెడి
కంది మునీంద్రుడు దానిఁ గవయందివిరెన్ (పై. 45)

అనంతర కాల ప్రబంధకవులు నన్నయ రచనాశైలి, పద్యాలనడకలతో పాటు వర్ధకుచాలను, కక్షయుగ్మాలను, లలిత కృశోదరాలను, త్రివళీయుత రోమరాజిని కూడా గ్రహించారు. వాటికి సంబంధించిన వర్ణనలను పెంచి పోషించారు. స్త్రీని ప్రాణంగలిగిన మానవ జాతిలో భాగంగా విస్మరింపజేసే ప్రయత్నం చేశారు.

ఏనాటి సాహిత్యమైనా ఆనాటి సామాజిక జీవిత వాస్తవికతకు ప్రతిబింబంగా వస్తుంది. సామాజిక జీవిత వాస్తవికత అంటే సమకాలీన ఆర్థిక సంబంధాలు, ఆర్థికపరమైన హోదా సమాజంలోని స్థానాన్ని నిర్ణయిస్తుంది. దానికి 'గుర్తింపు' 'సమ్మతి'ని కలిగింప జేయటానికి అనుకూలంగా మతపరమైన ఆచారకాండ రూపొందుతుంది. సమాజంలోని అంతరాలను యథాతథంగా నిలబెట్టటానికి జనానికి నీతిబోధ అవసరం అవుతుంది. దానికనుగుణంగా కళ, సాహిత్యం సృష్టింపబడుతుంది. దానిలోని భావాలు సమాజంపైన అధికారం కలిగి

ఉన్నవారి భావాలుగా ఉంటాయి. ఫ్యూడల్ యుగంనాటి ప్రాంతీయ రాజులు తత్వం, మతం, చట్టం మొదలైన అన్ని విషయాల్లోను సామ్రాజ్య కాలంనాటి చక్రవర్తులను అనుకరించారు. మధ్యయుగం ప్రారంభ కాలంలో మేధావుల పరిశోధనా ఫలితాలుగా వచ్చిన తత్త్వం, ధర్మం, సాహిత్యం, వ్యాకరణం మొదలైనవాటికి సంబంధించిన శాస్త్ర విషయాలు, భావాలు 'సంప్రదాయంగా' 'సంప్రదాయ భావాలు'గా స్థిరపడ్డాయి. ప్రాంతీయ భాషలలో సాహిత్యాన్ని ప్రోత్సహించటం ద్వారా ఈ సంప్రదాయ భావాలను నిలబెట్టే ప్రయత్నం చేశారు ప్రాంతీయ రాజులు. భాష ప్రాంతీయ భాష అయినా వస్తువు, భావాలు, రచనా విధానం మొదలైన అన్ని విషయాలను సామ్రాజ్య కాలంనాటి సంస్కృత సాహిత్యం నుంచి దిగుమతి చేసుకోవటం జరిగింది. కాని యథాస్థితి వాదం, 'ఫ్యూడల్' యుగంనాటి ఆర్థిక సంబంధాలు- వీటి పరస్పర వైరుధ్యాలు భావజాలంలో కూడా వైరుధ్యాన్ని సృష్టించాయి. ఈ వైరుధ్యాలు సాహిత్యంలో ప్రతిబింబించక తప్పదు. భారతదేశ చరిత్రలో సామ్రాజ్య యుగానికి ముందే చాతుర్వర్ణ్యవ్యవస్థగా ప్రారంభమై సామ్రాజ్య యుగం నాటికి వర్ణాశ్రమ ధర్మ ప్రధానంగా రూపొందిన సామాజిక వ్యవస్థకు సంబంధించిన భావజాలం, మధ్య యుగం ప్రారంభంలో రూపొందిన ధర్మశాస్త్ర విషయాలు, 'ఫ్యూడల్' యుగం నాటి ఆర్థిక పరిస్థితుల నుంచి ఉత్పన్నమైన పాలకుల కనుకూలమైన ఆలోచనా విధానం కలసి సంకీర్ణ రూపంలో నన్నయ భారతం అవతరించింది. దీన్ననుసరించి ఆయా యుగాలలోని సంస్కృత సాహిత్య స్వరూపాల సంకీర్ణ రూపంగా ఇతిహాసమైనా పురాణంగా, పురాణమైనా కావ్యంగా తెలుగు భారతం దర్శనమిస్తుంది.

# సంప్రదించిన గ్రంథాలు, వ్యాసాలు

## తెలుగు


1. కృష్ణారావు, భావరాజు వేంకట. 1922. పూర్వచాళుక్య చరిత్రము. శ్రీ రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచికలో. రాజమహేంద్రవరము. ఆంధ్ర దేశీయేతిహాస పరిశోధక మండలి. 2-16

2. నన్నయ. శ్రీమదాంధ్ర మహాభారతము.

3. రాధాకృష్ణశర్మ, చల్లా. 1962. తమిళ సాహిత్యము. దక్షిణ భారత సాహిత్యములులో. హైదరాబాద్: ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ: 1-46

4. రామకృష్ణశర్మ, గడియారం. 1962. కన్నడ సాహిత్యము. (పై) 51-110

5. రామలింగారెడ్డి, కట్టమంచి. 1922. అధ్యక్షుని వచనము. శ్రీ రాజరాజ నరేంద్ర పట్టాభిషేకి సంచికలో: 196-216

6. వీరభద్రరావు, చిలుకూరి. 1922. చాళుక్యులకుల ప్రశంస. శ్రీ రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచికలో: 73-105

7. సత్యనారాయణ, విశ్వనాథ. 1970. నన్నయగారి ప్రసన్న కథా కలితార్థ యుక్తి. విజయవాడ (మొదటి ప్రచురణ 'భారతి'లో వరుసగా 1946)

8. సత్యనారాయణ, విశ్వనాథ. 1970. పద్య విద్య (పీఠిక) శ్రీ మహాంధ్ర మహాభారతము. హైదరాబాదు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి.

9. 1959. విజ్ఞాన సర్వస్వము :3 భాగము. హైదరాబాదు: తెలుగు భాషా సమితి

## కన్నడం

10. పంప. విక్రమార్జున విజయం.

## సంస్కృతం

11. వ్యాస. శ్రీమన్మహాభారతమ్. ఆది, సభ, వనపర్వాణి. గోరఖ్‌పూర్: గీతాప్రెస్.

## ఇంగ్లీషు

12. Jha, D N. 1974. Temples as Landed Magnates in Early Medieval South India (C.A.D. 1200-1600) in Sharma, R.S. (Ed.) 1974: 202-216

13. Kosambi, D.D. 1956. -An Introduction to the study of Indian History. Bombay: Popular Book Depot.

14. " 1962. Myth and Reality : Studies in formation of Indian culture. Bombay: Popular Prakashan

15. " 1970. The Culture & Civilization of Ancient India in Historical outline. New Delhi : Vikas Publishing home (First published in 1965)

16. KrishnaRao,B.V. 1942. A History of the Early Dynasties of Andhradesa. Madras.

17. Nandi, R. N. 1974. Origin and Nature of Saivite Monarticism. The case of Calamukhas in Sharma, R. S (Ed.) 1974: 95-123

18. Romila Thapar. 1974 Social Mobility in Ancient India with Special Reference to Elite groups. in Sharma, R S.(Ed) 1974: 95-123

19. Rubin, Walter. 1974. Outline of the Structure of Ancient Indian Society in Sharma R. S (Ed) 1974; 85-94

20. Sathyanarayana,K. 1975. A study of the History and Culture of the Andhras: New Delhi: Peoples Publishing home.

21. Sharma, R.S (Ed) 1974. Indian Society: Historical Probings in Memory of D. D. Kosambi. New Delhi : Peoples Publishing home.

22. Srinivas, M.N. 1972. Social Change in Modern India. Bombay: Orient Longman Limited (First Published in 1966)

23. VenkataRamanayya, Nelaturi. 1950. Eastern Chalukyas of Vengi. Madras.



# పాల్కురికి సోమన:
# నిబద్ధత-నిమగ్నత

—ముదిగొండ వీరభద్రశాస్త్రి

[తెలుగు సాహిత్యానికి వెయ్యేళ్ళ చరిత్ర ఉన్నా, సాహిత్య చరిత్ర విభాగానికి మటుకు అందులో పదోవంతు వయస్సు అయినా లేదు. ఉన్నంతలో నైనా మౌలికంగా పరిశోధించి, పరిశీలించి ఆ విషయాలను స్వతంత్రంగా చెప్పినవారి సంఖ్య అత్యల్పం కాగా, పరంపరగా ఆ విశేషాలనే మళ్ళీ మళ్ళీ వల్లించిన వారి సంఖ్య అత్యధికం.

ఒక కవిని గూర్చి ప్రత్యేకంగా అధ్యయనం చేయటం విశ్వవిద్యాలయాలలో వ్యక్తిగత పరిశోధన ఆరంభమైనాకే మొదలైంది. అంతకుపూర్వం సాహిత్య చారిత్రకులు విరివిగా కవి కులగోత్రాల గురించి, కృతుల పౌర్వాపర్యం గురించి, కవి కాల జన్మస్థలాదుల గురించి కృషిచేసి కవితా మార్గంలో అతని ప్రశస్తిని సూచించారు. కవి వ్యక్తిత్వం గురించిగాని, అతని సమకాలీన పరిస్థితుల గురించిగాని అంతగా వివరణకు పూనుకోలేదు.

ఇటువంటి పరిస్థితులలో 'సారస్వత వేదిక' వారు 'తెలుగు సాహిత్యం' పైన 'మరోచూపు' ప్రసారించే యత్నం ప్రారంభించటం ముదావహము. అభినంద్యము. ఉత్తరోత్తరా ఒక సమగ్ర సాహిత్య చరిత్ర రచనను ఇదే శ్రీకారం చుడితే భాషకు, దేశానికి మేలు జరుగుతుందనటంలో అతిశయోక్తి లేదు.

ఈ విధమైన 'మరో చూపు'లో పాల్కురికి సోమన ఎలా కనబడతాడన్నది ప్రస్తుతాంశం. ఈ పరిశీలనలో సోమన కాలంలో ఆంధ్రదేశంలో రాజకీయ, సామాజిక, మత, సాహిత్య పరిస్థితులను సమీక్షించమని, సంస్కరణ ప్రధానము, ఉద్యమ ప్రధానమైన మతంగా వీరశైవం, బసవడి వీరశైవానికి ఆంధ్రదేశంలో వచ్చిన మార్పులు, మళ్ళీ బ్రాహ్మణ ప్రాధాన్యం మొదలైన

మార్పులకు గల కారణాలను వివరించమని ఆదేశం. అదే విధంగా సర్వకుల సమానత్వం విషయంలో సోమనకుగల నిబద్ధత నిమగ్నతను నిరూపించమని, వీరశైవ మత వ్యాప్తి విషయంలో హింస ఎందుకు చోటు చేసుకున్నదీ విశదీకరించమని కార్యనిర్వాహకులు సూచించారు. సాహిత్య విషయానికి వస్తే, సోమన సాహిత్యాన్ని ప్రచారసాధనంగా ఎలా ఉపయోగించాడు, జాను తెనుగుల విషయంలో సోమనకు గల నిబద్ధత, నిమగ్నత ఎటువంటిది, భాషా సాహిత్య విషయాలలో తాను చెప్పినదానిని సోమన ఎంతవరకు అనుసరించగలిగాడు, తెలుగు సాహిత్యంలో ఆయన మార్గం ఎందుకు కొనసాగలేదు, అయినా మార్గ పద్ధతిలోని సాహిత్యంపైన అది ఎంతవరకు ప్రభావం చూపింది అనే అంశాలనుకూడా పరిశీలించవలసినదిగా సూచించారు.

అధికారికంగా ఈ అంశాలన్నింటిని ప్రస్తావించి నిరూపించటానికి ఎంతో విపులమైన అధ్యయనం, అనేక రంగాలలో కూలంకషమైన పాండిత్యం మొదలయినవి ఆవశ్యకం. అందువల్ల 'విబుధ జనుల వలన విన్నంత–కన్నంత' అనే రీతిలో మాత్రమే ఒక ప్రయత్నం చేయట మౌతున్నది. ఇది సమగ్రము అని చెప్పే సాహసం లేదు ]

పాల్కురికి సోమన గురించి ప్రసిద్ధ పండితులు ఎందరో వాద వివాదాలకు పూర్వం తలపడ్డారు. ఈ వాద వివాదాలు చాలా కాలమూ నడిచినాయి. బహుశః 'కుమార సంభవ' కర్త నన్నె చోడుని తరవాత ఇంతగా వివాదాస్పదుడైన కవి మరొకడు లేడేమొ !

సోమన ఎప్పటివాడు, ఎక్కడివాడు అన్న దగ్గరినుంచి ఆయన కుల గోత్రాలేమిటి, ఆయన అనుసరించిన మతాచారా లేమిటి, ఆయన భాషా సాహిత్య సిద్ధాంతా లేమిటి వంటి అనేక ప్రశ్నలూ, ప్రతి ఒక్క ప్రశ్నకూ, అనేక సమాధానాలు ఈవరకే పుట్టి ఉన్నాయి. భాషా సాహిత్యపరంగా గాని, మత సామాజిక రీత్యాగాని సోమన దృక్పథాలను,వాటి విజయాపజయాలను అంచనా వేయటానికి ఈ ప్రశ్నలు సమాధానాలు పెద్దగా అవసరం కాదు కనుక ప్రస్తుత చర్చలో ఆ విషయాలను ఉపేక్షించవచ్చు.

సోమన గూర్చి అంతో ఇంతో తెలుసుకున్న వారందరికీ ఆయన మీద విశేష గౌరవం కలగటానికి కొంత అవకాశం ఏర్పడింది. ఈ ఆభిముఖ్యానికి ప్రధాన హేతువులు రెండు: మొదటిది-మన దేశంలో ప్రాచీనత పట్ల సహజంగా ఉన్న గౌరవభావం; రెండవది (భవభూతి చెప్పినట్లు) 'మమసమానధర్మః' అన్న అభిమానం.

మన ప్రస్తుత కాలాన్ని మనము ఒక దృష్టితో స్థూలంగా 'ప్రజా యుగము' అని వ్యవహరిస్తున్నాము. భాషగాని, సాహిత్యం గాని-సమస్తమూ ప్రజాబాహుళ్య సంబంధిగా, జనసామాన్య ప్రయోజనకారిగా ఉండాలనేది ఆధునికులలో పరపతి సంపాదించుకున్న దృష్టి. ఇది ఒక ఉద్విగ్నభావం. ఈ భావాన్ని మననం చేసేవేళ దాని ఆచరణీయత గూర్చిన యథార్థత పొడ గట్టదు.

నన్నయ వంటి విద్వత్కవులు తెచ్చిపెట్టిన మార్గ పద్ధతికి వ్యతిరేకంగా ఆ కాలంలోనే సోమన జానుతెనుగన్నాడు- దేశీయచ్ఛందస్సులను ఆద రించాడు- ఇంచుమించుగా సమకాలికులనదగిన చారిత్రక వ్యక్తుల కథలను స్వీకరించాడు- ఈ విధంగా ఒక ప్రజల ఉద్యమానికి సోమన నాదే శ్రీకారం చుట్టాడు-అని తలచుకొన్నప్పుడు సోమన పైన ఆదరాభిమానాలు సహజంగానే ద్విగుణీకృతమైనాయి. ఆ అభిమానానికి సోమన అర్హుడా, కాదా అన్న కొత్త ప్రశ్న లేవదీయటానికి కాదుగాని ఇటువంటి పూర్వస్థిత భావాలతో పరిశీలన ారంభిస్తే మన అంచనాల పరిమాణం మారుతుందని మాత్రం గ్రహించవలసి ంది.

సమాజ పరంగా చూసినప్పుడు సోమనకున్న నిబద్ధత, నిమగ్నత సమస్తమూ తాను శ్రేష్ఠమైనదని త్రికరణ శుద్ధిగా నమ్మిన ఒక ఉపాసనా మార్గము, ఆధ్యాత్మిక తత్త్వము జనులందరికీ అందించాలన్న ఏకైకాంశం పయినే కేంద్రీకృతమైనట్లు చెప్పుకోవచ్చును. ఇక తక్కిన విషయాలన్నీ కేవలం ఆనుషంగికాలు మాత్రమే. అందువలన సర్వకుల సమానత్వం విష యంలో సోమనకు ఏదో ప్రత్యేకంగా నిబద్ధత, నిమగ్నత ఉన్నదని చెప్పటం సాధ్యంగా తోచదు.

సోమన కవి-గొప్ప కవి; ప్రవక్త కాదు. గురు పరంపర ద్వారా తనకు అందిన మతంపైన ఆయనకు గాఢమైన అభినివేశం ఉన్నది. ఆ మతానికి పుష్టిని, స్ఫూర్తిని కలిగించి వాడవాడలా ప్రచారం గావించిన మహనీయులు తన కాలానికి కాస్త ముందుగా ఉన్న చారిత్రక వ్యక్తులు-బసవన, పండితయ్య. వారిద్దరిపైన ఆయనకు అపార గౌరవం. వారిద్దరూ అపర మహేశ్వరులు.

తగు భక్తి వర్ధనార్థంబు దానగుట
బసవని శరణన్నఁ బాపక్షయంబు
బసవని శరణన్నఁ బరమపావనము
బసవని శరణన్నఁ బ్రత్యక్ష సుఖము
బసవని శరణన్నఁ భవరోగహరము.

బసవని శరణంటే భక్తి చేకూరుతుంది; బంధములు పోతాయి; భాగ్యాలు కలుగుతాయి, ఆపదలు తొలగుతాయి, సంపదలు ప్రబలుతాయి; కీర్తి, శీలము వృద్ధి అవుతాయి; కోర్కె నెరవేరుతుంది; వాక్సిద్ధి కలుగుతుంది; బుద్ధి ప్రకాశిస్తుంది.

బసవండు కేవల భక్తుఁడే తలఁప?
అసమాక్షుఁ డా రూపమై నిలిచె గాక !

పండితారాధ్యులను ప్రస్తుతిస్తే నిండారు శివభక్తి నియతి వర్ధిల్లుతుంది. తండతండములు పాతకములు నశిస్తాయి. సద్భక్తి భాగ్యం కలుగుతుంది; దండి భవాంబుధి తరతరమింకుతుంది.

చిర తమోగుణ పరిస్ఫుతుండు శివుఁడు
వర సత్త్వగుణ వికస్వరుఁడు పండితుడు;
అరయ నచర లింగ మా లింగమూర్తి,
యరయగాఁ జరలింగ మా పండితయ్య.

... ... ...

అరుదగు లోకసంహారుండు శూలి
కరుణమై లోకోపకారి పండితుడు,

అత్యద్భుతములైన బసవని, పండితుని మహిమలను, కథలను విని ఉప్పొంగిపోయిన సోమన ఆ ఇద్దరి చరిత్రంను తన కవితా ఝరితో స్వీకరించి నల్గడలా భక్తి వెల్లువలు పారించటానికి కృషి చేశాడు.

మతాచార విషయాలలో బసవని మార్గానికి, పండితయ్య మార్గానికి కొంత వ్యత్యాసం ఉన్నది. అయితే శివపారమ్యం విషయంలోగాని, శివభక్తి విషయంలోగాని ఎటువంటి తారతమ్యం లేదు శివుడెంతో శివభక్తుడంత-ఇంకా సరిగా చెప్పాలంటే శివభక్తుడే కొంచెం మిన్న అనటంలోను వారిద్దరికీ ఒకేమాట.

ఈ శైవమతం గూర్చి ఇక్కడ చెప్పుకోవలసిన విశేషాలు ఒకటి రెండున్నాయి.

బసవేశ్వరుడుగాని, పండితయ్యగాని తాముగా ఒక కొత్త మతాన్ని ప్రవేశపెట్టినవారు కారు చారిత్రకంగా శైవం అతి ప్రాచీనమైనదనే పలువురి విశ్వాసం.

హిందూ ధర్మం అనుసరించే వారందరూ శిరసావహించే వేద వాఙ్మయం ద్వివిధమనీ, వానిలో ఒక భాగం త్రైవర్ణిక విషయమనీ–అంటే ఉపనయన సంస్కారం గల మొదటి మూడు వర్గాల వారికి ప్రత్యేకమైనదనీ - మిగిలినది 'సర్వ విషయశ్చ' అంటే అందరికీ ఉద్దేశించినదనీ భాష్యకర్తలు కొందరు నిర్దేశించారు. త్రైవర్ణికమైనది నిగమం లేదా వేదం; సర్వ విషయమైనది 'ఆగమం' అనీ వివరణ. శైవం నిగమాగమోక్తమైనది.

ప్రధానంగా శైవం అని గ్రహించే దానిలో అనేక అవాంతర భేదాలు ఉన్నాయి. ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతాదుల పేర్లతో ఆ తరువాత రూఢికి వచ్చిన ఉపాసన మార్గాలు, దీక్షా విధులలో తేడాలున్న పద్ధతులు అనేకం ఆ భేదాలకు కారణం. వీటి అన్నిటికీ సమానమైనది, ప్రధానమైనది శివపారమ్యం.

ఆంధ్ర దేశంలో ఆరాధ్యశైవం - లేదా శాంభవ దీక్షగా ప్రచారంలోకి వచ్చినది. పండితయ్య అనుష్ఠించినది ద్వైతాద్వైత మార్గం. దీనినే శివాద్వైతం అని కూడా వ్యవహరిస్తారు దీనికి సంబంధించిన తాత్త్విక చింతన ఉత్తర దేశం నుంచి లభ్యమైంది. అయితే దక్షిణ దేశాన అరువత్తుమూవురు నాయన్మారుల శివ

భక్తి, వ్రతదీక్ష సుప్రసిద్ధమైనది. వీరినే పురాతన భక్తులనే పేరిట పేర్కొని సోమన బసవ పురాణ, పండితారాధ్య చరిత్రలలో వారి గాథలను తెలియజేశాడు. ఈ విధంగా వివిధ కాలాలలో వివిధ శాఖల ద్వారా వివిధ ప్రాంతాలనుంచి వచ్చిన ప్రభావాల సమ్మిశ్రిత రూపం బసవ, పండితారాధ్యుల కాలంలో కర్ణాట కాంధ్ర సీమలలో వెలసిన శైవ స్వరూపాలుగా రూపు దాల్చింది.

'శ్వేతాది లకులీశాన్తం యోగాచార్య మతానుగాం' అనే ఆచార్య పరం పరలో ఈ ఉభయ ప్రాంతాల శైవాలకు ఒకే అవతరణం రూఢిగా వచ్చింది. ఇది వైదికమైనదే కాని కొందరు భ్రమపడినట్లు అవైదికంగాదు.

ఇక బసవేశ్వరునికి, పండితయ్యకు ఏకాభిప్రాయం లేని దొకటే అంశం పైన.

పండితయ్య ఉపనయన, పాశుపత లేదా శాంభవ దీక్షలు రెండింటిని విధి విహితములుగా ఎన్నుకున్నాడు. బసవడు పాశుపత దీక్ష ఒక్కదానినే ఆదరించి ఉపనయన దీక్షను నిరసించాడు. లింగధారణ దీక్ష జ్ఞానదీక్ష కావటంచేత అది ఒక్కటే రెండవ జన్మను ప్రసాదించగలదని బసవడు వాదించాడు. కాలక్రమేణా బసవని మార్గానికే వీరశైవం అన్న రూఢి కలిగింది.

ఏ మతమైనా ఉద్ధృతంగా ఉద్యమ రూపం దాల్చేటప్పుడు 'అనన్యాశ్చింత యన్తో మామేకం శరణం వ్రజ' అన్న సూక్తి, బోధన తప్పనిసరి అవుతాయి. అనుసరించే దీక్ష వీరవ్రతం అవుతుంది.

బసవేశ్వరుడు అనుష్ఠాన పూర్వకంగా చేసిన ప్రచారం వలన వీరశైవం కర్ణాటక ప్రాంతంలోను, కొంతవరకు ఆంధ్ర ప్రాంతంలోను ప్రాచుర్యం సంపా దించింది. బసవేశ్వరుని ప్రభావానికి లోనైన పాల్కురికి సోమన సాహిత్య మార్గంగా దానికి ప్రచారం చేశాడు

'బసవపురాణం' లో బసవని, ఆయన సమకాలికులైన నవీన భక్తుల, పురాతన భక్తుల భక్త్యుత్కర్షను నిరూపించటం ద్వారా సోమన విద్వత్ప్రకర్ష జోలికి, వాదోప వాదాల జోలికి పోని ప్రజాసామాన్యం హృదయాలను ఆకర్షించే

ప్రయత్నం చేశాడు. లింగధారణ దీక్ష ద్వారా సామాజికమైన కుల వ్యవస్థ కల్పించిన న్యూనత తొలిగిపోతుందనే విశ్వాసాన్ని కలిగించాడు. పరమేశ్వరుని కరుణకు పాత్రులు కావటానికి జ్ఞాన కర్మాదుల అవసరం లేకుండా కేవల భక్తి- ఆదీ అహంకార రహితమయిన భక్తి చాలుతుందనే అభిప్రాయాన్ని కలిగించాడు. భక్తిభావాన్ని రసోద్విగ్నమైన చిత్తవృత్తిలో పెట్టి ప్రచారం కావించాడు.

ఈ సందర్భంలో గమనించవలసిన అంశం ఒకటి ఉన్నది. బసవేశ్వరుని గూర్చి మనకి తెలియవచ్చే విశేషాలన్నిటినీ పరిశీలించినప్పుడు బసవన కేవల భక్తుడే కాక, మతాచార్యుడే కాక ఆర్థిక, సాంఘిక రాజకీయ జీవనాన్ని సంస్కరించిన సంస్కర్తగాకూడా కనబడతాడు. సోమన చిత్రించిన బసవడు అటువంటి సంపూర్ణమైన సమగ్రమైన వ్యక్తికాదు. ఇక్కడ బసవడు భక్త శిఖామణి, సాక్షాచ్ఛివస్వరూపుడు ద్వితీయ శంభుడన బరగిన వృషాధిపుని అవతారం. అనేకానేక లోకాతీత మహిమలు చూపినవాడు, మానవత్వం కంటె దైవత్వం అధికాంశంగా గల వ్యక్తి. సోమన బసవ పురాణ రచనా ప్రయోజనం దీనిని బట్టే స్పష్టమైపోతుంది.

జనసామాన్యానికి మతము హృదయ ధర్మం అవుతుంది. పండిత ప్రకాండులకు, అది బుద్ధి ధర్మంగా ఉంటుంది. సమాజంలో తమకున్న విశిష్ట స్థానం ద్వారా, గౌరవ ప్రతిపత్తి ద్వారా మేధా జీవులు తమ సిద్ధాంతాలను తమ విశ్వాసాలను జనసామాన్యంలో వ్యాప్తిచేయగల్గుతారు. కనుక మత వ్యాప్తిచేయటంలో తార్కికత ద్వారా, శాస్త్ర దృష్టాంతాల ద్వారా పాండిత్య ప్రకర్ష ద్వారా విద్యావంతులను కూడా ఆకిగట్టుకోవాలి. బసవడు తన జీవితాన్నే నిదర్శనంగా చేసి జన సామాన్యంలో మత వ్యాప్తిచేయగా పండితయ్య శిష్య సంఘాలతో సంచారం చేసి వివిధమతాలకు చెందిన ప్రముఖులను వాదంలో ఓడించి మత ప్రచారం చేశాడు. అందువల్లనే సోమన తన దీక్ష పరిపూర్తి చెందటానికి విద్యావంతులయిన వర్గంలో కూడా ప్రవేశించ వలసిన అవసరాన్ని గుర్తించి పండితయ్య చరిత్రను కావ్యస్థం చేశాడు. పండితారాధ్య చరిత్ర అనే నామకరణం చేసినా నిజానికి ఈ గ్రంథంలో చరిత్రాంశాలకంటే మత, తాత్త్విక విషయాలకు సంబంధించిన ప్రామాణిక చర్చలే ఎక్కువ ఉన్నాయి.

మత, తాత్త్విక విషయాలు అటుంచి ఈ శైవ మత వ్యాప్తి దేశానికి ఒనగూర్చిన ప్రయోజనాలు ఏమిటి అనే అంశాన్ని చూద్దాం. పండితయ్య తన మతాన్ని ప్రచారం చెయ్యటంలో వేద వాదాన్ని, కర్మ వాదాన్ని, కాల వాదాన్ని, వేదాంత మతాన్ని, సాంఖ్య వాదాన్ని, యోగ వాదాన్ని, చార్వాక వాదాన్ని, పాంచ రాత్ర వాదాన్ని, బౌద్ధ వాదాన్ని, జైన వాదాన్ని నిరసించాడు. నదైవం శంక రాత్పరమ్ అని ప్రతిష్ఠించాడు. బసవేశ్వరుడు కూడా ప్రజలను ఒక్క మతము లోనికి తేవటానికి ప్రయత్నించాడు. ఈ ప్రయత్నాల వల్ల అనైకమత్యం తొలగ టానికి అవకాశం కలిగింది. శివునికి శివభక్తునికి తేడా లేదు శివప్రీతికి, శివ భక్త ప్రీతికి ఏమి చేసినా తప్పులేదు. నీ సర్వాన్ని శివునికి, శివ భక్తులకు సమర్పించు అనేది ఈ ఇద్దరు వ్యాపింప జేసిన మతం కలిగించిన సామాజిక స్పృహకు మూలమైనది. కన్నడిగినా, కాలడిగినా, కంఠమడిగినా ఉత్తరించుకోవటమే— సంతోషంగా. ఈ విధమైన ఉద్రేకంతో తను, ధన, మాన, ప్రాణాదులు బలి చేసే ఆత్మార్పకుడు వీరుడు కాక ఏ మౌతాడు? సర్వోత్తమ ప్రీతికి ఆస్పదమైన తన ప్రాణాన్నే లక్ష్యం చేయనివాడు మరే సాహస కృత్యానికి వెనుదీస్తాడు? ఈ విధంగా నాటి శైవ మతం జాతిని వీర్యవంతం చేసింది. ఒక విధంగా దేశ కాల అవసరాలను గుర్తించి గురుగోవింద్‌సింగ్ ఏ విధంగా సిక్కులను వీర జాతిగా మలిచాడో బసవన కాలంలో శైవ మతం, శైవమత ప్రవర్తకులు అదే విధంగా జాతిని వీర్యవంతం చేశారు. ఈ శక్తి తెలుగునాట కాకతీయ సామ్రా జ్యానికి కొంతకాలం రక్ష నిచ్చింది.

ఈ ఆత్మార్పణ ప్రవృత్తికి లాంఛనాలుగానే వ్రత పూజాదిక సమయా లలో గండక త్తెరలు వేసుకోవటం, శరీరాంగాలు విచ్ఛేదనం చేసి సమర్పించటం, నారసాలతో, ఖడ్గాలతో ఛేదించుకోవటం వంటివి ఏర్పడినాయి.

ఇటువంటి మతం కాలక్రమంలో ఎందుకు వెనక బట్టింది. తిరిగి బ్రాహ్మణాధిక్యం వంటివి ఎందుకు వచ్చినాయి ? అన్న ప్రశ్నలకు సమాధానం కష్టమైనది కాదు. ఎంత త్రికరణశుద్ధితో, ఎంత విశాలహృదయంతో ఆచార్యులు ధర్మం ప్రతిష్ఠించినా, ఆ ధర్మం తెచ్చిపెట్టే వికాసాన్ని పోగొట్టుకుని, దాని విలువలు మరిచి దాంభికంగా బ్రతికేవాళ్ల, అమాయకులను నయవంచన చేసే వాళ్ల క్రమేపి అవతరించక మానరు. తమ దౌర్బల్యాలను, దురహంకారాలను

దౌర్భాగ్యాన్ని పెద్దల ప్రవచనాల ముసుగులో దాచుకోచూసే వారు ఏర్పడక మానరు.

బసవ పురాణం చదువుతుంటే బసవని కాలంలోనే ఈ లక్షణాలు ఏర్పడ లేదు గదా అన్న అనుమానం వచ్చి తీరుతుంది. బసవుడు బిజ్జలుని ఆస్థానంలో ఉద్యోగి కాగానే ఎందరో తరలి వచ్చారు.

బసవఁడు కేవల భక్తుండె యనుచు
వసిగొని లోకముల్ వర్ణన సేయ
నొక్కొక్క నియమంబు నిక్కంబు గాఁగఁ
జక్కన దర్శింపఁ జనుదెంచువారు;
చేకొన్న వ్రతములు చెల్లించు వారు;
ప్రాకట వ్రత బుద్ధిఁ బఱతెంచువారు
''ఖ్యాతుడో ! భక్తి సమేతుఁడో యరసి
చూతము గాక !" యంచును వచ్చువారు;
''బసవనిచేఁ బూజ వడయుద'' మనుచు
నెసకంబు దళుకొత్త నేతెంచువారు;
''నతని జూచినఁ జాలు నభవుని భక్తి
యతిశయం బగు''నని యరుదెంచువారు

ఈ విధంగా వచ్చినవారిలో—

''ముప్పూఁట నోగిరంబులుఁ బదార్థములుఁ
దప్పక కావళ్ల నెప్పుడుఁ బంప
వెండి వేశ్యల యిండ్ల నుండి భోగించు
మిండ జంగములు పంద్రెండు వేలనిన !"
కాని వారిలో ముగ్ధ సంగయ్య మాత్రం ఒక్కడే !

ఇక భాషా సాహిత్య విషయికంగా సోమన ప్రత్యేకత పరిశీలించవలసి ఉన్నది.

తన వృషాధిప శతకంలో సోమన తమిళ, కన్నడ, మహారాష్ట్ర, సంస్కృత భాషలలో బసవని స్తుతించిన పద్యాలతో పాటు 'జాను తెనుగు' లో కూడా ఒక స్తుతి పద్యాన్ని చేర్చాడు. అంతకు పూర్వం నన్నిచోడుడు కూడా 'జాను తెనుగు' ను పేర్కొన్నాడు. ఈ సమాసంలో 'జాను' అన్న పదం

అర్థాన్ని గూర్చి, జాను తెనుగు స్వరూపాన్ని గూర్చి పండితులు చాలా చర్చలు చేశారు.

వృషాధిప శతకంలోని ఉదాహరణను బట్టి జాను తెనుగు స్వరూపం దేశి పదాలతోకూడు కొన్నది.

బసవ పురాణంలో సోమన ఈ పదాన్ని ప్రయోగించిన సందర్భం యిది:

ఉరుతర గద్య పద్యోక్తుల కంచె
సరసమై పరగిన జాను తెనుంగు
చర్చింపగా సర్వ సామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు కోర్కిదై వార-

ఇక్కడ జాను తెనుగు భాషాపరంగా వ్యవహరించినట్లు తోచదు. గద్య పద్యోక్తులు, ద్విపద- ఇవి ఛందో విశేషాలకు సంబంధించినవి. గద్య పద్యాలన్నవి సంస్కృత లేవా మార్గ పద్ధతినిబట్టి వచ్చినవి. తదన్యమైన ద్విపద దేశిఛందము. ఈ విధంగా ఇక్కడ జాను తెనుగు దేశీయతనే పలికిస్తున్నది. వృషాధిపశతకం లోని ప్రయోగం భాషాపరంగాను, బసవ పురాణంలోని సందర్భం ఛందస్సు పరంగాను దేశీయతను సూచించగా, పండితారాధ్య చరిత్రలోని ప్రయోగం ఉభయాన్ని సూచిస్తున్నదనవచ్చు.

ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జాను తెనుగు విశేషము ప్రసన్నతకు.

ఫలితార్థంగా జాను తెనుగు అంటే అచ్చంగా దేశీయమైనది అనే భావంతోటే పాల్కురికి సోమన వ్యవహరించినట్లు కనబడుతున్నది. వృషాధిప శతకంలోని పద్యంలో తప్ప మరెక్కడా సోమన జాను తెనుగుభాషలో మాత్రమే వ్రాసినట్లు లేదు. తక్కిన విషయాలలో అంటే సంస్కృతి, సంఘ స్వరూపం,

ఆచార వ్యవహారాలు, ద్విపదవంటి ఛందస్సు మొదలైన వాటితో సోమన దేశీయతనే అనుసరించాడు.

సోమన బసవ పురాణమూ పండితారాధ్య చరిత్రా రచించటంలో ఒక ముఖ్యమైన ప్రయోజనం ఉన్నది. అది కవి యశస్సు కాదు. తన అంతరంగంలోని భక్తికి ఒక కావ్య స్వరూపం ఇచ్చుకుంటూనే ప్రజలను, విద్యావంతులైన వర్గాలను తన మార్గంపట్ల ఆకర్షించటం. బౌద్ధులు, జైనులు మొదలైనవారు తమ మతం ప్రజా సామాన్యంలోకి పోవాలంటే వివిధ సీమలలో వ్యవహారంలో ఉన్న ప్రాకృతాల మాధ్యమం ఎంతో ఆవశ్యకమైనదని గుర్తించారు. ప్రజల భాష ద్వారా మత ప్రచార కార్యక్రమాన్ని విజయవంతంగా కొనసాగించారు. సోమన ఆ అనుభవాన్ని గమనించి దేశీయమైన ఛందం ద్వారా ఒక విలక్షణమైన ఫక్కీ ద్వారా ప్రచారం చెయ్యటంకోసమే బసవ పురాణాన్ని ఆ విధంగా రచించాడు. జానపదులకు ప్రీతికరమైన కథాగేయ సాహిత్య లక్షణాలను కొన్నింటిని అందులో ఇమిడ్చినట్లు కూడా భావించవచ్చు.

భక్తుల బసవ ! యా ప్రమథుల బసవ !
ముక్తీశు బసవ ! నా ముద్దుల బసవ !
సంగన బసవ ! ప్రసాదంబు బసవ !
జంగమంబు బసవ ! సత్యంబు బసవ !

ఇత్యాది సంకీర్తనాలూ-

బసవా యనెడి భక్తిపరుల జూచినను
ఎసగు పక్షులకైన నింపదే భక్తి !
బసవా యనెడు భక్తిపరుల చేరువను
మసలు జంతువులకు నెసగదే భక్తి

వంటి పునరుక్తి బాహుళ్యమూ. ద్విపద గతులలో నిసర్గమైన రాగతాళ గతులు దీని ప్రచారానికి ఎంతగానో తోడ్పడి ఉండాలి. బసవ పురాణ పీఠికలో సోమన ద్విపద రచనను సమర్థించుకోవటానికి పెద్ద ప్రయత్నం చెయ్యలేదు. గద్య పద్యోక్తుల కంటె ద్విపదలు సర్వసామాన్యమంటూ వీటిని తెలుఁగు మాట

లనంగవలదు- వేదముల కొలదియ కాఁజూడుడు-అన్నాడు. (ఇక్కడ 'మాట' అని కాక పాట అనే పాఠాంతరం ఉండేదేమో)

కాని పండితారాధ్య చరిత్ర పఠించే పాఠకులు ఈ జన సామాన్యం కంటె భిన్నమైన ప్రవృత్తిగల వారు. అందుచేత అక్కడి పీఠికలో ద్విపదలను గూర్చి ఎంతో దూరం సమర్థించుకున్నాడు. తన కావ్య ప్రౌఢిని గూర్చి వివరంగానే చెప్పుకున్నాడు.

అయినా ద్విపదలు పండితులకు అంతగా పట్టలేదు. సోమన సమకాలం లోనే విద్యావంతులైన వర్గాలు సోమనను సోమన సాహిత్య మార్గాన్ని నిరసించి నట్లు కథలు ఉన్నాయి.

అయినా శ్రీనాథుడు, భీమసుకవి పాల్కురికి సాహిత్యాన్ని మెచ్చి ఆయన ద్విపదోక్తులే పెట్టి వాటిని పద్యకావ్యాలు చేసినట్లు పిడుపర్తి సోమనాథుడు గ్రంథస్థం చేశాడు. పిడుపర్తి సోమనకూడా గుర్వాజ్ఞ మేరకు బసవ పురాణాన్ని పద్యకృతిగా మార్చాడు.

బసవడు ఎందుకు అవతరించాడో సోమన చెప్పాడు. నారదుడు శివునకు భూలోక వృత్తాంతం తెలుపుతూ-

నరలోకమున నుమానాథ మీభక్తి
చరిత మేమియును విస్పష్టంబు గాదు-
తవిలి శివాచార తత్పరు లగుట
భవులతో, గొందఱు పలుక కున్నారు-
లోక ప్రపంచంబులోఁ గొందఱుండి
లోక బోధకు లోను గాకున్నవారు-
మఱికొంద రానంద మగ్నులై తమ్ము
మఱచి లోకములకు మఱుపడ్డవారు.

ఇటువంటి కారణాలచేత - జగజ్జనులెల్ల భక్తి సొంపునఁ జుబ్బనఁ జూఱలఁ దేలాలంటే నీవే వచ్చి లోక పావనంగా భక్తి పాలింపవలయు - అని విన్నవిం

చాడు. అప్పుడు నాకు, ద్వితీయ శంభుడన బరగిన ఈ వృషాధిపునకు తేడాలేదు. ఇతణ్ణి భూమిపై పుట్టించి లోకబోధ చేయిస్తానన్నాడు శివుడు. అతడే బసవన.

వృషాధిపునకు తోడుగా వచ్చిన పండితయ్య శివుని సంకల్పంచేత తన పాదభక్తి, నందికేశుని సర్వజ్ఞత, భృంగి సహజ నిష్ఠ, దూర్వాసముఖ్యుల శాప శక్తి, అక్షపాదాదుల వాగ్విచక్షత, ఉపమన్యుని సద్గురుత్వము, రుద్రప్రమదాధిపుల సహజ స్వకీయ ప్రసాదైకరతి, ప్రాక్తన నూతన భక్తగణాల వ్యక్త, దృష్ట ప్రత్యయారూఢ మహిమ, వీరభద్రుని శౌర్యము కలిపి ఒక మూర్తిగా రూపొందినవాడు.

ఈ ఇద్దరి చరిత్రలూ వ్రాసిన పాల్కురికి సోమన పిడుపర్తి సోమన కాలానికి భృంగి అవతారమైనాడు. కాని ఆశ్చర్యమేమంటే శివభక్తి స్పష్టం కాక పోవటానికి నారదుడు చెప్పిన కారణాలలో మొదటిది - భవులతో కొందఱు పలుకకున్నారు - అన్నదాన్ని పేర్కొన్న సోమనే ఆ లోపాన్ని పరిహరించ లేదు.

---

# ఉభయ కవి తిక్కన గారి సమన్విత సాహిత్య వ్యక్తిత్వం

—కోవెల సంపత్కుమారాచార్య

'మహాకవి ర్లోక శుభాభికాంక్షీ
మంత్రీవ గూఢార్థమతి శ్చకాస్తే—'[1]

అన్నారు విశ్వనాథ సత్యనారాయణగారు. మహాకవీ, మంత్రీ— ఉభయులూ లోక శుభాన్ని, శ్రేయస్సును ఆకాంక్షించేవారే. కాగా, గూఢార్థమతిత్వం ఉభయులకూ సమానధర్మం. వారు గూఢార్థమతులంటే, వారుదేశించిన లోకశ్రేయః ప్రయోజనం గూఢంగా ఉంటుందని తాత్పర్యం. వారా ప్రయోజనాన్ని వాచ్యం చేయరు. ఆయన కావ్యాల్లో వ్యంగ్యంగా, ఈయన కార్యాల్లో ఫలానుమేయంగా ఆ ప్రయోజనం వ్యక్తమౌతుంది. వారి కావ్య-కార్యాలను గాఢంగా అనుశీలిస్తే తప్ప ఆ ప్రయోజనావగాహన కలుగదు. కాగా, ఈ విధంగా మహాకవీ, మంత్రీ- ఉభయులూ ఒకరికొకరుగా, పర్యాయంగా ఉపమానోపమేయత్వం పరస్పరం పొందుతున్నారు. అయితే, మౌలికమైన ఈ సమాన ధర్మంతో ఉద్దిష్ట ప్రయోజన సాధనకు ఎన్నుకొన్న రంగాలు వారివారి జీవ లక్షణాన్ని అనుసరించి భేదిస్తున్నాయి. ఒకరిది కావ్యరచన. ఇంకొకరిది రాజ్యకార్యనిర్వాహణ. సామాజికంగా ఒకరు భావనారంగాన్ని ప్రభావితం చేస్తే, మరొకరు ఆచరణరంగాన్ని సువ్యవస్థితం చేస్తారు. అయితే, ఒకరు మహాకవిగా, మరొకరు మంత్రిగా, ఎవరికివారు విడివిడిగా కర్తవ్యం నిర్వహిస్తున్నారు. కాని, ఈ ఉభయుల శక్తులూ ఒకే వ్యక్తిలో సమావిష్టమై ఏకముఖంగా ఏకీభవించి సాగితే! సాగితే, ఆ సముజ్జ్వలిత మహావ్యక్తి తిక్కన గారు.

1. విశ్వనాథ సత్యనారాయణ; 'శాకుంతలముయొక్క అభిజ్ఞానత' పీఠికా పద్యాల్లోని భాగం.

ఉభయ శక్తులు ఏకత్ర సన్నివిష్టమై, సమన్వితమై ఏకముఖంగా ప్రస రించట మన్నది తిక్కనగారికి 'నిజకుల క్రమాగతం'గా— కుటుంబంలో ఆను వంశికంగా లభించిన వారసత్వం తిక్కనగారికి పితామహుడు 'మంత్రి భాస్కరుడు', 'గుంటూరి విభుడు.' ఆ విభుత్వం మంత్రిత్వపరమైంది. ఇదిట్లా ఉండగా, ఆయన 'సారకవితాభిరాముడు' (ఉత్తరామాయణం - నిర్వచనం; 1-12). తన తండ్రిని కేవలం 'మంత్రి' అని మాత్రమే పేర్కొన్న (ఉ. రా. 1-13) తిక్కనగారు తన తాతగారిని గూర్చి అంత గొప్పగా చెప్ప టమే కాకుండా ఆయనను 'తలచియైనను మన్నన మెయి' తనను 'లోకమాద రించు' నన్నారు (ఉ. రా. 1-12). నిజాని కీనాడు తిక్కనగారినిబట్టే ఆయన తాతగారిని స్మరిస్తున్నాంగాని, ఆనాడు ఉభయశక్తుల సమన్విత రూపమైన తాతగారిని గూర్చి తిక్కనగారి గౌరవ ప్రతిపత్తి అంతటిది. అయితే, ఆ తాత గారిని గూర్చి, ఆ సమన్వితి సాధించిన ఫలితాలను గూర్చి ఈనాటి కేమీ తెలియ రావటం లేదుగాని, తిక్కనగారు తననుగూర్చి చెప్పుకున్నదాన్ని మించి ఆయన ఉదాత్తసమన్విత వ్యక్తిత్వాన్ని గూర్చిన అంశాలు చాలా తెలియవస్తున్నాయి. కేతనతన 'దశకుమార చరిత్ర' మొదటి ఆశ్వాసంలో, ఆశ్వాసాద్యంత్య పద్యా ల్లోనూ తిక్కనగారిని గూర్చి అనేకాంశాలను వ్యక్తం చేసినాడు. తెలుగు సాహి త్యానికి తిక్కనగారు మహాకవి; మనుమసిద్ధి రాజ్యానికి మంత్రి. ఇవి ప్రధా నాంశాలు మహాకవిగా ఆయన 'ఉభయ కవిమిత్రుడు'. 'ఉభయ కావ్య ప్రౌఢి పాటించుశిల్పమునంబారగుడు.' ఉభయ కావ్యాల ప్రౌఢిని పాటించే శిల్పం ఏక ముఖంగా సమన్వితమైంది. ఆయన తన రచనకు ఎన్నుకున్నవి ఉభయేతి హాసాలు-రామాయణ, మహాభారతాలు. మరి, మంత్రిగా గణపతిదేవుడూ, మనుమ సిద్ధీ-ఈ ఉభయులనూసంధాన పరచిందాయన. మనుమసిద్ధికి మంత్రిగా సామాజిక ధార్మిక జీవనంలో ఒడుదొడుకులను నివారించే మార్గాన రాజ్యపాలనా వ్యవ హారం నిర్వహించిం దాయన. వ్యష్టి, సమష్టి-ఉభయ విధమైన సామాజిక జీవితాలపు 'ఆంధ్రావళి మోదముం బొరయునట్లు' ఏకముఖంగా ప్రసరింపజేసేం దుకు ప్రయత్నించిందాయన. ఈ ప్రయత్నంలోనే హరిహరనాథ తత్త్వదార్శ నికుడైనాడు. ఇట్లా గమనిస్తూపోతే-ఉభయ సమన్వయంతో ఏకత్వాన్ని సాధించే తిక్కనగారి జీవలక్షణం వ్యక్తమౌతుంది.

తిక్కనగారు ఆ ఉభయేతిహాసాలను - రామాయణ, మహా భారతాలను తమ రచనా విషయంగా ఎన్నుకోవటంలోనే ఆయన కవిత్వ, మంత్రిత్వ-ఉభయ శక్తుల సమన్వితి స్పష్టపడుతుంది. ఆయనకన్న చాలా పూర్వమే అత్యంత వైభవోపేతమూ, సమృద్ధమూ ఐన సంస్కృత సాహిత్యంలో 'ఇతిహాస' రచనా కాలం గడిచిపోయింది. 'కావ్య' రచనా కాలం సహస్ర ముఖాలుగా సాగుతున్నది. సాహిత్య వివేచన గూడా 'కావ్య ప్రమాణం'గా సమగ్రతను సాధించి విస్తరిస్తున్నది. అదట్లా ఉండగా, తెలుగులోనూ ఆయనకన్న పూర్వమే 'కావ్య' ప్రక్రియకు నన్నెచోడుడు శ్రీకారం చుట్టినాడు. ఈ విధంగా పరిశీలిస్తే, తిక్కనగారు నిజానికి, అచ్చంగా 'కావ్య' ప్రక్రియను చేపట్టి, తదనుగుణంగా రచన సాగించి ఉండవలసింది. కాని, పూర్వాపర సమన్వయంతో పురోగమన శీలమైన ఆలోచనా విధానం ఆయనది. అది దీర్ఘకాలిక ప్రయోజనాన్ని ఆకాంక్షించింది. అందుకే, ఆయన కేవల 'కావ్య' ప్రక్రియనుగాక, 'ఉభయ కావ్య' ప్రక్రియను స్వీకరించినారు.

'ఉభయ కావ్య' ప్రక్రియ అంటే, ఉభయ విధాలైన కవికర్మ (రచనా) రూపాలకు ఏకముఖీనత - ఏకీభావం కలిగించే ఒక విశిష్ట కావ్య ప్రక్రియ. రాజశేఖరుడు - తిక్కనగారికన్నా చాలా పూర్వుడు, సాహిత్య విమర్శకుడు - కవులందరినీ వారి వారి రచనా స్వరూప స్వభావాలను బట్టి మూడు వర్గాలుగా - శాస్త్రకవి, కావ్యకవి, ఉభయకవి అని నిరూపించినాడు. శాస్త్ర, కావ్య-ఉభయ స్వరూప స్వభావాల సమన్వయంతో ఏకముఖంగా రచన నిర్వహించే సామర్థ్యం కలవాడు 'ఉభయ కవి.' కేవల శాస్త్ర కావ్య కవులకన్నా విశిష్టుడు [1] తిక్కనగారు 'ఉభయ కవి మిత్రుడు' కావటమంటే, ఈ విధంగా. అంతేకాని, సంస్కృత-తెలుగు (మార్గ-దేశి) దృశ్య-శ్రవ్య ... ఈ మొదలయిన కవులుభయులకూ మిత్రుడనికాదు. ఇవన్నీ ఆయనలోని అనుషంగికాంశాలు కావచ్చు. కాని, ప్రధానంగా ఆయన రాజశేఖర నిరూపితుడైన 'ఉభయ కవికి' లక్ష్యమూర్తి. అట్లాంటి ఉభయ కవి శాస్త్ర-కావ్య విధానాలను అన్యూనాతిరిక్తంగా,

---

1. 'ప్రతిభావ్యుత్పత్తిమాంశ్చ కవి రిత్యుచ్యతే. సచత్రిధా-శాస్త్రకవిః, కావ్యకవిః, ఉభయకవిశ్చ ... ఉభయ కవిస్తూభయోరపి గరీయాన్ యదుభయత్ర పరం ప్రవీణః స్యాత్'-కావ్యమీమాంస, అధ్యా 6.

సమతౌల్యంతో—కుంతకుడు 'సాహిత్య' స్వరూపాన్ని నిరూపించిన రీతిలో[1]-సమన్వితం చేసి సమర్థంగా నిర్వహించింది—'ఉభయకావ్య' ప్రక్రియ.

ఈ విధమైన 'ఉభయకావ్య' ప్రక్రియను తెలుగులో, నిజానికి, ఆరంభించింది నన్నయగారు. ఆయన స్పష్టంగా అట్లా అని చెప్పలేదు గాని, పరమార్థతః, మహాభారత రచన ఆరంభించటం ద్వారా తెలుగులోకి 'ఉభయకావ్య' ప్రక్రియను అవతరింప చేసిందాయన. 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని—' (భారతం. ఆది. 1-32) అంటూ మహాభారత స్వరూపాన్ని వివరించే ఆయన పద్యంలో ప్రస్తావింపబడిన సప్తాంశాలను వర్గీకరిస్తే, అవి రెండు వర్గాలుగా యేర్పడుతయి. ధర్మ, వేదాంత, నీతి శాస్త్రాంశాలు మొదటివర్గం. మహాకావ్య, లక్ష్యసంగ్రహ, ఇతిహాస, పురాణాంశాలు రెండో వర్గం. మొదటిది భారతం యొక్క శాస్త్రత్వాన్నీ, రెండోది కావ్యత్వాన్నీ స్ఫురింపజేస్తాయి. ఈ రెండు లక్షణాల స్వభావాల సమన్విత రూపమైన మహాభారతాన్ని 'విశ్వజనీనమైపరగుచుండ' వ్యాస మహర్షి నిబంధించినాడు. మహాభారతం యొక్క విశ్వజనీనత్వం ఆ సమన్వితిలో ఉన్నది. నన్నయగారు కావ్యపరంగా చెప్పిన ఈ అంశాన్ని తిక్కనగారు కవిపరంగా 'విద్వత్సంస్తవనీయ-' (విరాట. 1-3) పద్యం ద్వారా వ్యక్తీకరించినారు. ఆయన 'ఉభయకవి' గదా! వ్యాస మహర్షిని గూర్చిన— 'విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు' అన్న విశేషణం ఆయనలోని 'కావ్యకవి' లక్షణాన్నీ, 'విజ్ఞాన సంపద్విఖ్యాతుడు' అన్నది 'శాస్త్రకవి' లక్షణాన్నీ వ్యక్తం చేయగా, 'సంయమి ప్రకర సంభావ్యానుభావుండు' అన్నది ఆ ఉభయ లక్షణాలనూ సమన్వితంగా యేకముఖీకరించే స్వభావాన్ని వ్యక్తం చేస్తుంది. ఆయన 'అనుభావం' ఈ విధమైంది కాబట్టే, సంయమి ప్రకర సంభావ్యమైంది. సంయములంటే, ఒక ఉద్దిష్ట ప్రయోజనం సాధించేందుకు అన్నింటిని సమగ్రంగా (ని)యమించే సామర్థ్యం సంపాదించినవారు. ఈ విధంగా ఉభయకవి ఐన వ్యాస మహర్షి ఆ విధమైన ఉభయ కావ్యంగా మహాభారతాన్ని 'జయం'గా రచించటంలోని 'విశ్వజనీన'త్వాన్ని నన్నయగారు, 'లోకహిత నిష్ఠ'ను తిక్కన

1. కుంతకుడు తన 'వక్రోక్తి జీవితం'లో అన్యూనాతిరిక్తత్వ మనోహారిణి ఐన శబ్దార్థాల విచిత్ర విన్యాస భంగిమయే 'సాహిత్య'మని నిరూపించినాడు. చూ:వ జీ, ఉన్మేషం. 1. శ్లో 17. వృత్తి.

గారూ భావించినారు. ఈ భావనలో నన్నయగారిది కావ్యపరమైన చూపైతే, తిక్కనగారిది కవిపరమైన చూపు. కాగా, తన తాతగారి నుంచి కవిత్వ-మంత్రిత్వోభయ సమన్వితిని వారసత్వంగా పొందిన తిక్కనగారు, సాహిత్య కుటుంబక్రమాగతంగా నన్నయగారి నుంచి ఉభయకావ్య ప్రక్రియను వారసత్వంగా స్వీకరించి సమగ్రంగా భారత రచన నిర్వహించినారు.

అసలుకు, రామాయణ-మహాభారతాలను ఉభయకావ్య ప్రక్రియగా తిక్కనగారు స్వీకరించటానికి ప్రేరకమైన అంశాలను గమనించటం అవసరం. ఆ రెంటిని యే భక్త్యుద్రేకంతోనో, మతావేశంతోనో రచించటానికి ఆయన ఉద్యమించలేదు. ఆయన ఆవేశం 'భవ్యకవిత'కు సంబంధించింది[1]. ఆయన-'సాత్యవతేయ సంస్మృతి శ్రీ విభవాస్పదంబయిన చిత్తముతోడ, మహాకవిత్వ దీక్షావిధి' (విరా. 1-30) నొందినవాడు. అందువల్ల భక్తి, మతోద్రేకావేశాలు ఆయనకు లేవు. పైగా రామాయణ, మహాభారతాలు భక్తి మత ప్రబోధక, లేదా మత భక్తిమయ గ్రంథాలు కూడా కావు. శైవ మతానికి ప్రతిగా వైష్ణవ మతాన్ని నిలువరించేందుకు తెలుగులో రామాయణ రచన జరిగిందనే ఒక ఊహ వ్యాప్తిలో ఉంది[2]. శ్రీరామచంద్రుడు విష్ణ్వవతారమనే అంశం అందులో నిక్షిప్తమై ఉండటం ఈ ఊహకు ఒక ప్రధాన హేతువు కావచ్చు. అయితే భారతంలోనూ శ్రీకృష్ణుడు విష్ణ్వవతారమన్న తాత్పర్యమూ నిక్షిప్తమై ఉన్నది. కాని భారత విషయంలో వైష్ణవ ప్రవాదం లేదు. కాగా, ఈ ఉభయేతిహాసాల విషయంలోనూ 'మత భక్తి' పరమైన ఊహలకు ఆధారం లేదు, ఆస్కారమూ లేదు. పైగా, తిక్కనగారు 'ఎత్తటినైనను ధీరోదాత్త నృపోత్తముడు రామ ధరణీ పతిసద్ । వృత్తము సంభావ్యమగుట । నుత్తర రామాయణోక్తియుక్తుడ నైతిన్' (ఉ. రా. 1-11) అన్నారు. నృపోత్తమత్వ, ధరణీ పతిత్వాలు ఉ.రా.

1. ఛందఃకర్తయైన అనంతామాత్యుని తాతగారికి తిక్కనగారు 'భవ్యభారతి' అనే బిరుదం ప్రసాదించినారు. (భోజరాజీయం. 1-24) ఆయనకు 'భవ్య' అంత ప్రియమైనది.

2. చూ. 'ఆంధ్ర మహాభారతము: విరాట పర్వము' (ఆం. ప్ర. సాహిత్య అకాడమి ప్రచురణ) పీఠిక. (పు. xxxxiv)

రచనలో తిక్కనగారికి ప్రధానమైనవి. 'వేదములకు నఖిలస్మృతి। వాదములకు, బహుపురాణ వర్గంబులకున్। వాదైన చోటులను దా। మూదల ధర్మార్థకామమోక్ష స్థితికిన్' (విరా 1-4) అనటం ద్వారా 'మూదల' తనం ఆ భారత రచనలో ప్రధానమైంది. కాగా, ఆ ఉభయేతిహాసాల రచనావిషయంలో తిక్కనగారి తాత్పర్యాన్ని ఈ దారిలో భావించవలసి ఉంటుంది.

ఇదిట్లా ఉండగా, ఇతిహాసాలకూ, కేవల కావ్యాలకూ ఉన్న మౌలిక భేదం ప్రధానంగా గమనించవలసిందొకటున్నది. ఇతిహాసాలకు అత్యంత విశాలమూ, అనంతవిధ మనః ప్రవృత్తిమయమైన సమాజం వస్తువు. సామాజిక వైయక్తిక ప్రవృత్తుల్లోని సాధర్మ్య-వైధర్మ్యాలూ, ఆకర్షణ- సంఘర్షణలూ. రకరకాలైన వాటి పరిణామ ప్రమాణ రీతులూ. ప్రభావక ధోరణులూ; వాటి దృష్ట్యా సమగ్ర సామాజిక శ్రేయస్సంపాదకంగా వాంఛించదగిన పరిస్థితులూ వ్యవస్థలూ, వాటికి సంబంధించిన సూచనలూ, వివరణలూ, జ్ఞాపనలూ-ఈ మొదలైన అనేకాంశాలను నిస్సంకోచంగా, అసంకుచితంగా, వాస్తవికంగా ఇతిహాసాలు చిత్రిస్తయి. వివిధ మనఃప్రవృత్తుల యథావృత్తుల చిత్రణల ద్వారా వాంఛనీయతావాంఛనీయతలను సూచిస్తూ, సామాజిక సువ్యవస్థ యొక్క సమగ్రతను ఉద్బోధించేవి ఇతిహాసాలు. కాగా, ఏకద్వికమనః ప్రవృత్తుల చిత్రణ ద్వారా, లోకసిద్ధమైన ఔచిత్యం ప్రాతిపదికగా లక్ష్య నిరూపణతో వ్యవస్థలోని ఏక దేశాన్ని రక్షించేందుకు ప్రయత్నించేవి కావ్యాలు. ఈ వస్తుపరమైన ప్రధాన భేదం కారణంగా ఇతిహాసాల విశాల పరిణాహంగానీ, అనంతముఖ వైవిధ్యంకానీ అపరిచ్ఛిన్నత్వం కానీ కావ్యాలకుండే అవకాశం లేదు. ఈ విధమైన మౌలిక భేదాన్ని గమనిస్తే, అసలు, ఒక ఇతిహాసాన్ని రచించాల్ననే సంకల్పమే కవిపరంగా ఎంతో ఉదాత్తమైనదే కాక, అత్యంత సాహసోపేతమైనది కూడా. పైగా, అంతకు పూర్వమే ఉన్న ఇతిహాసాన్ని మరొక భాషలోనికి తీసుకురావటం మరింత సాహసోపేతమైనది కేవలం శుకానువాదంగా కాక, ఆత్మప్రత్యయావహితంగా, సమకాలీన సామాజికోపయోగిలా లక్షణమహితంగా రచించగల్గట మనేది ఒక అనంత ప్రతిభావంతుడైన మహాకవికి, ఆయన 'మహాకవిత్వదీక్ష'కు మాత్రమే చెల్లుతుంది. దానికి కారణం ఆ సంకల్పం వెనుక జీవుని వేదన నిత్య జాగృతంగా ప్రజ్వలిస్తూ ఉండటమే సమాజాన్ని సమగ్రంగా సమావరించుకో

గల శ్రేయో లక్షణం గాఢమైన సంకల్పం కల మహాకవి యొక్క వేదనకు, శక్తికి- అంటే, అనంత ముఖంగా విజృంభించగ గాఢమైన ప్రతిభకు సమగ్రా విష్కారం కలుగాల్నంటే, ఇతిహాస రచన ఒక్కటే సముచితమైంది. అందుకనే అంతటి ఆర్తి, వేదన గల మహాకవులు ఏ కాలంలోనైనా, ఏ దేశంలో నైనా ఇతిహాసాలనే స్వీకరించి ఉభయ కావ్యంగా నిర్వహిస్తారు. కాగా, తాను ఎన్ను కున్న రచనకు మూలంగా ఒక రచన అంతకు ముందే ఉన్నదా, లేదా అన్నది ప్రధానం కాదు. దాని ద్వారా తాను సాధించదలచుకొన్న ప్రయోజనం ప్రధానం. దీని సాధనకు అనువైన మూలం ఉండి ఉంటే, దాన్ని స్వీకరించి ఆత్మీయతా-ప్రతిభా సమాకలనంతో మరింత ప్రభావోత్పాదకంగా, సామాజిక హితంగా ఆ మహాకవి వెలయిస్తాడు. ప్రయోజనానికి సంబంధించిన ఈ సంకల్పం ఇంతటి మహత్తరమైంది. కాబట్టే, నన్నయగారిలో కలిగి, ఇతరేతర వివిధ కారణాల వల్ల తత్కాలం సహకరించనందు వల్ల సమగ్రం కాకున్నా, దాని అంతస్సత్వం వల్ల అన్నేండ్లకు తిక్కనగారిలో జాగృతమైన సమగ్రమూ, సఫలమూ అయింది. కాగా, తిక్కనగారు ఈ ఇతిహాసాలను స్వీకరించటంలోని ఆంతర్యం అవగాహన అయ్యేందుకు ఆయన జీవించి ఉండిన కాలాన్నీ, తత్కాలీన రాజకీయ, సామాజిక, సాంస్కృతిక వాతావరణాన్నీ, పరిస్థితులనూ, స్థూలంగానైనా గమనించటం అవసరం.

## 2

శ్రీరాస్తాం మనుమక్షితీశ్వర భుజాస్తంభే జగన్మంగళ
ప్రాసాదస్థిరభారభాజిదధతీ సాసాలభంజీశ్రియమ్
శుండాలోత్తమగండభిత్తిషు మదవ్యాసంగవశ్యాత్మనాం
యాముత్తేజయతే తరాం మధులిహామానందసాంద్రాస్థితిః.

ఈ పద్యమీనాడు ఉ.రా.లో మొట్టమొదటి పద్యంగా చేర్చబడి కన్పిస్తున్నా, కావ్యారంభ సందర్భాన్ని బట్టిచూస్తే, దాని కక్కడ ప్రసక్తి లేదు. నిజానికది మనుమసిద్ధి పట్టాభిషేకవేళ తిక్కనగారి ఆశీస్సు రూపొందిన పద్యం కావచ్చు.[1] ఆ పద్యం నిండా అలుముకొని అనుభవానికి వచ్చే ఆనందానికి

1. ఈ అంశాన్ని నిరూపించింది పాటిబండ మాధవశర్మగారు. (చూ: ఆం.ప్ర.సా. అకాడమీ వారు ప్రచురించిన ని. ఉ. రా. పీఠిక. పు. vi)

మూలమైన మనుమసిద్ధి పట్టాభిషేకం, అటూ ఇటూ కలిసి ఏ పదిహేను ఇరవై ఏండ్లో తప్ప తిక్కనగారి జీవితంతో సమావృతమైన పదమూడో శతాబ్దం మధ్య కాలాన – 1249 ప్రాంతాన జరిగింది. మనుమసిద్ధి రాజు కావటం తిక్కన గారు కాకతీయ సామ్రాజ్య నిర్మాత ఐన గణపతిదేవ చక్రవర్తితో కలిసి సాగించిన మంత్రాంగ ఫలం. దీనికోసం తిక్కనగారు ఓరుగంటికి మంత్ర యాత్ర చేసినారు.

తిక్కనగారి ఈ యాత్రనూ, దాని సాఫల్యాన్నీ ఏకామ్రనాథుని 'ప్రతాప రుద్ర చరిత్ర', కాసె సర్వప్ప 'సిద్ధేశ్వర చరిత్ర', కూచిమంచి జగ్గన 'సోమ దేవరాజీయం' విపులంగా వర్ణించినయి. కాని వీటిలో అసంగతాంశాలెన్నో ఉన్నాయి. ప్రస్తుతానికి సంబంధించి కొన్ని – ఓరుగంటికి వెళ్ళిన తిక్కన గారు గణపతిదేవునికి ద్వైతం, అద్వైతం బోధిస్తూ; అనేక ధర్మాలూ, భారత వీరుల యుద్ధాలూ వివరిస్తూ, అక్కడ 'మన్ననమెయి కొన్ని దినంబులు' ఉన్నట్టూ, గణపతిదేవుడు పిలిపించగా వాదానికి వచ్చిన జైన-బౌద్ధ పండితులతో వాదించి, వారి నోడించి తిక్కనగారు వారి వసతులను కూల్పించి, వాళ్ళను 'దోమలవలె' పారదోలి నరికించి వేసినట్టూ, ఆ నాటికే ఆయన 'సోమయాజి' ఐనట్టూ ఆ గ్రంథాలావేశ పూరితంగా వర్ణించినయి. అయితే, నిజానికి, ఆనాటి కేనాడో బౌద్ధం నామమాత్రావశిష్టమైంది. పైగా ఓరుగల్లు ప్రాంతంలో ఏనాడూ బౌద్ధానికి వ్యాప్తి ఉన్నట్టు లేదు ఉన్నంతలో ఉన్నది జైనం మాత్రమే. మరొకటి. తిక్కనగారు జైన-బౌద్ధులతో వాదించి, జయించి, వారిని ధ్వంసం చేయించినారనటానికి చారిత్రికంగా ఏ విధమైన ఆధారలేశమూ కన్పించదు తిక్కనగారిని గూర్చి సాభినివేశంగా అనేకాంశాలను వెలుగులోకి తెచ్చిన కేతన, తన సమకాలికుడైన తిక్కనగారికి అంకితమిచ్చిన ద.కు చ.లో తిక్కనగారు జైన-బౌద్ధాలను నిర్మూలించినట్టుగానీ, కనీసం వాదంలో జయించినట్టుగానీ, అసలు జైన-బౌద్ధాలను గూర్చి ఏ ఒక్క మాట మాత్రమైనా చెప్పలేదు.[1] పైగా

1. కేతనకు జైన (బౌద్ధ)మంటే గౌరవం ఏమీ లేదని – 'మిండాట మాఘి పొలిసిన, మిండలకును జైనవృత్తిమేలని మదిలో, నొండు తలపు దిగి జినముని, మండలి కృపవడసియొక్క మాంత్రికు చేతన్' (ద కు చ., ౬-౬౪) అన్న పద్యం స్పష్టపరుస్తుంది.

వాటిలో ఏ ఒక్కటైనా నిజంగా జరిగి ఉంటే, తిక్కనగారి ఒక 'గొప్ప'గా కేతన తప్పక ప్రస్తావించి ఉండేవాడు. ద.కు.చ. తిక్కనగారికి అంకితమయ్యే నాటికే మనుమసిద్ధి రాజైనాడు. తిక్కనగారేమో మంత్రి. ఇంకొకటి. ద.కు.చ. తరువాతి తిక్కనగారి రచన ఐన ఉ.రా. నాటికి కూడా తిక్కనగారు 'సోమయాజి' కారు. తిక్కనగారి అనంతరం దాదాపు 2-5 శతాబ్దాల వేరు వేరు కాలాల్లో రచింపబడ్డ ప్ర.రు చ. మొదలైన గ్రంథాల్లో, తిక్కనగారి యాత్రా విషయం యథార్థమే ఐనా, కాల వ్యవధానం అధికం కావటాన, అనేకమైన ఊహాపోహలు కారణంగా అసంగతాంశాలనేకం చోటు చేసుకుని ఉంటయి. పైగా, తిక్కనగారి వాద-పాండిత్యాలకే మోహించి గణపతి దేవుడు అంతటి సేనా సహాయం చేసినాడనుకోవటం కేవలం అమాయకత్వమే అవుతుంది.

నిజానికి, గణపతిదేవుడు తిక్కనగారి మంత్రాంగ ఫలంగా మనుమసిద్ధి కోసం సేనా సహాయం చేయటం కాకతీయ సామ్రాజ్య నిర్మాణ-పటిష్ఠతలకు ఆయన చేసిన చేస్తున్న ప్రయత్నంలోని ఒక భాగం. కాకతీయ సామ్రాజ్యానికి దక్షిణంవైపు అంచుల్లో ఉన్నది నెల్లూరి మండలం. తిక్కనగారు ఓరుగంటికి వెళ్ళేనాటికి పూర్వమే గణపతిదేవుడు సామ్రాజ్యాన్ని ఆ వైపు చాలా దూరం విస్తరింపజేసినాడు. ఆ విస్తృతీకరణంలో ఆయన కావైపు మిక్కిలిగా తోడ్పడింది మనుమసిద్ధి తండ్రి తిక్కరాజు. ఆయన తెలుగు చోళుడు. తెలుగు చోళులతో గణపతిదేవుడు యుద్ధం చేయలేదు, స్నేహం చేసినాడు. సామ్రాజ్య నిర్మాణ-పటిష్ఠతలకు యుద్ధాలొక్కటే సాధనమనుకోలేదాయన. స్నేహ-బాంధవ్యాలు గూడా పెంపొందించినాడు. కృష్ణాముఖద్వారంలో ప్రబలులైన 'అయ్య' వంశీయుల్లో ముఖ్యుడైన జాయపను మైత్రీమయంగా ఒప్పించి సామ్రాజ్య గజసేనకు అధ్యక్షుడిని చేయటం, తన సోదరి కుందాంబికను 'నతవాడి' రుద్రరాజుకిచ్చి పెండ్లి చేయటం వంటివి ఉదాహరణలు.

ఇంతకూ, ఇంతటి సామ్రాజ్య నిర్మాణ ప్రయత్నమెందుకు? కేవలం రాజ్య విస్తరణ కాంక్ష మాత్రమేనా? కాదు. ఏనాటి సాతవాహనులో! వారి తరువాత ముక్కలు చెక్కలుగా విరిగి, విచ్చుకుపోయి పరస్పరం సంఘర్షించుకుంటూ, అనైక్యంవలని ప్రమాదాన్ని ఏ మాత్రమూ గుర్తించని తెలుగు వారు నివసించే ప్రాంతాలన్నింటినీ ఏకం చేసి, ఒకే విశాలాంధ్ర సామ్రాజ్యంగా

రూపొందించేందుకు ఎందరైనా ప్రయత్నాలు చేసి ఉండవచ్చు ఆ ప్రయత్నాల వెనుక తమ రాజ్యాలను విస్తరించుకోవాలన్నే తాత్పర్యమే తప్ప, తప్పనిసరిగా సంఘటితం కావలసిరావటానికి బయటి వత్తిడి వాళ్లకు లేకపోవటమే ఆ ప్రయత్నవైఫల్యాలకు కారణం కావచ్చు. చాలా ఏండ్లు-శతాబ్దాలదాకా ఆ విధమైన తెలుగు సామ్రాజ్యం రూపొందలేదు. కాగా, ఆ వత్తిడి వచ్చింది పదమూడో శతాబ్దంలో. దాన్ని గుర్తించింది గణపతిదేవుడు. 1199లో గణపతి దేవుడు రాజ్యానికి వచ్చినాడు. దాదాపుగా అదే కాలాన ఉత్తర భారతప్రాంతంలో ఢిల్లీ, కాశీ, కన్నోజ్, గ్వాలియర్ మొదలైన అసంఘటిత రాజ్యాలను విదేశీయుడైన మహమ్మద్ ఘోరీ ఘోరంగా జయిస్తున్నాడు. ఎప్పటికప్పుడా విషయాలు తెలుస్తూనే ఉన్నాయి. ఆ ప్రమాదం దక్షిణ భారత ప్రాంతానికి కలుగదనే నిశ్చయం ఏమీ లేదు. ఇదే ఏకీకృత విశాలాంధ్ర సామ్రాజ్య నిర్మాణం కోసం వత్తిడిని తీవ్రతరం చేసింది. ఆ ప్రమాదం ముంచుకొస్తే, మొదటి దెబ్బ తెలుగు దేశం మీదనే. మాండలిక రాజ్యాలుగా దేశం విక్షిప్తమై ఉంటే ఆ ధాటినీ ప్రమాదాన్ని తిప్పికొట్టి నివారించటం అసాధ్యం. అందుకని మొత్తం తెలుగు ప్రాంతాలను సంఘటిత పరచి ఒకే ప్రాంతంగా, సామ్రాజ్యంగా రూపొందించటం తత్‌క్షణ కర్తవ్యంగా గణపతి దేవుడు భావించినాడు. ఈ కర్తవ్య నిర్వహణం కోసం అవసరమైన అన్ని విధాలనూ ఉపయోగించినాడు. కాగా, మనుమసిద్ధికి తిక్కనగారి మంత్రాంగాన్ననుసరించి ఆయన చేసిన సేనా సహాయం ఈ విధాల్లో ఒకటి.

మనుమసిద్ధి తండ్రి తన ఉదారాశయానికి ఆ వైపున ఎంతో తోడ్పడి నాడు కదా! ఇప్పుడా తండ్రి అనంతరం, నాటికి కడప మండలంలో రాజ ప్రతినిధిగా ఉన్న మనుమసిద్ధికి నెల్లూరి మండలం దక్కకుండా పెత్తల్లి సోదరుడూ, బావఐన తిక్క రాజూ, దూరపు దాయాది విజయాదిత్యుడూ, మరి కొందరూ కలిసి పాండ్యుల సాయంతో దురాక్రమించుకున్నారు. మరి, ఎవరు రాజైతేనేం? మనుమసిద్ధే రాజు కాక తప్పని అవసర మేమిటి? ఏమిటంటే, అనద్యతన భవిష్యత్తులో పాండ్యులు వీరి సాయంతో తెలుగు సామ్రాజ్యాన్ని అంచుల్లో కత్తిరించబోతున్నారు. అందుకని, సామ్రాజ్య రక్షా దృష్ట్యా తిక్క రాజు కొడుకు కీలకమండలమైన నెల్లూరుకు రాజు కావటం తప్పనిసరి. తిక్క

రాజు నాడే రాజకీయ వ్యవహారాల్లో సామర్థ్యం ప్రదర్శిస్తున్న తిక్కనగారు గణపతి దేవుని మనసు కెక్కినారు. అందుకే ఆయన మంత్రాంగం విశ్వసనీయ మైంది. ఫలించింది. మనుమసిద్ధి రాజైనాడు. ఆ తరువాత తిక్కనగారు మంత్రిగా గల మనుమసిద్ధి జటావర్మ సుందర పాండ్యాదులతో (ఉ.రా. 1-30,43)[1] చేసిన యుద్ధం, వారిని తరిమిన రీతీ గణపతిదేవ-తిక్కనల మంత్రాంగంలోని ఔచిత్యాన్ని నిర్ధారిస్తుంది. సామ్రాజ్య నిర్మాణ-ప్రతిష్ఠతల విషయంలో అన్వయించి తిక్కనగారు నిర్వహించిన పాత్ర ఈ విధమైంది.

రాజకీయ వ్యవహారాలిట్లా ఉండగా, తెలుగు వారికి సంబంధించినంత వరకు విడిపోయిన వాటి పునరేకీకరణం ప్రధాన లక్షణమైన పదమూడో శతాబ్దంలో జరిగిన యుద్ధాలు దేశంలో ప్రజల శాంతి భద్రతలకూ, సంక్షేమానికీ ఆటంకమేమీ కాలేదు. దీని కానాటి నిర్మాణ కార్యక్రమాలే సాక్ష్యాలు. చాలా ప్రాంతాల్లో అడవుల్ని కొట్టి భూముల్ని సేద్యయోగ్యం చేయటం, వీటి నీటి వనరులకోసం పాకాల చెరువు, కాట సముద్రం మొదలైన సముద్రాలంతటి చెరువులు తవ్వించటం, వివిధ వృత్తుల వారికి వసతులు కల్పించి కొత్త కొత్త గ్రామాలను పొందించటం; సేద్యపు భూముల్ని రైతుల పరం చేయటం మొదలైనవి విరివిగా కేంద్రంతో పాటు, పరిమితాధికారాలున్న చిన్న చిన్న పాలకులూ, సామంతుల పూనికతో జరిగినయి. గ్రామాలు మూడు రకాలుగా వర్గీకరింపబడినయి. సాముదాయిక, గుత్త, వారపట్టు గ్రామాలు. మొదటి రకం గ్రామాల్లో భూమి ఏ ఒక్కరిదీ కాదు. అందరిది. సాముదాయిక సేద్య ఫలాన్ని అందరు రైతులూ అనువర్తించి పంచుకోవటం వీటి లక్షణం. రెండో రకంలో భూములనూ, రైతులనూ వర్గాలుగా విభజించి గుత్తాగా ఇవ్వటం. మూడో రకంలో ఎవరి భూమిని వారు దున్ని పండించుకోవటం, అనుభవించటం. అన్ని విధాల్లోనూ భూముల పంటలను బట్టి ఆరు నుండి పన్నెండో భాగంవరకు పన్నులు. విద్యా దానాది కార్యక్రమాలను నిర్వహించే వారికీయబడినవి పన్నులు లేని అగ్రహారాలు. తత్పూర్వం

---

1. 'ద్రవిడోర్వీపతి దున్మి-' (ఉ.రా. 1-39) ఈ ద్రవిడోర్వీపతి ఆ పాండ్యుడే నంటారు. (చూ. ఆరుద్ర, సమగ్రాంధ్ర సాహిత్యం II. పు. 118)

నుంచే సువ్యవస్థితమై సాగివచ్చే గ్రామీణ పంచాయతీ వ్యవస్థ, రాజ్య న్యాయ వ్యవస్థ ఆ కాలంలోనూ పటిష్ఠంగా ఉండింది. శిల్పాదికళల వికాస విన్యాసాలకు ఆనాటి వివిధ నిర్మాణాలే సాక్ష్యాలు. కాగా, ఇవన్నీ ఆనాటి రాజకీయార్థిక ప్రశాంత సమృద్ధిని స్పష్టపరిచే అంశాలు.

కాని, వ్యాపించిన ఈ విధమైన వాతావరణంలో కూడ దేశం మొత్తాన్నీ తీవ్రమైన కలవరం పాలు చేసిన అంశం 'మత' పరమైన వైషమ్యం. అంతర్బహిర్గత వివిధ కారణాలవల్ల సర్వత్రా జైన-బౌద్ధమతాలు క్షీణించి పోయిన దశలో ఆనాటికి గత శతాబ్దంతోనే కన్నడదేశంలోంచి శైవం వీరశైవంగా తెలుగుదేశంలోకి ప్రవహించింది. దీన్ని కన్నడ దేశంలో బసవన విజృంభింప జేస్తే, తెలుగు దేశంలో చేసింది పాల్కురికి సోమన. అప్పటికే పండిత త్రయమూ, నన్నెచోడుడూ దీనికి అనుకూల వాతావరణం కల్పించినారు. వీరిలో ఎక్కువగా చేసింది మల్లికార్జున పండితారాధ్యులు. అయితే, వీరిలో ఎవరు కూడా వైదిక భూమికను పరిహరించలేదు[1] ఆ పని చేసింది సోమన. ఒక విధంగా పరిశీలిస్తే, పూర్వం జైన బౌద్ధాలు చేసిందానికీ, అప్పుడు బసవన-సోమనల వీరశైవం చేసిందానికీ పెద్దగా తేడా ఏమీ లేదు. వైదిక వ్యవస్థను దెబ్బతీయటానికి పూనుకోవటంలో అన్నీ ఒక్కటే. అయితే, వీటిలోని ప్రధానమైన లోపం ఒక్కటే. అది. ఏదో ఒక నిశ్చిత ప్రాతిపదికమీద సాగుతున్న సామాజిక వ్యవస్థను దెబ్బతీయటమే తప్ప, ప్రత్యామ్నాయంగా మరొక పటిష్ఠమైన సామాజిక వ్యవస్థను నెలకొల్పలేకపోవటమే కాదుగదా. కనీసం సూచించనైనా లేకపోవటం. సామాజికమైన వ్యవస్థ వేరు. వ్యక్తిపరమైన మతం వేరు. వర్ణవిభేదం సమాజం నుంచి తొలగించటమే ప్రధానమున్నట్టుగా భాసించే వీటి ప్రయత్నంలో అది తొలగిపోలేదు సరిగదా, వైయక్తికంగా సీమితమై ఉండవలసిన మతం, సహన దయాశాంత్యాదుల కాలవాలంగా ఉండవలసిన మతం, మతపరమైన విద్వేషాలను రెచ్చగొట్టింది. నిజానికి ఈ వైయక్తిత 'మత' - సామాజిక

---

9. 'భక్తి మీది వలపు బ్రాహ్మ్యంబుతో పొత్తు వదులలేను నేను బసవలింగ' అన్న మల్లికార్జున పండితారాధ్యుల పద్యభాగం ఈ సందర్భంగా స్మరించదగింది.

వ్యవస్థలు రెంటింటికీ వైరుధ్యం సంఘర్షణ కలుగకుండా సమన్వయం సాధించ గలిగితేనే సమాజంలో శాంతి, లేకపోతే అశాంతి, అవ్యవస్థ. ఈ విధమైన అశాంతిని అవ్యవస్థను పూర్వం జైన - బౌద్ధమతాలు సృష్టిస్తే, ఆ కాలానికి వీర శైవం సృష్టించింది. ఆ నాటికింకా వైష్ణవం తెలుగు దేశంలో అంతగా బలపడ లేదు. నెమ్మదిగా సాగివస్తున్నదే తప్ప వీరశైవాన్ని ప్రతిఘటించగల 'వీర' త్వాన్ని సంపాదించుకోలేదు. కాగా తననాటికి కనబడిన/ వినబడిన అన్ని మతాలనూ/ ఉపాసనారీతులనూ వీరశైవం ప్రాతిపదికగా సోమన క్రూరతరంగా నిందించినాడు.[1] సామాన్యంగా ఒక మత స్థాపకుడు/ ప్రచారకుడు ఇతర మతాలను, వాదాలను ఖండిస్తుంటాడు— ఆనాటికి వాటన్నిటికి ఉనికి/ ప్రాబల్యం ఉన్నా, లేకున్నా ఫరవాలేదు. ఆ ధోరణిలోనే సోమన సాగినా నింద, వాగ్బాణ హింస 'అతి' తీవ్రదశకు చేరుకుంది. అన్నింటినీ, చివరకు కుటుంబ వ్యవస్థను 'మత' భేదం దృష్ట్యా విచ్ఛిన్నం చేయమనీ, కావలిస్తే హింసను చేపట్టటం శివ ప్రియమేననీ ఉద్బోధించటానిక్కూడా ఆయన వెనుకాడలేదు. సమాజంలోని వ్యక్తులందరూ తన మతమే అవలంబించాల్నని, ఇతర మతాల వారినేం చేసినా 'పుణ్య' మేననీ అనటంకన్నా నిరంకుశత్వం గానీ, ఉన్మాదంగానీ ఉండదు. 'మత' పరమైన మౌలిక అవగాహన కలిగించటానికి బదులు ఈ విధమైన రెచ్చగొట్టుడు విశృంఖలత్వానికే దోహదం చేస్తుంది, చేసింది గూడా. అందుకే ఆ 'భావోద్రేకత' యొక్క తీవ్రతకు, 'అతి'కి జనం మొదట గగ్గోలు పడి చీలి పోయింది. ఈ అవకాశాన్ని వైష్ణవం ఉపయోగించుకొని వ్యాపించి సాగటంలో 'మత' వైషమ్యాలు సామాజిక భావ రంగాన్ని కలుషితం/ క్లిష్టం చేయటం, మొదటి తీవ్రత తగ్గినా, వైషమ్యాలు మాత్రం అట్లాగే ఉండటం తిక్కన్నగారిని

10. సోమన 'బసవపురాణం, 'పండితారాధ్య చరిత్ర'ల్లో వర్ణితమైన హింసా కాండ జరిగిందనటానికి ఆధారం లేదని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు (తెలుగుభాషా సమితి 'విజ్ఞాన సర్వం' 3. పు. 557), పల్నాటి యుద్ధానికి శైవ-వైష్ణవ,వైష్ణవ-వైదిక వైషమ్యాలు కారణ మనటానికి ఆధారం లేదని టి. వి. సుబ్బారావుగారు (కాటమరాజు కథలు. xxviii) అంటున్నారు.

తీవ్రంగా కలవరపరచింది. సామాజిక భావరంగాన్ని అకలుషితం/ అక్లిష్టం చేయకపోతే, సమాజానికీ/ దేశానికి భద్రత లేదని గుర్తించిన తిక్కనగారు[1] దానికోసం చేసిన ప్రయత్నమే హరిహరనాథ తత్త్వప్రతిపాదన.

3

శ్రీయన గౌరినాబరగు చెల్వకు చిత్తము పల్లవింప భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపము దాల్చి విష్ణు రూ
పాయ నమశ్శివాయ యని పల్కెడి భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చ పరతత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్.

అన్నారు తిక్కనగారు భారతరంభంలో. ఇక్కడ ప్రత్యేకంగా పేర్కొనబడ్డ 'భక్తజనం' ఎవరు ? వీరి ఏ విధమైన ధ్యానాన్ని పరతత్త్వం మెచ్చుతుంది ? అనేక విధనామ-రూపవంతమైనా గూడా పరమార్థతః పరతత్త్వమొకటే అన్న భావనతో ధ్యానించే భక్తజనం వీరు. ఈ విధమైన ధ్యానరీతి వైదికమైంది.

శైవ-వైష్ణవాలు రెండూ అతి ప్రాచీనమైన భక్తి మతాలు. వందలేండ్లుగా వీటిలో సమరసత్వమే నెలకొని ఉండేది. దానికి కారణం మౌలికంగా వైదికమైన భావన వీటికి భూమికగా ఉండటమే. అందుకనే సామాజిక వ్యవస్థకుగానీ, భావ సమైక్యానికిగాని అవి భంగం కలిగించలేదు. ఈ భూమిక తొలగి పోనంతవరకు ఉండిన సమరసత్వం, తెలుగు దేశంలో బసవనతో ఉత్తేజితుడైన సోమన ఆ భూమికను తొలగించటంతో లుప్తమై 'మత' విద్వేషం కమ్ముకున్నది దీని లోంచి అవాంఛనీయంగా ఉప్పతిల్లిన భావోద్రేకాలవల్ల సామాజిక సువ్యవస్థ కత్యంతావశ్యకమైన భావసమైక్యానికి పెద్ద అవరోధం ఏర్పడింది. ఈ అవరోధం నివారించ/ ఉన్మూలించబడక పోతే రాజకీయంగా సాధించిన ఐక్యానికూడా

1. గణపతిదేవుని గురువు విశ్వేశ్వర శివాచార్యులు గోళకీమఠాలను స్థాపించి వర్ణమత భేదం పాటించకుండా విద్యాలయాలుగా, అన్నసత్రాలుగా నిర్వహించటం మత సామరస్యంకోసం పాటుపడ్డ వారింకా ఉన్నారని తెల్పుతుంది.

ప్రమాదం. ఈవిధమైన విద్వేషధోరణి జాతికీ, సమాజవ్యవస్థకూ, రాజ్యవ్యవస్థకూ విచ్ఛేదకారణమౌతుంది. బాధ్యతగల రాజకీయపదవిలో ఉండిన బసవన యొక్క మతావేశోద్రేకాలు విద్వేషాలను రెచ్చగొట్టి బిజ్జలుడి రాజ్యాన్ని విచ్ఛిన్నం చేసిన విషయం అనాటికింకా సరికొత్తగానే ఉండింది. అదట్లా ఉండగా, ఉత్తర భారతంలో దండ యాత్రలు సాగిస్తూ ముంచుకు రాబోతున్నదనిపిస్తున్న మహమ్మదీయుల ప్రమాదాన్ని సమర్థంగా ఎదుర్కొనేందుకు, తిప్పి కొట్టేందుకు జాతి సర్వమూ సన్నద్ధంగా ఉండేందుకు పొరపులు లేని భావ సమైక్యం జాతికి అవసరం. శైవమనీ, వైష్ణవమనీ తగవులాడు కుంటుంటే, ఈ రెండింటినీ తుడిచిపెట్టే మతోద్రేకం ప్రధానమైందా మహమ్మదీయుల దండయాత్రా ప్రమాదం. అందుకని, దాన్ని తట్టుకొని నిలువగల శక్తియొక్క అవసరాన్ని గుర్తించిన తిక్కనగారు ఒకవైపు సాధింపబడ్డ రాజకీయమైన ఐక్యానికి తోడుగా, బాసటగా మరొకవైపు జాతిలో భావ సమైక్య సాధనకు హరిహరనాథ తత్త్వాన్ని సమాజం ముందుంచినారు. అంతేకాని, ఉన్న మతాలు చాలక, లేదా, కాదని కొత్త 'మతం' ప్రతిపాదించటానికికాదు. సోమన అంతకు ముందే 'హరిహరనాథ' రూపాన్ని వెక్కిరించినాడు. (పండితారాధ్య చరిత్ర-వాద ప్రకరణం). ఒక వ్యక్తి రూపంలో నిలువుగా సగభాగం హరి, మిగిలిన సగభాగం హరుడు అన్న తాత్పర్యంతో ప్రధానంగా సాగిందా వెక్కిరింత. కాని, తిక్కనగారు రూపప్రాధాన్యాన్ని తొలగించి భావప్రాధాన్యాన్ని ప్రవేశపెట్టినారు. ఆయన హరిహరనాథుడిని 'భావనారాధ్యు' డనీ, 'భావనాతీతు' డనీ, 'భావనతత్పర చేతోయుక్త భక్త పరతంత్రు' డనీ (విరాట. 1-31,33,36 ) ప్రతిపాదించటంతో పరతత్త్వ 'భావన' కు ప్రాధాన్యం వచ్చి, అనేక నామ–రూపాలు ఆ భావనకు సాధనాలని స్పష్టపడుతుంది.

రకరకాల వ్యక్తులు సామూహికంగా ఉద్దిష్టమైన ప్రయోజన విషయంలో భావైక్యంతో కలసిమెలిసి ఉండవలసిన స్థితికి విచ్ఛేదం కలుగని విధంగా ప్రవర్తిస్తున్నప్పుడే సమాజం 'సమాజం'గా ఉంటుంది. వైయక్తిక-సామాజిక ప్రయోజనాలు వైరుధ్యంతో సంఘర్షించకుండా సౌమనస్యంతో సమన్వయం జరిగినప్పుడే సమాజానికి సుస్థితి. కాగా ప్రస్తుతానికి భక్తి విషయంలో—వివిధ నామరూపాల విషయంలో అభేద ప్రతిపత్తి ఉన్నాగూడా, ఆయాజీవలక్షణాలను

బట్టి ప్రత్యేకమైన వాటిపై 'భక్తి' ఉండవచ్చు.[1] అందుకనే ఇది వైయక్తికం. వైయక్తికంగా 'జన్మాంతర దుఃఖముల్ దొలగి''బ్రహ్మానంద'స్థితికి సంబంధించిన ప్రయోజనం ఇతర మత-రూపద్వేషం నిర్మూలనం వల్ల నెరవేరేది కాదు. వీటి వల్ల ప్రతిక్రియా ధోరణి పెరిగి జరిగేది సమాజ విచ్ఛిత్తి. వైయక్తికంగా'భేదము లేని భక్తి' పెంపొందినప్పుడే జాతిలో భేదద్వేషభావం నశించి సువ్యవస్థ సాధింప బడుతుందన్న పరమార్థం తెలిసి మంత్రిగా, తాత్త్వికపరంగా చేసిన ఉద్బోధ ఇది.

ఈ విధంగా 'భేదములేని భక్తి' రూపమైన సమన్వయతా వ్యాప్తి శైవుడి వైపునుంచే జరుగటం ఉచితంగానూ, ప్రభావోత్పాదకంగానూ, ప్రయోజన వంతంగానూ ఉంటుందని తిక్కనగారు భావించినారు. కారణం, నాటికింకా బలంగా ఉన్నది శైవమే కావటం, వైష్ణవం ఆనాటికీ అల్పసంఖ్యాక వర్గంగా మాత్రమే ఉండటం. అందుకనే, 'మహేశ్వరాంఘ్రి కమల ధ్యానైకశీలు' (ఉ.రా. 1-13) డైన తిక్కనగారు తానుగా హరిహరనాథ భావనోద్బోధకు ఉద్యమించినారు. ఈ ఉద్యమానికి మూలమైన 'భేదము లేని భక్తి' భావన కేవలంగా భారతరచనారంభంనాడే ఉదయించింది కాదు. నాటి వాతావరణాన్ని అవగాహన చేసుకొన్ననాటినుంచీ ఉన్నది. నన్నయగారి 'శ్రీ వాణీగిరిజాః-' పద్యంలో మాదిరిగానే ఉ. రా. ప్రారంభంలో 'హరి హర పద్మగర్భులను-' ఆయన స్మరించినారు. తాను 'మహేశ్వరాంఘ్రికమల ధ్యానైకశీలు'డు కాగా, మనుమసిద్ధి - 'చక్రభృత్పదయుగధ్యానక్రియాభ్యాసతత్పరతానిత్యుడు' (ఉ.రా. 10-161) 'నిత్యస్తుత్య లక్ష్మీశుడు' (10-163). అయినా ఆ రాజూ-ఆ మంత్రీ ఒకరుగానే రాజ్య కార్యనిర్వహణ చేసినారు. మనుమసిద్ధి తిక్కన

---

1. ఈ సందర్భంలో ఈ క్రింది రెండు శ్లోకాలు గమనింపదగినవి —

I. 'శైవావయం నఖలు తత్రవిచారణీయం । పంచాక్షరీ జప పరానితరాం తథాపి । చేతోమదీయ మతసీకుసుమావభాసం । నందాత్మజం స్మరతి గోపవధూకిశోరమ్''—లీలాశుకుడు.

II. 'మహేశ్వరేవా జగతా మధీశ్వరే। జనార్దనేవా జగదంతరాత్మని । నవస్తు భేద ప్రతిపత్తిరస్తిమే । తథాపి భక్తిస్తరుణేందుశేఖరే' — అప్పయ దీక్షితులు.

గారిని 'మామా' అని పిలువటానికి (ఉ.రా. 1-3) వాళ్ళ శైవ వైష్ణవాలుగానీ, బ్రాహ్మణ క్షత్రియత్వాలుగానీ ఆటంకపరచలేదు. బసవన-బిజ్జలులకూ, తిక్కన-మనుమసిద్ధులకూ మధ్య ఉన్న సంబంధంలోని తేడానూ, అసామరస్య-సామరస్యాలనూ ఇక్కడ గమనించవచ్చు. ఇదిట్లా ఉండగా, 'కిమస్థి మాలాం కిముకౌస్తుభంవా పరిష్క్రియాయాం బహుమన్యసేత్వం, కింకాలకూటం కిము వాయశోదాస్తన్యంతవ స్వాదు వదప్రభో!మే' (విరాట. 1-11)[1] పద్యం నాటికి ఆ భేదములేని భావన ఉద్యమ స్థాయిని సంపాదించుకున్నది. ఈ ఉద్యమాన్ని ఆయన విస్తరింపజేసిన తీరు గమనించదగింది.

'వృషకేతన పాదద్వయీ నికేతనుడ'ని 'ఆంధ్రభాషాభూషణం' లో స్పష్టంగా శైవుడని తన నావిష్కరించుకున్న కేతన, తిక్కనగారిని 'చిత్తనిత్యస్థిత శివుడెవ్వడనినవీడు—' (ద.కు.చ. 1-89) అని నిశ్చితంగా చెప్పిన కేతన తాను ద.కు.చ. కావ్యాన్ని తిక్కనగారికి అంకితం చేస్తూ ముమ్మొదట 'హరియన్నమతిక్కని ధన్యుజేయుతన్' అని ఆశంసించినాడు. తిక్కనగారికి గౌరవనీయుడైన ఈయన ఇట్లాకాగా, శిష్యుడైన మారన తన 'మార్కండేయ పురాణం' గన్నయ సేనానికి అంకితమిస్తూ ముమ్మొదటగానే '—రమావిభుండు...కృతార్థు జేయుతను శ్రీనిధి నాగయ గన్న ధీనిధిన్' అని ఆశీర్వదించినాడు. అయితే, గన్నయ విష్ణు భక్తుడేమో, అందుకే ఆ విధంగా ఆశీర్వదించినాదేమోననిపించవచ్చు. కాని, మా.పు. ఆశ్వాసాద్యంత పద్యాల్లో గన్నయ గూర్చిన సంబోధనలు గమనిస్తే అసలు తాత్పర్యం స్పష్టపడుతుంది. గన్నయ 'విష్ణుభక్తి పరిగ్రహు'డని (2-343), 'నితాంత సముపాసిత రుద్రు'డని (3-193) హరి హరభక్తుడూనని సువ్యక్తి పరుస్తూ, అంతటితోనూ ఆగకుండా 'గాఢ భజన సుప్రసన్న గరుడవృషాంకు'డని (3-194) 'భావస్ఫురిత భవానీ శ్రీ వనితా ధీశు'డనీ (7-1) 'శ్రీ కంఠ శ్రీ శభృత్యు'డని (8-189) మారన

1. ఈ పద్యంలో గమనించవలసిన అంశం ఒకటుంది. ఇందులోని కర్తృ పదం (త్వమ్) సర్వనామం కాగా, పరతత్త్వం ప్రత్యేకనామంతో సీమితం కాదనీ, సర్వనామవాచ్యమనీ తాత్పర్యం. కాగా, అనేక నామ రూపాలు ఉపాసక భావనాఫలితాలనీ అస్థిమాలామల ద్వారా సూచించబడింది.

ఆ సంబోధనల్లో తన గన్నయ యొక్క 'భేదములేని' వైదిక ధ్యాయితను స్పష్ట పరచినాడు. 'ఏకంసత్, విప్రాః బహుధా వదన్తి'-ఆ బహుత్వంలోనే ఏకత్వాన్ని భావించటం అచ్చంగా మౌలికమైన వైదిక భావన.

ఈ విధంగా పరిశీలిస్తూపోతే, కేతన-మారనలనే కాక, తమ ఉద్యమంలో తిక్కనగారు మరింకెంద రెందరిని, ఏయే ప్రాంతాల వారిని కలుపుకుంటూ ముందుకు సాగినారోమరి ! కాగా, సామాజికంగా భావ సమైక్యాన్ని పాదుకొల్పి రక్షించటం కోసం, ఎట్లాంటి వత్తిడులనైనా తట్టుకొని నిలబడ గలిగేందుకు జాతి జాతినీ మొత్తంగా సన్నద్ధ పరచటం కోసం వైదిక భావ భూమికగల సామరస్యాన్నీ, సౌమనస్యాన్నీ సాధించే ఒక మహోద్యమాన్ని తిక్కనగారు నిర్వహించినట్టు కన్పిస్తుంది. పలు ప్రాంతాల్లో దీన్ని వ్యాపింపజేయటానికి పలువురిని ఆయత్తం చేసినట్టూ కన్పిస్తుంది. 'మహాకవిత్వ దీక్షా విధి నొంది'న తిక్కనగారు ఈ మహోద్యమంలోనే రామాయణ-భారతాలను ఉభయ కావ్యప్రక్రియను నిర్వహించినారు.

# 4

తిక్కగారి ఉద్యమాన్ని జాగ్రత్తగా గమనిస్తే, అది ఉభయ ప్రయోజనాత్మకంగా నిర్వహింపబడ్డట్టున్పిస్తుంది. సమకాలీనంగా సంఘర్షించుకుంటున్న భిన్నభక్తిమతాల మధ్య వైషమ్యాలను తొలగించి సామరస్య, సౌమనస్యాలను పెంపొందించటం ద్వారా భావ సమన్వయాన్ని సాధించటం ఒక ప్రయోజనం. ఇంతకు ముందుదాకా వివరించుకొన్నదంతా ఇదే. కాగా, రెండో ప్రయోజనం సమాజాన్ని స్వస్వరూప జ్ఞానవంతం చేయటం ద్వారా జాగృతపరుస్తూ ఎప్పటికప్పుడు దాన్ని నిలువరించుకొనేందుకు వీలు కలిగించటం. తిక్కనగారు రామాయణ-భారతాలను తెలుగులో చేపట్టి నిర్వహించటం ప్రధానంగా దీనికి సంబంధించి.

ఆయన రచనా విషయంగా ఎన్నుకొని చేపట్టి నిర్వహించిన వాటిలో మొదటిది రామాయణం యొక్క ఉత్తర భాగం. రాముడు రాజు కావటం దాకా రామాయణ పూర్వభాగం. రాజైనప్పటినుంచి ఉత్తర భాగం. ఈ భాగాన్ని మాత్రమే ఎన్నుకోవటంలో గల తాత్పర్యాన్ని తిక్కనగారు మొదట్లోనే వ్యక్తం

చేసినారు - 'ఎత్తటి నైనను ధీరో, దాత్త నృపోత్తముడు రామ ధరణీపతి స ద్వృత్తము సంభావ్యమగుట, నుత్తర రామాయణోక్తియుక్తుడనైతి' నన్నారాయన. అంటే, రాముని 'రాజ' జీవితాన్ని, సద్వృత్తాన్ని ప్రస్తుతీకరించటం ప్రస్తుతానికి ప్రధానంగా, అవసరంగా ఆయన భావించినారన్న మాట. రాముడు రాజు కావటానికి ముందరి జీవితమంతా ఒకవిధంగా ఆయన వైయక్తికం, కౌటుంబికం.అది ఆ విధమైన సద్వృత్తం. రాజైన తరువాతిదంతా సమాజపరమైన జీవితం. రాజైనవాడి జీవితమంతా సమాజ పరంగానూ,తదారాధన తత్పరంగానూ మాత్రమే సాగవలసి ఉంటుందనీ, తద్భిన్నంగా ఆతడికేమీ ఉండదనీ అటు రాజపదవీ స్థితులకూ, ఇటు సమాజానికీ స్పష్టంగా నిరూపించి ప్రదర్శించటమే తిక్కనగారి కవసరమైన ప్రధాన లక్ష్యం. ఎందుకంటే—

తన జీవితం—భౌతికంగానూ, ఆధ్యాత్మికంగానూ ఏ విధమైన ఒడుదొడుకుల్లేకుండా అభ్యుదయ శ్రేయోలక్షితమైన మార్గాన అక్షతంగా సాగటం కోసంగాను ఉపకరించేందుకని అవసరంగా కొన్ని వర్గాలనూ, వ్యవస్థలనూ సమాజం రూపొందించుకొన్నది. కృతయుగంనాటి సామాజిక వ్యవస్థలో కాలం గడిచిన కొద్దీ సంక్రమించిన ఒడుదొడుకుల దృష్ట్యా ఈ విధమైన రూపొందింపు అవసరమైంది.[1] ఈ రూపొందించుకున్న వాటిలో ప్రధానమైంది పాలక వర్గం, రాజ్య వ్యవస్థ. వీటికి ప్రతినిధి రాజు, క్షత్రియుడు. ప్రజారంజనంగా పరిపాలన సాగించటమే అతని ప్రధాన కర్తవ్యమని 'రాజు' అన్న పదం; ప్రజా జీవితానికి ఏవిధమైన దెబ్బ-ఆఘాతం విఘాతం కలక్కుండా రక్షించవలసిన కర్తవ్యాన్ని 'క్షత్రియ' పదం స్పష్టంగా నిర్దేశిస్తున్నయి[2]. కాని, ఇట్లాంటి రాజు-క్షత్రియుడు కూడా

---

1. 'విను: తొల్లి కృతయుగంబున,మనుజులయెడ దండనీతిమంతుండై రాజనొకడు కలిగియరయుట, మనుజేశ్వర ! లేమ, ధర్మమతమంత్రుత గన్;
'ఒండొరులకు రక్షకులై, యుండుదు; రట్లుండ దైన్యమొదవినలోభం, బొండొండ పెరిగి ధర్మము, ఖండితమై మొదలుకొని రకార్యంబులకున్.'
—భార శాం. 2-199,200.

2. ప్రజలను 'రంజింపజేసేవాడు' అనీ, సామాజిక జీవితాన్ని 'క్షతం-ఆఘాతం నుంచి రక్షించేవాడు' అనీ రాజ-క్షత్రియ శబ్దాలకు వరుసగా వ్యుత్పత్త్యర్థాలు.

సుదీర్ఘకాలం మీద కామలోభ మోహమదాలకు లోనుగావటంతో అనేక సందర్భాల్లో ప్రజా జీవితం అతంకితమైంది, అవుతున్నది కూడా. అట్లాంటి స్థితిని నివారించేందుకు రాజుకు మళ్ళీ లక్ష్యనిరూపణ చేయటం, రాజు యొక్క మౌలిక స్వరూపాన్నీ కర్తవ్యాన్నీ అందరికీ అవగాహన పరచటం విజ్ఞుల కర్తవ్యం. ఈ కర్తవ్య నిర్వహణం కోసమే '-సామధరణీపతి...సద్వృత్తం...'- ఎత్తిటినైనా యే కాలంలోనైనా సంభావ్యమైనదాన్ని రామాయణోత్తరభాగాన్ని ఎన్నుకోవటం ద్వారా తిక్కనగారు ప్రధానీకరించినారు.

సీతను రాముడు పరిత్యజించటం ఉ.రా.లో కీలకమైన అంశం. ఇది లేకపోతే, నిజానికా భాగమే లేదు. సామాజిక జీవితంలో వ్యవస్థాగతమైన ఒకానొక కల్లోలాన్ని నివారించేందుకుగాను రాముడు - రాజు/క్షత్రియుడుగా భార్యను పరిత్యజించినాడు. ప్రజలకు లక్ష్యప్రాయంగా ఉండవలసిన రాజు/క్షత్రియుడు 'కామ' గ్రస్తుడన్న అభిప్రాయం ప్రజల్లో కలిగితే, సామాజికమైన స్త్రీ-పురుష సంబంధాల్లో ఒకానొక ఉచ్ఛృంఖలత్వం 'రాజు' నెపంగా వ్యాపించి శాంతి విచ్ఛిన్నమయ్యే ప్రమాదం ఉన్నది ఐతే తాను 'కామ' గ్రస్తుడు కాదనీ, సీతలో ఏ దోషమూ లేదనీ రామునికి తెలియంది కాదు. ప్రజలకూ తెలియంది కాదు. తెలిసి కూడా ఒక నెపానికి ప్రాతిపదిక తయారయ్యే అవకాశం కలుగుతున్నది. ఎవరో 'అజ్ఞుఁ' అన్నారని కాదు. దానివెనుక తాత్పర్యమది. దీన్ని గుర్తించిన రాముడు ఆత్మప్రత్యయవంతుడే అయినా, 'ప్రజాభిప్రాయం' శిరసా వహించి సీతను పరిత్యజించటంద్వారా ఆ ప్రాతిపదిక ఏర్పడకుండా చేసినాడు. దీనివల్ల సీతకు మనస్తాపం కలుగవచ్చు. కాని ఆమె ఎవరు? రాముని భార్య, అంటే రాజు భార్య, పట్టమహిషి. రాజెంతో రాజకుటుంబమూ అంతే వారి వైయక్తిక బాధలకు ప్రజా జీవితం ముందు ప్రాధాన్యం లేదు. ఈ విషయం ఆమెకూ తెలుసు. కాని, ఆమె బాధ ఇది కాదు. '—నాకు నెఱుగ జెప్పి పొమ్మనుటకుం దగనే-' (ఉ. రా. 9-27) అన్నదే అసలు బాధ. ఐతే, భర్తగా ఈ విషయం ఆమెకు తానుగా చెప్పటం రాముడు పడుతున్న మనస్తాపంలో సాధ్యం కాలేదు. ఈ మనోవ్యధ వైయక్తికమైంది. ఇక్కడ రాముని వైయక్తికాభిప్రాయానికీ, ప్రజాభిప్రాయానికీ సంఘర్షణ. ఈ సంఘర్షణలో సామాజికతముందు వైయక్తికతకు ప్రాధాన్యం రాముడీయలేదు.

రాజుగా ఆయన ఈ అంశాన్ని గుర్తించినాడు. శంబూకుని సంహరించే విష యంలో కూడా ఇదే స్థితి. అతన్ని సంహరించవలసివచ్చినందుకు వ్యక్తిగా రాముడు తీవ్ర మానసిక వేదనకు గురైనాడు. ఎంతగానంటే ఆ బాధలో 'నృప ధర్మము నీచము'గా (10-75) తలచేటంత. కాని వైయక్తిక భావనకూ, బాధకూ ప్రాధాన్యం లేదు. 'మేనితో దివంబునకుం' బోవలె (10-74) నన్న శంబూకుని అసహజమూ, అవాంఛనీయమూ ఐన వాంఛను సమాజం మన్నించలేదు. ఈ విధంగానే 'ప్రజాకంటకు'డైన లవణుణ్ణి సంహరింపించినాడు. కాగా, ఈ అంశాలన్నీ సమాజంలో పాలకవర్గ రాజ్య వ్యవస్థలకు ప్రాతినిధ్యం వహించే వారికి జీవిత మనేది వైయక్తికంగా కాక, ప్రజా సమాజ పరంగానే ఉండవలసి ఉంటుందనే మౌలిక తత్త్వాన్ని నిరూపిస్తున్నాయి. ఈ అంశాలన్నీ మనో విష మయ్యేందుకే పీటికన్నాముందు రావణ విషయం విస్తరించబడింది. కామాదు లకు లోనైనవాడు-వాడెంత ప్రసిద్ధ వంశీకుడైనా, ఎంతటి తపోబల పరాక్రమ వంతుడైనా రాజు/ క్షత్రియుడుగా పరధన దారాహరణోద్యోగి ఐతే వాడి పతనం తప్ప దన్నది రావణ వృత్తంవల్ల స్పష్టపడుతుంది. కాగా, ఆత్మభోగలాల సత్వంవల్ల రావణుడి జీవితం భ్రష్టమైంది, అసద్వృత్తమైంది. మరి, ఈ లాల సత్వం లేకపోవటం వల్ల రాముడి జీవితం ఉదాత్తమైంది. సద్వృత్తమైంది. ఒక కావ్యాన్నిమ్మనటం నెపంగా (మనుమసిద్ధి) రాజుకు-అతడు రాజైన కొన్నే ళ్లకే లక్ష్య నిరూపణపరమైన కర్తవ్యోపదేశాత్మకంగా, సమాజానికి నృపజీవిత మౌలిక తత్త్వ నిరూపణపరమైన జ్ఞానప్రదంగా తిక్కనగారు ప్రయోజన పరమైన 'ఉత్తర రామాయణోక్తియుక్తు' లైనారు.

అయితే, రాజ్య వ్యవస్థకు ప్రాతినిధ్యం వహించే వ్యక్తులకు సంబంధించిన జీవన ప్రవృత్తిలోని మౌలికతత్త్వాన్ని పునర్వ్యక్తం చేసినంత మాత్రాన సామాజి కంగా అన్ని అంశాలనూ నిరూపించినట్టు కాదు సమాజం రూపొందించుకున్న వర్గాలింకా ఉన్నాయి. ఈ వర్గాలే, నిజానికి, వర్ణాలు. మొత్తంమీద సామాజికంగా కర్మపరమైన విస్తృతప్రాతిపదికమీద రూపొందిన వర్ణాలు నాలుగు, ఈ యీ వర్ణాల స్వరూప స్వభావ కర్తవ్యాదులను గూర్చిన బహుముఖ పరిజ్ఞానం సమాజానికి అవసరం. ఈ అవసరాన్ని తీర్చగల భారతాన్ని ఉ రా. అనంతరం తమ రచనా విషయంగా తిక్కనగా రెన్నుకున్నారు.

తిక్కనగారు భారతాన్నైతే ఎన్నుకున్నారుగాని, అప్పటికి-ఏం తక్కువ, దాదాపు రెండువందలేండ్లకు ముందే '-ఆంధ్ర కవిత్వ విశారదుండు, విద్యాదయితుండు... మహితాత్ముడు నన్నయభట్టు దక్షతన్' (విరాట. 1-6) భారత రచన తెలుగులో ఆరంభించటమూ, అనేకమైన ఊహ్యానూహ్య కారణాలవల్ల వేసిన మూడో అడుగులోనే ఆ రచన ఆగిపోవటమూ జరిగింది. అయితే, 'గాసట బీసటే చదివి' లేదా, విని విపరీత వ్యాఖ్యానాలు చేసేవారికీ, వాటిని వినేవారికీ - ఇట్లాంటివాళ్లు ఏ కాలంలోనూ ఉండనే ఉంటారు - 'జనసుత కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థ మేర్పడ...అధిక ధీయుక్తి మెయిన్' (ఆది. 1-16) నన్నయగారు భారత రచన తెలుగులో ఆరంభించినారని తిక్కనగారు గమనించినారు. ఈ గమనింపువల్లనే నన్నయగారు తిక్కనగారికి 'మహితాత్ముడు'. భారతీయ సామాజిక ధర్మం యొక్క విశ్వరూపాన్ని 'జను'లకు 'ఏర్పడ' అవగతపరచవలసిన ఆవశ్యకతను గుర్తించిన తిక్కనగారు ఆ 'మహితాత్మ' సంకల్పంతోడి ఏకీభావాన్ని పురస్కరించుకొని, ఆ ఆగిన నన్నయగారి భారత రచననే 'తుదిముట్టన్ రచియించు టొప్పు' (విరాట, 1-7)గా భావించినారు. ఒక ఉదాత్తమైన సదాశయానికి సంకల్పానికి సంప్రదాయానికి తాత్కాలికంగా విఘాతం కలిగినా, కాలాంతరాన ఐనా అది ఉప్పుద్ధమై కొనసాగక తప్పదు. కాకపోతే, మొత్తం భారతంలో పదిహేను పర్వములు రచించిన తిక్కనగారికి నన్నయగారు రచించిన ఆ ఒక్క పర్వం గూడా[1] రచించటం అసాధ్యంకాదు. కాగా, ఉదాత్తమైన సంప్రదాయం యొక్క విచ్ఛేదం జాతికి సమాజానికి శ్రేయస్కరం కాదనే యాథార్థ్యం తెలిసిన తిక్కనగారు నన్నయగారి మహాప్రయత్నాన్నే అందిపుచ్చుకొని కొనసాగించినారు. ఆయన 'అవిచ్ఛిన్న సంప్రదాయార్థి'. అందుకే ఎన్నుకున్నది ఆ భారతం.

వివిధ వర్ణాల(వర్గాల/వృత్తుల)సమాహారభూతమై సమాజానికి సంబంధించి హితాహిత / ధర్మాధర్మ / కార్యాకార్యాలనూ, సామాజిక జీవన పథకం, కర్తవ్య

1. నిజానికది ఒక్క పర్వం గూడా కాదు. అంతకన్నా తక్కువే. దాన్ని 'ఒక్కపర్వం' గా పూర్తి చేసింది అనంతరకాలాన ఎఱ్ఱన గారు.

నిష్ఠా స్వరూపం - ఈ మొదలైన అంశాలను వ్యవస్థా దృష్టితో భారతం అనేక మార్గాల్లో నిరూపిస్తున్నది. ఒక మొత్తంగా భారతాన్ని సమన్వయ పూర్వకంగా అవగతం చేసుకుంటే ఫలానా వర్ణం గొప్పదని గానీ, తక్కువదని గానీ ప్రతిపాదించటం/ నిర్ణయించటం భారత తాత్పర్యం కాదనే అంశం స్పష్టపడుతుంది. ధర్మ నిర్ణయం/ నిరూపణం మొదలైన సందర్భాల్లో ధర్మజ్ఞత్వ/ తదాచరణలకే తప్ప కేవలంగా వర్ణాలకు ప్రాధాన్యం లేదని అనేక (ధర్మవ్యాధాదుల) ఉపాఖ్యానాలు అవగత పరుస్తయి. విహిత ధర్మాచరణంలో, కర్తవ్యపాలనలో అపక్రమం/ లోపం కలిగినప్పుడు శిక్షాది విషయాలలో కేవలం వర్ణాలు రక్షించవనే అంశం ఇతర పర్వాల్లోనే కాక శాంతిత్రయంలో విశేషంగా వివరించబడింది. స్వవర్ణేతర వృత్తుల నవలంబించినవారి విషయంలో ఆ అవలంబించిన దానిలో నేర్పునేతప్ప, వారి వర్ణానికి సంబంధించి గౌరవం సమాజానికి ఉండదని ద్రోణాదులకు సంబంధించిన పలు ఘట్టాలు నిరూపిస్తయి.

నిజానికి తిక్కనగారి నాటికే కాదు, నన్నయగారి నాటికే కాదు, అప్పటికే ఎన్నో వందలేండ్ల ముందరినుంచే వర్ణ వ్యవస్థ సమాజంలో తాను రూపొందిన్నాటి కర్మపరమైన స్వరూపాన్ని పోగొట్టుకుంటూ, సుదీర్ఘకాలం మీద జన్మపరత్వంతో బిగుసుకుపోవటం ప్రారంభమైంది. దీంతో, విహితమైన ధర్మకర్మపరత్వం కన్నా జన్మపరమై అహంకార/ న్యూనతా భావాలు సమావరించుకొంటూండటంతో ధర్మచ్యుతి అనేక విధాలుగా వ్యాపించింది. ప్రధానంగా క్షత్రియ, బ్రాహ్మణ వర్ణాల్లో. క్షత్రియత్వానికి సంక్రమించిన రాజ్యాధికార వ్యామోహంతో ఇతర వర్ణాలవారు ఆ స్థానాన్ని ఆక్రమించుకొనే ప్రయత్నం, దాని సాఫల్యంతో ఎవడు 'ప్రజాపాలన'కు వస్తే వాడే 'క్షత్రియు'డన్న తాత్పర్యానికి బహూనా బలం వచ్చింది. అయితే, ప్రజాపాలనకు రాజరికానికి ఎవరు వచ్చినా 'పాలనా ధర్మం' నిర్వహించటం అవసరం. కాని, ధర్మనిర్వహణకన్నా పలు సందర్భాల్లో అధికార సంపాదన/ రక్షణలే 'ధర్మ' మై, దాని కోసమే అనితర లక్ష్యంగా పోరాటాలు. ఈ వర్ణవిషయంలో అధికారాహంకారం వ్యామోహం లాలసత్వంతో ధర్మచ్యుతి విపరీతంగా జరిగితే, బ్రాహ్మణవర్ణంలో అగ్రవర్ణాహంకారం/ వైభవలాలసత్వంతో. అవసరాలనూ అవకాశాలనూ బట్టి విశేషాధికారాలనువర్తించిన అనువర్తింపజేసుకున్న ఈ రెండు వర్ణాలు - సామాజిక వ్యవస్థా

పరంగా క్రింకస్థాన మ్మాక్రమింపుకున్న ఉభయ వర్ణాలు కామక్రోధామంనల్ల, లాలసత్వంవల్ల అభిభూతమై ధర్మాచరణాదుల్లో అలసత్వం అలక్ష్యం అలవాటు చేసుకోవటంతో సామాజిక జీవితం మొత్తంగా కలుషితమూ కల్లోలితమూ కావటం సామాన్యమై పోయింది. దీంతో ఏది ధర్మమో, ఏది కాదో; - మానవ మనః ప్రవృత్తుల్లోని అనంత ముఖ వైవిధ్యంతో, తద్వారా ఏర్పడే వివిధ సందర్భాల దృష్ట్యా గహనమై పోయిన ధర్మ స్వరూపం అసలేమిటో సమాజానికి అవగతం కాని పరిస్థితి నెలకొన్నది. ఇట్లాంటి స్థితిలో అధికార వర్ణగతాహంకారాదులను దెబ్బకొట్టి, ధర్మంయొక్క ఆచరణ, ప్రచార, రక్షణలే ప్రధానమని నిరూపించి సమాజాన్ని జాగృతపరచవలసి ఉంటుంది. ధర్మాచరణాది విహీనమైన కేవల జన్మగత వర్ణాద్యహంకారాలను, ఆధిక్యభావాలను తొలగించేందుకు, విహిత ధర్మాచరణం లేనిచోట జన్మపరతకు విలువ లేదనే ఆలోచనప్రజలు అవగతం చేసుకొనేందుకు గహనమైన ధర్మ స్వరూపాన్ని - సామాన్య, విశేష, ఆపద్ధర్మాదుల ప్రత్యేక లక్షణాలను వారికి అందుబాటులోకి తేవలసిన అవసరాన్ని నన్నయగారి తరువాత మళ్ళీ సమకాలీన పరిస్థితుల నర్థం చేసుకున్న తిక్కనగారు గుర్తించినారు. అందుకే ఈ అవసరాన్ని తీర్చగల భారతాన్ని తెలుగు వారికి అందించినారు సమగ్రంగా. కేవలం త్రివర్గ (ధర్మ - అర్థ - కామ) సాధనా విషయమేకాక, చతుర్థ పురుషార్థాన్నీ ('మోక్ష' ధర్మాన్నీ) సమాకలనం చేసుకొన్న చతుర్వర్గ స్వరూపాన్నీ, అవైషమ్య పూర్వకమైన ఉపాసనా విధానాలను వివిక్తంగానూ, సమన్వితంగానూ ప్రస్తుతీకరించే భారతాన్ని - కర్ణపుటంబుల 'నీరుగ్రోలి ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ-' వెలయించినారు. (విరాట. 1-30). ఈ విస్తృతమైన ప్రయోజన కారణంగా భారతం 'ఆరాధ్యము జనులకు'. సమాజంలో ఎవరెవరి ధర్మాలేమిటో, తదాచరణ స్వరూపమేమిటో, అది కానినాడు కలిగే ప్రమాదాలేమిటో - ఈ మొదలైన అంశాల తెలివిడితో 'జను'లను విజ్ఞాన వంతులను చేసే భారతం 'జనాభ్యర్చితమూ, జన సంప్రార్థ్యమూ.' అందువల్ల 'తద్గౌరవమూహించి' తిక్కనగారు 'అఖండిత భక్తి'తో భారతాన్ని 'తెలుగు బాస వినిర్మింప దివిరి' నారు.

తిక్కనగారు ఈ ధర్మోద్యమంలో ధర్మామ్నాయమైన భారతాన్ని 'ఒక్క ఆరాధనా విశేషంబు'గా భావించి దేశీయులకు అందుబాటులోకి తేవటమేకాక,

ఈ ఉద్యమంలో కేతనాదులనుగూడా ప్రోత్సహించి అన్వయించేట్లు చేయటం గమనించదగిన అంశం. ద. కు. చ. వంటి రచన చేసిన కేతన 'విజ్ఞానేశ్వరీయం'- యాజ్ఞవల్క్య స్మృతికి విజ్ఞానేశ్వరుని 'మితాక్షర' వ్యాఖ్యను తెలుగువారి కందించినాడు. 'ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ' అని తిక్కనగా రనటం,- 'తెలుగున జెప్పెద సమస్త దేశీయులకున్' అని 'విజ్ఞానేశ్వరీయం' మొదట కేతన అనటం గమనిస్తే ఉద్యమ స్వరూపం అవగాహనకు వస్తుంది. కేతనేగాదు, వివిధ ధర్మాంశాలను ప్రస్తుతీకరించే 'మార్కండేయ పురాణం' తెలుగువారి అందుబాటులోనికి మారన తీసుకు వచ్చినాడు. కాగా, ఈ అంశాలన్నీ గమనిస్తే - తిక్కనగారు ధర్మోద్యమంద్వారా శ్రుతి, స్మృతీతిహాసపురాణ విజ్ఞానాన్ని తెలుగువారికి అందుబాటులోకితెచ్చివాళ్లు ధర్మపరంగా నిత్య జాగృత స్థితిలో ఉండే అవకాశాన్ని కల్పించినారు. ఈ విధంగా - సామాజిక ధర్మ సుస్థితి, భావ సమన్వయపరంగా జాతికి శాస్త్రీయ విజ్ఞానప్రదమై - జాగృత పరచిన తిక్కనగారి ఉభయ ప్రయోజనాత్మక ధర్మోద్యమం యొక్క విశిష్టత చారిత్రకంగా గమనించదగింది.

## 5

అప్పటికి ధర్మశాస్త్ర గ్రంథాల మాదిరిగానే తెలుగులో భాషాపరంగా వ్యాకరణం లేకపోవటం, దాన్ని కేతనే రచించటం ఈ సందర్భంలో విశేషంగా గమనించవలసిన ఒక అంశం. ఈ రచనా విషయంలోనూ తిక్కనగారి ప్రోత్సాహం ఉన్నట్టు అనిపిస్తుంది. ఎందుకంటే, ఉ.రా. అవతారికలో తిక్కన గారు వ్యాకరణానికి సంబంధించిన ఒకటి రెండంశాలను ప్రస్తావించినారు. 'అలవడ సంస్కృత శబ్దము, తెలుగుబడి విశేషణంబు తేటపడంగా, బలుకునెడ; లింగవచనంబులు భేదింపమికి మెచ్చు బుధజనము కృతిన్' (ఉ.రా. 1-8) అనీ, 'జాత్యముగామి నొప్పయిన సంస్కృత మెయ్యెడ జొన్ప...' (1-14) ననీ అన్నారు. సామాన్యంగా కవులు కావ్యావతారికలలో కావ్య శాస్త్ర విమర్శలకు సంబంధించిన అంశాలను ప్రస్తావించటమున్నది కాని వ్యాకరణాంశాలను ప్రస్తావించింది మాత్రం తిక్కనగారే. ఈ ప్రస్తావన భాషను సంస్కరించవలెనన్న తాత్పర్యం ఆయన కున్నదని స్పష్టం చేస్తుంది. ఈ తాత్పర్యమే కేతన 'ఆంధ్రభాషా భూషణ' రచనకు ప్రోత్సాహకమైంది. ప్రోత్సహించ వలసిన అవసరాన్ని తిక్కనగారు గుర్తించినారు.

నన్నయ గారు తెలుగుకు కావ్య భాషా స్వరూపాన్ని తమ భారత రచన ద్వారా నిరూపించినారు. అది సంస్కృతీకరింపబడిన భాష. అంటే, సంస్కృత పదబహుళమైన భాషా రూపమని గాదు. కావ్య రచనకు అనుగుణంగా సంస్కరింపబడినట్లుగా చేయబడిన భాషా రూపమని తాత్పర్యం. నన్నయగారి కన్న ముందు ప్రామాణికంగా చెప్పుకోదగిన కావ్యాలంటూ ఈనాటికీ లభించటం లేదు కాబట్టి, తన నాటి శిష్టులు అనుసరించే భాషా వ్యవహార విధానాన్ని అనుసరించి, సామాన్య వ్యవహార భాషా స్వరూప స్వభావ, స్వత్వాలను ఆకళించుకొని ఆయన ఆ విధంగా రూపొందించి ఉంటారని చెప్పవలసి ఉన్నది. సంస్కృత పదాలను తెలుగున కొదిగించుకోవటంలోని పద్ధతులను, దిశాసూచకంగా, రూపొందించినట్లే, దేశీయపదాలను గూడా కావ్యప్రయోగంలోకి తీసుకురావటానికి అనువైన విధానాలను గూడా, ఆయన భాషా ప్రయోగరీతులను బట్టి గమనిస్తే, రూపొందించినట్లు స్పష్టపడుతుంది. ఈ గమనించటానికి ఆం. భా. భూ. లో భాషా భేదాలను గూర్చిన కేతన చెప్పిన అంశాలు (20 నుంచి 30 దాకా పద్యాల్లోని) ఆధారాలుగా ఉపకరిస్తాయి అట్లాగే నన్నయగారినాటి, అంతకుముందరి ఆ తరువాతివి గూడా కొన్ని శాసనాలు కాగా, ఈ అంశాలన్నింటినీ పరిశీలించుకుని చూస్తే, భాషాస్వత్వం అనేది దెబ్బతినకుండా ఉండేట్లు కావ్యభాషా ప్రయోగ విధానమే ప్రాధాన్యం వహించినట్టు తెలుస్తుంది.

అయితే, నన్నయగారి అనంతరం నన్నెచోడ- సోమనాథులు అనుసరించిన భాషా విధానం పలుచోట్ల-సమాసగ్రథనంలో,సంధిసంయోజన విధానంలో, విశేష్య-విశేషణ సంధానంలో, అన్యభాషా పద సంపాదనలో, పద సంవిధానంలో భాషాస్వత్వాన్ని లెక్కచేయని ధోరణి కన్పిస్తుంది. దేశి-జానుతెనుగు ఇత్యాదిగా వారెంత చెప్పినా ఈ లోపం లేకపోలేదు. అందుకే తిక్కనగారు ప్రత్యేకంగా పనిగట్టుకొని, ఉపలక్షకంగా, ఆ వ్యాకరణాంశాలను ప్రస్తావించవలసి వచ్చింది. ఆయన దృష్టి అంతా 'జాత్యత' మీద. దానికి భిన్నంగా ఉండేట్టయితే, 'ఒప్పయిన సంస్కృత' పదం- సంస్కృత భాషాపరంగా ఎంత సుష్ఠువు,అందమూ గలదైనదైనా ప్రయోగించకూడదు. ఆ భిన్నత్వాన్ని లక్షించకపోతే భాషా స్వత్వం దెబ్బతింటుంది దేశీయ పదాలను విరివిగా ప్రయోగించటం దేశీయ భాషా కవికి అనివార్యమూ, చాలా అవసరమూ. కాని, ఆ అవసరం భాషా సహజ లక్షణానికి ఒదిగి ఉండటం కూడా ముఖ్యం. మౌలిక

మైన ఈ అంశాన్ని ప్రతిపాదిస్తూ, ఆ 'జాత్యత'ను వ్యవస్థీకరించటంకోసంగాను సాధనంగా తిక్కనగారు తెలుగులో వ్యాకరణ రచనకు ప్రోత్సాహం కలిగించినారు. ఇంతేకాకుండా, పద్యరచనా పరంగానూ వారిలో కనిపించే యతి ప్రాసల ప్రయోగానికి సంబంధించిన వ్యతిక్రమాలను గూడా- 'తెలుగుకవిత్వము చెప్పం, దలచిన కవి యర్థమునకు దగి యుండెడుమా, టలు గొని వళులుం బ్రాసం, బులు నిలుపక యొగిని బులిపుచ్చుట చదురే!' (ఉ.రా. 1-7) అనిగూడా నిరాకరించినారు. ఇక్కడ యతి-ప్రాసోపయోగంలోని వాంఛనీయ విధానంతోబాటు 'అర్థమునకుందగియుండెడు మాటలు' గొనటంలోని ఆవశ్యకతగూడా సూచింపబడింది. 'ప్రాతవడ్డ మాటల' (1-6) ప్రస్తావన గూడా దీనికి సంబంధించిందే. యతి-ప్రాస (-గణా)ల కుదిరింపుకోసం అర్థానికి తగియుండని మాటలు, ప్రాతవడ్డ మాటలు ప్రయోగించటంకానీ, లేదా మాటలకుదిరింపుకోసం యతి-ప్రాస (-గణా) లను పులిమి పుచ్చటంగానీ 'చదురు' కాదని నొక్కిచెప్పేందుకే ఈ అంశాలు ప్రస్తావించబడినాయి. ఇవన్నీ భాషా-ఛందో వ్యతిక్రమాలనేకాలకు కేవలం ఉపలక్షకాలుగా మాత్రమే ఒకటి రెండుగా ప్రస్తావించబడినాయి. కాగా, జాను తెనుగు, దేశిపేరిట జరిగే ఈ విధమైన వ్యతిక్రమాలను జాత్యత, భాషా వ్యవస్థ, స్వత్వందృష్ట్యా నిరాకరించ తొలగించవలసిన అవసరాన్ని, వాంఛనీయతను ఈ ప్రస్తావనలద్వారా తిక్కనగారు స్పష్టపరచినారు.

అయితే, ఈ విధమైన రకరకాల వ్యతిక్రమాలను మినహాయిస్తే, జాను తెనుగు, దేశి అనేవి తిక్కనగారికి అత్యంత ప్రియమైనవి. జాను తెనుగు, దేశి అని ఎంతో నిష్ఠగా ప్రతిపాదించి ప్రకటించిన నన్నెచోడ-సోమనాథుల కన్నా గూడా-ఆ మాట లేవీ అనకుండానే-ఎంతో అధికంగా, సమర్థవంతంగా తిక్కనగారు వానిని నిర్వహించినారనేది పరిశీలన ద్వారా సువ్యక్తమౌతుంది. నిజానికి దేశి పదాలను విరివిగా గుప్పించినంత మాత్రాన పెద్ద ప్రయోజనం అంతగా ఏమీ లేదు. ఏ విధమైన పదాల ప్రయోగం జరిగినా ప్రధానమైంది 'పలుకుల పొందు' (1-6) తిక్కనగారు 'పద సంఘటన' అనే అంశాన్ని దేశిగా చెప్పిన తీరిది. '-చేసెద నే కృతి'యన్న వారికి (1-5) అత్యవసరంగా సాధించవలసిన అంశం 'పలుకుల పొందు' ఇది లేకపోతే కావ్యంలో మరేమీ సాధించగల అవకాశం లేదు దీనిమీద సాధింపవలసినవే మిగిలినవన్నీ. కాగా, ఈ'పలుకుల పొందు'

అంటే, 'పలుకుల్ సరిగ్రుచ్చునట్లుగా చేరుప నేరగా వలయు'ట[1] సరిగ్రుచ్చుట అంటే, ఏవేవో పూలనూ ముత్యాలనూ ఏదో విధంగా, కొకిబికిగా గ్రుచ్చటం కాదు. ఒక పువ్వులోంచి మరో పువ్వు, ఒక ముత్యం లోంచి మరో ముత్యం వికసించినట్లు, విస్తరించినట్టు; ఒకదానికొకటి ఒదిగినట్టు; పొదిగినట్టు గుచ్చటం. ఇది ఒక నేర్పు. కాగా, కృతి చేసెదనన్న వారికి ఈ విధమైన 'పలుకులపొందు' సాధించే నేర్పు అవసరం. పదాలెంతటివైనా ఏ విధమైనవైనా ఈ నేర్పు లోపిస్తే, వాటి శక్తి-సౌందర్యాలు గూడా లోపిస్తయి. కాగా, 'తలపుందళంబులన్ సౌరభ మిచ్చు గంధవహు చందమునం బ్రకటంబు చేసి యింపారెడు బల్కులం బరయు'ట, వాటిని 'సరిగ్రుచ్చునట్లుగా జేరుపనేరగా వలయు'ట అనేది-దేశి, ఆదేశి విషయం ప్రస్తావించకుండా పదసంచయన, గ్రథన విషయాలను తిక్కనగారు మొట్టమొదట ప్రస్తావించినారు. 'సారమతిం...'(ఆది.1-26) పద్యంలో నన్నయగారు ప్రతిపాదించిన ప్రసన్న కథా కలితార్థ యుక్తి, అక్షర రమ్యత, నానారుచిరార్థ సూక్తి నిధిత్వం అనే అంశాలకు తిక్కనగారు ఈ పద గ్రథన విషయం చేర్చటం ద్వారా కావ్య స్వరూపానుశీలన విషయంగా సమగ్రతను సంపాదించినారనిపిస్తుంది.

ఈ 'పలుకుల పొందు' అనేది పలుకుబడి, నుడికారం, మాటతీరు అనే ఈ మూడంశాలను సమన్వితం చేసుకొన్న పదబంధం. ఈ మూడు రకాలుగా చెప్పబడినది ఒకే అంశమని స్థూలంగా అనిపించినా, నాజూకైన తేడాలు వాటిలో ఉన్నాయి. భాషలో-ఆ భాషా స్వత్వాన్ని, స్వభావాన్నీ అనుసరించి 'పలుకుబడు' లేర్పడుతాయి. ఈ పలుకుబడు లనబడే పద బంధాలను ఎవరు సంతరించిందీ చెప్పటం సాధ్యంకాదు. జన వ్యవహారంలో రూపొంది వాటంతట అవే ప్రచారంలోకి వస్తాయి. 'పెట్టని కోట' వంటివీ విధమైన పలుకుబళ్లు. జనవ్యవహారంలో రూపొందిన ఈ పలుకుబళ్లాధారంగా, వాటి ఒరపడిలో కవులు కొన్ని పద బంధాలు సంతరిస్తారు. ఇట్లాంటివి 'నుడికారాలు'. ఉదాహరణగా 'చుట్టపు మేరువు'

1. 'పొసగముత్తెపు సరుల్ పోహళించినయట్లు తమలోన దొరయు శబ్దములతోడ...' (కళా-1-185) అన్న పింగళి సూరనకు తిక్కనగారు గురువు.

'నడదివ్వో' వంటి వాటిని చూడవచ్చు. పలుకుబడులు, నుడికారాలూ పదబంధాలే అయినా, జన వ్యవహారంలో పలుకుబళ్ళకున్న వ్యాప్తి నుడికారాలకుండదు. జన వ్యవహారంలోంచి కవుల్లోకి, కావ్యాల్లోకి వచ్చేవవి, ఇటునుంచి అటు పోయేవివి. అయితే ఆయా రంగాల్లో ప్రయోగపరంగా అవి కలిగించే స్ఫూర్తీ, భావోద్దీప్తి ఒకటిగానే ఉంటాయి. కాగా, 'మాటతీరు' అనేది ఆయా భాషీయులు భావాన్ని వ్యక్తీకరించటానికి మాటలనూ, వాక్యాలనూ కూర్చే- తమకు మాత్రమే విశిష్టమైన విధానం, ఉపయోగించే కారక విధానం, అనువర్తింపజేసే కాకువు మొదలైన వాటికి సంబంధించింది. రకరకాలైన వ్యక్తులు వివిధ సందర్భాల్లో, వివిధ స్థాయిల్లో, పలువిధాలైన భావాలను తమ భాషద్వారా వ్యక్తీకరించే విధానమంతా ఈ 'మాటతీరు'. పలుకుబళ్ళు, నుడికారాలు కూడా ఈ మాటతీరులో అంతర్భవిస్తయి. ఈ మాటతీరులోని పట్టుదొరికిన కవికే మాటతీర్పు- 'పలుకులపొందు' సాధ్యమైతుంది. తిక్కనగారి రచన అంతా ఈ విధమైన 'పలుకుల పొందు' కు ఉదాత్తమైన ఉదాహరణగా నిలుస్తుంది.

తిక్కనగారి భారతం చదువటం కష్టం, పోతనగారి భాగవతం అర్థంచేసుకోవటం కష్టమని పెద్దలు అంటూ ఉంటారు. పోతనగారి భాగవతంలో అనేకమైన ఆధ్యాత్మిక విషయాలకు సంబంధించి 'అర్థం చేసుకోవటం' కష్టమనేదాన్ని అర్థం చేసుకోవచ్చు. కాని, తిక్కనగారి భారతాన్ని చదువటం కష్టమంటే ? అంటే, తిక్కగారి భారతం అర్థం కాకపోవటమనేది, సామాన్యంగా, లేదు. అనేక పదాలు, పదబంధాలు ఈనాడు మన వ్యవహారంలో సర్వత్రా ప్రచురంగా లేకపోవటంవల్ల అవి అర్థం కాకపోవటం అప్పుడప్పుడూ సంభవించవచ్చు. ఇది సుదీర్ఘ కాలవ్యవధానంవల్ల వచ్చిన క్లిష్టత. దీన్ని కొంచెం ఓపికతో అధిగమించవచ్చు. కాని నిజానికి ఏవో కొన్నిపదాల, పదబంధాల అర్థాలు తెలియకపోవటం అసలు సమస్య కాదు. అసలు విషయం తెలుగు 'మాటతీరు'- కాకువు మొదలైన అంశాలను అవగాహన చేసుకొని చదువటం. ఇది తెలియక చదువుకొంటే కలుగవలసిన ఉద్దీప్తి కలుగదు. పదాలను, వాక్యాలను ఎక్కడ విరువటం, ఆపటం, ఏ పదాలనూ, అక్షరాలనూ నొక్కి- సందర్భావగాహనతో పలుకటం- ఈ మొదలైన అంశాలు తెలిసి చదువుకోవటం - అసలు ఏ కావ్యం విషయంలోనైనా అవసరం. తిక్కనగారి రచన విషయంలో మరీ అవసరం. పద్యాన్ని

పద్యంగా సాఫీగా చదువుతూపోదామంటే, తిక్కనగారందుకు వీలీయడు. ఆగి ఆగి సాగమంటారు. ఉదాహరణకు ప్రసిద్ధమైన ఈ ఒక పద్యాన్నే- సూచనగా చూడవచ్చు. 'పైవడి పోయెగాక...' (కర్ణ. 3-224) అన్నపద్యాన్ని 'దుర్వారోద్యమ...' (విరాట. 2-55) అన్న పద్యం మాదిరి సాఫీగా చదువటానికి వీల్లేదు. కాగా, దీన్ని-

> 'పైవడిపోయెగాక, ధృతరాష్ట్రుడు గన్నదియేమి ?
> ఆ సభం దావలదన్న కీడుడుగదా !
> పతిలేదనబడ్డకాంత నేడీవుకనుంగొనం బతియే త్రైజనా ప్పె,
> పతుల్, విజృంభిత శ్రీ విలసిల్లు కామినులు
> సేద్పుడి రిట్లపతిత్వ దీనతన్'

అని విరిచి చదువుకోవలసి ఉంటుంది. ఈ చదువుకోవటంలో పద్యంలో గర్భితమైన ఎత్తిపొడుపు, కసి వ్యక్తం కావలసి ఉంటుంది. 'ఏమి, కదా' అనప్పుడు కాకువు, 'ఒప్పె' అన్నప్పుడు దీర్ఘీకరించకుండా కటిక్కన త్రెంచటం, 'పయల్, విజృంభిత శ్రీ' అన్నప్పుడు 'య' 'జృం' అనే అక్షరాలను నొక్కటం, శ్రీ ని దీర్ఘీకరించటం- ఈ మొదలైన రీతులలో చదువుకుంటేనే పద్య తాత్పర్యం వ్యక్తమౌతుంది. ఇదంతా తెలుగు 'మాటతీరు' కు సంబంధించింది. ఈ రీతిగా తిక్కనగారి రచనలో కొన్నివందల పద్యాలను చూచుకోవచ్చు.

నిజానికి, తిక్కనగారి 'నాటకీయత' అనేది ఈ విధమైన 'మాటతీరు' ను నిర్వహించటంలోంచి ఉద్గమించిందనవచ్చు. శ్రవ్యకావ్యంలో నాటకీయత ప్రధానంగా సంభాషణావిధానంలో వ్యక్తమౌతుంది. దీనికితోడు పాత్రలయొక్క ప్రవృత్తులను, తత్తత్సందర్భాల్లో పాత్రల 'అనుభావసంచారీభావ' విశేషాలను పలువిధాలుగా వ్యక్తీకరించటంలో మరింతగా ఉద్దీప్తమౌతుంది. ఈ అనుభావ-సంచారీభావాలను విశేషంగా 'అలతియలతి' మాటలతో కళ్ళకూ - మనసుకూ కట్టేటట్లుగా ప్రస్తుతీకరించటానికి, ఆయా పాత్రల మౌలిక మనః ప్రవృత్తులను అవగాహన చేసుకోవటం ప్రధానం. ఈ విధంగా పాత్రల మౌలిక మనః ప్రవృత్తులను అవగాహన చేసుకొనేందుకు లోకజ్ఞత - లోకంలోని మనుష్యులు వివిధ

పరిస్థితుల్లో ఏవిధంగా ప్రవర్తిస్తారనేది గాఢంగా పరిశీలించ వలసిన — పరిశీలనాశక్తి కవికి అవసరం. ఒకప్పుడీశక్తి ఉన్న కవికికూడా పరిశీలించే విస్తృతావకాశం లభించకపోవచ్చు. అది ఆ కవి జీవితంలోని పరిమితులకు సంబంధించింది. తిక్కనగారికి ఆయన జీవితాన్నీ, జీవన విధానాన్నీ, జీవ లక్షణాన్నీ బట్టి మానవ మనఃప్రవృత్తుల్లోని వైవిధ్యాన్నీ, జీవుని వేదనా స్వరూపాన్నీ అనంతంగా పరిశీలించి అవగాహన పరచుకొనే శక్తి యొక్క సర్వతోముఖ విజృంభణకు కలిగిన విస్తృతావకాశం మరే కవికి కూడా కలిగినట్టు కన్పించదు. అందుకే అది ఆయన కవితాశక్తితో సమన్వితమై ఆయన రచనలో అమేయమైన ఆత్మీయతా విలసనాన్ని సంతరించుకున్నది. భారతంలో ప్రసిద్ధమైన పాత్రలే పదుల్లో ఉన్నాయి. అప్రసిద్ధమైన వాటిని, అప్రధానమనిపించేవాటిని లెక్కవేస్తే—తొందరలో తేలదు. అయితే, చమత్కారమేమంటే, ఇన్నిన్ని పాత్రలు—అనేక స్థాయిలకు చెందినవి, కొన్ని కొన్ని సందర్భాలకే పరిమితమైనవీ, కానివీ—అనేక సందర్భాల్లోనివీ, మానవ, మానవేతర పాత్రలు యే ఒకటి మరొకదానివలె ఉండకపోవటం. వీటన్నిటిని కూడా బీరువోని విధంగా, దేనికదిగా గుర్తుపట్టేందుకు వీలుగా చిత్రించటం బ్రహ్మవంటివాడు మాత్రమే చేయటానికి వీలయిన విషయం. అందుకే తిక్కన గారిని 'కవిబ్రహ్మ' అనటం. ఈ అన్నది మరెవరోకాదు, ఆ భారత రచనలో తానూ ముప్పయ్యారో వంతు భాగం పంచుకొన్న ఎఱ్ఱనగారు (హరి 1-9).

లోకంలోని వ్యక్తులను మాదిరిగానే, కావ్యంలోని పాత్రలను గూడా— స్థూలంగానే కావచ్చు—రెండు వర్గాలుగా విభజించవచ్చు. ఒకటి : భావ ప్రధాన వర్గం, రెండు: చేష్టా ప్రధానవర్గం. భావ/చేష్టా ప్రాధాన్య వివక్షయా ఈ విభాగం గమనింపదగింది. భావ ప్రధాన వర్గానికి చెందిన పాత్రల్లో వాక్, చేష్టాదుల బహిర్ వ్యక్తీకరణలో మితత్వం అధికంగా ఉంటుంది. ఇవి పాఠకుల ఆలోచనాశక్తిని ఎక్కువగా వాంఛిస్తయి. వాటి ఆకర్షణ నెమ్మదిమీద పరుచుకొని ఉంటుంది. మరి, చేష్టాప్రధానమైన పాత్రల్లో కదలిక, వేగం, విసురూ అధికం. ఇవి తొందరగా పాఠకుని మనస్సును ఆకట్టుకుని ఆకర్షణను ఉద్దీప్తపరుస్తయి. తిక్కనగారి చిత్రణ పొందిన పాత్రలన్నీ గూడా చాలావరకు చేష్టా ప్రధాన వర్గానికి సంబంధించినయి. అందుకే అనుభావ, సంచారీ భావాదుల చిత్రణ

వాగ్వైఖరీ వైచిత్ర్యం, వైశిష్ట్యం, ఆక్షిప్తకాక్వాదుల విస్తృతి సర్వతోముఖంగా ఉండి నాట్యాయమానంగా భాసిస్తుందా రచన.

చిత్రించవలసిన పాత్రల వైవిధ్యంగానీ, సన్నివేశాల వైవిధ్యంగానీ, అనుభావ విశేషాల ప్రాచుర్యంగానీ, ఉత్తర రామాయణ విషయం అట్లా ఉండగా, ఆరింట ఐదు వంతుల, విశాలమైన పరిధిగల భారతాన్ని తమ రచనా విషయంగా ఎన్నుకొన్న తిక్కనగారికి కలిగినంతగా మరే కవికీ కలుగ లేదు. చెప్పుకోదగినంతలో కొంత అధికంగా కలిగిన కవి పాల్కురికి సోమనాథుడు. మిగతా విషయాల నట్లా ఉంచితే, ఈ విషయంలో తిక్కనగారి కన్నా పూర్వుడుగా ఆయనకూ్కడా స్ఫూర్తి కలిగించి ఉంటాడనిపించేంతటి శక్తిమంతుడైన సోమనాథుడు కూడా ఈ నాటికి మనకు తిక్కనగారి తరువాత మాత్రమే చెప్పుకోతగినవాడనే అనిపిస్తుంది. ఎఱ్ఱనగారి విషయం ప్రస్తుతానికట్లా ఉంచితే, ఆ తరువాత వెన్నంటి వచ్చేవారు నాచన సోమనాథుడు, పోతనగారు. వీరందరిట్లా ఉండగా, తిక్కనగారి తరువాత కవులందరి పరిధులూ విస్తృతి పొందదగినంత వైవిధ్యం లేనివి. అనేక పరిమితులతో ఆ పరిధులు కుంచించుకొని పోయి ఉండటం మూలాన, ఆమాత్రపు పరిధుల్లోనూ పరిమితంగా/పాక్షికంగా మాత్రమే ఈ లక్షణం వ్యక్తమౌతుంది, అంతలోనే కొంత విశేషంగా దృశ్యమానమయ్యేది అనంతుడు, దుగ్గన, సూరన వంటివారిలో. కాగా, ఇక్కడ ఒక అంశం గమనించవలసి ఉన్నది. కవి పరంపరలో సాహిత్యాన్నీ, సమాజాన్నీ ప్రభావితం చేయగల శక్తిమంతులు ఎప్పుడూ కొందరు మాత్రమే. వీళ్ళల్లోనూ ఉత్తరోత్తరులు తమ తమ విశిష్ట జీవలక్షణాలను ప్రధానీకరిస్తూనే, పూర్వపూర్వుల రచనల్లోని విలక్షణాంశాలను తమ రచనల్లో వారి వారి వ్యక్తిత్వపు పోకడల కనుగుణంగా అనువర్తింప జేస్తుంటారు. కొన్ని చోట్ల బుద్ధిపూర్వకంగానూ, కొన్ని చోట్ల యాదృచ్ఛికంగానూ ఇది జరుగవచ్చు. 'వచియింతు వేములవాడ భీమన భంగి ఉద్దండ లీల నొక్కొక్క మాటు...' ( కాశీ. 1-13. ] ఇత్యాదిగా శ్రీనాథుడు చెప్పటం ఈ రీతినే సూచిస్తుంది. ఇదిట్లా ఉండగా, తిక్కనగారంతటి శక్తిమంతుడుగా కన్పించే శ్రీనాథుడు రంగప్రవేశం చేయటంతో తెలుగు సాహిత్యం గణనీయమైన విచిత్ర పరిణామానికి లోనైంది. ఈ విధమైన పరిణామానికి, నిజానికి, బీజావాపన

చేసింది ఒక విధంగా నాచన సోమనాథుడే అనవచ్చు. ప్రధానంగా వస్తువు నెన్నుకోవటానికీ, భాషను వైభవీకరించటానికీ సంబంధించిందీ పరిణామం. ఉభయ కావ్యప్రక్రియా వైఖరిని నెమ్మదిగా తెరవెనక్కు పంపించి, కేవల కావ్య ప్రక్రియా విలాస వైఖరిని నైషధాంధ్రీకరణం ద్వారా శ్రీనాథుడు మోహినీ రూపంగా[1] తెలుగు సాహిత్య రంగం మీదికి అవతరింప జేయటంతో ఈ పరిణామం స్పష్ట ప్రతిపత్తిని పొందింది. సంస్కృత సాహిత్యంలో వచ్చిన మాదిరి పరిణామరీతి తెలుగుభాషా సాహిత్యంలోనూ క్రమంగా వచ్చేదే. దాన్ని మరింత వేగవంతం చేసింది శ్రీనాథుడు. పాండిత్య/ సాహిత్య క్షేత్రయాత్రలలో దేశాన్ని ఆయన చుట్టుముట్టి రావటంతో తెలుగు సాహిత్య భాష ఒకానొక విచిత్రమైన 'పలుకునుడికారా'న్నీ, 'ప్రౌఢి'నీ; విమోహకమైన నగిషీనీ, జిలుగు మెరుగునూ; పద్యరచనా విలాసాన్ని విశేషంగా సంతరించుకున్నది. వస్తు వైవిధ్యం/ వైశిష్ట్యం/ వైశాల్యంకన్నా రచనా వైభవం/ వైశారద్యం/ వైభోగం కొన్ని మెట్లు పైకెక్కి కూర్చున్నది. సమాజం మొత్తాన్ని సమావరించుకోవలసిన స్వభావాన్ని కోల్పోయి పాక్షికమైన అంశాలకు పరిమితంగా వస్తువు కుదించుకు పోవటం ఈ సందర్భంలో గమనించవలసిన అంశం. సామాజికోపయోగితకన్నా తాత్కాలిక వినోదలక్షణం అటు వస్తువునూ, ఇటు రచననూ సమావరించుకోవటం దాదాపుగా సర్వత్ర గమ్యమానమవుతుంది. అనేక మంది కవులు ఆస్థానాలనూ, ఇతరమైన ఆశ్రయాలను సంపాదించుకోవటం, అందుకు ప్రయత్నించటంతో వాళ్ళ జీవితాలే కాక, ఆలోచనా విధానం కూడా కొన్ని కొన్ని సామాజిక వర్గాలకే పరిమితమై పోయినట్టు కన్పిస్తుంది. దీంతో కావ్యరచనకు అవసరమైన స్ఫూర్తి సమిష్టి సమాజం నుంచి కాక, అధికంగా అంతరంగంలో నుంచీ / పూర్వ సాహిత్యంనుంచి వారి వారి జీవలక్షణాలను బట్టి పొందటం మామూలైపోయింది. తెలుగు సాహిత్య పరిణామ రీతిని స్థూలంగానే కావచ్చు, పరిశీలిస్తే వ్యక్తమయే ఈ విధమైన పలుకారణాలవల్ల తిక్కనగారు నిర్వహించిన, నెలకొల్పిన సాహిత్య ప్రమాణాలు ఆధునిక కాలందాకా చాలావరకు అచుంబితంగానే ఉండి పోయినయి.

1. శ్రీనాథుని కవితా మోహిన్యవతార స్వరూపాన్ని గుంటూరు శేషేంద్ర శర్మగారి 'సాహిత్య కౌముది' వ్యాస సంకలనంలో విశదంగా గమనించవచ్చు.

ఈ స్థితికి ఈ సుదీర్ఘ కాలంమీద రెండో మూడో అపవాదాలు ఎప్పుడూ ఎక్కడో ఉంటూనే ఉంటాయి. అవి ప్రత్యేకంగా గమనించదగినవి.

## 6

తిక్కనగారి రచనా విశ్వరూపంలో అనేకాంశాలను— 'కథాకల్యత్వ సంపత్తి' (ద. కు. చ. 10-192), నాటకీయత, మానసిక తత్త్వ /దశా పరిశీలన/ విశ్లేషణ చిత్రణ, వస్తు ప్రస్తుతీకరణ, భాషాచ్ఛందః ప్రయోగవిశేష వైలక్షణ్యం, అనేక విధ శిల్ప రహస్యాలూ – మొదలైన అనేకాంశాలను విడి విడిగానూ, వర్గీకృతంగానూ, సమష్టిగానూ ఎంతగానైనా పరిశీలించు కోవచ్చు, విశదీకరించుకోవచ్చు. ఈ పని జరిగింది, జరుగుతూనే ఉంది, జరుగుతుంది కూడా. త్రికాలా బాధ్యంగా ఈ పని సాగుదలకు తట్టుకోగలిగిన నిధి అది. ఈ విషయం అట్లా ఉండగా, ప్రధానంగా అవగాహనకు రావలసిందీ/ వచ్చేదీ— సమకాలీన సామాజిక పరిస్థితుల వత్తిడిలోంచి ఉత్పన్నమైన అవసరాన్ని గుర్తించి, దాన్ని తీర్చటమేగాక, అనంతర సుదీర్ఘ కాలంమీద గూడా అవసరాలను తీర్చటానికి అవకాశాన్ని కల్పించే, సూచించే మహారచనగా, మహా కవిత్వ దీక్షగా అది రూపొందటం, కర్మజ్ఞాన సమన్విత ధర్మాద్వైతమైన[1] వైదిక భావ భూమికమీద జన సంప్రార్థ్యమైన ఆనంద సాంద్రస్థితిని సంతరించిన తిక్కనగారి ఉదాత్తమూ, ఉత్తాలమూ ఐన సమన్విత సాహిత్య వ్యక్తిత్వం. అందుకే అది ఈ నాటికీ గౌరీశంకర శిఖరంగా సంభ్రమాశ్చర్యాలు కలిగిస్తూనే, నిత్యోజ్జ్వల్యమానంగా ఆలోచనను ఉత్తేజితం చేస్తూ చైతన్య స్ఫూర్తినీ కలిగిస్తూ ఉన్నది.

*సంప్రదించిన గ్రంథాలు..*


1. విజ్ఞాన సర్వస్వం, సం. 8. తెలుగు భాషాసమితి.
2. The History and Culture of the Indian People. vol. 5. -Bharathiya Vidya Bhavan.
3. భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్ర. భా. 1. , –తారాచంద్ అను : భూపతి లక్ష్మీనారాయణరావు.
4. యుగాంతం. , ఇరావతి కర్వే. అను : బాలచంద్ర ఆప్టే. (కేంద్ర సా. అకాడమీ ప్రచురణ. )

(ఇతర సూచికల్లో సూచితమైన గ్రంథాలు ఉండనే ఉన్నాయి గదా.)


1. చూ. ఆం ప్ర. సా. అకాడమీవారి భారతం భీష్మ పర్వం ప్రతికి డా. కేతవరపు రామకోటిశాస్త్రిగారి పీఠిక,

# శ్రీనాథుడు - సమకాలీన సమాజము

—రావి భారతి

(ఉపన్యాస సంక్షిప్తపాఠం)

కవితా సృష్టికి సమాజమే ఆధారము. ఉత్తమ కవిత్వ మెప్పుడు స్తబ్ధము కాదు. అది నిత్య చేతనాత్మకము. దీనియందు సమాజమునందలి వెలుగు నీడలు వ్యక్తమగును. కనుక సామూహిక స్వభావమును, చైతన్యమును వ్యక్తము చేయునదే ఉత్తమ సాహిత్యము. తెలుగులో ప్రాచీన సాహిత్యము కొంతవరకు మాత్రమే ఈ ఉద్దేశమును నెరవేర్చగలిగినది. పురాణములు మధ్యకాలపు ప్రబంధములు ఇందులకెంతమాత్రమును పనికిరావు. దీనికొక కారణమున్నది. అది రాచరికపు వ్యవస్థ. ఈ వ్యవస్థకు ముఖ్య లక్షణములు రెండు. 1. తరతరాలుగా రాజ్యాధికారము ననుభవించుట. 2. ప్రజలను అన్ని విధముల అస్వతంత్రులను చేసి, వారి ఆలోచనాసరణిని తమ వ్యవస్థకు అనుగుణముగా మార్చి వారిని మానసిక దైహిక బానిసత్వమునకు గురిచేయుట. ఇది నిరాటంకముగ సాగుటకు, తమ పేరు ప్రతిష్ఠలు లోకమున ఆచంద్రార్కముగ నిలుచుటకు కవులను చేరదీసి తమ కీర్తిని గోరంతలు కొండంతలుగా గానము చేయించుకున్నారు రాజులు. ఆ కాలములో కవులలో సామాజిక స్పృహ నాశించుటవలన ఫలము లేదు.

శ్రీనాథుడిట్టి వ్యవస్థలో, కాలములో వచ్చినవాడు. కనుక అనాటి సమాజము పట్ల తన బాధ్యత నెంతగా నిర్వర్తించినాడో మనము పరిశీలింప బూనినచో కుందేటి కొమ్ము సాధింప బూనుటయే యగును. కాని శ్రీనాథుడు తక్కిన కవులవంటివాడు కాడు. కేవలము రాజాస్థానము నంటిపెట్టుకుని ప్రజాజీవనముతో నెట్టి సంబంధమును లేనివాడుకాడు. తెలుగు సాహిత్యములో ప్రజాజీవనములో శ్రీనాథకవి కున్నంత ఎక్కువ సంబంధము మరేకవికి లేదని చెప్పవచ్చును. ఒక చరిత్రకారుడు శ్రీనాథుని చరిత్ర చెప్పుట యనగా నాటి ఆంధ్రదేశ చరిత్రను చెప్పుటయే అన్నమాట ఎంతేని సత్యము. కేవలము ఆంధ్రదేశమే కాక దక్షిణ దేశము కూడా పర్యటించినాడు శ్రీనాథుడు కాశిని కూడా సందర్శించి

నట్లు కొందరు సాహిత్య విమర్శకులు చెప్పుచున్నారు. ఆంధ్రదేశములో ఆయన చూడని ప్రాంతము లేదేమో. శ్రీనాథుడు సందర్శింపని రాజాస్థానము లేదు. పరస్పరము శత్రువులైన రాజుల ఆస్థానములలో సమానముగా గౌరవమును చూరగొన్నాడు. కొండవీడు రాజమహేంద్రవర రెడ్డి రాజ్యములు, ఈ రెండిటికీ కూడా ప్రధాన శత్రు రాజ్యమయిన రాచకొండ పద్మనాయక రాజ్యము, కొండవీడు-విజయనగర రాజ్యములు పరస్పర శత్రువులైనా శ్రీనాథుని సన్మానించాయి. శ్రీనాథుని దేశాటనము, నానా రాజ్య సందర్శనము, ఆయా ప్రాంతముల ప్రజాజీవన విధానము నవగాహన చేసికొనుటకు తోడ్పడినవి. తాను దర్శించిన ప్రకృతిని భీమ, కాశీఖండాది కావ్యాలలో వర్ణించినట్లే, తాను దర్శించిన ప్రజాజీవనాన్ని చాటువులలో వర్ణించినాడు శ్రీనాథుడు.

ఆనాటి ఆంధ్రదేశ చరిత్రతోడను, ప్రజాజీవనముతోడను విడదీయరాని ఇంతటి సంబంధముండుట చేతనే శ్రీనాథుకు తక్కిన కవులకంటే విలక్షణమైన వాడయినాడు ఏ రాజకీయ, మత, సామాజిక నేపథ్యములో శ్రీనాథుడు రచనలు చేసినాడో చెప్పటంతోపాటు, ఆ నేపథ్యము శ్రీనాథుని రచనల్లో ఎట్లు ప్రతిఫలించినదో చెప్పుట ఈ వ్యాస లక్ష్యము.

మహమ్మదీయ దండయాత్ర వలన కాకతీయ సామ్రాజ్యము 14 వ శతాబ్దము ప్రథమ పాదములో పతనమయినది తెలుగు నాయకులు ఐకమత్యముగా పోరాడి, కొలది కాలములోనే మహమ్మదీయులను పారద్రోలినారు. తత్ఫలితముగా రెడ్డి, పద్మనాయక, విజయనగర రాజ్యము లేర్పడినవి ఢిల్లీ సుల్తానుల రాజ ప్రతినిధి తిరుగుబాటు చేసి, గుల్బర్గా రాజధానిగా బహమనీ రాజ్యాన్ని స్థాపించినారు. శ్రీనాథుని కాలంనాటికి ఈ రాజ్యాలు స్థిరపడినవి. రెడ్లు, పద్మనాయకులు కాకతీయుల సామంతులే కావడం వలన కాకతీయుల పరిపాలనా పద్ధతినే అవలంబించినారు. రాజ్యవిస్తరణ కొరకు దక్షిణాపథంలోని ఈ రాజులందరు ఎడతెగని యుద్ధాలు సాగించినారు.

ఆనాటి పరిపాలనా యంత్రాంగములో దూత ఒక కీలకమైన వ్యక్తి దూతను అవమానపరచరాదు. చంపరాదు గౌరవముతో చూడవలెను. దూతలు చాలావరకు బ్రాహ్మణులే. నైషధములోని దూత, ద్విజ, వంచిచార ఖు

దూతలుగా వచ్చినట్లున్న సందర్భాన్ని శ్రీనాథుడు 'విప్రనికర'మని మాత్రమే అనువదించినాడు. గ్రామ జీవనములో పురోహితుడు ముఖ్యపాత్రను వహించి నాడు. పాలకవర్గము తరువాతిదే వీరి స్థానమనుటకు "దొరల యిండ్లకు నేగి తులసియుఁ బెట్టి వరుసనిచ్చలు దినవారంబుఁ జెప్పి" అన్న నవనాథ చరిత్ర నిదర్శనము. సాధారణముగా ప్రభుత్వోద్యోగులకు మాన్యము లుండెడివి. దినవెచ్చపు కై జీతగాండ్లు కొందరుండెడివారు.

మహమ్మదీయ దండయాత్రవలన కలిగిన ఘోర పరిస్థితులను ప్రోలయ నాయకుని విలస తామ్రశాసనము వర్ణించినది. ఆ బీభత్సము వలన భయావహ మైన ప్రజల జీవనమును తిరిగి మామూలు దశకు కొనివచ్చుట రాజుల మొదటి బాధ్యతయైనది. వైదిక మతావలంబులకు, మత సంస్థలకు, మతాచార్యులకు రక్షణ, ప్రోత్సాహము కల్పించినారు. శైవ వైష్ణవ భేదము లేక రెండు మతాల వారినీ రాజులు ప్రోత్సహించినారు. అయినను మొదటితరపు రాజులు కొంత శైవము వైపుకు, రెండవ తరపు రాజులు కొంత వైష్ణవము వైపునకు మొగ్గు చూపించుట కననగును. శైవములో లింగధారణ ప్రధానమయిన పాశుపతము ఎక్కువ వ్యాప్తిలో నుండినది. శ్రీనాథుని రచనలలో నిది పలు తావుల చోటు చేసికొన్నది. కాలాముఖము, కాపాలికము మొదలైన శాఖలూ, భైరవ, శాక్త తంత్రములూ వ్యాప్తి యందుండెను. మతాచార్యుల మహిమలు వేనోళ్ళ కొని యాడబడినవి. దేవాలయములు, మఠములు సాంస్కృతిక కేంద్రములైనవి. విద్యలకు, నృత్యగీతములకు నిలయములైనవి. జైనము తెలంగాణములో వృత్తి పనివారిలో, వ్యవసాయదారులలో కొంతమేరకు వ్యాపించియుండినది. తమ అధికారమునకు ముప్పు లేనంతవరకు రాజులు అన్ని మతములను సహించినారు. తమను ఎదిరించిన అన్ని ఉద్యమాలనూ క్రూరముగా అణచివేసినారు.

శ్రీనాథుడు పల్నాటివీరచరిత్ర, క్రీడాభిరామములలోనూ, అప్పుడప్పుడూ చెప్పిన చాటువులలోనూ నాటి ప్రజా జీవనమును అభివర్ణించినాడు. శ్రీనాథుని రచనలను బట్టి ఆయనను కొందరు శ్రీనాథుడని కూడ అనినారు శృంగార ప్రధానమైన రచనలు చేయుటమే దీనికి కారణము. రాజుల, ధనవంతుల జీవిత ములో భోగలక్షణము క్రమక్రమముగా పెరుగుచు వచ్చినది. తూర్పుచాళుక్యులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగర రాజులు, తంజావూరు నాయక రాజులు

ఈ క్రమములో భోగలాలసత పెరిగినది. మహాసామ్రాజ్యములు పోయి రాజ్యములు చిన్నచిన్నవి అయినకొలది ఈ భోగలక్షణము పెరుగుచు వచ్చినది. దీనిని మతములు కూడ వినియోగించుకొనినవి. దేవదాసీలు, బసివిరాండ్రు ఇందుల కుదాహరణము. వేశ్యల కానాటి సమాజమునందు విశేష ప్రాధాన్యమున్నది. ఈ వేశ్యావృత్తి ఆనాడు చట్టబద్ధమయినదనుటకు జారధర్మాసనమే ప్రత్యక్ష సాక్ష్యము. అన్ని వర్గములకు, అన్ని కులములకు చెందినవారిలో బహిరంగముగనో, రహస్యముగనో వ్యభిచారము సాగినది. వేశ్యలను పోషించుట ఒక సామాజిక గౌరవ చిహ్నముగా ఆనాటి ధనిక వర్గము భావించినది. "కొత్తలంజెల కాముండ వుత్తముడవు" (క్రీ. పు. 64). బ్రాహ్మణ పూటకూటి యిండ్లు కూడ వ్యభిచార నిలయములుగా ప్రసిద్ధి కెక్కినవి. వితంతువుల వ్యభిచారము బాగా వ్యాపించినది. వ్యభిచార మానాడింతగా ప్రబలుటకు 1. ధనవంతుల భోగలాలసత 2. బాల్య వివాహాలు, నిరంతర యుద్ధాల వలన సిద్ధమైన వితంతువులు 3. పరిస్థితుల ప్రాబల్యము వలన స్త్రీలపై విధింపబడిన విశేష ఆంక్షలు 4. పేదరికము కారణములు. వేశ్యలు పట్టణాలకేగాక పల్లెలకు కూడా వ్యాపించినారు. నైతిక విశృంఖలత్వము ఆనాటి సమాజము ప్రధాన బలహీనతలలో నొకటి. ఒకవైపు వర్తక వాణిజ్యాలు, లలితకళలు వృద్ధిపొందినవి. మరొకవైపు సాంఘిక నైతిక జీవనము అత్యంత కలుషితమైపోయినది.

ఇది ఇట్లుండగా మహమ్మదీయ దండయాత్రలలో స్త్రీలపై అనేక అత్యాచారములు జరిగినవి. వీనినుండి తప్పించుకొనుటకు స్వజన స్వధర్మ రక్షణార్థమై కొన్ని విపరీతములైన కట్టుబాట్లు ప్రచారములోనికి వచ్చినవి వాటిలో సహగమన మొకటి — స్త్రీల నణచి ఉంచుటకు ప్రాచీన పాతివ్రత్య ధర్మములన్నింటిని పునరుద్ధరించినారు. సహగమనము నిర్బంధము గాకపోయినను సహగమనము చేసిన స్త్రీలకు నాడు పూజ్యస్థానము కల్పింపబడినది. వారిని "పేరంటాండ్ర"ని పూజించేవారు. పతివ్రతా ధర్మములలో అత్యుత్తమమైనదిగా సహగమనము చెప్పబడినది.

"చిచ్చుఁజొరఁబోవు వికచరాజీవ నేత్ర
కశ్వమేధంబు ఫలము తథ్యంబు గలుగు" (కాశీ. 2-86)

"ఎన్నికకు రోమకూపంబు లెన్నిగలవు
దివ్యవర్షంబులన్ని మోదించు సాధ్వి
నాక భువనంబు నందాత్మనాథుఁగూడి
వెఱపొకింతయులేక చిచ్చుఱికెనేని" (కాశీ. 2-91)

కాశీఖండములోని కళావత్యుపాఖ్యానములో మూలమునందు సుశీల ఉత్కటమగు విరహబాధను సహింపజాలక మరణించెనని యుండగా శ్రీనాథు డామె సహగమనము చేసినట్లు మార్చినాడు. స్త్రీ పురుషుని కేవిధముగా లొంగి ఉండవలెనో చెప్పినాడు.

"పతి పిల్వబంచినఁ బనియేమి యని వచ్చి
చెప్పిన యుడిగంబు సేయవలయు
భర్తయానతి లేక ప్రకృతి బంధునికైన
నే పదార్థమును నీగి సెట్ట
జీవితేశ్వరుఁడు దించిన యోగిరంబును
గుత్స సేయక భుక్తి గొనఁగఁ దగవు
సుఖసుప్తగు నిజేశునిఁ బ్రబోధ మొనర్పఁ
గాదనుష్ఠాన భంగములదప్ప

నొంటి నే చోటి కరుగుట యుక్తిగాదు
తడుపుగట్టక నీరాడఁ దగవు గాదు
కడపమీదను, మఱి సన్నెకంటి మీదఁ
బక్కిమీదను గూర్చుండ జాడగాదు" (కాశీ. 2-75)

"నాగరికత్వము వాచాప్రాగల్భ్యము జూపదగదు పతిముందట," "మగడు కోపించినను అలుగరాదు " పతి తన ధర్మమును నిర్వర్తించక పోయినను ఇదియేమి యని ప్రశ్నించరాదు దీనినిబట్టి ఆ నాటి భార్యాభర్తల సంబంధము కేవలము ఒక యజమానికి, దాసికి మధ్యగల సంబంధము వంటిదే నని స్పష్టమగును.

"ప్రార్థితంబైన ధన మెంతయైన నిచ్చు
ప్రాణనాథుని సరియె యే బంధువులును" (కాశీ 2-82)

ఇది ఒక భార్య భర్తకు సేవలు చేయకుంటేనే పరమార్థం. వితంతువుల పరిస్థితి మరీ అధ్వాన్నం.

> ''బైసిమాలిన పరమ నిర్భాగ్యురాలు
> విధవ, దాని యాశీస్సు విషసమంబు'' (కాశీ. 2-85)

పరిస్థితుల ప్రాబల్యము వలన ఏర్పడిన తాత్కాలికమైన కట్టుబాట్లు శాశ్వత సాంప్రదాయములుగా మారిపోవుటకు చరిత్రే సాక్ష్యము. ఏ సంఘము నందు అవసరమునకు మించిన ఆంక్షలు, కట్టుబాట్లు, ఆచారములు, నిర్బంధ విధానము అమలునందుండునో ఆ సంఘమునందు అవినీతికి అంకురార్పణము జరిగినట్లే.

ఆనాడు ప్రజల ముఖ్య జీవనాధారము వ్యవసాయము. వ్యవసాయాభి వృద్ధికి రెడ్డిరాజులెంతో కృషి చేసినారు. కాలువలు, చెఱువులు త్రవ్వించుట, అడవులను నరికి భూమిని సాగులోనికి తెచ్చుటలో వారి కృషిని శాసనములు కావ్యములు వర్ణించుచున్నవి. గోదావరి కిరువైపుల వ్యాపించి ఉన్న భూములు అత్యంత సారవంతములై అరటి, కొబ్బరి, పనస, పోక, మామిడి మున్నగు తోటల కనుకూలమై యున్నవి. కృష్ణా గోదావరీ డెల్టాలలో కపురపుభోగి ధాన్యము, తిలలు, పెసలు, బొబ్బెర్లు, చెరకు, సజ్జలు, మినుములు పండేవి. రేనాడు, పల్నాడు మొదలైన ప్రాంతములలో మెట్టభూములు విస్తారముగ నున్నం దున ప్రజలు శ్రమజీవులుగ, నిరాడంబరులుగ జీవించినారు. ఈ ప్రాంతము లందు జొన్నలే అధికముగ పండింపబడుచుండినవి. అందుకే ఆహారపదార్థము లన్నియు జొన్నతో చేసినవే అని శ్రీనాథుడు వర్ణించినాడు.

ఆనాడు గ్రామములు రాచఊళ్ళు, అగ్రహారాలు, నాయంకరపాట్లని మూడు విధములు అగ్రహారములన్నియు పన్ను మినహాయింపును పొందినవే నాయంకరపాట్లలో భూస్వాములు కౌలుదార్ల నుండి సొమ్మును వసూలు చేసి రాజునకు కొంత మాత్రము చెల్లించి తక్కినది తామనుభవింతురు రాచ ఊళ్ళలో రాజే స్వయంగా భూమిని కౌలుకిచ్చి ప్రత్యక్షముగా ప్రజల నుండి పన్నులను రాబట్టును. శ్రీనాథుడు చివరి రోజులలో గుత్తకు తీసికొన్న ఊరు ఇటువంటిదే. వ్యవసాయపు పన్ను ప్రధానమైనది. పన్ను చెల్లింపు విషయ ములో కవైనా, కర్షకుడైనా ఒక్కటే. చెల్లించకపోతే శిక్షమాత్రం తప్పదు. పల్లెజనులతో పోలిస్తే నగరవాసులు భోగజీవితాన్నే గడిపినారు.

పట్టణములు వైభవములకు, పసుసమృద్ధికి నిధానములై యుండగా పల్లెపట్లు మాత్రము మిక్కిలి హీనదశ యందున్నవి. కులమునకు పెద్దలైనను, కూటికి పేదలైన పురోహితుల్ని శ్రీనాథుని చాటువుల్లో చూడవచ్చును. బీదరికము అశౌచము పురోహితుల ఇండ్లలోనే నెలకొని ఉంటే తక్కిన సామాన్యుల సంగతి చెప్పనక్కరలేదు. కాయకష్టము మీద బ్రతికే కృషీవలులు. వృత్తులే ఆధారంగా రెక్కాడితే కాని డొక్కాడదని నిరుపేదలు ఆనాడూ, ఈనాడూ ఉన్నారు. అక్షరాస్యత లేదు, రాజకీయ చైతన్యముగాని, సాంఘిక చైతన్యముగాని లేదు. కనుక వారికసలు సమస్యలున్నవని గాని, ఆ సమస్యల స్వరూపముగాని తెలియదు. నిజమునకు బానిసత్వమును ప్రేమించు బానిసలు వారు. కనుక ఉద్యమములు లేవు. ప్రజల స్థితిని కప్పిపుచ్చి ప్రభుత్వపు వైభవమును వేనోళ్ళ పొగడు కవులకే కనకాభిషేకములు. రాచరికపు వ్యవస్థను నమ్ముకొని జీవించుటయే వారికి దొరికిన ఏకైకమార్గము.

విదేశ వ్యాపారము పెద్దయెత్తున జరిగినది. మోటుపల్లి శాసనము, వసంతోత్సవాలు, అవచి తిప్పయ్య సెట్టి ప్రశంసా ఈ విషయమును తెలుపుతున్నవి.

జీవితము విషయములో శ్రీనాథునిది ఒక ప్రత్యేక దృక్పథము.

''వాడు చేసిన ధర్మంబు వానిఁగాచుఁ
గీర్తియొక్కటి చాలదే కేవలంబు'' - (కాశీ. 2-10)

''తనువులస్థిరములు ధనములు కల్ల
కీర్తి యొక్కటి భువిని భిలము గాకుండ'' (పల్నాటి. పు. 111)

''సంపద వేళనే సకలభోగములు
పొందంగవలె ధర్మములం చేయవలయు'' (పల్నాటి. పు. 41)

అందుకే అందరు రాజులచే సన్మానాలు పొందినా, కొండవీటి రెడ్డి రాజ్యానికి విద్యాధికారి అయినా, అవసానకాలానకేమీ మిగల్చుకోలేక పోయినాడు. అగ్రహారాలిప్పించినాడు కానీ స్వయముగా స్వీకరించలేదు. తనను గౌరవించిన రాజులూ, మండలాధిపతులూ, మంత్రులూ, శ్రేష్ఠులూ పోయిన తర్వాత బ్రతుకు తెరువుకు వ్యవసాయము చేపట్టవలసి వచ్చినది. ఓఢ్ర గజపతులకు పన్నుకట్టలేక శిక్ష ననుభవించవలసి వచ్చినది. రెడ్డి రాజ్యము ఔన్నత్యం, పతనాలే శ్రీనాథుని జీవితములోనూ ప్రతిఫలించినవి.

# పోతన్నలో అభ్యుదయాంశ: కవిత్వంలో కాల్పనికత: భక్తిమార్గం

—గంగిశెట్టి లక్ష్మీనారాయణ

'పోతన్నలో అభ్యుదయాంశ - కవిత్వంలో కాల్పనికత' - ఇదీ నేను ప్రసంగించాలిసిన విషయం అయితే సంచాలకులు అనుమతిస్తే కాస్తంత స్వేచ్ఛ తీసికొని నా ప్రసంగ విషయం శీర్షికకు 'భక్తిమార్గం' అంటూ కలుపుతున్నాను. పోతనలో అభ్యుదయాంశగా విమర్శకులకు స్ఫురించిన విషయానికీ, కవిత్వంలో కాల్పనికతగా ద్యోతకమయ్యే మనోహర ధర్మానికి బీజం-ఈ భక్తిమార్గం. ఈ మాటను మనం నిత్యం ఉపయోగించుకొనే భగవదారాధనాధర్మం, భగవంతుని పట్ల తదేకశ్రద్ధ, తాత్పర్యం అనే అర్థంలో రెండు విధాల వ్యాప్తి ఉన్న ఒక సాంకేతికార్థంలో వాడుతున్నాను. ఆ రెండు విధాలు: 1. భరతవర్షంలో క్రీస్తుపూర్వం ఎప్పుడో ఆవిర్భవించిన పురాణయుగానికి నాందీగా పని చేసిన సామాజిక - మత స్థితి. ; 2. క్రీస్తు అనంతరం భరత వర్షమంతటానూ, ఆంధ్రదేశంలోనూ అల్లుకొనిఉన్న స్థితి- ఒక విశిష్ట సాహిత్యపంథాకు భూమి కయిన సామాజిక పంథా. ఆ రెండు విధాలనుగురించి ముచ్చటించేముందు సంచాలకులు శీర్షికలో ఉంచిన అంశాలను గురించి కాస్త పరిశీలించడం నా కర్తవ్యం. కనుక అందుకోంచి ఉపక్రమిస్తాను. అందులోనూ, కావ్యక్షేత్రాల్లో కష్టపడేవారం కాబట్టి 'కవిత్వంలో కాల్పనికత' అన్నదాన్ని ముందుగా చూద్దాము.

కాల్పనికత అంటే ఏమిటి ? దాని లక్షణాలేమిటి? అనేది విమర్శక పర్యాలోచన పరిధిలో ఇంకా తేలని సమస్య. 'కాల్పనికత కవిత్వానికి పుట్టిల్లు' అంటాడు ఒక పాశ్చాత్య విమర్శకుడు. 'కల్పన' అనే మానసిక తంత్రాన్ని బహుముఖాలలో దర్శించి, విశ్లేషించడానికి అనేక విమర్శకులు కృషి చేశారు. స్వభావోక్తి ప్రక్రియలను వెనుకముఖంపట్టి వక్రోక్తి-తద్వారా-ధ్వన్యుక్తివంటి

సంప్రదాయాలు సుప్రతిష్ఠ స్థితిని అందుకొన్నాక, భావయిత్రీ ప్రతిభకు కాల్పనిక వ్యాపారంపట్ల అన్వయం పెరిగింది. వర్ణించేవాడే కవి అన్న నిర్వచనం ఏర్పడ్డప్పుడు, కంటెదురుగ్గా కనిపించినదాన్ని వర్ణించేవాడనటం కంటె, కల్పనలో అనిపించేదాన్ని వర్ణించేవాడనే అర్థవ్యాప్తి ఏర్పడింది. దృశ్యసౌందర్యం-అథవా-వాస్తవికత కంటె, ఊహాసౌందర్యం-అథవా-కాల్పనికతపట్ల ఆర్యావర్త కవులకు ఆదరం పెరిగింది. అదే సంప్రదాయమై, దానికొక వేదాంత పరిపుష్టి కూడా ఏర్పడింది. ప్రాచీన కవుల్లో కాల్పనికతను దర్శించేటప్పుడు, దాని స్వరూప స్వభావాలను ఆవిష్కరించేటప్పుడూ ఈ వేదాంత పరిపుష్టినంతటినీ మనం దృష్టిలో ఉంచుకోవాల్సుంటుంది. ఆ పుష్టి స్థితికే 'భక్తిమార్గం' అని పేరుపెట్టి, మనం చివరకు అందులోకే చేరుతామని ముందే మనవి చేశాను.

ఇక కాల్పనికతా లక్షణాలేమిటి? అనేది ప్రశ్న. దీన్ని గురించి మును పెన్నడో ఉన్నవారి మాటనటుంచి, నిన్న మొన్న వచ్చిన కాల్పనిక కవిత్వం-లేక-భావకవిత్వం గురించి పరిశోధించినవాళ్ళు కూడా ఇదమిద్ధంగా లక్షణ నిర్వచనం చేయలేదు. ఈ లక్షణాలను ఒక క్రమంలో వింగడించి, పరిభాష పదాలను తగిలించి, చూపిస్తే-మనపని కొంత సుకరమై తీరుతుంది. ఆ లక్షణాల్లో కొన్ని: 1. ఆత్మీయత 2. ప్రకృతిని జడప్రకృతిగా కాకుండా, ఆత్మాశ్రయత్వంతో వర్ణించడం, 3. భావోద్వేగానికీ, శబలతకూ ప్రాధాన్యం, 4 అందుకు సంబంధించిన శిల్పం నగిషీ పనితనాలు, 5. కరుణకూ, విప్రలంభ శృంగారానికీ అధిక ప్రాధాన్యం ఇవ్వడం...ఇలా మరికొన్నిటిని వింగడించి, పరిభాషను తగిలించుకొంటూ పోవచ్చు. ఎంతపొడుగు బంతి పేర్చినా, మొదటుండే ముఖ్యపీఠం ఒక్కటే నేను! అనేది. కవిలోని 'నేను' పరాక్రమించే కొద్దీ కల్పన ముసురుకొంటుంది. కొండపీటి మబ్బుల్లాగా కమ్ముకొంటుంది. అదే నేను పరాస్తమైతే కథాకథనం మాత్రం మిగులుతుంది. ఐతిహాసికత ఆత్మ అయిన పురాణం పేరుకొంటుంది పోతన్నలోని నేననే ప్రత్యయం ఒక మహా భక్తునిగా రూపుపోసుకొంది. అడుగడుగునా అతని అహంత భక్తిపారవశ్యంలో రవళించింది. 'నన్నయ తిక్కనాది మహానుభావు లెందరు వెలసినా, భాగవతాన్ని తెనిగించకుండా నాకే వదిలేశారు. నేను జెప్పి భవహరాన్ని పొందుతాను' అంటూ, తానూ-తన ముక్తి అనే స్పృహతో తెనుగు భాగవతాన్ని అందు

కొన్నాడు. నవవిధ భక్తిసూత్రాల్లోనూ తానే అంటూ, వింటూ కొనసాగాడు. అందుకే, ఆ ఆత్మీయ మనోజ్ఞ భావశబలత మూలంగానే ఇంకే కావ్యం పొందనంత గొప్పగా, భాగవతం తెలుగునాట గౌరవాన్ని పొందింది. ప్రతి తెలుగువాడి హృదయంలోనూ ప్రియంగా ఒదిగింది. శ్రోతా-కవీ ఎదురు బదురుగ్గా కూర్చొని పలకరించుకొనేటంత పరిపాటి వచ్చింది. కాల్పనికత అంటే వాస్తవ వ్యతిరిక్తమైన శుద్ధ కల్పనా ప్రపంచాన్ని అక్షరాల్లోకి కుదించటం కాదు; కవీ శ్రోతా పరస్పరం ఎదురైనంతగా స్పందించటం. భావానుభవాన్ని సమంగా పంచుకోవటం, కథకోసం దొర్లిపోయిన కొన్ని భాగాల్లో తప్పితే, ఎక్కువభాగం ముఖ్యంగా దశమ స్కంధ పూర్వభాగం పోతన్న కాల్పనికత అతిశయాన్ని ఘనంగా చాటుతుంది. పై అనుభావ్యతను ఆబాలగోపాలం అందరికీ అందిస్తుంది. ఆ పసిడిసిరికి కారణం ఆయన భక్తిమార్గమే అనటం కేవలం పునరుక్తి

ఇక 'అభ్యుదయాంశ' అనే విషయానికి వద్దాము. అభ్యుదయమనే మాటకు ఈనాటి సాహిత్య ప్రపంచంలో చాలా అర్థాలు ఉన్నాయి. అభ్యుదయ కవిత్వం అనేది ఒక ఉద్యమమై పెల్లుబికి, పాతికేళ్ళపాటు అఖండంగా ప్రవహించి, కొండకొమ్మల్లోకి చేరుకొన్న దినాల్లోకూడా అభ్యుదయం పట్ల సరైన అవగాహన ఆవిష్కృతం కాలేకపోయింది. సమాజంలోని వస్తుస్థితిని ఆవిష్కరిస్తూ, అతార్కికమైన మౌఢ్యభావాలను తిరస్కరిస్తూ, సర్వజనసౌభాగ్యాన్ని దృష్టిలో ఉంచుకొని ముందడుగు వేయడం అభ్యుదయం. వికాసం మలుపుల్నిబట్టి ఎప్పటికప్పుడు దీని విలువలూ-ప్రమాణాలు మారుతూంటాయి. "ఇమ్మనుజేశ్వరాధముల'కంటూ తిట్టిపోసినా కడకు ఇచ్చింది శ్రీహరికేగా?'' అంటూ గోపీచంద్‌గారు కటాబొటిగా చప్పరించినప్పుడు, సమాధానంగా చంద్రంగారు చెప్పినమాట— ''తన కావ్యాన్ని రాజులకివ్వ నిరాకరించి, భూమి దున్నుకు కుటుంబ పోషణ చేసుకొంటానని చేసిన సవాలుయొక్క గొప్పతనాన్ని గోపీచంద్‌గారు గ్రహించలేదు. అందుకే పోతన సగర్వంగా చెప్పుకొన్న మాటలలో జమీందారీ తత్త్వానికి ఎదురు తిరిగిన రైతుకవి హుందాను గోపీచంద్‌గారు గ్రహించలేకపోయారు.'' పోతన్న గురించి మనం తరతరాలుగా వింటున్న జనగాథను ఆధారంగా చేసికొని, సజావుగా అంచనాకట్టి చెప్పిన మాటలివి. సమకాలీన రాజరిక వ్యవస్థను తిరస్కరించి, శ్రీహరి శరణం వేడిన వాక్స్వేచ్ఛా

జీవి రూపం పోతన్నది. అదే ఆయనలోని అభ్యుదయాంశంగా తళుక్కు మంటోంది. రాజ వ్యవస్థను కాదన్నా, కడకు చేరింది మరో మౌఢ్యమైన మత వ్యవస్థ వద్దకే కదా అంటూ తీసెయ్యడం కాదు. 'రాచరికాన్ని తిరస్కరించిన వాళ్ళకు భక్తి మార్గం ఒక ఆశ్రయం. అందాకా అది అభ్యుదయం' అన్న సూక్ష్మాంశాన్ని గుర్తించాల్సి ఉంది. కాళహస్తీశ్వర శతకం లాంటివి ఆ అభ్యుదయ మార్గంలోనే వికసించాయి. ఆ నాటి పెత్తందారీ స్థితిపట్ల పరాఙ్ముఖతనూ, ఈసడింపునూ ప్రతిభాపూర్వక వాక్స్వేచ్ఛతో ప్రదర్శించాయి. ఆ స్వేచ్ఛా, దాని వెనుక ఉన్న ఊపూ, నిబ్బరం భక్తిమార్గం ఇచ్చిన ప్రత్యయాలు. ఆ మార్గాన్ని విపులీకరించడానికి పూర్వం, పై జన ప్రసిద్ధగాథలోని నిజానిజాలను మరికొంత గమనించాల్సి ఉంది.

కవితారీతుల్ని బట్టి, లోకం కథల్ని బట్టి మనకిద్దరు పోతన్నలు కనిపిస్తున్నారు. ఒకరు - భోగినీ దండకం, వీరభద్ర విజయం, భాగవత కావ్యాలు వ్రాసిన పోతన్న[1] "భవిజూడక, భవిడాయక భవుపదముల గొల్చి, ఘోర భవభంజనులై, భవదూరులైన పుణ్యుల భవు నర్చన చేసి వరము బడసిన వారిని" సన్నుతించి, పిన్నతనమనీ, పెక్కు సంస్కృతులు వినలేదనీ అత్యంత సహజమైన నమ్రతను ప్రకటిస్తూ, ఇవటూరి సోమనారాధ్య దివ్య శ్రీ పాద పద్మారాధకుడై వీరశైవం పూని, వీరభద్ర విజయం రచించి, ఆ పైన కావ్య కళలో నిష్ణాతుడై, రాచకొండ సింగనకు కరమిష్టుడై, ఆయన కోర్కిమేరకు, ఆయన ప్రియురాలి మీద కూడా పదం కట్టి, శృంగార దండకాలకు తెలుగులో శ్రీకారం చుట్టి, ఆ పిమ్మట ఆముష్మికచింతన లావై, సంసారయోగంనుండి అద్వైతం పాలబడి, అక్కడా తృప్తిదొరక్క, కడకు భక్తిమార్గంజేరి, పారమ్యం పొంది భాగవత కల్పతరువును లోకంలో వెలయింపజేసినవాడు.

ఇక రెండవ వాడు : చదువు సంధ్యల్లేని సామాన్య రైతైనా, మధ్యలో స్వాములవారి దయతో మంత్రబలంవల్ల కావ్యవిద్యను పట్టుకొని, ఏకంగా భాగవ

1. కర్తృత్వ విచార చర్చలోకి దిగనవసరం లేదు. మూడూ ఆయన రచనలనే విశ్వాసం.

తాన్ని చెప్పి, రాచకొండ సింగమనాయడు - సాక్షాత్తు వసంతావనీ నాథ సోద రుడు ఎంతగా బలవంత పెట్టినా, కావ్యకన్యను అమ్మకుండా రామాంకితం చేసి అష్టకష్టాలూ పడ్డవాడు. ఈ కథకి తోడు, మరొక చోద్యం కూడా. తలా తోకా లేకుండా మల్లన్న పద్యం పోతన్నకు తగిలించి, ఆయనకు కొడుకుగా కూడా చేశారు కథకులు. ఇంగితమున్న వాళ్ళెవరూ నమ్మలేనన్ని ఐతిహ్యాలు. అందులో భాగంగానే, ''ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి...కాలుచే సమ్మెట వాటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చె నీ బమ్మెర పోతరాజొకడు'' అనే అసాధారణ మైన ఆత్మప్రత్యయం స్ఫురించే అందమైన పద్యాన్ని అందంగా చొప్పించారు వ్రాతప్రతుల్లోకి. సహకర్తృత్వం వహించిన సమకాలీనుల్లో లేదు, స్వయాన మను మలు వ్రాసిన కృత్యవతారికల్లో లేదు, కథల్ని పోగెయ్యడంలో సిద్ధహస్తుడైన అప్పకవి కాలానికి లేదు, 18వ శతాబ్దిలోని తిమ్మన్న కాలానికి ఊడిపడింది. ఈ పద్యాన్ని బట్టి, పద్యంచుట్టూ అల్లిన ఐతిహ్యాన్ని బట్టి, జమీందారీ స్థితి నెదిరించే రైతు హుందాతనం గురించి గంభీరమైన అంచనాలు వచ్చాయి. అభ్యుదయాంశ విచారానికి అంకురార్పణలు జరిగాయి.

అయితే రాచరికాన్ని పోతన పూర్తిగా తిరస్కరించాడా? భాగవతంలోని అనేక అంశాలు రాచరిక వ్యవస్థను, క్షత్రియాధిక్యతను సమర్థించేవిగానే ఉన్నాయి. "సర్వవేదమయుండు బ్రాహ్మణుండు; సర్వదేవమయుండు క్షత్రి యుండు" అని నిష్కర్షగా చెప్పిన పోతన రాచరిక వ్యవస్థకు వ్యతిరేకి అని చెప్పలేం.

సప్తమ స్కంధంలో నారదుడు ధర్మరాజుకు వర్ణాశ్రమ ధర్మాలను తెలిపే ఘట్టంలో ఇలా ఉంది: ద్విజునకు యజన యాజనాధ్యయ నాధ్యాపన దాన ప్రతిగ్రహంబులను షట్కర్మంబులు విహితములు. రాజునకు ప్రతిగ్రహ వ్యతిరిక్తంబులైన యాజనాది కర్మంబు లైదును, ప్రజాపాలనంబును, బ్రాహ్మ ణులు గాని వారివలన దండ శుల్కాదులను కొనుటయు విహిత కర్మంబులు. వైశ్యునికి గృహ వాణిజ్య గోరక్షణాది కర్మంబులును, బ్రాహ్మణ కులానుసర ణంబును విహితములు. శూద్రుడు ద్విజ శుశ్రూష సేయవలయును.

సీ. విను కర్షణాదిక వృత్తికంటెను మేలు యాచింపనొల్లని యట్టి వృత్తి
ప్రాప్తంబుగై కొని బ్రతుకు కంటెను లెస్స యనుదినంబును
ధాన్యమడిగికొనుట
యాయావరము కంటె నధిక కళ్యాణంబు పలుగ యెన్నంల
ధాన్య భక్షణంబు
శిలజీవనము కంటె శ్రేయమాపణముల బద్ధ గింజలు దిని
బ్రతుకు గనుట

ఆ. యెదరు చోట నృపతికీ నాల్గు వృత్తులు
దగుబ్రతిగ్రహంబు దగదు తలప
నాపదవసరముల నధము డెక్కువ జాతి
వృత్తి నున్న దోషవిధముగాదు.

పలికెడిది భాగవతము, పలికించేవాడు రామభద్రుడూ, పలికితే భవహర మౌతుందని పరవశం కొద్దీ పోతన్న భాగవత గాథను తెలుగులో పలికే నాటికి[2] తెలుగునాట ఉన్న సమాజవర్తనం కూడా మనం ఈ మాటల వెంట గమనించాలి. రాజు దానం ఇచ్చేవాడే కానీ పుచ్చుకోకూడదు. శూద్రులకు ద్విజ శుశ్రూషముఖ్యం వంటి మాటలని అలా ప్రక్కకు పెట్టినా గుర్తించాల్సిన అంశాలు కొన్నిఉన్నాయి. ఆనాటికి మహాసామ్రాజ్యాలు అస్తమించాయి. క్షత్రియులు మాత్రమే పరిపాలకులుగా లేరు. మొదట్లో వైశ్యులు మాత్రమే వ్యవసాయం, గోరక్షణ, తత్ఫలవాణిజ్యం చేస్తున్నప్పటికీ అది కూడా తగ్గిపోయి, వాణిజ్యం మాత్రమే చూస్తూండడంతో శూద్రుల్లోని ఒక వర్గంవారు బానిసత్వం నుంచి విముక్తి పొంది వ్యవసాయం, గోరక్షణకు ఆధారమై, ఆ తర్వాత భూస్వామ్యంతోపాటు రాజస్వామ్యం కూడా పొందారు. ఆ వర్గాల్లోనే స్వామ్యత పొందని బలహీనులూ, ఇతర వృత్తులవాళ్లు ఇంకా బానిసత్వంలోనే ఉన్నారు. రాజరికం పొందిన వాళ్ళందరూ చంద్రుని తోనో, సూర్యునితోనో వావివరుసలు కుదుర్చుకొంటున్నారు. కవుల్ని, పురోహితుల్ని పురమాయిస్తున్నారు. రాజరికం పొందలేకపోయినా స్వతంత్రంగా

2. అనువాదమన్న స్పృహను ఈ మాటలు రానీయవు.

సుప్రతిష్ఠులైన శూద్రవర్ణాలవారు వాణిజ్యంవైపు కూడా ఎగబడుతున్నారు.[3] తమలో తాము వృత్తుల కోసం తగాదాలు పడుతున్నారు. అమాత్యాదిక నియోగాల్లో బ్రాహ్మణులే కుదుటబడ్డారు. వేదపరాయణ జీవనం తగ్గుముఖం పట్టింది. సర్వకర విముక్తమైన అగ్రహార దానాలు ఎక్కడో అరుదుగా కాని రావడంలేదు. అలాంటప్పుడు 'బ్రాహ్మణులుగాని వారివలన దండశుల్కాదుల గొనుట' వంటి మాటలు కేవలం సంస్కృత భాగవత రచనాకాలంనాటి భావజాలానికి సంబంధించినవి అని మాత్రమే గ్రహించాలి.

తెలుగునాట భాగవతం అవతరించి, పురాణ ప్రక్రియను జనప్రియం జేసింది. నారాయణరావుగారి మాటను తీసికొంటే ఆశుకవితా మార్గాన్ని గొప్పగా లోగలుపుకొంది భాగవతం. పౌరాణికుడు నిత్యం జనప్రియంగా భాగవత పురాణాన్ని గానం చేసి, వివరించి, ధర్మబోధకత్వాన్ని నిర్వహించేవాడు. ప్రత్యక్ష జీవితానికి ఉద్బోధం కలిగించేవాడు. అందుకావలసిన అనుపానులన్నీ పోతన తన రచనలో సమకూర్చాడు. రెంటిమధ్య ఇంత వైవిధ్యం ఉంటే మరి ఆతని ఉద్దేశ్యం మాట యేమిటి? ఎవరో కవి పండిత గాయకుల్ని ఉద్దేశించిగాదు పోతన భాగవతాన్ని తెలుగులోకి తెచ్చింది. తెలుగువారందరికీ వెలుగుబాట అయిన భక్తిమార్గాన్ని చూపడానికి. నిత్యప్రవచన, ప్రబోధన నిమిత్తం. అందుకే ఆ రచన పొందినంతటి ఆబాలగోపాలామోదాన్ని ఇంకేదీ పొందలేక పోయింది. మరిలాటివాటిని అందులో పొదిగించడానికి కారణం?...ఆ సీసం విషయంలోకి వద్దాము. మొదటి మాటే. ''వినుకర్షణాదిక వృత్తికంటెను మేలు యాచింపనొల్లని యట్టి వృత్తి.'' కర్షణమంటే వ్యవసాయం, దున్నడం. అది యాచకవృత్తితో సమానము, అంతకంటే యాచింపనొల్లని యట్టి వృత్తి మేలు అనడానికి ఆనాడు పొలం దున్నేవాళ్లు, ఇంకా బానిసలుగా మిగిలిపోయి యాచకసదృశులైనవారైనా కావాలి. లేదా దున్నినా యాచకస్థితి తప్పనివారైనాఐ ఉండాలి. యాయావరమని రెండో పాదంలోనూ, మూడో పాదంలోనూ ఎలాగూ చెప్పాడు కాబట్టి కర్షణమంటే యాచింపకర్మములేని ఘనవృత్తిగా కాకుండా యాచక వృత్తిలాగా అగుపిస్తోంది. కృషికి సంబంధించిన యే అంశం పట్ల

3. వణిజనుంచి బలిజ శబ్దం వచ్చిందని ఒక అభిప్రాయం.

గౌరవమున్న వాళ్ళయినా, సమకాలీనతకు చెందిన ఔచిత్యం కోసమైనా దీన్ని పరిహరించిఉండేవారు. పోతన్నగారు అన్యథా అలాటి సత్పరిహారాలను చేశాడు. మరి ఇక్కడ మాత్రం కృషిని కింది అడుగులోనే ఉంచి భూషించాడు. ఇందులో చంద్రదంగారు పేర్కొన్న జమీందారీ వ్యవస్థ నెదిరించే రైతు పుందాతనం ఏమి కనిపిస్తోంది? అభ్యుదయాంశం ఏమి స్ఫురిస్తోంది? చివరకు తేలేదేమిటంటే-కష్టాలూ, ఆపదల పాలైన మహారాజులు పాదం ముక్తాయింపుల్లో అన్న నాలుగు వృత్తులైనా చేయెచ్చుకానీ, పద్యం మొదట్లో కర్షణం మాత్రం చేయరాదు. 4 ఎత్తు గీతిలోని చివరెత్తు మాటల్ని గూడా గమనించాలి. 'ఆపద వసరముల నధము డెక్కువ జాతి వృత్తినున్న దోషవిధముగాదు.' తక్కువ జాతి వాడు ఎక్కువ జాతి వృత్తిలో ఉంటే, ఆపదవేళల్లో, అది తప్పు గాదు. తప్పుగా పరిణించగూడదు. తప్పయినప్పుడు దండన అమరాలి కదా! అయితే ఆపదవేళ. ఈ పాదం ఒక పట్టాన వ్యాఖ్యానించి చెప్పడానికి వీలు కాని మాట.

శూద్ర ధర్మాన్ని వివరిస్తున్న పద్యం— "స్తేయము లేని వృత్తియు, శుచిత్వము, సన్నుతియు, న్నిజేశులన్ మాయలు లేక దాయుటయు........." ధరామరుల సేవయు, గోవుల రక్షణంబు" ఆరంభం ఆరంభమే, దొంగతనం లేని మంచి వృత్తి అంటూ మొదలు పెట్టారు. అంటే నాడు శూద్రులంటే మొదటి మాటగా దొంగతనం గుర్తుకు వచ్చేదా? లేక పద్యం నడక కోసం ఒక పది కట్టు ప్రయోగమా? ఆ మధ్యలోనే 'బ్రాహ్మణ క్షత్రియులకు నీచ సేవనంబు కర్తవ్యంబు గాదు' అంటూ, వర్ణ ధర్మోపదేశం ముగింపులో 'జాతి మాత్రంబున బుధుని వర్ణంబు నిర్దేశింపలేరు. శమదమాది వర్ణలక్షణ వ్యవహారంబుల గన వలయు' అనే ఉదాత్తమైన భావాన్ని అందిస్తాడు. అంతకు మునుపొక పద్యంలో శమదమాదుల వంటి సద్గుణ లక్షణాలు – 'నిజలక్షణము లగ్రజాతికి నధిపా!' అంటూ అగ్రజాతికి మాత్రమే చెప్పినందువల్ల వాళ్ళలో అవి లేకుంటే అగ్ర వర్ణములు కారు అని, మనం ఒక వర్గానికి మాత్రమే ఆయన ఉద్దేశించారు అనుకో కుండా, అందరికీ అన్వయించి చూడడం మేలు.

పై పద్యభాగంలో శూద్ర లక్షణ వర్ణనలో 'గోరక్షణం' ఒకటే విహిత వృత్తి ధర్మంలో చెప్పబడింది. ఆనాటి సామాజిక స్థితినీ, వృత్తి వ్యవహారాలనీ

4 ఇది పరోక్షంగా ఆనాటి శూద్ర ప్రభువుల మీద దెబ్బకాదు కదా?

పరిశీలించటంలో ఈ మాటను లోతుగా గమనించాల్సిన అవసరం ఉంది. పోతన్న నాటి సమాజంలో శూద్రులు మరి ఏ ఇతర వృత్తుల్లోనూ లేరా? పంచాయణం వృత్తుల వాళ్ళు శూద్రజాతిలోకి రారా? వైశ్యవర్గం లోనికి వెళ్తారా? మయుణ్ణీ, మార్కండేయుణ్ణీ, వాళ్ళ సంతతినీ కుల పురుషులుగా చెప్పికొని పురాణాలను నిర్మించుకొన్న వీళ్ళు, యజ్ఞోపవీతం వంటి చిహ్నాలతో నేమి, భౌతిక కర్మాధార శాస్త్ర సంపర్కంతో నేమి, తాము నిర్మించిన వస్తువులను వినియోగంలోకి తెచ్చే విధానాలతో నేమి, వైశ్య శబ్ద పరిధిలోకి వస్తారేమో! భూకర్షణం కలిగిన వాళ్ళు కూడా వైశ్యశబ్దవాచ్యులై, కేవలం గోరక్షణం వహించే వాళ్ళు మాత్రం శూద్ర వర్గీయులౌతారా? కులనామాలన్నీ ప్రాయికంగా సామాజిక పరిభాషలోకే వస్తాయి. ఆనాటి సమాజం లోని ఆర్థికస్థాయి నిర్ధారకాంశాల్లో గోసంపద కింకా ముఖ్యస్థానం ఉంది. అప్పటికొకటి రెండు శతాబ్దుల పూర్వంవిగా చెప్పబడే కాటమరాజు కథ, పల్నాటి యుద్ధకథ వంటి ప్రసిద్ధ తెలుగు గాథల్ని తీసికొంటే, ఆ విషయం తేట తెల్లమౌతుంది. భూసంపదకంటే సుఖమైనవసతి కలిగించేదిగా గోసంపద పరిగణనలోకి వస్తుంది. అనేకంగా ఆలయాల కిచ్చిన దాన శాసనాలు కూడా ఈ అంశాన్ని వెలుగులోకి తెస్తాయి. గోరక్షణేతర వృత్తి కలిగిన శూద్రులు శూద్ర వర్ణంలోకి రారా? ఒక వంద సంవత్సరాల తదనంతరం వచ్చిన పెద్దన్న 'ఆచటి నాలవజాతి హరిముఖాత్తవిభూతి' అంటూ ప్రశస్తంగా ప్రశంసించాడాయె. పోతన్న, పై భాగంలోనే మరోచోట 'సంకర జాతులైన రజకాదు' లను అంత్య జాతులుగా పేర్కొనడం వల్ల, శూద్రులలో సంపన్న వర్గాన్ని మాత్రమే ఆయన ఉపలక్షించాడేమో!

భాగవతం ముగింపులో, ద్వాదశస్కంధాంతంలో భవిష్య పురాణకథనం చేస్తూ నిర్మొగమాటంగా భావితరాల్లోని అగ్రవర్ణజుల వర్తనాలను ఖండిస్తాడు పోతన్న. వర్ణాశ్రమధర్మ విహితులై ఎలా నిహతులౌతారో నిర్మమకారంగా పేర్కొంటాడు. ఈ నిర్మమతను కేవలం యథాతథానువాదంలోని కథాకథన వైఖరిగా భావించక్కర్లేదు భవిష్యపురాణ ప్రసక్తమైన భావితరం, తనకు సమకాలీనమైందేనన్న స్ఫూహను ఆయన వెన్నంటే ఉంటుంది. అందుకే వాళ్ళ కళ్ళను తెరిపించడానికే ఆ నిర్మమతను అవలంబిస్తాడు. పోతనలోని దివ్యాంశ అదే. భగవత్పారమ్యం పొందిన మహాభక్తుని నిర్భీతాంశ అది. ఆనాటి సమాజ

స్థితిలో అచ్చమైన అభ్యుదయాంశ కూడా అదే. అంతేకాని, చక్రవర్తుల వర్తులాన్ని ధిక్కరించి, వాళ్ళ చక్రానికి ఎదురొడ్డడం కాదు, రాజరికాన్ని తక్కువ చూపు చూడడమూ కాదు. పోతన కాలంలోని పరిస్థితిని గమనిస్తే, ప్రజలందరూ సమీకృతులై ఒక ఉత్తమ ప్రభువుకోసం అన్వేషణ సాగించడం కనిపిస్తుంది. రాచకొండ రాజ్యం అలానే అవతరించింది. కాకతీయ సామ్రాజ్య విచ్ఛిన్నానంతరం, మహమ్మదీయుల దురాక్రమణలను, దురాగతాలను ప్రతిఘటించే నిమిత్తం, స్వచ్ఛందంగా ప్రజావాహిని ఒక వీరుణ్ణి, శూరుణ్ణి వరించడానికి కదలి వచ్చింది. వీరత్వంపట్ల ప్రబోధం పెరిగింది. సర్వలక్షణశోభితులైన శూరుల వర్ణన కావ్యసీమల్లో ప్రబలింది. క్షాత్రధర్మ ప్రబోధం, ఆనాటి సమాజంలో ప్రధాన తంత్రమైంది. ఆత్మార్పణం, హింసాత్మకమైన పరిత్యాగం, రణోత్సాహం, వీరధర్మం నాటికి చారిత్రక అవసరాలయ్యాయి. మతంలోనూ, మనోవ్రతంలోనూ ఈ మార్పు మనకు బహుధా కనిపిస్తుంది. కవిత్వం యధాశక్తి ఈ భావ విస్ఫూర్తికోసం పరిశ్రమించింది. పూర్వగాధల్లోని మహావీరుల చరిత్రలను, వాళ్ళ వీరోచిత కృత్యాలను పరవశం గొలిపే విధంగా గానం చేసింది. శూరభక్తిని పెంపొందించడానికి దోహదం చేసింది. శూరభక్తి వ్యక్తి ఆరాధనకు చోటిస్తున్నదని కాదు మనం ఎన్నవలసింది, శూరభక్తి పరోక్షంగా దేశభక్తికి బీజం వేస్తుందని. నిన్న మొన్నటి కాల్పనికోద్యమ సంధికాలంలో కూడా ఈ ప్రక్రియా వ్యాప్తిని మనం గుర్తించవచ్చు. 'ఇతర దేశాలలోకూడా సమాజంలో మార్పుకోరే రచయితలు వెనుకటి గాథలనే తిరిగి క్రొత్త పద్ధతిని అన్వయించటంతో ప్రారంభించడమనే సాంప్రదాయముంది' అనే చంద్రంగారి మాటలను మనం ఈ వెలుగులో అన్వయించుకోవాలి. శూరభక్తికోసం, ఆనాళ్ళల్లో ఎన్నుకొన్న పంథా-అవతారపురుషులైన శ్రీరామ, శ్రీకృష్ణాదుల గురించి మహోత్కృష్టంగా గానం చేయడం సర్వసుగుణాభిరాములుగా, ధర్మరక్షాపరాయణులుగా వారిని వర్ణించడం. ఈ అవతారగాథావర్ణన, ఆ నాళ్లలో మనకు దాక్షిణాత్య భాగాల్లోకంటె, ఔత్తరాహ భూముల్లో అధికంగా కనిపిస్తుంది. ఔత్తరాహ భూముల్లో అవతార వర్ణన సంప్రదాయానికి అధిక ప్రాచుర్యం రావడానికి కారణం అక్కడ వెలసిన మహమ్మదీయుల ఆగడాలే. ఆ వేడి దక్షిణాని కింకా అంత దిగజేదు. దక్షిణాది మొగసాలలోనూ, ఉత్తరాది కడ అంచులోనూ ఉన్న తెలుగు భూమిలోమాత్రం తాండవిస్తోంది. అందుకోసమే ఔత్తరాహ సంప్ర

దాయాన్ని, సమకాలీన చారిత్రకావసరాన్ని గుర్తుపట్టి, పోతన్న, దుష్టశిక్షణ పరాయణుడైన భగవదవతార తత్వాన్ని ప్రశస్తంగా నిరూపించే భాగవతాన్ని తెలుగులోకి తెచ్చాడు. కడగండ్ల పాలౌతున్న తన ప్రజకు ఊరటగొలిపే విధంగా, నిబ్బరం ఇచ్చే తీరుగా, క్షాత్రధర్మం ప్రకాశించేరీతిగా భాగవత రచనను నిర్వహించాడు. 'ఒనరన్ నన్నయ తిక్కనాది కవులు' తమదాకా తన పుణ్యంకొద్దీ భాగవతాన్ని వదలిపెట్టారని పోతన్న సంతోషించడని గుర్తించడం కంటె, వాళ్ళ కాలం కంటె పోతన్న కాలానికి భాగవత రచనావసరం ఏర్పడిందని గుర్తించాలి. రాజవ్యవస్థకు కావలసినన్ని అందాలు సంతరించడంలో పోతన్న బీరు పోలేదు. ఎలాటి ప్రభువు విషయంలోనైనా, వీలైనంత వరకు న్యూనతను రానివ్వకుండా దాటెయ్యడానికే ప్రయత్నించాడు. హిరణ్యకశిపుడు వంటి పరమ అభాగవత రాక్షస శిరోమణి విషయంలో నైనాసరే, తన తమ్ముడైన హిరణ్యాక్షుడు హరిచే హతుడైన పిమ్మట, వాని బిడ్డలను, భార్యలను, తన తల్లిని చేరబిలిచి 'పరులెవ్వరు? తామెవ్వరు? పరికింపగ నేక మగుట భావింపరు! తత్పరమ జ్ఞానము లేమిని, పరులును మేమనుచు దోచు ప్రాణుల కెల్లన్'- అంటూ ఉపన్యసించిన వైరాగ్య భావాలనూ, సుయజ్ఞోపాఖ్యానాన్ని ఈశ్వర పరాయణతనూ చదివితే, హిరణ్యకశిపుని వ్యక్తిత్వం స్ఫుటంగా ఎదుట నిలిచి విస్మయం గొలిపిస్తుంది [5] తర్వాత తర్వాత ఆత్మసుతుణ్ణే, నారాయణ జపం మూలంగా ఏవగించుకొని హింసించినప్పుడు తప్ప, అతని హుందాతనానికి ఎక్కడా దెబ్బతీసే విధంగా రచన సాగించలేదు. సామాన్యమైన కావ్యక్రియా పరాయణులైతే, వీలైనంత వరకూ హిరణ్య కశిపుని క్రూరత్వానికి నగిషీలు చెక్కి ఉండేవారు కాని. ఔన్నత్యానికి ఊపిరి నిచ్చేవారుకారు. రాజవ్యవస్థకు ఆయన మెఱుగులు దిద్దిన ఘట్టాలన్నీ ఒక ఎత్తు-బలి చరిత్ర ఘట్టం ఒకటే ఒక ఎత్తు. పోతన్న లోని భక్తి వైరాగ్యాలూ, ఆత్మ విశిష్టత, భావుకత, శిల్పం అన్నీ ఒక దాన్ని మించి ఒకటి పోటీపడి సాగాయి అందులో. బలిచక్రవర్తి ఔన్నత్యం-వామనుని విశ్వాధిపత్యం

---

5 ఇక్కడొక విషయం గమనించాలి. హిరణ్యకశిపు డెప్పుడూ వైదిక మతాన్ని, వైదిక మతావలంబులనూ, విష్ణ్వన్వేషణలో హింసించాడు తప్ప, సామాన్య జనులకు-శూద్రులకు-పీడన కలిగించాడనే మాట ఒక్కటీ అగుపడదు బహుశ ఒకనాడు వైదిక వర్గానికి-అవైదిక రాజవర్గానికి జరిగిన పోరాటానికి ఈ కథ సంకేతం కావచ్చు.

అనే రెండు ప్రధాన దృక్కోణాలనూ చాలా పొందిగ్గా నడిపించాడు. విశ్వాధిపతి అయిన విష్ణువు చేతినే క్రిందుచేసి, బలి చక్రవర్తి చేతిని మీదు చేయడంలో స్వంత కల్పన లేకున్నా ఆ మీదైన వైనంలోని గొప్పతనాన్ని హృదయానికి హత్తుకుపోయేలా చెప్పడంలో పోతన్న స్వంత ముద్రా, ప్రతిభా ఉన్నాయి. బలిచక్రవర్తిని తెలుగు సాహిత్యంలో కనిపించే గొప్ప దాన వీరునిగా తీర్చిదిద్దాడేకాని, దానవునిగా చిత్రించలేదు. 'కారే రాజులు రాజ్యముల్ కలుగవే' అన్న మాటలు పోతనలోని నిరాడంబరతను, నిష్కామతను ప్రతిధ్వనించడమే కాకుండా, సమకాలీన నరపాలురకు పుష్టినిచ్చే దివ్యమంత్రోపదేశాన్ని చేస్తున్నాయి. భాగవతంలోని ఏ రాజవీరుని కథను తీసికొన్నా, దాన్నొక సుందర సందేశంగా తీర్చడానికి చేసే ప్రయత్నం కనిపిస్తుంది. అడపాదడపా బ్రాహ్మణ వ్యవస్థకే కించపాటు కలిగే స్థితి భాగవతంలో కనిపిసుందేమో కాని, రాజవ్యవస్థకు కించపాటొాదవే స్థితి కనిపించదు. మొదటిగా '[illegible]' అవతరించిన సన్నివేశంలోనే ఆ రహస్యం ఉంది. భాగవత ధర్మంలోనే అది ఇమిడి వుంది. బ్రాహ్మణ మతాన్ని వ్యతిరేకిస్తూ, క్షత్రియులు రూపొందించిన ఉద్యమం భాగవత ధర్మం. క్షాత్ర ధర్మ ప్రవేశానికి భాగవత ధర్మం ఒక తాత్విక స్వరూపం పోతన్న కాలంలోని పరిస్థితి కూడా అదే. నరపాలురను బలహీన పరచడం కాకుండా, వాళ్ళనింకా బలవంతులుగా, గుణవంతులుగా, రాజ్య రక్షణ, మత రక్షణ పరాయణులుగా తీర్చి దిద్దడానికి నాటి మత ప్రవక్తలూ, సాహిత్య నిర్మాతలూ కృషి చేశారు. ముఖ్యంగా ఉత్తర భారతదేశంలో ఆ కృషి ఫలితమే శ్రీరామ. శ్రీకృష్ణ ప్రశస్తి గానామృతాలు. క్రీస్తు అనంతర భారత చరిత్రలోని మధ్యకాలంలో కృష్ణ, రామ ప్రశస్తి కావ్యాలు అనేకం అవతరించాయి. కృష్ణుని లోని రాజకీయ చతురతా, అర్థ విద్యాపారంగత్వం, సరస నైపుణ్యం. రాముని లోని నైతికబలం, కొన్ని విలువల పట్ల చిత్తశుద్ధి, ఆచరణ పటిమా ప్రతి నరపాలునికీ అతి ముఖ్యమని పరోక్షంగా చాటి చెప్పాయి. పోతనలో రామకృష్ణాద్వైతం కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. శ్రీరామాంకితమైన తెలుగు భాగవతం, శ్రీ కృష్ణ సంకీర్తన, చింతనాల వల్లనే నేటికీ కోహినూర్ వజ్రంలాగా మెరిసిపోతోంది. సంకీర్తన, చింతనాలనే భక్తిమార్గాలకు ఉపాదేయంగా తెలుగు నాట ఎప్పటికీ శాశ్వత కాంతితో నిలిచిపోతుంది. ఆ కాంతికి నిధానమైన భక్తిమార్గ

మనే సాహిత్య పంథాని ఇక కాస్త పరిశీలిద్దాము-అదే పోతన రచనకున్న సామాజిక భూమిక, అనే విషయాన్ని గుర్తుంచుకొని

తొట్టతొలిసారిగా భారతావనిలో సాక్షాత్కరించిన భక్తి మార్గమనే సాంప్రదాయాన్ని గురించి మొదట్లోనే కాస్త సమీక్షించుకోవలసిన అవసరం ఉంది. హిందూ మతానికి ఉపాధులుగా చెప్పబడే సంహితలు, బ్రాహ్మణారణ్యకోపనిషత్తుల్లో, తాత్త్వికదర్శనానికి అద్దం పట్టేవి ఉపనిషత్తులే. విశ్వం, చైతన్యం, జీవుడు, ఆత్మ, పరమాత్మవంటి అనేక నిరూప విషయాల పట్ల అవగాహన పెంచేటందుకు భిన్నకాలాల్లో భిన్న మహర్షులు చేసిన ప్రయత్నాల ఫలితమే ఈ ఉపనిషత్తులు. నిరాకారమూ, నిర్గుణమూ అయిన పరమాత్మ చైతన్యాన్ని విశ్లేషించి, వివరించి, తర్కించే జ్ఞాన భాండాగారాలు. గొప్ప మేధాగత పరిశ్రమ లందించే అక్షరమంత్రాలు. ముఖ్యమైన ఉపనిషత్తులు వెలసినకాలం క్రీ పూ. 6వ శతాబ్ద ప్రాంతమని ఆధునిక విమర్శకు లంగీకరించినప్పటికీ, వీటి ఆరంభ వికాస కాలం అంతకు చాల పూర్వమేననీ, ప్రాయశః క్రీ. పూ. 2000 సంవత్సరాల నుంచి వీటి వికాసం ప్రారంభమై ఉండవచ్చనీ పెద్దలు ఊహిస్తున్నారు ఈ నడిమి సుదీర్ఘకాలంలో ముఖ్యంగా మొదటి సహస్రం లోపల వర్ణప్రతిపత్తి పెరగడం, జ్ఞానమార్గమైన తాత్త్వికదర్శనం కొంతమంది చేతుల్లో మాత్రమే ఉండిపోవడం, క్రమేపీ వాళ్ళకు మిగిలిన సమాజం మానసిక బానిసత్వం నిర్వహించే దశ రావడం, ఈ జ్ఞాన చైతన్యమంతా సామాన్యులకేమాత్రం అందుబాటులోకి లేకపోవడం వంటి ముఖ్యమైన పరిణామాలు చోటు చేసికొన్నాయి. ఒక్కమాటలో చెప్పాలంటే, పామరులకూ-పండితులకూ, సామాన్యులకూ, తాత్త్వికులకూ మధ్య ఒక అగాధం, దూరం ఏర్పడే పరిస్థితి వచ్చింది. ఆత్మచైతన్యాన్ని నమ్మే స్వభావం ఉన్నప్పటికీ, దాన్ని ఆకళింపు చేసికొని, దివ్యతను అందుకొనే మార్గం తనకు దూరమైనట్లు, దాన్ని తమనుంచి దూరం చేసిన వారు తమమీద అనుచితమైన పెత్తనం చేస్తున్నట్లు, యజ్ఞ యాగాది నిష్ఫల కర్మల నాధారంగా తమ ఆర్థిక మూపాలైన పశు సంతతిని కొల్లగొంటున్నట్లు సామాన్యులు అనుకోసాగారు. అందుకోసం ఉద్యమ రూపంలో విప్లవాలు లేచాయి. ఈ విప్లవోద్యమాలకు ఒకవైపు సాత్వతులు, మరొకవైపు లిచ్ఛవులూ, శాక్యులూ నాయకత్వం వహించారు. వీరందరూ క్షత్రియులే. ఇక్కడ

ఈ మాటను కొంత విపులీకరించాలి- తర్వాత తర్వాత వివరించబోయేదానికి ఇది కీలకం కనుక. సంహిత-అందులో మొదటిదైన ఋగ్వేద సంహిత-ఆర్య మత తత్వానికి సంబంధించిన రెండు ముఖ్యమైన దృక్కోణాలను చూపుతుంది. ఒక వైపు-భిన్న దేవతలను, వారిని సంతృప్తిపరచే భిన్న పూజా విధులను నిర్దేశించింది. మరోవైపు అంతకంటె అతీతంగా, ఆ దేవతా తత్వాన్ని, విశ్వతత్వాన్ని, విశ్వాత్మ వైవిధ్యాన్ని విశ్లేషిస్తూ, ఇదంతా ఒకే ఒక విశ్వచైతన్యం-పరమాత్మ-బ్రహ్మతత్వ విలాసమనే నిర్ణయానికి బీజం వేసింది. రెండవది ఉపనిషత్తుల్లో విస్తారంగా వికసిస్తే, మొదటిది-యజ్ఞయాగాది విహిత కర్మల విధుల్ని వివరించే బ్రాహ్మణాల్లో పెరిగి పెద్దదయింది. క్రమేపీ, రెండూ ప్రక్కప్రక్కనే పెరుగుతూ వచ్చినా, రెంటికీ మధ్య వైవిధ్యం కూడా పెరుగుతూ వచ్చింది. హిందూమతం పేరువద్దకు వచ్చేసరికి వీటన్నిటినీ ఒకే త్రాటికి గట్టి చూస్తాము కాని, రెండూ రెండు భిన్న మార్గాలకు కారణభూతమైనవనే అంశాన్ని విస్మరిస్తాము. అందులో మొదటిదాని ప్రాబల్యం పెరిగినందువల్లనే విప్లవాలు అవశ్యకమయ్యాయి. నిష్ఫలయజ్ఞ యాగాది కర్మ తంత్రాలకు నిలయమై, అదే తాత్త్వికదర్శనా మార్గమని పేరు వచ్చేసరికి విప్లవాత్మకమైన ఆ మార్పులకోసం ఉద్యమాలు అవసరమయ్యాయి. బ్రాహ్మణులను పట్టుకునిల్చి వర్ణవ్యవస్థకు నీళ్ళుపోసి పెద్దచేసిన వర్గంమీద, సాత్వతులు, లిచ్ఛవులూ, శాక్యులు తిరుగుబాటు చేశారు. సాత్వతులకు శ్రీకృష్ణుడు నాయకుడు. లిచ్ఛవులకు వర్ధమానుడు ప్రధాన నాయకుడు. శాక్యులకు గౌతముడు. క్రమంగా వీరే వాసుదేవ, జైన, బౌద్ధాలకు ఆది ప్రవక్తలూ, లేదా, ముఖ్య ప్రవర్తకులయ్యారు. గమనించవలసిందేమిటంటే, ఆర్యావర్త భూమికి మూడంచుల్లోనూ ముఖ్యమైన మూడు విప్లవాలు రావడం.[6] సాత్వతులు జ్ఞానమార్గం స్థానే భక్తిమార్గం ప్రవేశపెట్టడానికి కారణభూతులయ్యారు నిరాకారుడూ, నిర్గుణుడూ అయిన పరబ్రహ్మను దర్శించి, తదైక్యం పొందడం-వ్యావహారిక వృత్తుల్లోని పామరులకు కష్టసాధ్యం కనుక. ఒక విశిష్టరూప కలితుడూ, సమస్తగుణయశోవిలాసి అయిన ఈశ్వరుణ్ణి భక్తితో అర్చించి, సాయుజ్యం పొందమంది వాసుదేవ

6. చుట్టుపక్కల బయట ఉన్న ప్రభావాల ప్రభావం వీటిపై ఎంత? అనేది లోతుగా చూడాల్సిన విషయం.

తత్త్వం. నిరూప బ్రహ్మ పదార్థాన్ని జ్ఞానంతో చేరడం కంటె, భక్తితో సారూప దైవాన్ని పొందడం సులువని ఉద్ఘాటించింది. నిరూప బ్రహ్మ తత్త్వాన్ని గురించిన తార్కిక వాదాల కంటె, మానవజీవితం, జీవిత సమస్యలూ, నైతికత-వీటి గురించి అవగాహన ముఖ్యమైంది. ఈ అవగాహనే ముక్తికి మార్గమని ఉపదేశించింది బౌద్ధం. ఈ సూత్రాన్ని అంగీకరిస్తూ, జీవాత్మ-పరమాత్మల స్వరూపాన్ని కూడా అర్థం చేసికొని, పరమ ప్రాకృతిక రీతిలో నిరాడంబర జీవనం గడుపుతూ, విశ్వచైతన్యాన్ని ఆకళింపు చేసుకొనే రీతుల్ని అన్వేషించమంది జైనం. ఈ మూడింటి వైపు సామాన్య జనులకు మొగ్గు పెరిగింది. ఇవి మూడూ ప్రాచీన భారతీయతత్వం విలువల్ని క్రొత్త దృక్కోణాలతో పునరుద్ధరిస్తున్నవే. ఈ మూడింటికి భిన్నంగా బయలుదేరిందే బ్రాహ్మణమతం బౌద్ధం, జైనం, వాసుదేవం వైదికమతానికంటె భిన్నమతాలుగా మనం పరిగణిస్తే, ఈ బ్రాహ్మణమతాన్ని కూడా భిన్నంగానే పరిగణించాలి—ఇదీ వైదికమతం ఒక్కటి కాదు. వైదికమతం విశ్వచైతన్యాన్ని ఆవిష్కరించడానికి యత్నించింది. ఇది ఒకానొక సారూపమైన దేవతామూర్తుల అర్చనావిధుల్ని, కొన్ని సంప్రదాయ విధుల్ని ఏర్పరచటానికి కృషి చేసింది. నిజమైన జ్ఞానమార్గం కంటె భిన్నమైన, బాహిరమైన కర్మకాండకూ, కృత్రిమమైన ఆచార సంప్రదాయాలకూ-ప్రాధాన్యం పెంచటానికి కష్టించింది. ఇది ప్రాచీన వైదిక మతంకంటె నిక్కచ్చిగా భిన్నమైంది. జైన, బౌద్ధాలు వైదిక మతం కంటె ఎలా భిన్నమైనవో, ఇదీ అలా భిన్నమైనది. తేడా అంతా ఒకటే. జైన, బౌద్ధాలు వైదిక మతంనుంచి పూర్తి దూరంగా వచ్చి, నూత్న దర్శన మార్గాలను, బహిర్విధులతో పాటు, అంతర్దర్శనంలో కూడా మార్పును తేవడానికి ప్రయత్నిస్తే, ఇది వైదిక మతం పరిధిలోనే ఉంటూ, అంతర్దర్శనంలో కాకుండా, బహిర్విధుల్లో ప్రాముఖ్యతనిస్తూ పోయింది. పై మూడింటి విప్లవాల తర్వాత, మూడింటితోను రాజీమార్గాన్ని అవలంబించి, మూడింటి తీరులనూ లోగలుపుకోవటానికి యత్నిస్తూ మరికొన్ని సరికొత్త మార్గాలు తరువాత వచ్చాయి. భక్తితో సారూపదేవతార్చన అనే అంశాన్ని తీసికొని, ఈశ్వరునికి తోడు హరికి కూడా పీఠం వేసి, ఆ హరి వాసుదేవ కృష్ణుడూ అభేదం వంటి భాగవతులను లోగలుపుకొంది. బుద్ధుణ్ణి కూడా ఆ హరి అవతారమే అంది. ఒకనాటికి వర్ధమానుణ్ణికూడా ఆ హరి అవతారంగానే చేసింది. బౌద్ధులూ,

జైనులూ ఒక ముఖ్యమైన పని చేశారు. సమాజంలో జ్ఞానజ్యోతిని వెలిగించటానికి, బౌద్ధులు కొన్ని సామాజిక పీఠాలను ఏర్పరచుకొని, అక్కణ్ణుంచి సామాన్యులందరికీ తమ నవ్యజ్ఞానమార్గాన్ని వినిపించడం మొదలుపెట్టారు. ఎటువంటోనూ మూడు పూటలకంటె ఎక్కువ గడుపకూడదంటూ, పరమ ప్రాకృతికంగా మసలాలనే నియమం పట్టిన జైనులు, అరణ్య మధ్యాల్లో ముఖ్యస్థావరాలను కేంద్రాలను ఏర్పరచుకొని, అక్కడనుంచి నిత్యసంచార సముపార్జితమైన తమ జ్ఞానంతో గొప్ప గొప్ప మేధాగత పరిశ్రమలను నిర్వహించారు. సమాజోపయోగకరమైన భిన్న భిన్న శాస్త్రాల ఆవిర్భావ, వికాసాలకు నిత్యం పరిశ్రమించారు. జైన, బౌద్ధుల ఈ కృషి జనుల్ని చాలా ఆకర్షించింది. బ్రాహ్మణ మతము ఈ రెంటినీ లోగలుపుకొంటూ, వ్యక్తిరూపాత్మక దేవతార్చనల నిమిత్తం బౌద్ధుల ఫక్కీలో పీఠాలను, దేవాలయాలను నెలకొల్పింది. ప్రజాబాహుళ్యానికి జ్ఞానం పంచే నిమిత్తం, సమాజావగాహనను పెంచే విధంగా, వైజ్ఞానికత, నైతికత పెరగాలంటూ ఉపదేశాత్మకమైన పురాణాలను నిర్మించింది. తమ మతాన్ని జనప్రియం చేసేటందుకూ, జైన బౌద్ధ భాగవతుల దాడి నెదుర్కొనేటందుకు బ్రాహ్మణ మతం ఎంచుకొన్న కొత్త దృక్కోణాలు-వ్యక్తిరూపాత్మక దైవం, పీఠం-లేదా దేవాలయం, పురాణం. ఇందులో పురాణాన్ని మొట్టమొదటి సామాజిక విద్యా పాఠ్యగ్రంథం - (First formal text of Social Education) అనొచ్చు. ఈ పురాణాల మూలంగా, బ్రాహ్మణ మతం ప్రత్యేక రూపం ఒక విధంగా తెరమరుగౌతూ, సమ్యగ్రీతిలో హిందూ మతావిష్కరణకు సంబంధించిన ప్రయత్నం జరిగింది. నవీన దర్శనాలు, ప్రాచీన దర్శనాలు, బహుపూర్వచరిత్రలూ, సమాజ స్వరూపాలూ అన్నీ కలిసి, జానపదుల హృదయాన్ని ఆకర్షించే ధర్మాల్లో ఒక్కటైన అభూతకల్పనా ద్రవ్యం సహాయంతో పురాణ కథలు అనేకంగా వెలసి వచ్చాయి. క్రీ.పూ. 4,3 శతాబ్దాల నుంచి క్రీ.శ. 12 శ.ల వరకూ ఈ పురాణాల కల్పన కొనసాగుతూనే వచ్చింది. ఈ యుగారంభానికి పూర్వమే ప్రసిద్ధంగా వెలసిన ఇతిహాసాలకు సైతం జానపద అభూత కల్పనాధర్మం తోడై, కొత్తరీతిలో కొండంతలుగా పెరిగిన పురాణాలయ్యాయి. ఈ పురాణాలన్నిటిలోకి తలమానికంగా వచ్చింది భాగవతం. ఒక విధంగా ఇది చాలా పటిష్టంగా సాగిన సమ్యగ్రచన. పై లక్షణాలన్నీ దీంట్లో అధికంగా కొట్టొచ్చినట్లు కనిపించడమే కాకుండా,

భక్తి యోగానికి ప్రాముఖ్యత పెరిగి, మరింత జనప్రియం చేసే శక్తి వచ్చింది. భక్తి మార్గ ప్రదీపిక కావడమే దీనికి వెన్నెముకలాంటి లక్షణం. ఇదీ సంస్కృత భాగవతం వెలసే నాటికి, తద్రచనా నేపథ్యం. దీని నిర్మాణకాలం స్పష్టంగా తెలియనప్పటికీ, బ్రాహ్మణమతానికి ఒక పటిష్ఠమైన సమ్యగ్రూపం ఏర్పడ్డాక, భక్తిమార్గం సుప్రతిష్ఠమయ్యాక, అవతారవర్ణనా ప్రయోగం అత్యంత విజయ వంత మార్గమని తేలాక ఏర్పడ్డ రచనే అన్నది నిర్వివాదాంశం.

తెలుగు దేశంలో పోతనకు చాలాకాలానికి ముందే కన్నడ, తమిళ దేశాలనుంచి వర్ణవ్యవస్థను, కులభేదాలను వ్యతిరేకిస్తూ భక్తి ప్రధాన మతాలుగా వీరశైవం, వైష్ణవం ప్రచారంలోకి వచ్చాయి. సర్వసామ్యతను, స్వామ్యతను మత పరంగా కానీ, మత చైతన్యంతో నిబద్ధమైన ఆనాటి సమాజపరంగా కానీ, ఇవి ఎక్కువగా ఉపలక్షించాయి. ఇవి దేశీయతను బహుధా ఆదరించాయి. గుడి భాషగా కూడా ద్రావిడాన్ని ప్రవేశ పెట్టాడు శ్రీరంగంలో నాథమునీ, విశేషించి అతని అనుచరుడు రామానుజుడు. ఈ దేశీయత సమగ్రంగా కాక పోయినా ఒక ప్రయత్నంగానైనా తెలుగులో వీరశైవ సాహిత్యంలో కని పిస్తుంది. అయితే వర్ణాశ్రమ ప్రధానంగా వైదికమతం కంటే అభిన్నంగా భావింపబడుతున్న బ్రాహ్మణమతం పాక్షికమైన గాడిలోనుంచి తప్పించి, మరో పాక్షికమైన గాడికో కుదించి కట్టివేయడానికి చేసే ప్రయత్నం అవడం వల్ల, ఇదీ అంత విజయవంతమై వేళ్ళూని ఏకైక మార్గంగా నిలవలేదు. మార్పు పునఃవాంఛనీయమైంది. ఆ స్థితిలో ఉత్తర భారతంలో భక్తి ప్రధానరీతి ఒకటి అవతరించింది. ఇది వైష్ణవంతోకాని, విష్ణ్వవతార ప్రధానమైన శాఖలతో కాని ముడిపడి నడిచింది. ప్రతి అవతారం ఒక మేధాగత ప్రయోగమే. సమాజం గమనంలో మార్పు తేవాలనుకొన్నప్పుడు, భగవంతుడు అవతరించాడంటారు అంటే సామాన్యార్థంలో, ఆ అవతారం పేరిట మేధావంతుడు ఒక ప్రయోగం చేస్తున్నాడన్న మాట ఈ ప్రయోగ లక్షణం, ప్రస్తుతం వివక్షలో ఉన్న ప్రయోగకాలానికి కూడా చక్కగా నప్పింది. విభిన్నమైన విష్ణ్వవతార గాథల ప్రశంస పెరిగింది. ఆ మూలంగా అందరికీ భగవదధికారాన్ని, పరోక్షంగా సమాజంలో సర్వసమతను, ప్రచారం చేయడం జరిగింది. ఈ సర్వసమతా ప్రచారం ఒక చారిత్రక అవసరంగా పరిణమించింది. మరీ ముఖ్యంగా ఉత్తర

దేశంలో మహమ్మదీయులు రాజ్యాలను ప్రతిష్ఠించుకోవడంతో ఆగకుండా, హైందవ జాతిని మహమ్మదీయ మతంలోకి ఊకుమ్మడిగా మార్చడంలోకూడా ఉద్యుక్తులయ్యారు. హైందవుల పేరిట చలామణి అయ్యేవారిలో బ్రాహ్మణమతం సృష్టించిన అంతరాలూ, వాటి పరిణామాలూ, ప్రభావాలూ ఘోరంగా ఉన్నాయి. సామాన్యులు, నిమ్న వర్గాలు, ఈ నిమ్న ప్రతిపత్తితో నలిగి పోవడం కంటే, సర్వసమానతను చూపించే ముస్లిం మతమే మేలనే భావంలో పడే ప్రమాదం వుంది. అలాటి భావాన్ని వీలైనంతవరకూ బహుధా ప్రచారం చేయడం జరుగు తోంది. భగవంతుడి పేరు చెప్పినా ఫలితం నాస్తి అవుతోంది ఎందుకంటే, ఆయన పాదభాగం తమ ప్రాదుర్భావ స్థానమైపోయింది. సేవతప్పనిసర వుతుంది. ఒక వైపు భౌతిక సేవ, మరో వైపు మానసిక బానిస సేవ మధ్యలో నిమ్న వర్గీయులు నలుగుతున్నారు సామాన్యులు, నిమ్న వర్గాలవారు అందరినీ ఒక తాటి మీదకు తీసికొచ్చి, ఆత్మ విశ్వాసాన్ని పురికొల్పి, సర్వసమతనూ, సర్వజన గౌరవాన్నీ చాటి చెప్పాల్సిన బాధ్యత అంకురించింది. వీరశైవంలాగా ఆత్మార్పణం, ఆత్మ హింసవంటి రూపాలంకేసి వెళ్ళి, నైరాశ్యం పెంచకుండా, క్రియా శూన్యమైన బలాదూరు స్థితిని కల్పించకుండా, మధురమైన, భావపరమైన ఆనంద భక్తి మార్గాన్ని ప్రజలకు, అందులో విశేషించి, అడుగు వర్గాల వారికి అందించాల్సిన అవసరం ఏర్పడింది. ప్రజలందరి మధ్య ఉన్న సామాజిక అంతరాలను తగ్గించాల్సిన అవసరం ఏర్పడింది. అందరికీ భగవదధికారం సమానమన్న భావనను మేల్కొల్పాల్సిన అవసరం వచ్చింది. ఈ అవసరాన్ని పూర్తి చేయటానికి భక్తి ప్రధానమైన వైష్ణవం ఉత్తరాదిలో అవతరించింది. ఈ సమకాలీన లక్షణమే ఉత్తరదేశపు టంచుల్లో నివసించిన పోతనను ప్రభావితం చేసిఉండాలి.

రామానందుని శిష్యుల్లో నిమ్నజాతీయులు, ఉన్నత జాతీయులు అంటూ రెండు వర్గాలైనా ఆతర్వాతగా ఏర్పడ్డాయికాని, ప్రబోధాల ఫలితాలు మాత్రం అందరికీ అందాయి. తమ మతంపట్ల, జాతిపట్ల గౌరవం పెంచాయి, అవతార పురుషుల మహిమాగానంతో, జాతిరక్షణకు చిన్నచిన్న ప్రభువులకు సైతం ఒక ఉద్యమ శక్తిని ప్రసాదించాయి. ఏకముఖంగా, తమ జాతి ప్రాశస్త్యాన్ని తలుచుకొంటూ, తమ ప్రభువు వీరావతారాలను స్మరిస్తూ రాజులు దేశగౌరవ పరిరక్షణకు ఉన్ముఖులయ్యారు. సంసారయోగంలో భక్తియోగం మేళనం కావ

డంతో, ముస్లిములు తమ స్త్రీలకిచ్చే జనానా మన్నన మిన్నగా వుండడంతో, సమాజంలో స్త్రీలపట్ల కొత్త జాగృతి, గౌరవం పెరిగాయి. ఆదిలోని భాగవత వాసుదేవం సైతం గృహస్థులుగా, మత ధర్మ పరాయణతను పాటించే వీలు కలిగించడానికే వచ్చింది. ఇప్పుడీ కొత్త భక్తియోగం కూడా అంతే. ఇది స్త్రీలకు సమధిక మర్యాదను, పూర్వ గౌరవాన్ని సమకూర్చడం విశేషం. వాళ్ళలో సహజంగావుండే సహనం, దయ, మార్దవం, ప్రగాఢ ప్రేమ, ఆత్మ త్యాగం వంటి లక్షణాల వల్ల స్త్రీ విశిష్టత కొత్త వన్నెలోకి వచ్చింది. భక్తి మార్గంలో స్త్రీలకు గొప్ప ప్రోత్సాహం, స్థానం లభించాయి. సరిగ్గా ఇలాటి సమాజ స్థితి మూలంగానే, తొలి తెలుగు కవయిత్రి తాళ్ళపాక తిమ్మక్క ఈ యుగంలో రావడాన్ని గమనించగలం. పెద్దగా పాండిత్య ప్రజ్ఞ లేనివాళ్ళయినా సరే పరిపూర్ణమైన భక్తిని ఆత్మలో నిలుపుకొంటే చాలు, ఏ విశిష్ట రచనకైనా, యోగ్యతకైనా అర్హులౌతారు అనే భావం ఉదయించింది సూరదాసును తన మార్గంలో చేర్చుకొంటూ మూణ్ణాళ్ళపాటు వల్లభాచార్యులు భాగవతాన్ని, దశమ స్కంధాన్ని వివరించి చెప్పాడట. ఒకసారి సూరదాసును గానం చేయమన్న ప్పుడు అవిద్య నుంచి విముక్తి కలిగించమంటూ సూరదాసు పరవశంతో గానం చేశాడు. అప్పుడు వల్లభుడు 'నీవు సహజంగానే జ్ఞానాన్ని పొందిన వాడివి. నీకు బోధతో నిమిత్తం లేదు' అంటూ ప్రశంసించాడని ప్రతీతి. ఇది ఒక వైపు స్వానుభవ సాక్షాత్కార యోగ్యతేకానీ, వర్ణ యోగ్యత భగవదారాధనలో ముఖ్య మైంది కాదనే అంశం వివరిస్తూనే, మరో వైపు పోతన 'సహజ పండితుడ'నే బిరుదుకు గొప్ప వివరణను కలిగిస్తోంది. తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు గారు సవివరంగా నిరూపించినట్లు పాండిత్యం వ్యాకరణ, నైఘంటుక విద్యకు సంబంధించిందికాదు. జ్ఞాన సంబంధం దాన్ని స్వానుభవ సాక్షాత్కార శక్తి మూలంగా పొందినవాడని బహుశా అదే శక్తి ఆయన ప్రతి పదంలోకి ప్రవ హించి వుండవచ్చు. తెలుగు జాతికే తలపూవులాగ భాగవతాన్ని తీర్చి ఉండవచ్చు. 'కమనీయ భూమి భాగంబులు లేకున్న, పడియుండుటకు దూదిపరుపులేల' అనే అతి ప్రాకృతికమైన నిరాడంబరతనూ, 'ధన మదాంధుల కొలువేల తాపసులకు' అనే నిష్కపటమైన కఠిన సంయమన శీలతనూ, 'కారే రాజులు, రాజ్యముల్ కలుగవే' అనే నిర్లిప్తమైన ఔదార్య చరితనూ, భీష్ముడు చూసిన 'వన్నెలాడు' సాక్షాత్కార సౌభాగ్య

పటిమనూ, 'ఒక సూర్యుండు సమస్త జీవులకు నొక్కొక్కడై' తోచు లీలను గమనించి, వల్లభునికి పాఠం నేర్పించగలిగే 'శుద్ధత'ను నింపుకొన్న దర్శన పటిమా, 'లావొక్కింతయు లేదు'; 'కలడు కలండను వాడు కలడో లేడో' అనే వెర్పుని గుండెతడీ, 'ఎవ్వనిచే జనించు జగము?' అన్న ప్రశ్నకు అత్యంతాద్భుత మైన నిరీశ్వర అభ్యుదయ సమాధానము, ఇలా అడుగడుగునా ప్రతిధ్వనించే ఆయన లలిత లలితానుశీలమైన భక్తి, జ్ఞాన, వైరాగ్య సంపద బహుశ ఆ సాక్షాత్కార పటిమవల్లే కావచ్చు, పదం పదంలోనూ అంత అందంగా ఒదిగాయి. అయితే ఎలాటి సామాజిక స్థితిగతుల్లో ఆయన రచన అవత రించింది అని ప్రశ్నించినప్పుడు మాత్రం ఆనాటి మత-సమాజస్థితులన్నిటినీ వివక్షలోకి తీసికోవలసి వుంటుంది. సమాజంలో ఆర్థిక స్థాయి కల్పించిన హెచ్చుతగ్గులనీ, తన్మూలంగా ఏర్పడ్డ కష్టనష్టాలనీ, సమస్యలనీ మతం పరిష్క రించలేకపోవచ్చు. ఒక్కొచోట వక్రించినప్పుడు ఇంకా పెంచి పెద్దచెయ్యనూ వచ్చు. కాని భావపరంగా మతం ఎంతో ప్రభావాన్ని చూపుతుంది. ముఖ్యంగా ప్రాచీన హిందూ సమాజంలోని భిన్న దశలలో చూపింది. మనిషిలోని అంతశ్చేతనే కాకుండా, బహిశ్చేతన కూడా అత్యధిక శాతం మతం చేతనే నియంత్రితమై వుంది. మనిషి సామాజిక ప్రతిపత్తి, సంబంధాలు మత సూత్రాల అధీనంలో రూపుగొంటూ వచ్చాయి. ఇలాటప్పుడు ఇతర సామాజిక-ఆర్థిక-రాజకీయ వివరాలకు సంబంధించిన సంపూర్ణ చిత్రం మనకు దొరకనంత వరకూ, మత చైతన్యమే సామాజిక చైతన్యానికి దిక్సూచి అనీ, ప్రతిబింబం అనీ భావించాల్సి వుంటుంది. కవి మతప్రవక్త కాకపోవచ్చుకానీ, ఆయన ప్రతిభా వంతుడైతేమాత్రం తాను నిర్వహించే పాత్ర మాత్రం జన బాహుళ్యంలో అంత కంటెకూడా గొప్పగా వుంటుంది. పోతన కవిత ఆవిర్భవించే కాలానికి మత వ్యవస్థలో పెచ్చు పెరిగిపోయిన దురాచారాల్లో వర్ణ వ్యవస్థ, వాటి కట్టుబాట్లు, సంకుచితత్వం, అంధ విశ్వాసాలూ, అర్థహీనమైన ఆచారాలూ, భక్తిపేరిట మూర్ఖమైన ఆవేశం, పరస్పర అసహనంవంటివి మచ్చుకు కొన్ని మాత్రమే. వీటన్నిటిమీద విరుగుడుగా పనిచేసి, వీటికంటె భిన్నమైన లలిత మార్గంగా పని చేస్తూ నిమ్న వర్గీయుల నందర్నీ ఏకం చేస్తూ, జాతి గౌరవ రక్షణ బాధ్యతను గుర్తు చేస్తూ భక్తిమార్గమనే విశిష్ట మార్గం ఒకటి అప్పుడు ఏర్పడింది. ఇది

శ్రీవిష్ణు అవతారాలైన రామ, కృష్ణుల అవతారాలనూ, అందులోనూ ప్రధానంగా శ్రీకృష్ణ లీలలను పరమ సుందరంగా గానం చేస్తూ, భిన్నభిన్న రీతుల్లో శ్రీకృష్ణ లీలల్ని నవనవోన్మేషరీతిలో కల్పన చేస్తూ వచ్చింది. ఇది వైష్ణవ మతంకంటె భిన్నమైనది. ఒక విధంగా వైష్ణవం, విశిష్టాద్వైతం వంటివి కలసి పూర్ణ మార్గంగా, రాధామాధవ తత్వంగా ఎదగడానికి అవకాశమిచ్చిన ప్రవాహమార్గం. దక్షిణ భారతంలో పూర్వమే వున్నా ఉత్తర భారతంలో అప్పటికి ఉధృత స్థాయిలో ఉన్న ధర్మం. తెలుగునాట మళ్ళీ బ్రాహ్మణీకరణ ప్రయత్నాల్లో శ్రీనాథాది కవులు మునిగివుంటే, పోతన ఒక్కడే తన దేశం ఎగువనున్న గాలుల్ని పీల్చి, భక్తి మార్గం ఆవశ్యకతను గుర్తించి, ఆ సరళిలో, శ్రీకృష్ణ లీలామృత గాన లహరితో తెలుగునాట భాగవతాన్ని అవతరింప చేశాడు. నిక్కచ్చిగా తెలుగునాట దారులు పరచి నివాళు లర్పించాడు. ఆదే పోతన్న కవిత- భాగవతంలోని ప్రత్యేకత. మరొకరు ఆ మార్గంలో పయనించలేదు ఆ ప్రత్యేకతను సాధించలేదు. సగం పాపులర్-సగం క్లాసిక్ లక్షణాల్ని కలగలిపి భాగవత రసవత్కావ్యం తయారు చేశాడు[7] అయితే గమనించాల్సిం దేమిటంటే - భక్తిమార్గం, ఆనాటి మత వ్యవస్థలోని ఏయే దురాచారాల మీద దండెత్తిందో, వాటన్నిటినీ తాను మాత్రం నిర్వహించలేదు. ఆనాటి దురా చారాల్లో ఒక్క బాహ్యాడంబరం, భక్తికపటత్వం, విషయలాలసత్వంవంటి కొన్ని అంశాల మీద మాత్రం గుండె హత్తుకుపోయే రచనను కథాకథనంలో ఇమిడ్చాడు. కాని, అంతకంటె మించి సమకాలంలోను, ఆ తరువాతా వర్ణవ్యవస్థ దుష్ఫలితాలపట్ల, అంధవిశ్వాసాలపట్ల, పౌరాణిక అతిశయోక్తులపట్ల ఔత్త రాహుల్లో సిద్ధకవులు, సంత్ కవులు, నాథ్ పంథీయులు అనుసరించిన పంథాకు చెందినవాడు మాత్రం కాదు పోతన.

7. పూర్తి పాపులర్ ధోరణిలో జనగానం అంశానికి చేరువగా తమ భావనను ఆ తరువాత యోగ కవులు తెచ్చారు.

# తాళ్ళపాక అన్నమయ్య సాహిత్యం

-ఇరివెంటి కృష్ణమూర్తి

తాళ్ళపాక కవులు తెలుగు పలుకుబళ్ళను బళ్లకెత్తి పదిహేను పదహారు శతాబ్దాల్లో తెలుగుభాషకు ఒక సార్థక్యాన్ని ఒక వ్యక్తిత్వాన్ని సంతరించిపెట్టిన మహనీయులు. ఈ కవులు సృష్టించిన సారస్వత సంపద పరవస్తు చిన్నయ సూరికి చిక్కివుంటే గ్రాంథికాంధ్ర కల్పతరువని పేరొందిన బాల వ్యాకరణం సజీవాంధ్రభాషా కల్పతరువై ప్రాచుర్యాన్ని సంపాదించుకొని ఉండేది. ఐదు వందల ఏండ్లుగా తెలుగు తల్లుల నోళ్లలో తెలుగు బాలల ఆటల్లో తెలుగు భక్తుల పాటల్లో పెనవేసుకొనిపోయిన తాళ్లపాక వారి సంకీర్తన సాహిత్యం కేవలం రేఖాసదృశం. శ్రీ ప్రభాకరశాస్త్రి వంటివారు తాళ్ళపాక వారి సాహిత్యాన్ని చదువనిదే తెలుగురాదని అభిప్రాయపడ్డారు.

ప్రవాహరూపంలో ఉన్న భాషకు ప్రమాణాలను ఏర్పరిచే ప్రయత్నం తెలుగులో ఆదికావ్య రచనతోనే ఆరంభమైనది. ఆంధ్ర శబ్ద చింతామణి అథర్వణకారికావళి వికృతివివేకం ఆంధ్ర భాషాభూషణం అహోబల పండితీయం అప్పకవీయం లాంటి వ్యాకరణాలు సంస్కృతంలోనూ, తెలుగులోనూ అవతరిస్తూ తెలుగుభాషకు హద్దులను ఏర్పరుస్తూ వచ్చినాయి. సంస్కృతంలో శాస్త్రవ్యసనం చేసిన ఆంధ్ర పండితులు ఈ వ్యాకరణాలు గీసిన గీట్లతో పరిచయం ఏర్పరచుకుని, వాటిని దాటటం భాషాపచారమని నమ్మి ఆ లక్షణ రేఖలతోనే తమ తెలుగు కావ్యాలను తీర్చిదిద్దుకున్నారు. కాని ప్రజాసామాన్యం మాత్రం వ్యాకరణాలు గీసిన గీట్లను పండితులకు వదిలిపెట్టి తమ జీవద్భాషలో తాము నన్నయకంటె కొన్ని వందల ఏండ్ల పూర్వం నుంచే సాహిత్య సృష్టిని చేసుకుంటూ వచ్చింది. పాలకురికి సోమనాథుడు పేర్కొన్న ప్రభాత పదాలు, వెన్నెల పదాలు, వాలేశు పదాలు ఈ కోవలోనివే. నన్నయకు పూర్వమున్న భాష గానటబీసదే కావచ్చు. నన్నయ తరువాత - అంటే తెలుగు వ్యాకరణాలు వచ్చిన తర్వాత - కూడా రాజాస్థానాలకు వెలియైన ప్రజలు ఇతర కళలవలెనే

కవితా కళను కూడా సృష్టించుకుని భద్రపరుచుకున్నారు. మరి ఆ సాహిత్యానికి కర్త ఎవరో తెలియకపోవచ్చు. కాని తరతరాలకు దాని పరిమళాలు అందుతూనే వచ్చినవి. బుర్రకథలు, జంగం కథలు, తోలుబొమ్మలాటలు, జముకుల కథలు, జోలలు, ఏలలు, యక్షగానాలు మున్నగు జానపద కళారూపాలు ఎన్నో సాహిత్య వాసనలను రూపక మర్యాదలను కళారహస్యాలను జన సామాన్యానికి అందిస్తూనే వచ్చినవి. అయితే ఈ సామాన్యుల భావనుగానీ కళారూపాలను గానీ రాజాస్థానాల్లోని పండితులు సమాదరభావంతో చూసినట్లు కనపడదు. కావ్యాలలో అక్కడక్కడ ప్రసక్తానుప్రసక్తంగా పాత్రచిత్రణ సందర్భంగానో, స్వభావోక్త్యలంకారంకోసమో సమకాలిక సాంఘికేతివృత్తాన్ని రేఖామాత్రంగా తెలియజేయడంకోసమో తడిమినారే కాని వాటిలోని కళా వైదగ్ధ్యాన్ని గానీ సాహితీ సాముచిత్యాన్నిగానీ వాటిలోని వైవిధ్యాన్ని గానీ సందర్శించి అభినందించలేక పోయినారు. ఇక గుర్తింపుమాట దేవుడెరుగు. ఈ సాహిత్య కళారూపాలను గుర్తించి కొంతవరకు తమ తమ ప్రచారానికి అనువైన పద్ధతిలో మలచుకుని ఆదరించినవారు శివకవులు. అక్షర ఛందస్సులపట్ల కొంత మమతను విడిచి మాత్రాచ్ఛందస్సులనూ గాన యోగ్యమైన పదాలనూ ఆశ్రయించి శివ కవులు సామాన్య ప్రజలకు కొంత సన్నిహితులైనారని చెప్పడానికి వీలున్నది. పదిహేడవ శతాబ్దారంభంలో కంకంటి పాపరాజు, కందుకూరి రుద్రకవి, రంగాజమ్మ, రఘునాథ నాయకుడువంటి విద్వత్ప్రబంధ నిర్మాతలు ప్రజాసామాన్యానికి సన్నిహితమైన యక్షగాన ప్రక్రియను చేపట్టి వాళ్ళల్లో ప్రాముఖ్యాన్ని అందుకున్న భాషా ప్రయోగాలను ఎన్నింటినో సొంతంచేసుకుని జీవద్భాషోద్యానంలో విహరించగలిగినారు. ఇలాంటి వాతావరణం నాటి సాహిత్యలోకంలో కలగడానికి తాళ్ళపాక కవుల పదసాహితీ వసంతోదయమే కారణం. ఇంతకు పూర్వం తెలుగు ప్రబంధాలలోనికెక్కి వాటి భాషను శక్తిమంతం చేసిన లోకోక్తులూ జాతీయాలూ సామెతలూ పదబంధాలూ అన్నీ సామాన్య ప్రజలవే. కాని వాళ్ళ ఊసైనా ఎత్తకుండ ఈ కవులు వాళ్ళ భాషా చమత్కారాన్ని సజీవత్వాన్ని సొంతం చేసుకుని తమ కావ్యాలకు అచ్చమైన తెలుగుతనాన్ని పులుముకుని వాళ్ళనూ వాళ్ళ భాషనూ వాళ్ళ కళలనూ అశాస్త్రీయాలనీ గ్రామ్యాలనీ అప్రమాణాలనీ సంస్కృతం నుంచి అరువు తెచ్చుకున్న గడుసుదనంతో చీదరించుకున్నారు. పదిహేనవ శతాబ్దారంభములో అన్నమాచార్యుల అమృతోదయం

ఈ సామాన్య ప్రజానీకం పలుకుబడికీ సంగీతానికీ సుప్రభాతం పలికింది. ఆ మహనీయుడూ ఆతని వంశంవారూ వైష్ణవ భక్తితత్త్వాన్ని వివిధ భక్తితత్త్వాలనూ తమ సంకీర్తనల ద్వారా రచనల ద్వారా ప్రజానీకంలోకి తీసుకొనిపోయినారు. గీర్వాణభాషాభేషజాన్ని అతివేలంగా సంపాదించి కూడా ఈ వంశంవారు తీయని తెలుగు పలుకుబడికి తమ కవితను అంకితం చేసి స్వామి పదాలకు అర్పించటంకోసం ప్రజల పదాలను పట్టుకున్నారు. వీరి సాహితీ సృష్టి తెలుగు సాహితీ చరిత్రలో ఒక మలుపు. కవితను సంగీతానికి అతి సన్నిహితంగా తీసికొనిపోయిన ప్రయోగం వాగ్గేయకార సంప్రదాయానికి శ్రీకారం. వీరిలో ప్రథముడు మానవోత్తముడూ వాగ్గేయకారుడూ అయిన అన్నమాచార్యుల జీవితం అద్భుతావహమైన ఘట్టాల రాగమహిత సాహిత్యానుభవాల చయనిక.

అన్నమయ్య అవతరించిన కాలం నాటికి తెలుగు దేశంలో ఏకచ్ఛత్రాధిపత్యం వహించి తెలుగు దేశాన్ని ఒక త్రాటిపై నడిపిన కాకతీయ సామ్రాజ్యం నశించి తెలుగు ప్రజ పలుతీరుల పరిపాలనకు లోనయినది. ఉత్తరంలో గజపతి రాజులూ, తెలంగాణంలో బహమనీ రాజులూ, రాజమహేంద్రపురంలో రెడ్డి రాజులూ, విద్యానగరాన్ని రాజధానిగా చేసుకుని రాయలసీమను సాళువ తుళువ వంశపు రాజులూ రాజ్యంనెరపుతున్నారు. అన్నమాచార్యుల వంశీయులు కడపజిల్లాలోని తాళ్ళపాక గ్రామస్థులే అయినా అన్నమయ్య కాలం నుంచి తిరుపతినే నివాసంగా మార్చుకున్నారు. తురుష్కుల దండయాత్రలవల్ల ప్రజల్లో సాంఘిక భద్రత నానాటికి క్షీణిస్తున్నది. తెలుగు దేశంలోని పరిపాలకులలో తరుచుగా యుద్ధాలు జరుగుతుండడం, పలు సందర్భాలలో తురుష్కులదే పైచేయిగా ఉండడం వలన ధర్మ రక్షకులని బిరుదులు అతికించుకున్న రాజులకే దిక్కులేని పరిస్థితి ఏర్పడినప్పుడు ఇక ప్రజల గోడు ఎవరికి కావాలి? ఉత్తర భారతంలో హిందూ రాజులకు పట్టిన గతి, హిందూ సంస్కృతికి పట్టిన గతి దక్షిణ భారతంలోనూ పట్టింది. నమ్మిన ధర్మాన్ని వదలలేక విమత దుష్కృత్యాలను ఎదుర్కోలేక సామాన్య ప్రజానీకంలో శరణాగతితత్త్వం ప్రబలింది. భక్తి తత్త్వం, కులతత్త్వానికి విరుద్ధమైన భావాలకు ప్రాచుర్యం నిరపాయకరంగా తోచింది నాటి బుద్ధిమంతులకు. ''భగ్నకృషీ బాగవతా భవంతు'' అన్నట్లు అందరూ భగవత్తత్త్వచింతనకు మనసొగ్గడం నేర్చుకున్నారు. తత్త్వాలు వ్రాసే కవుల

సంఖ్య ఆనాడు అధికం. భక్తి గీతాలు పాడుకుని భజనలు చేయించే భక్త సమూహాల సంఖ్యా ఆనాడు అతి వేలం. తెలుగులో ఫారసీ ఉర్దు పదాల దిగుమతి సజావుగా సాగింది. చిల్లర రాజులు అతివేలమయిన శృంగార కావ్యాలు వ్రాయించుకున్నారు. సంస్కృతలాక్షణికులు ఏర్పరచిన హద్దుల్లో నడచిన కావ్య జాలంలో కావ్యత్వం అడుగంటి శబ్ద చమత్కారాలు, ఛందస్సు కసరత్తులు అధికమైనవి.

పదహారవ శతాబ్దారంభంలో ప్రబంధమనే ఒక వినూత్న ప్రక్రియ తెలుగులో అవతరించి స్వతంత్రకావ్య పద్ధతికి నారు పోసింది. రసవత్ ప్రబంధ రచనకు దారి తీసింది. పది పన్నెండు మంచి ప్రబంధాలు ఈ ప్రబంధ విహాయసంలో ధ్రువ తారలుగా వెలసినవి. అంతే. సామాన్య ప్రజకు ఇవి కూడా దూరంగానే ఉండినవి. అన్నమయ్య పదసాహిత్యం తెలుగుదేశాన్ని ఉర్రూతలూగించిన తరువాత నూరేళ్ళకు కాని ఈ ప్రబంధ ప్రక్రియ పుట్టలేదు. పుట్టి నూరేండ్లు కూడా ఒకే విధంగా వెలుగలేదు.

బాల్యం నుంచే అన్నమయ్య భక్తి వివశుడై పాటలు పాడేవాడు. ఆ పాటలలో అతడు తన జీవితవృత్తం వ్యంజించినాడని చెప్పినా అబద్ధం కాదు. చిన్న తనంలోనే ఇంటి పనులు చేయలేక విసుగుచెంది దేవదేవుని దర్శనార్థం తిరుపతికి పయనమైనాడు. అప్పటికాతనికి పదహారేండ్లు. ఏడుకొండలనెక్కుతున్న భక్తులతో తిరుమలకు పోతూ మోకాళ్ళ పర్వతం దగ్గరికిచేరి అలసిపోయి ఆకలితో స్పృహతప్పి పడిపోయి నిదురపోయినాడు. కలలో లక్ష్మీదేవి సాలగ్రామాలతో నిండిన ఈ కొండను చెప్పులతో ఎక్కరాదనిచెప్పి,చెప్పులు లేకుండా ఎక్కితే అలసట కలుగకుండ కొండ ఎక్కవచ్చుననీ స్వామి దర్శనమవుతుందనీ తాను ఆరగించిన ప్రసాదాన్ని అన్నమయ్యకు పెట్టి అంతర్థానమైనదట. అప్పుడు అన్నమయ్య అలమేలుమంగపై ఒక శతకం చెప్పినాడట. ఆ తరువాత గరుడకంబంపై, పుష్కరిణిపై బ్రహ్మపాదముపై, విష్వక్సేనునిపై, గర్భాలయంలో పరంజ్యోతిగా వెలుగుతున్న స్వామిపై ఆశువుగా సంకీర్తనములు చెప్పినాడట. అప్పటి నుండి కనీసం రోజుకొక్క సంకీర్తనం చొప్పున తాను పరమపదించేవరకు అన్నమయ్య కొన్ని వేల కీర్తనలు స్వామి వారినిగూర్చి

చెప్పినాడట. పదహారవ ఏటనే స్వామి సాక్షాత్కారాన్ని పొంది, శఠకోప యతీంద్రుల వద్ద గురూపదేశాన్ని పొంది, కొంతకాలం తిరుమలలోనే ఉండిపోయినాడు అన్నమయ్య. అతణ్ణి వెతుక్కుంటూ అక్కడికి వచ్చిన తల్లిదండ్రుల కోరికనూ గురువు ఆదేశాన్నీ పాటించి అన్నమయ్య తిరిగి తాళ్లపాక చేరుకొని గార్హస్థ జీవితాన్ని పాటించాడు. అహోబిలం లాంటి పుణ్యక్షేత్రాలు సందర్శించి శ్రీ వేంకటేశాంకితంగా శృంగార సంకీర్తనలెన్నో రచించినాడు. హృదయావర్జకములూ శ్రుతిపేయములూ అయిన ఆ సంకీర్తనలు బహుళ్రుతమై టంగుటూరులో నాడు అధిపతిగా ఉన్న సాళువ నరసింగరాయలు దాకా ప్రాకినవి. అతడు అన్నమయ్యను దర్శించి అతని ఆశీర్బలంతో పెనుగొండలో పట్టాభిషిక్తుడై 1487లో విజయనగర సింహాసనానికి అధిపతి కావడం తటస్థించినది. సాళువ నరసింగరాయలు అన్నమయ్య స్వామిని గూర్చి రచించిన శృంగార కీర్తనములు విని తన్నుగూర్చి కూడా శృంగార గీతములు రచింపుమని అడుగగా అన్నమయ్య నిరాకరించినాడు. రాచరికపు ఆవేశానికి వివేకమెంతంతమాత్రమే గదా! అన్నమయ్యకు సంకెళ్లుపడినవి. కానీ ఆ భక్తుని దివ్యగాన ప్రభావంతో అవి తమంతటతామే తెగిపోయినవి. రాజు ఆ భాగవతోత్తమునికి శరణాగతుడైనాడు. సుప్రసిద్ధ కన్నడ వాగ్గేయకారుడూ, నాదబ్రహ్మోపాసకుడూ పురందరదాసు అన్నమాచార్యుణ్ణి విష్ణ్వవతారముగా భావించి సందర్శించెనట. అన్నమయ్య కూడా పురందరుని పాండురంగ విఠలునిగా భావించి ప్రస్తుతించెనట. ఈ ఇరువురు వాగ్గేయకారుల ప్రభావాలను కన్నడ తెలుగు దేశములు తప్పించుకొనలేకపోయినవి. ఆయన వ్రాసిన ఆధ్యాత్మ సంకీర్తనములూ, శృంగార సంకీర్తనములూ రాగతాళాలతో కూడినవి 32000 దాకా ఉన్నాయని ఆయన మనుమడు చిన్నన్న అన్నమాచార్య చరిత్రములో తెలిపినాడు. ద్విపద ప్రబంధంగా రామాయణాన్నీ, సంస్కృతంలో వేంకటాద్రి మాహాత్మ్యాన్నీ, సంకీర్తన లక్షణాన్నీ, తెలుగులో శృంగారమంజరి అనే గ్రంథాన్నీ పన్నెండు శతకాలనూ వ్రాసినాడు. ఆళ్వారులు రచించినది ద్రావిడవేదమైతే అన్నమాచార్యుని సంకీర్తనలు ఆంధ్ర వేదములని శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు అభిప్రాయపడినారు.

అన్నమయ్య సాహిత్యాన్నిగూర్చి ఆరుద్ర "ఇతరుల కవిత్వంలో అయితే ఈ కవి వాడిన నానుడులు, పలుకుబళ్లు, సామెతలు అని ఒకటో అరో వెతికి

వెతికి అతి కష్టంమీద పట్టి చూపించాలి. కాని అన్నమయ్య రచనంతా దేశీయమే. అడుగడుగునా సామెతలే. ప్రతి చరణంలోనూ నానుడులే. అన్నమయ్య మూర్తీభవించిన తెలుగుతన''మంటూ కీర్తించినారు.

అన్నమయ్య రచనల్లో పురాణాల్లోని సారళ్యం, దేశి పలుకుబడులలోని తేటదనం పొంగులువారుతూ ఉంటాయి. ఆయన ఆధ్యాత్మ కీర్తనలు వల్లించిన చిలుకపలుకులు కావు. ఆత్మప్రబోధాన్నీ, ఆత్మానుభవాన్నీ, లోకవృత్త రహస్యాన్నీ, స్వీయానుభూతినీ వ్యంజిస్తూ ఉంటాయి. అయితే శాస్త్రీయపరిభాషా శబ్దారణ్యంలో అవి చిక్కువడక స్వేచ్ఛగా పక్షిలా ఎగురుతుంటాయి. ఆ పక్షికి ఒక రెక్క అచ్చమైన తెలుగుభాష. రెండవ రెక్క సుందరమైన భావం. ఇది దాని ఉడ్డీనశక్తి కవితాశక్తి.

''విన్నపాలు వినవలె వింతవింతలు
పన్నగపు దోమతెర పైకెత్తవేలయ్యా''

''కానరటె పెంచరటె కటకటా బిడ్డలను
నేనూ మీవలెనే కంటి నెయ్యమైన బిడ్డను
బాయిం పారవేసిన పాలు వెన్నయును
చేయి పెట్టకుందురా చిన్నిబిడ్డలు
మీ యిండ్లు జతనాలు మీరు సేసుకొనక
పాయక దూరేరేమే ప్రతిలేని బిడ్డను''

''నేనైతే ఈడేరుదు, నీకు లీలామాత్రమింతే
మానక నన్నేలుకొమ్ము మాధవగోవిందా
ఇందరిపై సూర్యుండు ఎండలు గాసించేను
అందు కొన్ని కిరణాలు అణిగిపోయేనా''

''ఏది తుద? యెన్నడు ముగుసును?
ఆదికి ననాది హరిమాయ
సాదించి సుజ్ఞానియైతే
యీదెస వెదికిన ఇహమే పరము''

''పొదుగుడు మనమున బొడమిన యాసలు
అదననెక్కడికి అదగునయ్యా
వొదగుచు జలముల నుండు మత్స్యములు
పదపడి యేగతి బాసేనయ్యా''

వంటి పంక్తులను ఎన్నింటినైనా ఎత్తిచూపవచ్చు. అన్నమయ్య సంకీర్తనానందసాగరంలోని మౌక్తికాలలో ఇవి కొన్ని మాత్రమే. ''చందమామ రావే జాబిల్లి రావే!'' అని పాడందే ఏ తెలుగుతల్లీ బిడ్డకు అన్నం పెట్టదు. ''జో అచ్యుతానంద! జోజో ముకుంద!'' అని జోలం పాడందే ఏ తెలుగు బిడ్డకూ నిదురవోడు. ఈ పాటలు అన్నమయ్యవే. తెలుగుల దైనందిన జీవితంతో అన్నమయ్య కవిత పెనవేసుకపోయినది. ఇదే ప్రజాకవితా లక్షణం.

పదకవితా పితామహుడుగా సాహిత్య సంగీత కళాప్రపంచంలో ప్రసిద్ధి వడసిన అన్నమయ్య రచనలు ''ఉజ్జ్వల రసానుభూతి నాదపించుచు ననేక దేవాలయములలోని యర్చామూర్తుల నభివర్ణించుచు శరణాగతి మహత్త్వమును ప్రతిపాదించుచు నింక ననేక విధముల లోకనీతి ధర్మోత్కర్ష భూతదయాది విశేషాంశముల వెలయించుచు ఎంతో వింతగా వేడుకగా సంగీత సారస్యముతో, సవరని భాషతో, వేదవేదాంతేతిహాసాది సూక్తితదర్థ ప్రతిపాదనములతో వెల్లివిరిసి, విజ్ఞాననిధులై విరాజిల్లుచున్న''వని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పలికిన మాటలలో యాథార్థ్యమే ప్రకాశిస్తున్నది.

# ప్రబంధాలు – సామాజిక, మత, రాజకీయ భూమిక

ఎస్. వి. రామారావు

ఆంధ్ర వాఙ్మయంలోని ఏ ప్రక్రియ గురించి అయినా విమర్శకు పూను కోవాలంటే ఎన్నో ఇబ్బందులకు గురికాక తప్పదు. వస్తువుయొక్క తత్త్వాన్ని-స్వరూప స్వభావాలను-గురించిన స్పష్టమైన అవగాహన లేకుండానే కొన్ని అభిప్రాయాలు చర్విత చర్వణంగా ప్రచారంలో ఉండటంవల్ల ముందుగా అవి అడ్డుతగిలి దారి తప్పించడానికి ప్రయత్నిస్తాయి. ప్రబంధ వాఙ్మయం పైన అభిప్రాయాల కూడా ఈ ఇబ్బందులు తప్పవు.

అసలు- ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో పురాణయుగం, కావ్యయుగం, ప్రబంధయుగం అన్న విభజనమే విడ్డూరంగా కనబడుతుంది. కవిత్రయం చేసిన రచన ఇతిహాసం కాగా, వారు ప్రాతినిధ్యం వహించిన యుగాన్ని పురాణ యుగం అని వ్యవహరిస్తున్నాము. అటు సంస్కృత వాఙ్మయంలో, ఇటు ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో కొన్ని రూఢ్యర్థాలతో ప్రయుక్తమైన 'సాంకేతిక' శబ్దాలను మన సాహిత్య విమర్శకులు ఈ విధంగా తమకు తోచిన అర్థంలో వాడుకోవటం శోచనీయమైన విషయం. ప్రబంధ శబ్దానికీ అదే గతి పట్టింది.

ప్రబంధం అంటే స్వతస్సిద్ధమైన అర్థం కావ్యం. సంస్కృత లాక్షణికులు నిర్వచించిన సర్గబంధమనే మహాకావ్యమే తెలుగులో సుమారు ప్రబంధం అయింది. 16 వ శతాబ్దానికి ముందటి తెలుగు కవులందరూ-నన్నెచోడుడు, పాల్కురికి, తిక్కన, ఎర్రన, శ్రీనాథుడు మున్నగువారు-తమ కావ్యాలను ప్రబంధాలుగా పేర్కొన్నారు. వీనిలో ఇతిహాసాలూ, ద్విపద కావ్యాలూ, క్షేత్ర మాహాత్మ్యాలూ మొదలైనవి ఉన్నాయి, కావ్యానికి పర్యాయపదంగా 'ప్రబంధ' శబ్దం ఇంత సుస్పష్టమైన అర్థంలో వాడుకలో ఉండగా - 16 వ

శతాబ్దంలో వెలువడిన కావ్యాలకు మాత్రమే ప్రబంధాలు అని ఎవరు ఏ వేళలో నామకరణం చేశారో కాని, ఆ ముహూర్తం నుంచి ఆ శబ్దానికి ఉన్న సహజమైన అర్థం పోయి అంతకుముందు లేని అర్థం వాడుకలోకి వచ్చేసింది. తర్వాతి విమర్శకులందరూ ఆ అర్థాన్ని రూఢిచేసి ప్రబంధానికి కొన్ని లక్షణాలను ఆపాదించారు. అవి-ఏకనాయకాశ్రయము, వస్త్వైక్యము, స్వతంత్ర రచన, శృంగార రసము, ఆలంకారిక శైలి, అష్టాదశ వర్ణనలు

ఈ లక్షణ నిర్దేశంలో కూడా గతానుగతికంగా ఒకరు చెప్పిన వాటినే మరొకరు చెప్పుకుంటూ పోవడమే కాని, అవి ఎంతవరకు ప్రబంధానికి అన్వయిస్తాయని పరిశీలించినవారు లేరు నిజానికి పైన చెప్పబడిన లక్షణాలలో చాలా వరకు అంతకుముందు ఉన్న కావ్యాలకు వర్తించేవే. శివుని లీలలను కొనియాడే హరవిలాసంలో, విష్ణుపారమ్యాన్ని బోధించే ఉత్తర హరివంశంలో వస్త్వైక్యత లేదనుకుంటే - ఆముక్తమాల్యద, శ్రీ కాళహస్తి మహాత్మ్యం, పాండురంగ మాహాత్మ్యం మున్నగు ప్రబంధాలు కూడా ఆ కోవకే చెందుతాయి. శృంగార వర్ణన ప్రియత్వం, స్వతంత్ర రచనా ధోరణి, ఆలంకారిక శైలి మొదలైన లక్షణాలు శ్రీనాథాదుల కాలం నుంచే గోచరిస్తాయి. అఖిల వాఙ్మయాన్ని స్వభావోక్తి. వక్రోక్తిగా వింగడించిన దండి సూక్తిని దృష్టిలో పెట్టుకుంటే- ఆంధ్ర వాఙ్మయంలో కవిత్రయం వారిది స్వభావోక్తి కాగా, తదనంతర కవులది వక్రోక్తి అని ఉగ్గడింపవచ్చును శ్రీనాథునితో ప్రారంభమైన వక్రోక్తి క్రమంగా సమాసభూయిష్ఠమైన ప్రౌఢ ప్రబంధ శైలిగా పరిణమించింది.

కాలగతి ననుసరించి క్రమ పరిణామం చెందుతూ వచ్చిన తెలుగు కావ్యరచనాపథం 16 వశతాబ్దంలో వినూత్నమైన మలుపు తిరిగింది. వర్ణనా బాహుళ్యమే ఆ కొత్త మలుపు ''ప్రబంధములలో కథా చమత్కారము కన్న వర్ణనాపాండిత్యమే ప్రధానము'' అని మొదటి కవి చరిత్రకారుడైన గురజాడ రామమూర్తి నొక్కి చెప్పినా తర్వాతివారు దాన్ని అంతగా గమనించలేదు. ఆంధ్రాలంకారికుడైన విద్యానాథుని ''ప్రతాపరుద్ర యశోభూషణం'' (14 వ శ.) తర్వాత తెలుగు సాహిత్యంపై అలంకారశాస్త్ర ప్రభావం విస్తృతంగా గోచరిస్తుంది. అష్టాదశ వర్ణనలు, శ్లేష, ఉత్ప్రేక్షాది అలంకారాలు ప్రబంధ యుగంలో ప్రబలమై ఆ యుగ వాఙ్మయానికి వైలక్షణ్యాన్ని సంతరించాయి

ప్రాచీనాంధ్ర సమాజాన్నీ, సారస్వతాన్నీ మతమే చాలా వరకు మల చిందన్న విషయం చారిత్రక సత్యం "ప్రాచీన హిందూదేశ చరిత్రము ప్రధానముగ హిందూమత సంస్కృతి చరిత్రమే కాని రాజకీయములకు సంబంధించిన చరిత్రము కాదు. ప్రాచీన కాలమున పుట్టిన ఉద్యమము లన్నియు మత విషయకమైనవే కాని రాజకీయములైనవి కావు. ఒకవేళ రాజకీయములైన ఉద్యమములు కూడ ఉన్నవన్న ఎడల అవి మత ధర్మములను పోషించి పరిరక్షించు కొరకును, ఉద్ధరించు కొరకును పుట్టినవేకాని ఉద్యమములు కావు. కుంఫిణీ పరిపాలనము వచ్చిననాటి నుండియే మన చరిత్ర రాజకీయముగ మారుచున్నది. ఉద్యమములు రాజకీయములైనట్టియు, ఆర్థికములైనట్టియు ప్రధానాశయములతో నడుపబడుచున్నవి. ఈ ప్రధాన సూత్రమును మనము గమనించిననే కాని ప్రాచీన హిందూదేశ చరిత్ర పరమార్థము మనకు బోధపడదు" అన్న మల్లంపల్లి వారి వాక్యాలు[1] తెలుగు దేశచరిత్రకు కూడా అక్షరాలా వర్తిస్తాయి.

విజయనగర రాజులు శైవ, వైష్ణవ మతాలను అభిమానించారు. పంపా విరూపాక్షస్వామిని, 'హజార' రాముని ఆరాధించారు వారి దానశాసనాల చివర విరూపాక్ష, శ్రీరామ, శ్రీ వేంకటేశ నామాలు గోచరిస్తాయి. "శ్రీ వేంకటేశ పద పద్మాసేవిత సదయహృదయు" డయిన రాయలు కాలంలో వైష్ణవ మతం బాగా వ్యాప్తి చెందింది 2వ శతాబ్దంలో అవతరించిన రామానుజాచార్యుల విశిష్టాద్వైతం విష్ణువే పరదైవమనీ, విష్ణుభక్తులకు వర్ణాశ్రమ ధర్మాలతో నిమిత్తంలేదనీ ప్రచారం చేసింది. తమిళంలో ఆళ్వారులు, తెలుగులో తాళ్ళపాక కవులు సాహిత్యం సాధనంగా విష్ణుభక్తిని వెదజల్లారు. ప్రబంధయుగ కవులు కూడా ఈ మార్గాన్ని అనుసరించారు.

శ్రీకృష్ణదేవరాయలు తన జీవిత కాలంలో అనేక మారులు తిరుమలేశుని దర్శనం చేసుకొన్నాడు. 1513 లో దేవేరులతో తరలివెళ్ళి కోట్ల రూపాయలు విలువచేసే నవరత్న ఖచితమైన కిరీటాన్ని సమర్పించాడు.[2] దక్షిణదేశ యాత్రలో కంచి, కాళహస్తి, అహోబలం, సింహాచలం మొ॥ క్షేత్రాలు దర్శిం

చాడు కళింగ దండయాత్ర సందర్భంలో బెజవాడలో విడిది చేయగా శ్రీకాకుళ మహావిష్ణువు కలలో కనిపించాడు. ఆ స్వామి ఆదేశాన్ని అనుసరించి విష్ణుపారమ్య బోధకమైన 'దివ్య ప్రబంధం' విరచించాడు.

విష్ణుభక్తుల గాథలు వర్ణించే ''ఆముక్తమాల్యద''లోని ప్రధాన పాత్రలు పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు), చూడికుడుత్తనాంచియార్ (గోదాదేవి) విష్ణుభక్తి శాఖలైన దాస్య, మధుర భక్తికి నిదర్శనాలు. మాలదాసరికథ భక్తికి కుల మతాల ప్రసక్తి లేదని నిరూపిస్తుంది. యామునాచార్యుని చరిత్ర రాజులకు భోగమేకాదు త్యాగం కూడా ముఖ్యమని చాటుతుంది. ఈ కావ్యంలో అడుగడు గునా కృష్ణరాయల విష్ణుభక్తి తొణికిస లాడుతుంది. పురవర్ణన చేసినా విష్ణు మయమే. విష్ణుచిత్తుని జీవిత చిత్రణలో ఒక భాగవతుని కాపురం కనులకు కడు తుంది. చతుర్థాశ్వాసంలో 15 పద్యాలలో చేసిన దశావతార ప్రశంస నాటి కావ్యాలలో సామాన్యంగా గోచరించే అంశం.

నంది తిమ్మన, పింగళి సూరన శ్రీకృష్ణునికి సంబంధించిన ఇతివృత్తాలు స్వీకరించగా, తెనాలి రామకృష్ణుడు విష్ణు ప్రశంసాపరమైన 'పాండురంగ మాహాత్మ్యం' విరచించాడు. అయ్యలరాజు రామభద్రుడు రామావతార గాథను అభివర్ణించాడు. అయితే నాటి కవులు అందరూ వైష్ణవులు కారు. శైవులైన మల్లన, ధూర్జటి కృష్ణదేవరాయల ఆశ్రితులు కావటం ఆయన పరమత సహనానికి నిదర్శనం. కాని మతం మార్పిడి నాడు వాడుకలో ఉన్నట్లు సాక్ష్యాలు లేక పోలేదు. విశిష్టాద్వైతి అయిన పెద్దన మొదట అద్వైతిగా ఉండినట్లు, తెనాలి రామలింగడు రామకృష్ణుడుగా మారినట్లు కొన్ని ఐతిహ్యాలు ప్రచారంలో ఉన్నాయి.

విజయనగర రాజుల ఏలుబడిలో దేశం పౌరుషవంతమై, ప్రజలు నాగరక జీవనం నేర్చారని చరిత్ర చాటుతున్నది. నాడు నగర జీవితానికి ప్రాధాన్యం హెచ్చింది. విదేశ రాయబారులు విజయనగరరానికి విచ్చేసి ఆ పట్టణ సౌభాగ్యాన్ని ఎంతో ప్రశంసించారు. నాటి ప్రజల్లో భోగలాలసత, రసికత విశేషంగా గోచరిస్తాయి.

ప్రబంధాల్లో రసికతా జీవనం విస్తృతంగా ప్రదర్శితమైంది. పూలు రసికతకు చిహ్నం. నాటి కవులు పుష్పలావికల వర్ణన విరివిగా చేశారు,

"వెలది యీ నీ దండ వెల ఎంత నా దండ
కును వెలబెట్ట నెవ్వనిక్కైతరంబు"

అని వారి సరస సంభాషణను, శ్లేషోక్తులను రాయలు, భట్టుమూర్తి మున్నగు వారు రమణీయంగా గ్రంథస్థం చేశారు. 'పెంటివిద్యలు' నాడు పెచ్చు పెరిగా యని పంచతంత్ర కర్త పేర్కొనటంలో అతిశయోక్తి లేదు.

ప్రజల విలాసజీవితానికి ఆలంబనం వేశ్యావృత్తి, 'వారవనితా సుధారస ధారల' కోసం మహాకవులు సైతం సానివాడలలో తారసపడే వారని చాటు పద్యాలు వెల్లడి చేస్తున్నాయి. మత్స్యధ్వజుడు వేశ్య యింటికి బయలు వెడలే సన్నాహాన్ని రాయలు గొప్పగా వర్ణించాడు.[3] కాళహస్తి మాహాత్మ్యంలోని శివభక్తుల కథల్లో సానికూతుళ్ళు కూడా ఉన్నారు. విటులు, జారిణుల మధు పానకేళిని, వారి సరసాన్ని విశృంఖలంగా చిత్రించిన కవికర్ణ రసాయనంతో ప్రబంధ కవిత పలుచబారింది. పింగళి సూరన మాత్రం నాటికవులకు అపవాదంగా వేశ్యను నాయికగా స్వీకరించి గౌరవాన్ని ఆపాదించాడు.

వేట నాటి వినోదక్రీడల్లో ముఖ్యమైనది. జంటకవులైన నంది మల్లయ, ఘంట సింగయ మన కావ్యాలలో వేట వర్ణనకు ఒరవడి పెట్టారు. మనుచరిత్రలో స్వరోచి వేట విపులంగా వర్ణితమైంది. ధూర్జటి ఆటవికులైన చెంచుల వేట, వారి ఆచార వ్యవహారాలకు సజీవమైన చిత్రణ చేశాడు.

అయితే, ప్రబంధ యుగం నాటి ప్రజలందరూ సంపన్నులేననీ, వారందరూ రాసిక్యంలో మునిగి తేలే వారని భావించటం పొరపాటు. ఆ కాలం కవులు చాలావరకు రాజాశ్రితులు కావటంవల్ల, నాగరకుల విలాస జీవితాన్ని సన్నిహితంగా చూసిన వారు కావటం వల్ల సామాన్యుల స్థితిగతులు వారి కావ్యాలకు ఎక్కలేదు. అయినా బాల్యంలో వారి కష్టనష్టాలు స్వయంగా చవి జూచిన రాయలు వాటికి కొంతవరకైనా దర్పణం పట్టగలిగాడు. వానకాలంలో కట్టెలు మండక పొగచూరిన యిండ్లలో సతమతమయ్యే గృహిణుల బాధ ఆముక్త మాల్యదలో వర్ణితమైంది. ప్రజలు తమకు వున్నా లేకపోయినా కలిగిన దానిలో అతిథి అభ్యాగతులకు ఘనమైన మర్యాదలు చేసేవారు. ప్రవరుడు, విష్ణుచిత్తుడు చేసిన అతిథి సత్కారాలు మరుపురానివి.

పాండురంగ మాహాత్మ్యంలోని క్షేత్రం పండరి అయినా వర్ణన అంతా తెలుగుదేశానికి సంబంధించిందే. ఆ కావ్యాన్ని లోతుగా పరిశీలిస్తే నాటి సాంఘిక వ్యవస్థ స్వరూపం కొంతవరకైనా అవగాహన అవుతుంది. నిగమశర్మ కథ భోగలాలసులై చెడిపోయిన 'పండిత పుత్రుల' గతిని, పేదరికానికి గురియై చితికిపోయిన బ్రాహ్మణ కుటుంబాల పరిస్థితిని విశదం చేస్తుంది.

విజయనగర రాజులకాలంలో సైనిక శక్తి ప్రాబల్యం హెచ్చింది. ఒకవైపు అశ్వపతులూ, మరోవైపు గజపతులూ ఈ నరపతులకు ప్రతిద్వంద్వులుగా వుండటంలో ఎప్పుడూ ఏవో యుద్ధాలు జరుగుతూనే ఉండేవి. శ్రీకృష్ణదేవరాయల పరిపాలనా కాలంలో ముప్పాతిక మువ్వీసం యుద్ధాలతోనే గడచిపోయింది. మనుచరిత్ర, పారిజాతాపహరణం అవతారికలు ఆయన పరాక్రమ ధాటిని లెస్సగా ఉగ్గడించాయి. సాముగరిడీలు మొదలైనవాటి ప్రసక్తి కూడా ఈ కావ్యాల్లో గోచరమౌతుంది. బహమనీరాజులతో పోటీపడి విజయనగర ప్రభువులు మేలుజాతి అశ్వాలను దిగుమతి చేసుకొని ఆశ్విక దళాన్ని పెంచారు. అందుకే నాడు హయలక్షణసారం(మను మంచిభట్టు) మొ॥ అశ్వశాస్త్రాలు అవసరమైనాయి. పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నంలో అశ్వగతులను గొప్ప శాస్త్రపరిజ్ఞానంతో ప్రదర్శించాడు.

ఆముక్తమాల్యద కర్త స్వయంగా ప్రభువు కావటంచే యామునాచార్యుని వృత్తాంతంలో పరిపాలనా వ్యవస్థను, రాజనీతిని విపులంగా వివరించాడు. నాటి రాజరిక వ్యవస్థ పైకి ఎంత సుస్థిరంగా కనబడినా, అంతఃపురంలో రాజ్యం కోసం కుట్రలూ, హత్యలూ జరగటం పరిపాటిగా ఉండేది. వీటిని ప్రత్యక్షంగా చూచినవాడవటం వల్ల కాబోలు ధూర్జటి "రాజుల్ మత్తులు, వారి సేవ నరక ప్రాయంబు" అని నిరసన కనబరచాడు. కాళహస్తీశ్వర శతకం ధూర్జటి కవి ఆత్మీయతను ప్రస్ఫుటంగా ప్రతిబింబిస్తుంది.

ప్రబంధ కవులు రాజాశ్రితులే అయినా అందరూ రాజవంశ వర్ణనకూ, వారి కీర్తి ప్రశంసకూ పూనుకోలేదు. ప్రతిభావంతుడైన మహాకవి సమకాలీన ప్రభావానికి అతీతుడై సార్వకాలిక సందేశాన్ని అందిస్తాడు. అల్లసాని పెద్దనయే అందుకు ప్రత్యక్ష సాక్ష్యం. సమకాలీన సమాజం రసికతా జీవనంతో

మితి మీరుచుండగా, గృహస్థాశ్రమ విలువలను, పతివ్రత ప్రాశస్త్యమును దాటిచెప్పిన ఏకైక కవి వీరుడు ఆయన. శృంగారం సరిహద్దును దాటబోయే తరుణంలో పెద్దన కథను ఆపి క్రొత్తమలుపునకు తిప్పుతాడు. వరూధిని కథ లోనూ, స్వరోచి కథలోను మనకు గోచరించే సత్యం ఇదే. శృంగారం మానవ జీవితానికి ముఖ్యమే అయినా పరిమితి దాటితే పతనానికి కారణమౌతుంది. ప్రవరుడు భోగ విముఖుడు కాడు కాని అధర్మపరుడు కూడ కాడు. భోగ వైరాగ్యాలకు సమన్వయాన్ని సాధించి నిరూపించిన మహాకావ్యం స్వారోచిష మను సంభవం దేశకాలాతీతమైన,సార్వకాలిక సమకాలీనమైన సందేశాన్ని అందించటం చేతనే పెద్దనామాత్యుడు ఆంధ్ర కవితా పితామహుడైనాడు. కవుల వ్యక్తిత్వ, సాహిత్యాలను సమన్వయించి చూసినపుడు మన సాహిత్య పరామర్శ 'క్రొత్త చూపు'తో కొనసాగగలదు.

ప్రబంధయుగానికి ప్రాతినిధ్యం వహించిన ఒక మహాకవిపై, ఆయనకు ఆశ్రయ మొసంగిన ఒక మహా ప్రభువుపై అభ్యుదయకవి ఆరుద్ర అభిప్రాయా లతో ఈ వ్యాసానికి ముగింపు పలుకుతున్నాను.

''ఆది కవులు, కవి బ్రహ్మలు, ప్రబంధ పరమేశ్వరులు, నవీన గుణ సనాథులు, కవి సార్వభౌములు మొదలైన ఆజానుబాహు లెందరున్నా మన సాహితీరంగంలో అందరికన్నా ఒక జానెడు ఎత్తుగా కనిపించే జాణ ఆంధ్ర కవితా పితామహుడే. దీనికి కారణం కృష్ణరాయలు అందరికన్నా పెద్దపీట వేసి పెద్దన గారిని దాని మీద నిలబెట్టడం కానేకాదు. ఆయన సహజంగా ఉన్నతుడు. రాయల వారి పీట లేకపోయినా, జానెడు కాకపోతే బెత్తెడయినా ఎత్తుగా అల్లసాని పెద్దన గారు కనపడకపోరు. దానికి కారణం ఆయనలో పూర్వ కవుల శుభ లక్షణాలన్నీ కేంద్రీకృతం అయాయి.''4

''ఎంతో మంది ఎన్నో వ్యాసాలు, గ్రంథాలు వ్రాసి రాయల వారి మహోన్నత కవితా వృక్షానికి నిచ్చెనలు వేశారు. ఈ నిచ్చెనల మీద అందరూ ఎక్కలేరు. రాయల వారి వైదుష్యాన్ని, వ్యక్తిత్వాన్ని, ప్రత్యేకమైన దృక్పథాన్ని అర్థం చేసుకొనడానికి ఏళ్ళూ, పూళ్ళూ పడుతుంది. సామాన్య సాహితీ

ప్రియులకు అంత తీరుబాటు ఉండదు. రాయల వారు నేటి ఆంగ్ల సాహిత్యంలో జేమ్స్ జాయిన్ కోవలోని వారు...... జాయిన్ రచయితల రచయిత రాయల వారు ఆ కోవలో తొలిపూస. '' [5]

1. విజయనగర సామ్రాజ్యము-వాని ఉదయ ప్రశస్తులు. (వ్యాసమంజూష-సం. ఉత్పల సత్యనారాయణాచార్య.)

2. 2681 తులాల బంగారు, 2822 కెంపులు, 160 పచ్చలు, 423 వజ్రాలు, 10 వైడూర్యాలు, 10 గోమేధికాలు, 3130 ముత్యాలు, 3 మాణిక్యాలు ఈ కిరీటంలో ఉన్నాయి (చూ. సమగ్రాంధ్ర సాహిత్యం vii ఆరుద్ర – పు. 92)

3. ఆముక్తమాల్యద (2 – 75)

4. సమగ్రాంధ్ర సాహిత్యం vii (ఆరుద్ర) పు. 177

5. ,, ,, పు. 124

# నిరసన కవి ధూర్జటి

—మోతుకూరు నరహరి

'ఏవ్యక్తిఅయినా, కళారూపమైనా నాటి ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిస్థితుల కనుగుణంగానే రూపు దిద్దుకోవటం జరుగుతుంది' అన్న విషయాన్ని మళ్ళీ మళ్ళీ వివరించి చెప్పవలసిన అవసరం లేదనుకుంటాను. ఈ ప్రాథమిక సత్యాన్ని ఆధారం చేసుకొని ధూర్జటిని అంచనావేసే ప్రయత్నాన్ని ఈ వ్యాసంలో చేస్తాను.

పోతన ఎవరి ఆస్థానంలోనూ కవితా పీఠాలను అధిరోహించలేదు కనుక తన కృతిని నరాంకితం చేయనన్నాడంటే సరిపోతుంది కాని, రాజాస్థానంలో ఉండి కూడా పెద్దన, తిమ్మనాదుల లాగా తన కృతిని కృష్ణదేవరాయలకు అంకితం చేయకపోవటమేకాక తన శతకంలో "రాజుల్మత్తులు, వారి సేవ నరక ప్రాయంబు..." అని నిర్భాగమాటంగా చెప్పటం ధూర్జటికే చెల్లింది. ఈ విధంగా తనకో ప్రత్యేక వ్యక్తిత్వాన్ని సంతరించుకొన్న ధూర్జటిని కేవలం వైయక్తికంగా కాక సమకాలీన రాజకీయ, మత, సామాజిక పరిస్థితుల్లో అంతర్భాగంగానే చూడవలసి వస్తుంది.

ధూర్జటి విజయనగర సామ్రాజ్యాన్ని అత్యున్నతస్థితికి తీసుకొని వచ్చిన కృష్ణదేవరాయల (క్రీ.శ. 1509-1530) కాలంవాడు. విజయనగర సామ్రాజ్యాన్ని మొదట పాలించిన సంగమ వంశీయులు (క్రీ శ. 1336-1486) శైవులు. అయినా బుక్కరాయలు ఉత్తర హరివంశ కర్త నాచన సోముని పోషించాడు. సంగమ వంశీయుల తరువాత రాజ్యానికి వచ్చిన సాళువ (క్రీ.శ. 1486-1501), తుళువ (క్రీ.శ. 1501-1565) వంశీయులు వైష్ణవులు. "ధరణీవరాహ" వంటి బిరుదులు వేసుకున్నారు. నంది మల్లయ, ఘంట సింగయలు వరాహ పురాణంలో తుళువ వంశానికి చంద్రవంశం మూలంగా వర్ణించారు. తరువాతి కవులు వీరినే అనుసరించారు. నంది మల్లయ "ఉమామహేశ్వర ప్రసాదలబ్ధ సారసారస్వ

రాభినంది'' అయినప్పటికీ వైష్ణవుడూ, దండనాయకుడూ అయిన తుళువ నరస నాయకుణ్ణి తృప్తిపరచటానికి వరాహ పురాణ రచన చేశాడు. రెండవ దేవ రాయలు (క్రీ.శ. 1423–46) మతాల విషయంలో సమభావాన్ని చూపించాడని వింటాం. ఇతని కాలంలో వీరశైవ, వైష్ణవ, జైనమతాచార్యులు రాజును తమ వైపు తిప్పుకోవటానికి పోటీ పడ్డారు. మాధ్వులు, జైనులు బలహీనంగా ఉండటంతో వీరశైవులు, శ్రీవైష్ణవులు ప్రత్యర్థులుగా నిలచారు. వీరశైవులకు ఆర్థిక పరిస్థితులు అనుకూలంగా ఉండటంతోపాటు జక్కనమంత్రి, లక్కన సేనాని మొదలైన వారి తోడ్పాటు కారణంగా అనేకులైన వీరశైవ కవులకు ఆదరం లభించింది. ఈ కారణంగా కన్నడ భాష వీరశైవ సాహిత్యంతో నిండిపోయింది. దేవరాయలకు పురోహితుడు కందాడై ముకుందదొడ్డయాచార్యుడు భారతాన్ని తొమ్మిది నెలలపాటు వినిపించాడు. దేవరాయలు భారతాన్ని కన్నడంలోకి అనువదించమని తన ఆస్థాన కవులైన కుమారవ్యాసుడిని, చామరసును కోరాడు. రాయలు కుమారవ్యాసుడి అనువాదాన్ని ప్రశంసించాడు. వీరశైవులు ఇది సహించలేక పోయారు. చామరసు కవి లింగాయతుడుగా మారి కుమారవ్యాసుడి భారతాన్ని అధిగమించే విధంగా ఉండాలని ''ప్రభులింగ లీలె'' కావ్యాన్ని రాశాడు. రాయల ఆస్థానంలో శైవ వైష్ణవుల మధ్య వాదోపవాదాలు జరిగాయి పండితులు కుమార వ్యాసుడి భారతంకన్నా ప్రభులింగలీలె ఉత్తమ రచన అని నిర్ణయించారు. దేవరాయలు వీరశైవం స్వీకరించాడు. విజయనగర స్థాపన నాటినుంచి తాతాచార్యులు, అప్పలాచార్యులు, చక్రవర్తులు మొదలైన వంశాలకు చెందిన అనేక కుటుంబాలు విజయనగర సామ్రాజ్యం అంతటా వైష్ణవ ప్రచారం చేశారు. రెండవ దేవరాయలు వీరశైవాన్ని స్వీకరించటంవల్ల దీనికి కొంత ఆటంకం ఏర్పడ్డా ఆ స్తబ్ధత ఎంతోకాలం కొనసాగలేదు. రెండవ విరూపాక్ష రాయలు(క్రీ శ. 1465-86)తన బంధుమిత్రులతోపాటు క్రీ.శ.1481 ప్రాంతంలో వైష్ణవాన్ని స్వీకరించాడు. జైనమతానుయాయిగా ఉన్న వీరనరసింహరాయలు (నరస నాయకుడు) 1502 ప్రాంతంలో వైష్ణవాన్ని స్వీకరించాడు. ఈ నరస నాయకుడి రెండవ కుమారుడే శ్రీకృష్ణదేవరాయలు. శ్రీకృష్ణదేవరాయల అన్న అయిన రెండవ వీరనరసింహరాయలు (క్రీ. శ. 1503-09) తమ్ముడిలాగా వీరవైష్ణవుడు కాదు. ఆయన ''బ్రాహ్మీముహూర్తాన లేచి ఆరాధ్యుల నామావళు లున్నూ, ఆధ్యాత్మ సంకీర్తనలున్నూ, పాండవగీతలు, భ్రమరగీతలు, గజేంద్ర

మోక్షం..." పఠించేవాడు...వినేవాడు. శ్రీకృష్ణదేవరాయల కాలంలో ప్రధాన మతంగా వైష్ణవం నిలదొక్కుకుంది. ఇది ధూర్జటికాలంనాటి మత పరిస్థితి.

కృష్ణరాయల కాలంనాటికి భూస్వామ్య రాచరిక వ్యవస్థ వేళ్ళూనుకొంది. రాయలకాలంలో విజయనగర సామ్రాజ్యం విస్తరించింది. తన శత్రువులు తల ఎత్తకుండా రాజ్యాన్ని పటిష్టం చేసుకోగలిగాడు రాయలు. ఆయన అనేక యుద్ధాలు చేశాడు "శత్రురాజుల కోటలను తగులబెట్టి అవి మంటలకు ఆహుతి కావటం విజయి అయిన రాజుకి పట్టిన మంగళహారతిలాగా ఉంది" (మధురా విజయం 4-73) అని ప్రస్తుతించేంత రాక్షసానందాన్ని ఆనాటి కవులూ, రాజులూ అనుభవించారు. అధికారం ఆప్తులకు, ద్విజులకు మాత్రమే ఇవ్వాలి (ఆముక్త 4-207) అనే సిద్ధాంతం ఆధారంగా ఆనాటి పరిపాలన ఉండేది. చాతుర్వర్ణ్య వ్యవస్థ అనేది దాని మూలార్థంలో అమలులో ఉండటానికి వీలులేక పోయినా ఒక సైద్ధాంతిక ధ్యేయంగా మాత్రం కొనసాగుతూ ఉంది. రాజ్యానికి పరిపాలకుడు రాజే అయినా దాదాపు సర్వాధికారాలు మహాప్రధాని చేతిలోనే ఉండేవి. పాతుకుపోకుండా ఉండటానికి మండలాధిపతుల్ని రెండు, మూడు సంవత్సరాల కొకసారి మారుస్తూ ఉండటం జరిగేది. యుద్ధాలలో తోడ్పడ్డవారికి భూములివ్వటం జరిగేది. రాజు తరువాత విభిన్న ప్రాంతాలను పరిపాలించేవారు అమరనాయకులు. తమ అధీనంలో కొంత సైన్యాన్నిఉంచి పోషించటం, రాజుకు తాము వసూలుచేసిన పన్నుల నుండి 1/3 భాగం చెల్లించడం వీరు చేస్తుండేవారు. సూత్రప్రాయంగా అమరనాయకుల అధీనంలోని భూములు వంశపారంపర్యంగా సంక్రమించ కూడనప్పటికీ ఆచరణలో మాత్రం దాదాపు అవి ఆ కుటుంబాలవారికే సంక్రమిస్తూ వచ్చాయి. చిన్న చిన్న దళాధిపతులకు, బ్రాహ్మణులకు యువ రాజులూ, అమరనాయకులూ భూములను ఇచ్చేవారు. దేవాలయాలకు కూడా విస్తారమైన భూఖండాలుండేవి. దేవాలయాలు ఆయా ప్రాంతాలలో ఆర్థిక, సాంస్కృతిక కేంద్రాలుగా ఉండేవి. ఉత్సవాలు, యాత్రికుల రాకపోకల కారణంగా చేతివృత్తుల వారు, వ్యాపారులు దేవాలయం చుట్టుపట్లనే స్థిరపడ్డారు. దేవాలయాల ఆదాయంతో వ్యాపారం, వడ్డీవ్యాపారం కూడా సాగేది. చేతివృత్తుల వారికి వారు దేవాలయాల్లో చేసే పనికిగాను వస్తు రూపంలో ప్రతి ఫలం

ఇవ్వటంతోపాటు కొంత సేద్యయోగ్యమైన భూమిని కూడా ఇచ్చేవారు. బాధ్యతలతోపాటు ఈ భూములు కూడా వంశపారంపర్యంగా సంక్రమిస్తుండేవి.

గ్రామాల్లోనే కాక పట్టణాల్లో కూడా ఫ్యూడల్ ప్రభువుల పెత్తనం పెరగటం ఈ కాలంలో జరిగింది. పట్టణంలోని ప్రభుత్వ వ్యవహారాలన్నీ అంతకు పూర్వంవలె వివిధ వృత్తులకు, కులాలకు చెందిన వారి ప్రతినిధులతో కూడిన సభల ఆధ్వర్యంలో నిర్వహించబడటం కాక గవర్నర్ హస్తగతం అయ్యాయి. మార్కెట్ పన్ను వసూలు చేయటం, సముద్ర వ్యాపారంపై పన్ను వేయటం వంటి అధికారాలు ఫ్యూడల్ ప్రభువుల, వడ్డీ వ్యాపారుల హస్తగతం అయ్యాయి. సహజంగానే పట్టణాల్లోను విజయనగరంలోను ఉండేవారు కుబేరులయ్యారు. రాజధాని సంపన్నంగా, ఆహ్లాదకరంగా, వజ్రవైడూర్యాలతో, రకరకాల ప్రజలతో, వివిధ వ్యాపారాలతో చూడ ముచ్చటగా ఉండేది. కాని పోర్చుగీసు యాత్రికుడు, చరిత్రకారుడు అయిన న్యూనిజ్ రాతలనుబట్టి రైతులు తాము పండించిన పంటనుండి 90 శాతాన్ని అమర నాయకులకు చెల్లించాల్సిన దుర్భర పరిస్థితులుండేవి. పట్టణ నాగరికత, నగర వాతావరణం అభివృద్ధి చెందిన పరిస్థితుల ఫలితంగానే ఒకవైపు ప్రబంధాలు, మరొక వైపు ఆ పరిస్థితులకు నిరసనగా 'భక్తి' సాహిత్యమూ వచ్చాయి అన్నమయ్య, ధూర్జటి మొదలైనవారు సమకాలీన భక్తి సాహిత్య నిర్మాతలలో చెప్పుకోదగ్గ వారు.

అయితే తెలుగు దేశంలో 'భక్తి' మార్గం, భక్తి సాహిత్యం ఉద్యమ రూపాన్ని పొందినట్టు కనిపించదు. వ్యక్తులుగా మాత్రమే భక్తులు కనిపిస్తారు. మొత్తంగా రాచరిక వ్యవస్థపైన వ్యతిరేకతకన్న, అనేక ఇతర కారణాలవల్ల ఆయా రాజుల విషయంలో వ్యతిరేకత ప్రధానంగా కనిపిస్తుంది. అన్ని కులాల వారికి మోక్షం సాధ్యం అని వైష్ణవం చెప్తున్నా, కుల నిరసన వీరశైవ, వైష్ణవాల ప్రధాన తత్వమైనా భక్తి కవుల సాహిత్యంలో వైరాగ్యానికి ఉన్న ప్రాధాన్యం ఈ అంశాలకు కనిపించదు. ఇదే కాలంలో ఉత్తర భారత సాహిత్యాలలో 'భక్తి' ఉద్యమం సంస్కరణోద్యమంగా రూపుదిద్దుకొంది. దానికి సంబంధించిన సాహిత్యానికి ప్రధాన సాహిత్యంలో భాగంగా గుర్తింపు లభించింది. దక్షిణ భారత సాహిత్యాలలో కన్నడంలో దాస సాహిత్యం కుల

నిరసనను ప్రదర్శించింది. బోయకులానికి చెందినవాడని చెప్పబడుతున్న కనకదాసు "కులము కులము అంటారు. సత్య సుఖము కలవారికి కులమేముంది? ......బురదలో పుట్టిన తామరను పద్మనాభుడికి సమర్పించడంలేదా? గోమాంసంలో ఉత్పత్తి అయ్యే క్షీరాన్ని బ్రాహ్మణులు త్రాగడం లేదా? మృగాల శరీరంలో పుట్టిన కస్తూరిని భూసురులు పూసుకోవటం లేదా? నారాయణుడే కులంవాడు? ఆత్మ ఏ కులం? జీవం ఏ కులం? తత్వేంద్రియాల కులం చెప్పండయ్యా..." అని ప్రశ్నిస్తాడు. పురందరదాసు, సర్వజ్ఞుడు కన్నడంలో ఈ కోవకు చెందిన కవులే. ఇదే కాలంలో కులంతో సంబంధం లేకుండా చాలా మంది కవులు తమిళంలో వెలిశారు. అయితే వీరిలో ఎక్కువమంది శైవులు. కాలమేఘపులవర్, అరుణ గిరినాధర్, వీరకవి రాయర్, పరంజ్యోతి మునివర్ వీరిలో చెప్పుకోదగ్గవారు.

ఇదే కాలంలో విజయనగర సామ్రాజ్యంలో వైష్ణవం ప్రబలంగా ఉంది. కృష్ణరాయల కృతుల్లో నేడు దొరుకుతున్న ఒకేఒక గ్రంథం ఆముక్తమాల్యదను బట్టి ఆయనకు వైష్ణవ మతంపట్ల గల అపారమైన తాదాత్మ్యాన్ని గ్రహించవచ్చు.

రాయలు ఆముక్త మాల్యద అవతారికలో అనంతుని, గరుత్మంతుని, పాంచజన్య,నందక,కౌమోదకి,శార్ఙ్గ,సుదర్శనాలను, దశావతారాలనేకాక పన్నిద్దరాళ్వారులను కూడా ప్రస్తుతించాడు. ఇతివృత్తమే వైష్ణవ సంబంధి కనుక ద్రవిడ దివ్య ప్రబంధాలను (1-56, 84) తోమాలెలను (1-69) వైష్ణవావళిని (1-79) వైష్ణవపరిషత్తును (7-29) వర్ణించడం సహజమే. ఆయన పేర్కొన్న బ్రాహ్మణులందరూ దాదాపు వైష్ణవులే కాని, వాదనకోసమైనాసరే ఇతర మతాల వారిని, ముఖ్యంగా శైవులను, శైవపండితులను, వారి విశ్వాసాలను 'ప్రేలెడు దుర్మదాంధులు' (2-88) అని, వెఱ్ఱి శైవంబు (4-42), పాషండ షండంబు (4-75), విష్ణుతో నివ్వల నొక్క వేల్పు గణియించిన పాతకి నౌదు(6-43)- అని తన పాత్రలద్వారా నిందింప చేయడం, "ఆదినారాయణుండాయె నొక్కరుండ; బ్రహ్మలేడు, మహేశుండు లేడు, లేమ రోదసి" (ఆముక్త 3-10), "అశేష దివిషచ్ఛరీరంబుల న్నారాయణ శరీరంబులే" అంటూనే 'హంగ...

ఇతరుల పూజించవలె' (ఆముక్త 3-13)దని, 'బ్రహ్మ శివుడు నేనే. వారిని పూజించడం కూడా నన్ను పూజించడమే. అయినా అందులో తరతమ భేదాలున్నాయి' (4-51-) అని విష్ణువుతో చెప్పించడం, 'జయముకుందాన్య దేవతా గాత్రబధిర' (7-25) అని, వేంకటేశ్వరస్వామిని ప్రస్తావించవలసినప్పుడు కూడా 'ఈశ్వర' శబ్దాన్ని ఉచ్చరిస్తే మైలపడిపోతానని కాబోలు 'వేంకట భర్త' అని మాత్రమే అనడం రాయలుకు వైష్ణవం పట్ల గల గాఢ తత్పరతను వ్యక్తం చేస్తున్నాయి. ఈ గ్రంథాన్ని బట్టి రాయలు రాజుగా గాక ఒక మత ప్రబోధకుడుగానే కనిపిస్తాడు.

ఈ విధమైన ఇరుగు పొరుగు సాహిత్యాల, తెలుగు సాహిత్య, రాజకీయ, మత, ఆర్థిక, సాంఘిక, కన్నడ దేశంతో సన్నిహిత సంబంధం గల భౌగోళిక పరిస్థితుల నేపథ్యంలో చూసినప్పుడు ధూర్జటి ఆ కాలంలోని విశిష్ట వ్యక్తిగా కనిపిస్తాడు "వ్యవస్థిత శక్తితోపాటు అక్కడక్కడ చెదురు మదురుగానైనా విప్లవ భావన కూడా తన అస్తిత్వాన్ని నిరూపించుకుంటుంది. ఆ విప్లవ భావనవల్ల వచ్చినవారే పోతన, సంకుసాల నృసింహకవి, కూచిమంచి తిమ్మకవి వంటివారు! వీరిలో అగ్రగామి ధూర్జటి.' అని ప్రశంసల నందుకున్నాడు ధూర్జటి. ఈయన శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో "నత్కీరునికి-శంకరునికి జరిగిన (భాషా భావాల) వివాదం నాటి లాక్షణిక ఆదర్శ వ్యవస్థకు తద్వ్యతిరేక సహజ శక్తికి జరిగిన పోరాటంగా భావించాలి" అన్న అభిప్రాయం నూతనదృక్పథంతో ధూర్జటిని చూడవలసిన అవసరాన్ని చెప్పక చెప్పుతున్నది. నత్కీరుని కథను ధూర్జటి తమిళంలోని తిరువిళయాడల్ నుంచి గ్రహించినప్పటికి ఆ ఘట్టం తన హృదయాన్ని ఆకర్షించింది, భావనకు సన్నిహితమైంది కనుకనే ఈ మాహాత్మ్యానికి మూలమనబడే షడక్ష్యాయిలో లేకపోయినా ఇందులో పొందుపరచాడు ధూర్జటి.

ఈతడు శైవుడయిన కారణంగా రాయలు సంపూర్ణ దయ చూపనందున తన శతకంలో ధ్వని ప్రధానంగా కొన్నిట, తెగబడి కొన్నిట రాజులను నిందించెనని కొందరు అభిప్రాయపడుతున్నారు. కాని ధూర్జటి అంతటివాడు కేవలం తన వైయక్తిక ఈర్ష్యా ద్వేషాల కారణంగానే, అసంతృప్తి కారణంగానే రాజులను

నిశితంగా విమర్శించినాడనడం, 'అభావే విరక్తిః'వంటి దనడం సమంజసం కాదు.

పోగా రాయలు తన రచనలో తప్ప నిజ జీవితంలో వీరవైష్ణవుడుగానూ, మత సహనం లేనివాడుగానూ ప్రవర్తించినట్లు ఎక్కడా ఆధారాలు లేవు. అందువల్ల ఆర్థిక సాంఘికాది పరిస్థితుల ప్రభావం వల్ల రాజుల నిరంకుశ విధానాలకు చలించిపోయిన కారణంగానే ధూర్జటి రాజులనంత నిశితంగా, నిర్మొగమాటంగా విమర్శించినాడనటం ఉచితంగా వుంటుంది. ఈ శతకంలోని పద్యాలు అన్నీ ఒకేసారి ఒకే వూపుతో రాసినవి కాకపోవచ్చు. ఈ కారణంగా వివిధ పరిస్థితులకు స్పందించి రాసిన శతకంలో ఇతివృత్తం ఉండదు కనుక, కవి ఆత్మీయతే ప్రధానం కనుక ఈ శతకం ఆ నాటి సమాజానికీ, ధూర్జటి జీవితానికీ, ఆయన ఆలోచనా ధోరణికి అద్దం పడుతున్నది. రాయల అండ చూచుకొని అక్రమాలకు పాల్పడిన వైష్ణవుల చర్యలను సహించలేక ధూర్జటి వారిని హేళన చేశాడు. (శతకము- పద్యము 73) ''స్తుతమతియైన ఆంధ్రకవి" అనే పద్యం లోని సమాధానం భాగాన్ని తెనాలి రామలింగడు చెప్పలేదన్నప్పటికీ, తమవలె రాజుగారి కరుణా కటాక్ష వీక్షణాలకోసం మతం మార్చుకోని, రాజును పొగడని, అంకితం ఇవ్వని, అన్నిటినీ మించి ఆముక్త మాల్యద రచనలో దాదాపు వైష్ణవపు ముద్దగా కనబడే కృష్ణరాయలకు మత విషయంలో ప్రతిద్వంద్విగా నిలబడిన ధూర్జటిని అసూయతో అప్రతిష్ఠపాలు చేయడానికే కొందరు అతడికి జారత్వాన్ని అంటకట్టి వుంటారు.

రాయల మరణానంతరమే ధూర్జటి శతకం రాసి వుంటాడనుకొంటే అంతకు పూర్వమే-రాయల ఆస్థానంలో వున్నప్పుడే-శ్రీకాళహస్తి మాహాత్మ్యాన్ని రాసివుండాలి. 'తన కృతిరత్నానికి వరుడెవ్వరని పరికించడం'లో కాళహస్తీశ్వరునికే అంకితం ఇవ్వడానికి ముందు ఊగిసలాట కొంత వుండేదని అభిప్రాయపడ్డా దానికి కారణం ధూర్జటి యవ్వనం, అపరిపక్వతయే అయివుంటాయి. ఏదియేమైనా ఆయన ఆస్థానంలో ఉండి, 'పాదవినమ కృష్ణవర రాడ్గంభీర కోటీర విస్ఫుట రత్నద్యుతి పాటలీకృత పదాంభో జాతు'డుగా ప్రశంసించబడి

కూడా రాయలకు తన ఈ గ్రంథాన్ని అంకితం ఈయక పోవడమే ధూర్జటి వైశిష్ట్యం.

మతంలో అపర ధూర్జటి అయిన ధూర్జటి ప్రకృతి అంతటినీ శివమయం గానే చూశాడు. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము ఇందుకు నిదర్శనం. ఉదయిస్తున్న చంద్రుని శివలింగంగానూ-(2-133), రాజసభలో భంగపడిన శివదాసి ఏడుపును శివార్చనగానూ (1-51), ప్రకృతిలో వివిధ వస్తువులను ఆకారసామ్యంతో లింగంగా అభివర్ణించడం (శత -15) ఆయన శివ తత్పరతను తెల్పుతుంది. ధూర్జటి తన సమకాలిక కవుల కోర్కెలకు భిన్నంగా, పోతన 'పునర్జన్మంబు లేకుండగన్' తన జన్మను సఫలం చేసుకోగోరినట్లు 'భవన్మయమైన పూర్ణచిద్గగనములో మునుంగలిపి, క్రమ్మరఁబుట్టెడు బాధ మాన్పవే' (3-124) అని తిన్నని, శివబ్రాహ్మణుని కోర్కెగానూ, 'భక్తవత్సల! కాల సంభవములగుచు - కాల భుక్తంబులయ్యెడి కమలజాది-పదవులేనొల్లఁ గాలంబువట్టి మ్రింగ-నోపు మీ చిన్మయాకృతిఁ జూపుమీశ' (1-82) అని వశిష్ఠుని కోరికగానూ శివునితో చెప్పించడంలో ఆయన ఆయా పాత్రలతో తాదాత్మ్యం చెందాడు-ఆయన ప్రధాన పాత్రలన్నిటి కోరిక ఇదే- [సాలెపురుగు (2-105), కాళము-హస్తి (2-154), నత్కీరుడు (3-221), అర్జునుడు (4-196), వేశ్యకూఁతులు (4-117)]

ఆశ్వాసాంత గద్యలో తల్లిదండ్రుల పేర్లుతప్ప స్వీయవంశాదులను వర్ణించని, గురుప్రశంస చేసినప్పటికీ ఆయన పేరును చెప్పని ధూర్జటి నిరాడంబరత, 'భవపరాఙ్ముఖత', ఆ కాలపు కవులలో ధూర్జటిని విశిష్ట వ్యక్తిగా చేశాయి. పైకారణంగానే శతకంలో ధూర్జటి పేరు కనబడదు

'తానెఱిగిన విద్య నృపా - స్థానములో నెఱపఁ గీర్తి సమకూరుంగా-కేసరునకుఁబర విద్యా- ధీనత భూపాల సభ (దేజముగలదే?' అని హరద్విజుడు శివునివద్ద వాపోవడం (శ్రీకాళ-2-162) అనే వ్యాజంతో ధూర్జటి ఆకాలంలో స్వప్రకాశం లేకపోయినా కవులమని ఊరేగే, డంబాలు పలికేవారి బండారాన్ని బట్టబయలు చేశాడు. పద్యంలో తప్పుపట్టిన నత్కీరుని 'శేషంకోపేన పూరయేత్' అన్న విధంగా శివుడు శపించడం ముక్కు సూటిగా పోయే వాసెపట్టి ఆరోజుంలో చూపించబడిన నిరంకుశత్వానికి తార్కాణం.

వేశ్యలను ఉంచుకోవడం, వారిలో కొందరిని దేవదాసీలపేర ఆలయాల్లో నియమించి, అందరూ వాడుకోవడం గొప్పసంస్కృతిగా భావించే ఆరోజుల్లో, ఆముక్తలో చెప్పినట్లు రాజులు స్వయంగా వేశ్యల ఇండ్లకు వెళ్తున్నట్లు కథలు అల్లే ఆ కాలంలో వేశ్య కూతుళ్ళే వేశ్యా వృత్తిని నేరంగా భావించడం (శ్రీకాళ.4 37-45) విశేషం.

ధూర్జటి రాజులను విమర్శించడం శతకంలో ఎక్కువగా కన్పించినా ఇది బీజరూపంగా 'ఒక తప్పును కావరుగా నృపాలకుల్' అని అర్థాంతరన్యాసంగా మాహాత్మ్యంలోనే చెప్పబడింది (1-48).

119 పద్యాలు గల ధూర్జటి శతకంలో 21 పద్యాలలో రాజుల ప్రస్తావన ఉంది. రాజలోకాధమశ్రేణి (పద్యం 2), రాజులు మత్తుల్ వారి సేవ నరక ప్రాయంబు (ప. 18), రాజై దుష్కృతి జెందె చందురుడు...ఆ రాజ శబ్దంబు ఛాఛా జన్మాంతరమందు నొల్లను (ప.21),రాజర్థాతురుడైనచో నెచట ధర్మంబుండు (ప 22), రాజకీటములనే సేవింపగానోప(ప.27), నృపాధమద్వార దేశంబుగాచి దినంబుల్ వృథపుత్తుఁ జ్ఞాఁ (ప 31), అల్పుల్ మత్తులై యేల చచ్చెదరో రాజులమంచు (38), రాజన్నంతనె పోవునాకృపయు.... దుర్బీజశ్రేష్ఠులు (39), భవదుఃఖంబులు రాజకీటములనేఁ బ్రార్థించినం బాయునే (41) భూపాలురన్ సేవల్ సేయగబోదురేలొకోజనుల్ (46), సుఃఖుల్, మూర్ఖుల నుత్తమోత్తములు రాజుల్గ ల్గియేవేశన-న్నలతం బెట్టిన నీ పదాబ్జములఁబాయంజాల (56), కాంతింబొండితిఁ జాలు జాలు బహురాజద్వార సౌఖ్యంబులన్ (62), నృపాలాధమున్ పాత్రంబంచు భజించ బోదుకదియుంబాప్యంబె (63), దుర్మార్గులన్ ఛీ; ధాత్రీశులచేయ నేటికి (83), రాజశ్రేణికి దాసులై సిరుల గోరఁజేయగా సౌఖ్యమే (88), రాజులకు సేవల్ సేయగాఁ బోరు లక్ష్మి రాజ్యంబును గోరి నీ పరిజనుల్ (91), చేరంబోవు దురేల రాజుల జనుల్ (92), లోక కంటకులచేఁ బ్రాపించు సౌఖ్యంబు నా మదికిం బథ్యముగాన..... సత్యదానదయాదుల్గల రాజు నాకొసగుము (98), నరనాథాశ్రయము ............. సిద్ధించినన్, అరయన్ దొడ్డఫలంబు గల్గునదిగాతా కార్యమే తప్పినన్ — సిరియుంబోవును, బ్రాణహానియునగున్ (111), క్షితినాధోత్తమ సత్కవీశ్వరుడు వచ్చెన్ మిమ్ముఁ జూడఁగా...మముంగ్రితమే చూచెను బొమ్మటందురధముల్ (113), భూభృత్ చండాలుర్ (115).

వీనిలో 16 పద్యాలలో రాజులపై తీవ్ర విమర్శ ఉంది. నాలిగింటిలో ఆ రాజులను సేవించ బోయేవారిపై విమర్శ ఉంది ఒకదానిలో (99) 'మంచిరాజుని'మ్మని శివుని ప్రార్థించడం ధూర్జటి రాచరిక వ్యవస్థనే వ్యతిరేకించలేదని చెప్తుంది. రాజరిక వ్యవస్థయొక్క పరాకాష్ఠ దశలో జీవిస్తూ ఆ వ్యవస్థ దుర్మార్గాన్ని భరించలేని స్థితిలో ఉండి దాన్ని అతి తీవ్రంగా విమర్శిస్తూనే ఆ వ్యవస్థ పోతే దాని స్థానంలో రావలసిన మరోవ్యవస్థను ఊహించలేని పరిస్థితులలో ఆ ఉన్న వ్యవస్థలోనే ఊరటనువెతుక్కోవడానికి చేసే ప్రయత్నమే 'మంచిరాజును' కోరుకొనడం.

రాజులనేకాదు, తన సమకాలికులైన అవకాశవాదులైన కవులను కూడా ధ్వనిగా విమర్శించాడు ధూర్జటి. 'నీ చేతి జీతంబునేఁగానింబట్టక సంతతంబు మదివేడ్కన్‌గొల్తు (4), పీడెంబబ్బినయప్పుడున్ ......చెలగుదంభప్రాయ విశ్రాణన క్రీడాసక్తుల నేమి చెప్పవలె (11), రాజుల్ మత్తులు, వారి సేవ నరక ప్రాయంబు, వారిచ్చు నంభోరాశీచతురంతయాన తురగీ భూషాదులాలీత్మవ్యధా బీజంబుల్(18), ఒకరింజంపి పదస్థులై బ్రతుకఁ దామొక్కొక్క రూహింతురేలకో తామెన్నడుఁ జావరో ? ... (67) వంటి పద్యాలలో 'నిరుపతిహతిస్థలంబు' 'ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి' వంటి పద్యాలు చెప్పిన, రాజువద్ద ప్రాపకం కలిగి ఇతరులను ప్రోత్సహించని పెద్దనాది కవులపై విమర్శ ఉంది 'అయగారై చరియింపవచ్చు' (73). అనే పద్యంలో తాతాచార్యులవారివంటి వైష్ణవులపై విమర్శ ఉంది. అయినా ఆముక్తమాల్యదలో రాయలు శైవులను గురించి రాసిన పద్యాలతో (2-88;3-10; 3-13; 4-42; 4-75; 6-43) పోలిస్తే-మత విశ్వాసం రాయలకు వలెనే ధూర్జటికీ ఉన్నా-ధూర్జటి సంయమనం పరమతనిందా వైముఖ్యం గోచరిస్తాయి. పాండిత్యం ఉండీ అవకాశవాదులైన వారిని 'చదువుల్నేర్చిన పండితాధములు' (70) అని విమర్శించాడు ధూర్జటి

'కలలంచున్,శకునంబులంచు, గ్రహయోగంబంచు' (53) అనే పద్యంలో సమకాలీనుల విశ్వాసాలను విమర్శిస్తాడు ధూర్జటి 'శృతులభ్యాసముచేసి...... సభలన్ వృధావచనముల్ చెప్పంగనేకాని, (53) అనే పద్యంలో మాటలకు, చేతలకు పొంతన లేనివారిని విమర్శించాడు. ప్రతిభ లేకపోయినా కవిత్వం రాసే వారినీ విమర్శించాడు (116).

వంగ దేశంలో చైతన్యుడు (1485-1533), గుజరాతు ప్రాంతంలో వల్లభాచార్యుడు (1479-1531) మొదలైన పలువురు భక్తిప్రధానమైన రాధా మాధవ మతాన్ని ప్రారంభించారు. ముస్లిం చేనేతకారుడైన కబీర్ (1380-1414), దర్జీ కుమారుడైన నామ్‌దేవ్ (పంధరీపురం-మహారాష్ట్ర-15వ శతాబ్ది) వంటి వారు వ్యాప్తిచేసిన ఈ భక్తి ఉద్యమాన్ని రకరకాల చేతివృత్తులవారు-ముఖ్యంగా అట్టడుగు వర్గాలవారు-అనుసరించారు. ఈ ఉద్యమ నాయకులు విస్తరిస్తున్న భూస్వామ్య, రాచరిక వ్యవస్థను వ్యతిరేకించి, శ్రమ జీవులను ఏకం చేయడానికి కృషి చేశారు. పలువురు ఇతరులు కూడా సమష్టి వ్యవసాయం, గ్రామీణ స్వయం సమృద్ధతల కోసం పాటుపడ్డారు

దాదాపు ఇదే కాలంలో లాహోర్‌లోని ధాన్యం వ్యాపారి కుటుంబానికి చెందిన నానక్ (1469-1539) సిక్కు మతాన్ని ప్రారంభించాడు. దీనిలో వ్యాపారులు, రకరకాల చేతివృత్తులవారు, జాట్ కులానికి చెందిన రైతులు పలువురు చేరారు

అయితే ధూర్జటిపై వీరి ప్రభావంగాని, చైతన్యుడు 1510 తర్వాత దక్షిణ దేశయాత్రలుచేసినా, ఆయన, ధూర్జటి దాదాపు సమకాలికులే అయినా వారిద్దరు కలుసుకున్నారనటానికిగాని, ప్రత్యక్ష ప్రమాణాలు లేవు. దీన్ని మరింత పరిశోధించవలసి వుంది.

భూస్వామ్య వ్యవస్థకు, అధికార వర్గానికి వ్యతిరేకంగా భక్తిభావన ఉత్తర దేశంలో ఉద్యమ రూపాన్ని ధరించింది కాని తెలుగుదేశంలో- మరీ చెప్పాలంటే దక్షిణదేశం మొత్తంలో- ధూర్జటివంటివారు వ్యక్తులుగానే మిగిలి పోయారు తప్ప వారి ఆలోచనలు, ఆశయాలు ఉద్యమరూపాన్ని తాల్చలేక పోయాయి.

## ఉపయోగపడిన ముఖ్య గ్రంథాలు

### తెలుగు

1 అప్పారావు, పి. యస్. ఆర్. 1976. ధూర్జటి కవితావైభవం. హైదరాబాదు, యువభారతి

2. నారాయణరావు, వెల్చేరు. 1978. తెలుగులో కవితా విప్లవాలస్వరూపం. విజయవాద : విశాలాంధ్ర ప్రచురణాలయం.

3. సుందరం, ఆర్వీయస్ 1977. కన్నడ సాహిత్య చరిత్ర, హైదరాబాదు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ.

4. సుబ్బారావు, వంగూరి. 1957. (రివైజ్డ్ ఎడిషన్) శతక కవుల చరిత్రము. నరసాపురము : కమల కుటీర్ ప్రెస్ అండ్ పబ్లికేషన్స్.

5. వేంకట కృష్ణశర్మ, వేదము. 1954. శతక వాఙ్మయ సర్వస్వము. ప్రథమ సంపుటము.

ఇంగ్లీషు

1. Antonova, K, Bongard Levin, G., Kotovsky, G. 1979 A History of India. Moscow: Progress Publishers.

2. Mahalingam, T. V. 1940. Administration and Social Life Under Vijayanagar. Madras: University of Madras.

3. Meenakshi Sundaram, P. 1965 History of Tamil Literature. Hyderabad Marathi Sahitya Parishath.

4 Rice, Edward, P. 1921. A History of Kanerese Literature Culcutta: (The Heritage of India series) Association Press.

ఇంకా తెలుగు సాహిత్య చరిత్ర గ్రంథాలు, విజయనగరకాలం నాటి సాహిత్య రచనలు, ఇతర వ్యాసాలు.

# అచ్చతెలుగు కావ్యాల అవతరణ-చారిత్రక భూమిక

—బూదరాజు రాధాకృష్ణ

'అచ్చతెలుగు' నిర్వచనం విషయంలోనే పండితులమధ్య ఏకాభిప్రాయం లేదు. ప్రథమాంధ్రలాక్షణికుడు కేతన పదజాలాన్ని అయిదు విధాలుగా విభజించాడు—తత్సమం, తద్భవం, అచ్చతెనుగు, దేశ్యం, గ్రామ్యం—అని (ఆం. భా. భూ. 18). 'తల, నెల, గుడి, మడి, పులి, చలి' వంటి మాటలు అచ్చతెలుగంటూ "ఎల్లవారికిఁ దెలిసెడి యాపలుకు లచ్చతెనుఁగనఁబరగున్" అని నిర్వచించాడు (ఆం. భా. భూ. 22). మరి రెండు పద్యాల్లో 'దేశితెనుఁగు/దేశ్యంపుఁ దెలుఁగు'ను వివరిస్తూ 'ఎఱుకువ, నెత్తమ్మి, ఎరగలి, ఎసకంబు' వంటి 'పలుకులు' 'దేశితెలుఁగు' లనీ, 'తేఱనాడిన దేశ్యంపుఁ తెలుఁగులయ్యె' ననీ (అదే. 23, 24). అంటే 'స్పష్టంగా తెలిసే' మాటలు దేశ్యపదాలని అర్థం చెప్పుకుంటే పై నిర్వచనానికీ దీనికీ మధ్యనున్న భేదం మాత్రం స్పష్టంగా లేదు 'సాహిత్యోపయుక్త' పదాలు దేశ్యాలని సుందరాచార్యుల వివరణ (అ. తె. కృ. ప. 8). కేతనే 'తత్సమంబు దక్క తక్కిన నాలుగు, నచ్చతెలుగులందు రఖిల జనులు, (ఆం. భా. భూ. 27) అని చెప్పినందువల్ల విషయం మరింత క్లిష్టమవుతున్నది. 'గ్రామ్య' మనేది 'లక్షణవిరుద్ధ'మో, 'బూతో' కావచ్చు. అది ఏ భాషా భాగానికి చెందినా కావ్య ప్రయోగదూరమే కాబట్టి ప్రస్తుత పరిశీలనలో స్మరించనక్కర లేదు. అందరికీ తెలిసే దేశ్యాలు అచ్చతెలుగులనీ, తెలియనివి దేశ్యమాత్రాలనీ స్థూలంగా కేతన మతం కావచ్చు.

తరవాతి లాక్షణికుల విభజన ప్రణాళిక మరోవిధంగా ఉంది. విన్నకోట పెద్దన 'తత్సమం, తద్భవం, సహజాంధ్రదేశభవం, దేశ్యోద్భవం, గ్రామ్యం' అని పంచవిధాలుగా విభజిస్తూ (కావ్యా. చూ. 9-11), 'బహుదేశానీయముల్తై

చక్కఁదనము నెఱదనములునై ఆయా నెలవులఁ జెవులకుఁ దీయములగు పలుకు లెల్ల దేశ్యము' లన్నాఁడు (అదే 9-14). అన్యదేశ్యాలూ, మాండలికాలూ దేశ్యా లని ఆయనభావం కావచ్చు, 'ఎల్లజనులకున్ లో మిగులఁ దేటపడియెడు నా మాటల యచ్చతెనుఁగు' లన్న పెద్దన దృష్టిలో (అదే 9-18) కేతన చూపులో లాగానే స్పష్టబోధత అచ్చతెనుగు ప్రధానలక్షణం అనిపిస్తుంది. అప్పకవి చతుర్విధ విభజన చేశాడు. 'తత్సమ,తద్భవ, దేశ్య,గ్రామ్య' పదాలని విభజిస్తూ దేశ్యాలకు రెండు విధాల అవాంతర భేదాలు సూచించాడు: 'ఆంధ్రదేశ్యంబులు రెండు దెఱంగులయ్యె భువి శుద్ధాంధ్రంబులు నన్యదేశ్యజాంధ్రంబులు నాఁగా...' అని (అప్పకవీయం 1-105) పెద్దన మాటలతో అప్పకవి మాటలను అను సంధించినప్పుడు అన్యదేశ్యాలను (అంటే తత్సమేతరాలను) దేశ్యాలుగా భావించా రని తెలుస్తుంది. కూచిమంచి తిమ్మకవి 'లోకవ్యవహారంబగు బాస దేశ్య మంద్రదదియెహితం బారఁగ నచ్చతెనుంగని...కొందరందురు...' (లక్షణసార సంగ్రహం 1-69) అన్నప్పుడు దేశ్యానికీ అచ్చతెలుగుకూ భేదం లేదనే చెప్తు న్నాడు కాని ఆయన ఉదాహరణలేమీ ఇవ్వలేదు తెలుగు లాక్షణికులు తత్సమ మన్న పదానికి సంస్కృత, ప్రాకృత సమమనే అర్థమే చెప్పుకున్నారు, చిన్నయ సూరికాలందాకా సూరి మాత్రం 'త్రిలింగదేశ వ్యవహారసిద్ధంబగు భాష దేశ్యంబు' (బాలవ్యాకరణం, సంజ్ఞా. 21), 'సంస్కృత సమేతరంబయిన భాష యచ్చ నాఁబడు' (అదే, అచ్చిక. 1) అనే రెండు సూత్రాల్లో అచ్చతెలుగులో దేశ్యం ఒక భాగమని నిర్ణయించాడు. ప్రాకృతసమం, సంస్కృత ప్రాకృత భవాలు, దేశ్యం గ్రామ్యం-అన్నీ అచ్చతెలుగే కాబట్టి, పూర్వోక్త కేతన నిర్వ చనంలోనూ (చూ 1-1), శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి హరికారికల్లోను ('తత్సమేతర భాషేయ మచ్ఛేతి కవయో వదన్') ప్రాకృతసమాలు అచ్చతెలుగులో చేరవు. చిన్నయసూరి దృష్టిలో చేర్తాయి. చిన్నయసూరి అన్యదేశ్యాల ప్రస్తావనే తీసుకు రాలేదు. అప్పకవి తెచ్చి, వాటిని 'మతిరోసి విడువకూడ' దనీ, 'వ్యవహార హాని' వస్తుందనీ, అవన్నీ 'నీతంబు' లనీ, వాటిని అచ్చతెలుగులో భాగంగానే పరిగణించాడు (అప్పకవీయం 1-64-70).

అచ్చతెలుగును గురించి అనేకులు చర్చోపచర్చలు చేశారు.[1] అచ్చతెలుగులో అన్యదేశ్యాలను (అంటే ముఖ్యంగా సంస్కృత ప్రాకృతసమేతరాలను) భాగంగా మన లాక్షణికులు భావించారనటంలో సందేహం లేదు (రాధాకృష్ణ, వ్యావహారిక భాషావికాసం, 44-47). ఒకనాటి గ్రామ్యం మరో కాలంలో అగ్రామ్యమై అచ్చతెలుగులోనో దేశ్యంలోనో భాగమవుతుందని వఝుల చినసీతారామస్వామిశాస్త్రి, తాతా సుబ్బారాయుడు శాస్త్రి భావించారు (రాధాకృష్ణ, తెలుగుభాషాచరిత్ర, 270, 296). తమిళ కన్నడాది భాషలనుంచి గానీ, ఉరుదూ ఇంగ్లీషుల వంటి భాషల నుంచి గాని వర్ణభేదం లేకుండా వచ్చిన పదాలను తత్సమాలుగాను, వర్ణవికారంతో వచ్చిన వాటిని తద్భవాలుగాను భావించవలసివుండగా సంస్కృతప్రాకృతసమాలను మాత్రమే తత్సమాలుగా, సంస్కృతప్రాకృతభవాలను తద్భవాలుగా భావించటం మన లాక్షణికుల విశ్లేషణపద్ధతిలోని లోపమే. అదే సమయంలో సంస్కృత ప్రాకృతేతరాలను 'అన్యదేశ్యా' లంటూనే 'అచ్చ తెలుగు'లో భాగాలనుకోవటం మరీ పొరపాటు (రాధాకృష్ణ, తెలుగు భాషా చరిత్ర, 95, 269). అయిదింట నాలుగువంతుల తద్భవాలు ప్రాకృత భవాలైనా వాటిని సంస్కృత భవాలుగా పరిగణించటం, తెలుగు వర్ణపద్ధతికి లోబడిన కారణంగా అవి అచ్చ తెలుగు మాట లనుకోవటం సరైన పద్ధతి కాదు (దొణప్ప, తెలుగు భాషా చరిత్ర, 305, 308). ఈ పరిగణనకు 'వ్యవహారహాని' భయమే ప్రధానకారణమయితే సంస్కృత సమాలుగాని ప్రాకృతసమాలుగాని అటువంటి హాని కలిగించవనుకోవటం పరిహాసాస్పదం. 'అచ్చ తెలుగు' కావ్యాలను పరిశీలిస్తే, వాటిలోని భాషాపాటవాన్నీ, రసపుష్టినీ పరిగణిస్తే, ఈ విచక్షణ ఎంత అసమంజసమో తెలుస్తుంది. నిజానికి దేశ్యాలనీ, అన్యదేశ్యాలనీ పదజాలాన్ని విభజించి అన్యదేశ్యాల్లో అవి ఏ భాషనుంచి వచ్చి

---

1. చూ. అచ్చతెనుగు కావ్యము, భారతి, జూన్ 1972; ఆంధ్ర దేశ్యము-అన్యదేశ్యము, కోరాడ రామకృష్ణయ్య, భారతి, ఆగష్టు-సెప్టెంబరు 1944; ఆంధ్రము-అన్యదేశ్యపదములు, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, సా. సర్వ. రుధిరోద్గారి, ఫాల్గుణం; అచ్చతెనుగు, చింతలపల్లి రామకృష్ణమూర్తి, ఆం. సా. ప. ప. 1928 మొదలైనవి. వివరాలకు నే. శ్రీ. కృష్ణమూర్తి 'వ్యాసరచనల సూచి' (1875-1972), ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్, 1977.

చేరినవైనా చేర్చివుండాల్సింది. అచ్చ తెలుగు కవులు సంస్కృత ప్రాకృతాలను వెలివేసి పెర్షో-అరబిక్ పదాలు వాడటంలో సామంజస్యం గాని,కావ్యప్రయోజనం గాని, వ్యవహార ప్రయోజనంగాని, నిర్దుష్ట లాక్షణిక దృష్టిగాని కనిపించవు. సహజంగా వాడుకలోకి వచ్చిన సంస్కృతపదాలను పరిహరించటమే కృత్రిమం. తదితర భాషాపదాలు తెలుగే అనుకోవటం కృత్రిమత్వానికి పరాకాష్ఠ. పరిహరించామంటూనే సంస్కృత పదాలకూ, పదబంధాలకూ, వ్యుత్పత్తి మూలక కృత్రిమానువాదాలు చేసి, అవి సహజమై అందరికీ అర్థమయ్యే అచ్చ తెలుగుకు ప్రతిబింబాలనుకోవటం హాస్యాస్పదం.

'అచ్చ తెనుగు' కు పర్యాయపదాలుగానో, సమీప పదాలుగానో మన లాక్షణికులూ కవులూ వాడిన మాటలు మరికొన్ని వున్నాయి: 'తేట తెలుగు, జానుతెనుగు, నాటు తెలుగు' అనేవి. వీటిలో మొదటి పదం అంత సాంకేతికం కాదు (బులుసు వేంకటేశ్వర్లు: భారతి 1948 జులై; గిడుగు 1965 ఆం. ప. ఉగాది సంచిక). మూడోది ఆదిభట్ల నారాయణదాసు సహజ ధోరణిలో పెట్టిన పేరు (వ్యాసపీఠం, 67); అంత పట్టించుకోవలసింది కాదు. 'జానుతెను' గనే పదం వీరశైవోద్యమంతో ముడిపడి అనేక విమర్శన లాకర్షించింది. 'జాను' శబ్దానికి 'అందము, సౌందర్యము' అని శబ్దరత్నాకరార్థం. 'జానుఁదెనుగు' అంటే తేట తెనుఁగు, స్పష్టముగాఁ దెలిసెడి తెనుగు' అని సూర్యరాయాంధ్ర నిఘంటువు. నన్నెచోడుడి కుమారసంభవంలోని 'సరళముగాఁగ భావములు జానుఁదెనుంగున నింపు పెంపుతోఁ బిరిగొన వర్ణనల్...' ఇత్యాది పద్యాన్నీ (1-35), పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలోని 'జానుఁదెనుఁగు విశేషము ప్రసన్నతకు' (దీక్షాప్రకరణం, 6.పా), బసవ పురాణంలోని 'ఉరుతర గద్యపద్యోక్తుల కంటె - సరసమై పరఁగిన జానుఁదెనుంగు - చర్చింపగా సర్వ సామాన్య మగుట' (1-81 పం.) అనే ప్రయోగాలనూ సూర్యరాయాంధ్ర నిఘంటువు ఇస్తున్నది. ప్రయోగాలను బట్టి చూస్తే కేతన నిర్వచనంలోని అచ్చ తెనుగుకూ దీనికీ భేదం స్పష్టంగా కనిపించదు. పాల్కురికి సోమన పద్యం 'బలు పులితోలు చీరయును, ఁబాపసరుల్...లెంక నని జానుఁదెనుంగున విన్నవించెదన్...' (వృషాధిపశతకం 67 ప) లోని పదజాలం అచ్చ తెలుగుకే

ఉదాహరణ ప్రాయం. అయితే సుందరాచార్యులు బహుకావ్య భాషా పరిశీలనచేసి జాను తెలుగంటే 'మిశ్రాంధ్రం' అనే నిర్ణయానికి వచ్చారు (అ.తె.కృ.ప.,2). ఈ శబ్దాన్ని నేలటూరి వేంకటరమణయ్య (భారతి 1942 సెప్టెంబర్), కోరాడ రామకృష్ణయ్య (భారతి 1946 జూన్) వంటి మరికొందరు కూడా చర్చించారు. గొర్రెపాటి వెంకటసుబ్బయ్యవంటివారు శాస్త్రదృష్టికన్నా రసానందం ఎక్కువై జానుదెనుగును ప్రశంసించారు (కిన్నెర 1958). 'జాను' శబ్దానికి సమానార్థక సరూప పదం కన్నడంలో కనిపించదు. కన్నడంలోని 'జేను' శబ్దానికి 'తేనె' అని అర్థం (చూ. కిటిల్, DED 2674 b). పదాద్యకారేకారాల మారుపాటు ఆంధ్ర కర్ణాటాల్లో మరికొన్ని పదాల్లో కనిపిస్తుంది కాబట్టి జాను, జేనులకు ప్రాథమికార్థంగా 'తియ్యని' అని చెప్పవచ్చు. కన్నడంలో జానుశబ్ద ప్రయోగం భాషాపరంగా లేదు. అలాగే తమిళ మలయాళాల్లోనూ. అందువల్ల తెలుగువారి దాడుకనే ఈ విషయంలో ప్రమాణంగా తీసుకోవలసి వస్తుంది. అయితే సోమనాథుడి జానుదెనుగు ఒకప్పుడు అచ్చ తెలుగుగా, ఒకప్పుడు ఆంధ్రంగా భాసిస్తుంది. నన్నెచోడుడి విషయంలోనూ అంతే. క్రీ.శ. 16 వ శతాబ్ది తరవాత వచ్చిన అచ్చ తెలుగు కావ్యాల్లో లాగా వీరశైవ కవుల జానుదెనుగులో పెర్షో—అరబిక్ పదాలు లేవు కాబట్టి 'మిశ్రాంధ్ర' మనే పూర్వోక్త వివరణ శైవకావ్యాల విషయంలో సరిపడదు, తమిళ, కన్నడాది పదాలను అన్యదేశ్యాలుగా పరిగణిస్తే తప్ప. కన్నడంలోనూ సాహిత్యం వెలయించిన వీర శైవకవులు జానుదెనుగనే మాట వాడలేదు. 'అచ్చగన్నడ' మనే అన్నారు. అచ్చగన్నడంలో అన్యదేశ్యాలకు తావులేదు. మన లాక్షణికులు వైరి సమాసాలను, మిశ్రసమాసాలను నిషేధించినట్లే కన్నడ లాక్షణికులు కూడా నిషేధించారు గాని, వారి నిషేధం తీవ్రతరమయింది శబ్దమణిదర్పణం 'ఆ సమసంస్కృతంగళన్ అచ్చగన్నడదోళ్ బెరసి సమాసం మాడలాగదు' (సూత్రం 98) అని చెప్తుంది. తత్సమాల్లో ప్రాకృత సమాలను కూడా మన లాక్షణికులు చేరిస్తే కన్నడ లాక్షణికులు సంస్కృత సమాలనే చేర్చి ఆ మాటలను 'సమసంస్కృత' పదాలంటారు. మలయాళంలో 'శుద్ధమలయాళ' మనే మాటకే వాడుక. సంస్కృత తమిళ పదాల ప్రభావం లేని భాషనే వాళ్లు శుద్ధ మలయాళ మంటారు (వెంకటేశ్వర శాస్త్రి 1968-32). ఇది 'కొడుందమిటం' (వాడుక తమిళం) భాష నుంచి ఏర్పడ్డదని కొందరి అభిప్రాయం (అదే. మలయాళం iii).

ఈ వ్యాసకర్తకు తెలిసినంతలో తెలుగు సాహిత్యంమీద తమిళ సాహితీ ప్రభావంగాని, తమిళ సాహిత్యంమీద తెలుగు సాహిత్య ప్రభావంగాని- ఒకవేళ ఉన్నా పరిగణనీయంగా- ఎన్నడూ లేదు. వైష్ణవ మత గ్రంథాల్లో కొంత తమిళ ప్రభావమున్నా కావ్యాల్లో మతేతర విషయాల్లో కనిపించదు. తమిళ సాహిత్యంలో సంగంకాలంలో గ్రంథాక్షరి లిపిలో సంస్కృత పదాలను వాడే వారే గాని రాను రాను వట్టెలుత్తులిపికీ, చెందమిళం భాషకూ (గ్రాంథిక భాషకూ) ప్రాముఖ్యం వచ్చింది. జాతిలక్షణంగా వేర్పాటువాదంతో బతికే తమిళుల సాహిత్యంలో అచ్చతెలుగువంటి పదాల అవసరమే లేదు. ఇప్పటి రాజకీయ మనస్తత్వాన్నిబట్టి దక్షిణభారతం మొత్తంలో తమిళులు మాత్రమే భాషా పరిశుద్ధతా వాదులు. వాళ్ళ సాహిత్యంకూడా అంతే. దాని ప్రభావమే తెలుగు మీద ఉంటే అచ్చ తెలుగు కావ్యాలు అసంఖ్యాకంగా వెలువడటమే కాక వాటికి సాహిత్యంలో సర్వోత్తమ స్థానం దక్కి ఉండేది. తమిళ సాహిత్యంలో ఏ కారణాలవల్ల "పరిశుద్ధ" భాషారచనలు వచ్చాయో పరిశీలించినా ప్రయోజనం లేదు కాబట్టి ఆ విషయం చర్చించటం లేదు.

కన్నడ సాహిత్యంలో 'అచ్చగన్నడ' వాదం అనాది సిద్ధమే. వీర శైవ కవులు ఈ వాదానికి జీవం పోశారు. క్రీ॥శ॥ పన్నెండో శతాబ్దంలో కావ్య నిర్మాణం చేసిన అల్లమప్రభు, బసవేశ్వర, చెన్నబసవ, సిద్ధరామ, పండితారాధ్య, సోమనాథాదు లెవ్వరూ అచ్చగన్నడంలో రాయలేదు. వాస్తవానికి తెలుగులో లాగా కన్నడంలో కూడా వారు చెప్పినట్లు చేయలేదు. జైన సాహిత్యాన్ని జైనుల మతధోరణులనూ ప్రతిఘటించారే గాని ఆచరణలో అచ్చగన్నడం రాసి చూపలేదు. ఇంకా చిత్రమేమంటే జైనకవి ఆండయ్య క్రీ॥శ॥ 1225 ప్రాంతంలో అటు మహాకావ్యం గాని ఇటు ఖండకావ్యంగాని కాని ఒకానొక చంపూ రచనలో కన్నడ సాహిత్యంలో అద్వితీయంగా అనుస్యూతంగా ఉన్న అచ్చగన్నడ రచన చేశాడు. (ముగళి. 1934 : 221-23) ఆ గ్రంథానికి రెండు పేర్లు : కబ్బిగర కావ (=కవిరక్షకుడు) లేదా. కావనగెల్లి (= కాముని గెలుపు) అని.[1] వీర శైవులతో సహా అందరూ అచ్చగన్నడమంటూనే 'ఘృతతైల న్యాయం'లా సంస్కృత మిశ్రితభాష రాసి కర్త్రీ వేస్తున్నారని

1. ఇది మణి ప్రవాళ కావ్యమనీ, 'కబ్బిగర కావ'కు 'మదన విజయ'మనే అర్థమనీ వెంకటేశ్వరశాస్త్రి భావించటం ప్రామాదికం (1968:14).

ఆయన 'ధ్వనియుక్త కావ్యం' రాశాడట. అందులో జైనకథాలేదు, లౌకిక కథాలేదు ('జినకథయిల్ల. లౌకిక కథ యిల్ల') బేంద్రే అభిప్రాయంలో 'శ్రవణ-విరక్తి, శివ-శక్తి, కామ-రతి' అనే త్రివిధ ద్వంద్వాలను నిరూపించటానికి కవి యత్నించాడు (''శ్రీ బేంద్రియవరు హేళువంది 'కామ-రతి, శ్రవణ-విరక్తి, శివ-శక్తి-' ఈ త్రికూట ద్వంద్వద కావ్యవు కబ్బిగర కావదల్లి నిరూపిత వాగిత,'' అదే 221). అంటే అనేక అచ్చ తెలుగు కావ్యాల్లాగా ఇదొక చిత్ర కావ్యమని చెప్పవచ్చు. ఆండయ్యకు ముందుగాని వెనకగాని ఎవరూ ఈ రకమైన రచన చేయకపోవటమే ఆయన ప్రత్యేకత ('యారూ అవనమార్గవన్ను అనుసరిసదిల్ల'-అదే). ఆండయ్య అచ్చగన్నడ రచనకు చారిత్రక సామాజిక కారణాలేమీ లేవు. శివకవులు చేస్తామని, చేశామని చెప్పి చేయని పని నేను చేస్తున్నాననే మనస్తృప్తి పాప మాయనకు కలిగిఉంటుంది. అంతే లాభం.

శుద్ధ మలయాళ కావ్యాల విషయంలో కొన్ని కారణాలు కనిపిస్తాయి. క్రీ॥శ॥ 12వ శతాబ్దిలో మలయాళ సాహిత్యం ఆవిర్భవించేటప్పటికి మణిప్రవాళ, పాట్టు రచనా ధోరణులుండేవి. మొదటి రకంలో 'ద్రావిడ సంఘాతాక్షర నిబద్ధం'గా సంస్కృతపదాలను ప్రత్యయ సహితంగా వాడితే, రెండో పద్ధతిలో చెందమిళం చోటు చేసుకుంది. మణిప్రవాళ శైలి తెలుగు కన్నడాల్లోనేగాక చివరికి తమిళంలో కూడా వాడుకలోకి వచ్చింది 13, 14 శతాబ్దాల్లో (వేంకటేశ్వరశాస్త్రి 1968 : 14, 15). క్రి. శ. 1350-1450 మధ్య కాలం నాటి 'నిరణం కవులు' లీలాతిలకం నియమాలను అధిగమించి సంస్కృత పద భూయిష్టంగా సంస్కృతాక్షరాలను కూడా వాడి, ముత్తమిళం (=తక్కువ తరగతి తమిళం) అందులో కలిపి మిశ్రభాషలో కవిత్వం చెప్పారు. (అదే, 23-25). ద్రవిడ పదాలను నిస్సంకోచంగా సంస్కృతీకరించి 'సందర్భే సంస్కృతీకృతాచా' అనే లీలా తిలక సూత్రాన్ని చరమావధికి తీసుకపోయారు. ఈ ధోరణిని వ్యతిరేకిస్తూ క్రీ॥శ॥ 16వ శతాబ్దిలో 'కృష్ణ గాథ' అనే శుద్ధ మలయాళ కావ్యం తమిళ భాషా ప్రభావం కూడా లేకుండా వెలువడింది (అదే, 27-28). అంతకుముందు అటువంటి రచనలు లేవు. ఈ గ్రంథకర్త ఎవరన్నది వివాదాస్పదమైనా దానికున్న ప్రజామోదం మరో కావ్యానికి రాలేదు. (అదే 31-32). క్రి. శ. 16వ శతాబ్దినాటి ఎటుతచ్చన్ భారతంలో చాలావరకు శుద్ధమలయాళం ఉన్నా (అదే, 40) కృష్ణగాథ ఒక్కటే ఆ ప్రక్రియకు దృష్టాం

తంగా లక్ష్యంగా నిలిచింది. కన్నడంలో కబ్బిగరకావలాగా మలయాళంలో ఇదొక్కటే విలక్షణ కావ్యం. మలయాళంలో ఈ ధోరణి నిలవలేదు.

'శుద్ధ సంస్కృత' వాదం, 'పరిశుద్ధ అస్సామీవాదం' వంటివి ఉన్నట్లుగాని, ఆ తీరు రచనలున్నట్లుగాని ఈ వ్యాసకర్తకు తెలియదు. మధ్యయుగాలనాటి ఉత్తర భారతీయభాషల్లో కూడా ఇటువంటి ధోరణి పర్యాప్తంగా లేదు. తూర్పు ఇండియా కంపెనీవారి ధర్మమా అని వచ్చిన హిందీ-ఉరుదూ సంఘర్షణ క్రీ. శ. 19వ శతాబ్దినాటిది. హరిఔధ్ 'ఠేఠ్ హిందీ కా ఠాఠ్' గాని, రాజా లక్ష్మణసింగ్ పెర్షో-అరబిక్ పదాలను వెలివేయాలని వాదించటంగాని, సేఠ్ గోవిందదాస్, పురుషోత్తమ్ దాస్ టండన్ ప్రభృతులు సంస్కృతమయ హిందీకోసం చేసిన ఆర్భాటంగాని, భారత ప్రభుత్వం వారు- ముఖ్యంగా హిందీ డైరెక్టరేట్, ఆకాశవాణి వంటి విభాగాలవారు- సృష్టించిన సర్కారీ హిందీగాని, చివరికి డాక్టర్ రఘువీర్ భాషా భేషజంగాని, మన అచ్చతెలుగువాదానికి సరిపోలక పోగా అందుకు వ్యతిరేకమైన ధోరణులకే అవి నిదర్శనలు.

భాషలో స్వచ్ఛత, శుద్ధతవంటి భావాలు గాలిమేడల వంటివి. సంస్కృతంతో సహా ఏ భాషా అన్యభాషాపదాలు స్వీకరించనిది లేదు. ఏక కుటుంబానికి చెందిన భాషల్లో కూడా కాలాంతరంలో- అవి ప్రత్యేక భాషలుగా విడిపోయిన తరవాతికాలంలో- ఆదాన ప్రదానా లున్నప్పుడు ఆలా వచ్చి చేరిన పదాలు అన్యదేశ్యాలే అవుతాయి. వాటిలో కొన్ని చేరినందువల్ల భాష పరిశుద్ధమై, మరి కొన్ని చేరితే అపవిత్రమయిపోదు ఏ భాషలోనైనా 5 శాతం పదాలు మాత్రమే అన్యదేశ్యాలని, అచ్చతెలుగులో "ఇతర ద్రావిడభాషా పదములకన్న పారసీ, అరబ్బీ, ఉర్దూ పదములు...ఎక్కువగా చేరిన' వనిగాని, 'ఈ అన్యదేశ్యములు చాలవరకు తత్సమములుగనే వాడబడినవి' అనిగాని ఊహించటం కేవలం అమాయకత్వం (సుందరాచార్యులు: అ. తె. కృ. ప. 243-351). కొమ్ములు తిరిగిన మన లాక్షణికులు కూడా సంస్కృతేతర-అన్యదేశ్యాల రూప నిష్పత్తి సాధించలేదు. ప్రాకృత సమ, ప్రాకృత భవాలు ఏ ప్రాకృత భాషా విశేషం నుంచి వచ్చాయో చెప్పలేదు. తెలుగులోని ఇతర భాషాపదాల (అన్యదేశ్యాల) పరిశీలన చేసినవారు పూర్వవ్యాకర్తల పద్ధతిలో తత్సమ, తద్భవాల విభేదనతో రూపనిష్పాదన చేయలేదు. మొత్తంమీద సంస్కృత సమపదాలు లేని భాషా

విశేషాన్ని అచ్చతెలుగని భావించారు. వ్యక్తినామ, స్థలనామాదులను, బిరుదులను చాలామంది యథాతథంగా ప్రయోగించినా, కొందరు వాటికికూడా వ్యుత్పత్తి మూలకానువాదాలు చేశారు. ఏవంవిధగుణసంపన్నమైన అచ్చ తెలుగు రచనలు ఏ కాలంలో, ఏ పరిస్థితుల్లో, ఎవరు, ఏవిధంగా కల్పించారో స్థూలంగా మాత్రమే పరిశీలిద్దాం.

అచ్చ తెలుగు కృతులనేవి క్రీస్తుశకం పదహారో శతాబ్దినుంచి ఇంచు మించు నేటిదాకా అవతరిస్తూ ఉన్నాయి. సుందరాచార్యులుగారు బహుపరిశ్రమ ఫలితంగా 57 గురు రచయితలను, 91 కృతులనూ పేర్కొన్నారు. వారికి గూడా దొరకకుండా తప్పించుకొన్న రచయితలూ, కృతులూ ఉండవచ్చు. వారిచ్చిన విశేషాలమీదనే ఆధారపడి లెక్కలు కడితే, నేటి ప్రాంతీయ విభజన ప్రకారం 39 మంది రచయితలు కోస్తావారు; ఆరుగురు తెలంగాణావారు, ఇద్దరు రాయలసీమవారు, మరి ఇద్దరు గంజాం జిల్లావారు, ఎనిమిదిమంది దక్షి ణాంధ్రులు. శతాబ్దాలవారీగా లెక్కిస్తే పదహారో శతాబ్ది వారిద్దరూ తెలంగాణా వారే. వారే ఈ పద్ధతికి ప్రవర్తకులు. పదిహేడో శతాబ్దివారు అయిదుగురిలో తెలంగాణా, దక్షిణాంధ్రాల ప్రతినిధులు ఒక్కొక్కరయితే కోస్తావారు ముగ్గురు. పద్దెనిమిదో శతాబ్ది రచనలు ఆరింటిలో కోస్తావారివి నాలుగు, దక్షిణాంధ్రులవి రెండు. పందొమ్మిదో శతాబ్ది రచనలు 19. వాటిలో పదమూడు కోస్తావారివి. మరి రచనల విషయం పరిశీలిస్తే సుమారు 50 గ్రంథాలు నిఘంటువులు మిగిలిన వాటిలో అనేకం 'నియమకవిత' (అ. తె. కృ ప. 17) నిర్వచన, నిరోష్ఠ్య, నిరూష్మలే కాకుండా ఏకాదశాక్షరి వంటి సాముగరిడీలు కూడా లేక పోలేదు. అనులోమ విలోమ బంధకవితాదులు లేకపోలేదు. 'పండితుల, ప్రభువుల పరభాషా వ్యామోహము కారణముగ...అచ్చ తెలుగు ప్రక్రియ అధమ కావ్య ప్రక్రియగ భావింపబడినది' అని (అదే. 14), పాఠ్యగ్రంథాల్లో లేనందువల్ల 'అనాదృత వాఙ్మయ' మయిందనీ (అదే. 17) సుందరాచార్యులవారు వర్ణిస్తు న్నారు. నిజమా?

అచ్చ తెలుగు సాహిత్యాన్ని ఏ పేరుతో పిలిచినా దాని ఆవిర్భావానికి ఏదో కారణం ఉండాలి. వీరశైవులు జాను తెలుగు వాదం తెచ్చినప్పుడు మార్గ కవితా ధోరణులనూ, సంస్కృత ప్రభావాన్నీ నిరసిస్తూ ద్విపదవంటి దేశీయ

ఛ్ఛందస్సునూ, స్థానిక భక్తచరిత్రలనూ ప్రవేశపెట్టినా భాషా విషయంలో తాము చెప్పిన సిద్ధాంతాలను తామే ఆచరించలేకపోయారు. అచ్చతెలుగుపదాలను ఎవరెన్ని వాడారో, ఎంత శాతం వాడారో లెక్కపెట్టలేము కాబట్టి ఈ వ్యాసకర్త ఏదో ఒక అంకె చెప్పలేదు కాని మొత్తంమీద రంగనాథ రామాయణాదుల్తో పోలిస్తే వీరశైవుల కృతులు ప్రజామోదం అంతగా పొందకపోవటానికి వారుప యోగించిన భాష కూడా కారణమయి వుంటుందని చెప్పగలడు. మరి ఇతర కారణాలు కూడా ఉండివుంటాయి. ఆ ఉద్యమం ఫలించలేదు. అప్పటి నుంచి రచనలు మామూలు ధోరణిలోనే నడిచాయి—పదహారో శతాబ్దం వరకు, మూడు వందల సంవత్సరాలపాటు. మొదటి అచ్చ తెలుగు పుస్తకం వచ్చేసరికి దేశ కాల పాత్రల్లో కొన్ని మార్పులు వచ్చాయి. క్రీ. శ. 1530 తరువాత శ్రీకృష్ణ దేవరాయల మరణానంతరం, విజయనగర సామ్రాజ్యం క్షీణముఖం పట్టింది. రెడ్డి సామ్రాజ్యం అప్పటికే అస్తమించింది. వెలమల రాజ్యాలు సామంత రాజ్యాలైనాయి. క్రీ. శ. 1323 లోనే తెలుగుగడ్డమీద కాలుమోపిన ముస్లిములు రాజ్యాలు స్థాపించారు. పదహారో శతాబ్దికి కుతుబ్‌షాహీల ప్రభుత్వం వచ్చింది. (మల్లంపల్లి 1967:67-110) తెలుగువారు సామ్రాజ్య నిర్మాణం నుంచి సామంత రాజ్యాల స్థితికి-నిజానికవి పెద్ద జమీందారీలు మాత్రమే-దిగజారారు. యూరపియన్ రాజ్యాలవారు ప్రాక్పశ్చిమతీరాల్లో వాణిజ్యం పేరిట స్థిరపడి ప్రభుత్వావకాశాల కోసం సన్నద్ధమవుతున్నారు. తెలుగుదేశం బహుధా విచ్ఛిన్నమయింది. సాహిత్యంలో స్వర్ణయుగం అంతరిస్తున్నది. కవి పండిత పోషణ చక్రవర్తుల పని గాక సామంతుల కర్తవ్యమయింది. ప్రవాసాంధ్రులు దక్షిణదేశంలో మహాకావ్య రచనకన్నా వచనకవితా యక్షగానాదుల మీదా, నిఘంటు నిర్మాణంమీద దృష్టిసారించారు. పారంపర్యమైన ప్రబంధకవిత గతానుగతికమై పిల్ల వసుచరిత్రలవంటి కుక్కమూతి పిందెలు పుట్టేకాలం దాపురించింది. శాస్త్రగ్రంథాలు, టీకాటిప్పణులు, చిత్ర, బంధ కవితలు, ఆశుకవితా ధోరణులు తొంగిచూస్తున్నాయి. తెలుగు రచయితల దృష్టి వాళ్ళ రాజకీయ సామాజిక దృక్పథాల్లాగానే కల్లోలితమై పోయింది. వేమన నిందించిన సమాజం వేళ్ళు దన్నుతున్నది.

మొదటి నుంచీ భారత భాగవత రామాయణాది సంస్కృతకథలే కావ్య వస్తువులుగా బతికినవాళ్ళు నూతనత్వం ప్రదర్శించలేని - ప్రదర్శించి మెప్పించ

చక్కఁదనము నెఱదనములునై ఆయా నెలవులఁ జెవులకుఁ దీయములగు పలుకు లెల్ల దేశ్యము' లన్నాడు (అదే 9-14). అన్యదేశ్యాలూ, మాండలికాలూ దేశ్యాలని ఆయనభావం కావచ్చు, 'ఎల్లజనులకున్ లో మిగులఁ దేటపడియెడు నా మాటల యచ్చతెనుఁగు' లన్న పెద్దన దృష్టిలో (అదే 9-18) కేతన చూపులో లాగానే స్పష్టబోధత అచ్చతెనుగు ప్రధానలక్షణం అనిపిస్తుంది. అప్పకవి చతుర్విధ విభజన చేశాడు. 'తత్సమ,తద్భవ, దేశ్య,గ్రామ్య' పదాలని విభజిస్తూ దేశ్యాలకు రెండు విధాల అవాంతర భేదాలు సూచించాడు: 'ఆంధ్రదేశ్యంబులు రెండు దెఱంగులయ్యె భువి శుద్ధాంధ్రంబులు నన్యదేశ్యజాంధ్రంబులు నాఁగా...' అని (అప్పకవీయం 1-105) పెద్దన మాటలతో అప్పకవి మాటలను అనుసంధించినప్పుడు అన్యదేశ్యాలను (అంటే తత్సమేతరాలను) దేశ్యాలుగా భావించారని తెలుస్తుంది. కూచిమంచి తిమ్మకవి 'లోకవ్యవహారంబగు బాస దేశ్యమంద్రదదియెహితం బారఁగ నచ్చతెనుంగని...కొందరందురు...' (లక్షణసార సంగ్రహం 1-69) అన్నప్పుడు దేశ్యానికీ అచ్చతెలుగుకూ భేదం లేదనే చెప్తున్నాడు కాని ఆయన ఉదాహరణలేమీ ఇవ్వలేదు తెలుగు లాక్షణికులు తత్సమమన్న పదానికి సంస్కృత, ప్రాకృత సమమనే అర్థమే చెప్పుకున్నారు, చిన్నయ సూరికాలందాకా సూరి మాత్రం 'త్రిలింగదేశ వ్యవహారసిద్ధంబగు భాష దేశ్యంబు' (బాలవ్యాకరణం, సంజ్ఞా. 21), 'సంస్కృత సమేతరంబయిన భాష యచ్చ నాఁబడు' (అదే, అచ్చిక. 1) అనే రెండు సూత్రాల్లో అచ్చతెలుగులో దేశ్యం ఒక భాగమని నిర్ణయించాడు. ప్రాకృతసమం, సంస్కృత ప్రాకృత భవాలు, దేశ్యం గ్రామ్యం-అన్నీ అచ్చతెలుగే కాబట్టి, పూర్వోక్త కేతన నిర్వచనంలోనూ (చూ 1-1), శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి హరికారికల్లోను ('తత్సమేతర భాషేయ మచ్ఛేతి కవయో వదన్') ప్రాకృతసమాలు అచ్చతెలుగులో చేరవు. చిన్నయసూరి దృష్టిలో చేర్తాయి. చిన్నయసూరి అన్యదేశ్యాల ప్రస్తావనే తీసుకురాలేదు. అప్పకవి తెచ్చి, వాటిని 'మతిరోసి విడువకూడ' దనీ, 'వ్యవహారహాని' వస్తుందనీ, అవన్నీ 'నీతంబు' లనీ, వాటిని అచ్చతెలుగులో భాగంగానే పరిగణించాడు (అప్పకవీయం 1-64-70).

పదికాసులు విసిరేసీ వుండవచ్చు. బ్రౌన్‌మీద, మాలిక్ ఇబ్రహీం మీద వారికి హిందూదేవతాత్వమిచ్చి ప్రశంసాపద్యాలు రాసిన మన కవిదీనులూ దీనకవులూ పదహారో శతాబ్దిలో కనిపెట్టిన సరికొత్త యాచన పద్ధతికే అచ్చు తెలుగు కవిత ప్రముఖ నిదర్శనం.

పొన్నిగంటి తెలగన్న 'యయాతి చరిత్ర' కుతుబ్‌శాహీల కాలంలో వెలిసింది కాబట్టి ముస్లిం రాజులు తెలుగు భాషను అభిమానించి ఆదరించారని భావించటం సమంజసం కాదు. తెలుగుదేశ చరిత్రను ఒక్కసారి పర్యాలోకిస్తే తెలుగుకు రాజభాషా గౌరవంగాని, అధికారభాషా గౌరవంగాని 1966కు ముందు ఎవ్వరూ ఇవ్వలేదు. సాతవాహనులు, ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, పల్లవులు ప్రాకృతాన్ని - విస్పష్టంగా చెప్పే మహారాష్ట్రి ప్రాకృతాన్ని - అధికార భాషగా గుర్తించారు. వేంగిచాళుక్యులు, కాకతీయులు, విజయనగర చక్రవర్తులు, రాచకొండ, దేవరకొండ, కొండవీడు, రాజమండ్రి వెలమ రెడ్డి రాజులు సంస్కృతమే తమ రాజభాషగా పరిపాలించారు. రెడ్డిరాజుల చరమకాలంలో తెలుగు భాషకు కొంత ప్రాముఖ్యం పెరిగిందని గుర్తించిన మల్లంపల్లి సోమశేఖరశర్మగారు సామంతరాజులు మాత్రమే తెలుగులో వ్యవహరించారని నిరూపిస్తున్నారు (History of Reddi Kingdoms : 492-93) బహమన్లు, కుతుబ్ శాహీలు, ఆసఫ్‌జాహీలు పెర్షో-అరబిక్ భాషనే రాజభాష చేశారు. కొన్ని దాన శాసనాలు, గ్రామాదుల సరిహద్దులూ, గ్రామ నామాలూ క్రీ. శ. 2 వ శతాబ్ది నుంచి తెలుగులో దొరికుతున్నా అవి అధికార భాషగా తెలుగు స్వరూపాన్ని ప్రతిబింబించేవికాదు. బ్రిటిష్ వారు కూడా రాజభాష ఇంగ్లీష్ అయినా, కొన్ని ప్రకటనలూ నోటీసులూ ప్రాంతీయ భాషల్లో ప్రకటించారు. వ్యవహార ప్రయోజనమే అక్కడి దృష్టి అందువల్ల మాలిక్ ఇబ్రహీం రామరాయల ఆశ్రయంలో తెలుగు భాష విని, తెలుగు వంటకాలు తిని, అచ్చతెలుగును అభిమానించాడని లేము. భాషాభిమానంకన్నా రాజకీయ ప్రయోజనమే అతనికి అవసరముండవని గుర్తించాలి. నాటి నుంచి నేటి వరకూ కవినాయకనటగణికా పోషణ ప్రచార సాధనమేగాని పరమార్థదాయకంకాదు ఆ దృష్టితోనే ప్రపంచాధిపత్యం తమకు సంక్రమిస్తే పరిపాలన కుంటుపడకుండా అమెరికన్లూ, రష్యనులూ ప్రపంచ భాషలన్నీ నేరుస్తున్నారు. అమెరిండ్ భాషలను ద్వితీయ ప్రపంచయుద్ధ కాలంలో

అమెరికన్లు నేర్చుకోవటం మొదలుపెట్టారు. అలాగే 1962 నాటి చైనాయుద్ధపర్యవసానంగా భారత ప్రభుత్వం సరిహద్దు భాషలు నేర్చుకోవటం నేర్పటం ప్రోత్సహించటం మొదలుపెట్టింది. సైనికావసరాల దృష్ట్యాపాలితుల భాషల్లో కవిపండితుల కృషిని ఏదో కొంత ప్రోత్సహించినంత మాత్రాన పాలకుల ప్రజాభాషాభిమానానికి అది దృష్టాంతం కాదు. నిజానికది పాలకుల రాజకీయధురంధరత్వానికే నిదర్శన.

తెలగన్న కాలం నుంచి నిన్నమొన్నటి వరకూ వచ్చిన అచ్చతెలుగు కావ్యాల్లో అనేకం సంస్థానాధీశుల, జాగీర్దార్ల ఆస్థానకవులు రాసినవే. 'అచ్చతెలుంగుఁ బద్దె మొకటైనను...'(అ.తె.కృ.ప. 47) మొదలైన పద్యాలు కష్టసాధ్యమైన గరిడీలు చేసి మెప్పు సంపాదిద్దామన్న కవుల మనస్తత్వాన్ని స్పష్టం చేస్తున్నాయి. కవులకున్న బిరుదుల మాట అటుంచి కవితాప్రాగల్భ్యాన్ని మాత్రమే పరీక్షిస్తే శ్రీకృష్ణదేవరాయల కాలం తరవాత కళాపూర్ణోదయ ప్రభావతీ ప్రద్యుమ్నాలు, విజయవిలాసం తప్ప మరే మహాకావ్యమూ వెలువడినట్లేలేదు. పిల్లవసుచరిత్రలు, ద్వ్యర్థిత్ర్యర్థికావ్యాలవంటివి కుప్పతిప్పలుగా వెలిశాయి. ఈ గరిడీల ప్రభావం ఎంత దుర్భరంగా ఉందో వీరేశలింగం గారు వదిన పాట్లే విశదీకరిస్తాయి. పండితకవిగా ప్రఖ్యాతి సంపాదించాలని మనవాళ్లు ఎంత తీవ్రంగా ప్రయత్నించారో అంత తీవ్రంగానూ సంప్రదాయవ్యతిరేకధోరణి ప్రబలింది. చివరికి తనపేరు చెప్పటానికి ఒక సీసపద్యమంతా వాడుకోవలసిన దుర్గతి వచ్చింది అచ్చతెలుగు కవులకు (అదే 68). తాము రాసిన పద్యాలు తమకే నచ్చక పాఠాంతరాలు రాసి ప్రకటించవలసివచ్చింది కొందరికి (అదే. 111-113). 'సొబగుదిమ్మ వాని సోమిదమ్మ' వంటి అసందర్భ వర్ణనలకు దిగజారవలసివచ్చింది కొందరు (అదే 193) భాషాశాస్త్రం అనువాద పద్ధతులుగా పేర్కొనే అన్ని పద్ధతులూ పాటించి కృత్రిమభాషను సృష్టించారు (అదే. 341, 343, ముఖ్యంగా 347). గిడుగువారి 'ప్రాఁదెనుఁగుఁగమ్మ' ఈ పద్ధతిని వెక్కిరించటానికి పుట్టింది. కందుకూరివారి గ్రంథాల్లోగానే, స్వదేశభాషోద్యమం ప్రబలంగా ఉన్న ఇరవయ్యో శతాబ్ది ప్రథమార్థంలో తుమ్మల సీతారామమూర్తి చౌదరి వంటివారు అచ్చతెలుగును పునరుజ్జీవింపచేయాలని ప్రయత్నించి పరాజితులైనారు ప్రజామోదం లభించక అందే సాధారణ ప్రజలుగాని, కవిపండితులుగాని అచ్చతెలుగును కృత్రిమ

భాషగా, విజాతీయభాషగా భావించారేగాని తమదనుకున్నట్లు లేదని అర్థం. ఆంధ్రసాహిత్యచరిత్రలో క్షీణయుగలక్షణాలకు ప్రతీకగా నిలిచాయీకావ్యాలు, అప్పటి సాంఘిక రాజకీయపరిస్థితుల్లో మహాకావ్య నిర్మాణం జరగలేదు, సాము గరిడీలు సాగాయి. అందులో భాగం అచ్చతెలుగు రచన.

అచ్చ తెలుగు కృతులను పరిశీలించినవారు ఒక్క విషయం గుర్తించక తప్పదు. ఒకరిద్దరు కవిపండితులు 'భాషాపరిశుద్ధత, స్వచ్ఛత' అనే నినాదాలు లేవదీసినా ప్రజామోదం సాధించలేరు. నిజానికి ఏ భాషా పరిశుద్ధం కాదు కాబట్టి ఈ వాదం నిలవదు. కొన్ని భాషలు ఆదాతృభాషలు (Borrowing languages). తెలుగు అటువంటిది. ఈ స్వభావం మారదు. ఆరుద్రలాగా ఎవరైనా మార్చాలని ప్రయత్నించినా అది నెరవేరదు. ఒక్క తమిళంలో తప్ప మరే ద్రావిడ భాషా సాహిత్యంలోనూ శుద్ధభాషా రచనలు రాణించలేదు. ఇది చరిత్ర చెప్పిన సత్యం. మధ్యయుగాలనాటి రాజకీయ సామాజికార్థిక వ్యవస్థలో మహాకావ్య నిర్మాణం చేపట్టి సామాజికప్రమోదమో చైతన్యమో సాధించలేని సామాన్య కవులు అచ్చ తెలుగు రచనలకు పూనుకున్నారు. గతానుగతికత్వం జాతి లక్షణమైన తెలుగుకవులు అదే మార్గంలో అప్పుడప్పుడు ప్రయాణించారు. వారెవరూ గమ్యం చేరలేదు— గమ్యమంటూ ఒకటి లేదు కనుక. అచ్చ తెలుగు రచన ఈవిధంగా శివకవులనాటినుంచి ఈనాటివరకూ ఒక నినాదంగా, సాధారణ రచనలుగా, సాముగరిడీలుగా చరిత్రగర్భంలో కలిసిపోయాయి, కలిసిపోతున్నాయి అంతకుమించిన విశేషమేమీ లేదు.

[ఈ వ్యాసరచనలో కన్నడ సాహిత్య విశేషాలు వివరించిన డా. బి. రామచంద్రరావు, తమిళ సాహితీవైభవం వర్ణించిన డా. వి. ఆర్. జగన్నాథం, హిందీ భాషా ప్రత్యేకతలు విడమర్చి చెప్పిన హైదరాబాద్ కేంద్రీయ హిందీ సంస్థాన్‌లోని డా. రెడ్డి, డా. చౌహాన్ వగైరాలకు నా కృతజ్ఞతలు.]

## ఉపయుక్త ప్రధాన గ్రంథాలు

అప్పారావు, ఎం.ఆర్, 1973-A Report...on the Use of Modern Standard Telugu (Sista vyavaharikam) for Teaching and Exami-

nations for Andhra University Courses, Andhra Univ; Waltair.

కృష్ణమూర్తి, భద్రిరాజు-1979-(సంపాదకులు) తెలుగుభాషాచరిత్ర, ద్వితీయ ముద్రణ, ఆం. ప్ర. సాహిత్య అకాడమి, హైదరాబాద్.

మురళి, ఆర్.ఎస్-1964- కన్నడ సాహిత్య చరిత్ర, ఉషా సాహిత్యమాలె, మైసూర్.

రాధాకృష్ణ-బూదరాజు-1972-వ్యావహారిక భాషావికాసం, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

,, ,, 1974-మధ్యయుగాల్లో పరిపాలనా భాషగా తెలుగుకున్న స్థానం, తెలుగు-అధికారభాష (ప్రత్యేకసంచిక), రాజ్యభాషాప్రసార సమితి, హైదరాబాద్ (పేజీలు 59-61, ముఖ్యంగా 61).

వేంకటేశ్వరశాస్త్రి. జె-1958-మళయాళభాషా సాహిత్యాలు, హైదరాబాద్.

సుందరాచార్యులు కె వి- 9 8- అచ్చతెలుగు కృతుల పరిశీలనము (అముద్రిత పరిశోధనవ్యాసం, ఉస్మానియా విశ్వవిద్యాలయం)

సోమశేఖరశర్మ,
మల్లంపల్లి–1967–ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము, పరమేశ్వర పబ్లికేషన్స్, హైదరాబాదు.

,, ,, ? History of Reddi Kingdoms,e.s.p. pp 492-493

# ప్రజాకవి వేమన

—ఎస్. గోపి

వేమన్న తాత్త్వికుడైన ప్రజాకవి. యోగసాధనకు, అద్వైతాను భవానికి సంబంధించిన పద్యాలు వేమన్నలో ఉన్నాయి. హఠయోగసాధనను వేమన్న అనేక పద్యాల్లో నిరసించాడు. అయితే రాజయోగాన్ని కీర్తిస్తూ చెప్పిన పద్యాలు కొన్ని కనిపిస్తాయి. యోగశాస్త్రంలో పతంజలి చెప్పిన రాజయోగం కాక వేమన్నలో కొంత ప్రత్యేకతతో కనిపిస్తుంది. ఏ రాజయోగాన్ని శైవులు మలుచుకున్నారో అది అతనిలో కనిపిస్తుంది. కాబట్టి అష్టాంగాల ప్రసక్తిని ఖండించాడు. ధ్యానం వేమన పద్యాల్లో ప్రాధాన్యం వహించింది.

తత్త్వానుభావానికి వేమన చెప్పిన సాధన శైవసంబంధిగానే కనిపిస్తుంది. నాదం, బిందువు, కళలు, చిదాకాశం, బయలు వంటి పదజాలం శైవంలోనే ఎక్కువగా కనిపిస్తుంది. కుండలినితో కలిపిన తంత్రం శైవంలో ఉంది. శైవభేదాలు కొన్నింటిలో శైవం, తంత్రం కలిసిపోయాయి. కాబట్టి, శైవాల్లో కనపడే తంత్రం, కుండలిని, మతం వేమన పద్యాల్లో ఎక్కువగా కనిపిస్తాయి. వేమన పద్యాలను తాంత్రిక దృష్టితో అధ్యయనం చెయ్యవలసిన అవసరాన్ని కట్టమంచి రామలింగారెడ్డి 1928 లోనే గుర్తించారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు తరఫున అనంత కృష్ణశర్మగారిని వేమనపై ఉపన్యాసకునిగా నియమించినప్పుడూ, తర్వాతా ఐదారు (?) ఉత్తరాలు రాశారు. మొదటి ఉత్తరంలో వి.వి. శర్మ అనే ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాన్ని సూచనగా అనంత కృష్ణశర్మకు పంపారు.

"It is his theory that much of Vemana's Philosophy is based on Tantric system and it is only by the application of the Tantric Key that you can Unlock Vemana fully" (a letter from C. R. Reddy to Ananta Krishna Sarma, dated. 9th Feb., 28)

అనంత కృష్ణశర్మ ఈ వాదాన్ని అంగీకరించలేదు. వేమన్నను అద్వైతిగా, కాకపోతే, ''ఒక రకమైన అద్వైతి"గా చిత్రీకరించారు.

తత్త్వాలతో వేమన్న కెప్పుడూ పేచీ లేదు. శైవపద్ధతిలో సాధనను బోధించినప్పటికీ, లింగధారుల బాహ్యవేషాలను కూడ దుయ్యబట్టాడు. ఇక్కడ వేమన్న ప్రత్యేకత ఉంది. శైవులనేకాక ఇతర మతాలవారి వేషధారితనాన్ని కూడ తీవ్రంగా ఖండించాడు. వీటన్నిటిని చూస్తే వేమన్న ఏదో అనుభవం మీద ఆధారపడ్డ సర్వమానవ సామాన్యమైన విశ్వమతంకోసం ఆరాటపడ్డట్టుగా తోస్తుంది.

వేమన్న మొదటినుంచి కూడ మతాన్ని కాకుండా తత్త్వాన్ని పట్టించుకున్నాడు. మతాల కర్మకాండను, పురాణ పాత్రలను అధిక్షేపించాడు. అద్వైతంలో వ్యావహారిక సత్తా పారమార్థికసత్తా అని రెండు దృక్పధాలున్నాయి. వ్యావహారిక దృష్టితో అన్ని వాస్తవాలే కాని పారమార్థిక దృష్టికి 'మాయ'లో భాగాలు. వేమన్న వ్యావహారికసత్తాను స్పష్టంగా నమ్మిన దశా, ఖండించిన దశా రెండూ కనిపిస్తాయి.

అయితే వేమన్న తత్త్వానుభవం పొందాడా అన్నది ప్రశ్న. చాలా పద్యాల్లో చూస్తే అతీతమైన దేన్నో అతడు "తెలుసు''కున్నా డనిపిస్తుంది. ''మనసును దాటి పోవా''లని అనేక పద్యాల్లో బోధిస్తాడు. మనసును దాటి పోయిన వాడికి భేదాలు ఉండవు. కాబట్టి భేదాలను తిట్టా డనుకోవాలి. ఆ భేదాలు ద్వంద్వాలూ, మతాది ఉపరిభేదాలు.

అయితే ఇక్కడొక సందేహం! భేదాతీత దశకు చేరుకున్నవాడు ఈ క్షుద్ర లౌకిక భేదాలను పట్టించుకోవటం సాధ్యమా? పైగా వాటిని పడదిట్టటం! ఇది వేమన్నలో కొట్టొచ్చినట్టు కనపడే ప్రత్యేకత.

తత్త్వానుభవం పొందిన వేమనలో ఉద్రేకం వంటి భావాలు నశించలేదా? లౌకిక భేదాలను అనుదినం పరిశీలిస్తూ ప్రతిస్పందిస్తూనే ఉన్నాడా? తాను పొందిన అనుభూతి స్వభావ, స్వరూపాలను జనులకు వివరించే ప్రయత్నం మీద

కేంద్రీకరించకుండా, దానికోసం ప్రయత్నం చెయ్యని, అజ్ఞానంలో కొట్టుకునే వారిని జాలితో, బాధతో, కోపంతో గద్దిస్తున్నాడు, వెక్కిరిస్తున్నాడు. బ్రహ్మని దర్శించిన వాడికి ఇది సాధ్యమా ? ఇది వేమన్న విషయంలో ప్రశ్నార్థకమైన ప్రత్యేకత !

వేమన్న 'యోగి' అని కచ్చితంగా నిర్ణయం చెయ్యటానికి ఇటువంటి సందిగ్ధ పరిస్థితిని ముందు తొలగించవలసి ఉంటుంది.

వేమన్న మొదట లౌకిక విషయాలతో ప్రారంభమై అలౌకిక విషయాలపై దృష్టి సారించాడనీ, పరిణామదశలనీ వాదించవచ్చు. కాని వేమన్న లోక వ్యవహారాలను, సంఘరీతులను చివరివరకూ వదిలిపెట్టి పోలేకపోవటం కనిపిస్తుంది. ఏ విషయాన్ని తీసుకున్నా భావావేశంతో, ప్రజల్లో పూర్తిగా నిమగ్నమైనవాడు తప్ప చెప్పలేని పోలికల్తో పద్యాలు వెదజల్లాడు. అతని వ్యక్తీకరణలోని అప్రయత్నత, స్పష్టత, సారళ్యం, క్లుప్తత లాంటి లక్షణాలు అపారమైన ప్రతిభావంతుణ్ని సహజకళాకారుణ్ని పట్టిస్తాయి. 'కవి', 'గొప్పకవి' అనకుండా ఉండలేము. కవి అనటానికి ఆలంకారిక నిర్వచనాలు అడ్డొస్తే వేమన్న పద్యాలను చూసి నిర్వచనాలు మార్చుకోవలసినంతగా అతడు కవి అయినాడు. మన నిర్వచనాలు కవిత్వ పరిధిలోనే చేసినవి కావటం వల్ల సంఘదృష్టితో చెప్పిన కవిత్వాన్ని కొలవటానికి ఎంతమేరకు ఉపకరిస్తాయో పరిశీలించాలి.

మొత్తం వేమన పద్యాల్లో వేదాంత పద్యాల సంఖ్య తక్కువే. అవయినా వేమన్న శైలితో లేని జటిలమైన కందపద్యాల్లో చెప్పినవి ఎక్కువ.

సంఘంలోని ప్రతి కదలికకు ప్రతిస్పందించిన ప్రజాకవిగా పద్యాల్లో వేమన సాక్షాత్కరిస్తాడు. కాబట్టి నాటి సంఘ నేపథ్యంలో వేమన్నను చూసే ప్రయత్నం సత్ఫలితాల నిస్తుందనే నా నమ్మకం.

అబేదుబాయ్ (ఫ్రెంచి మిషనరీ, 1817) నుంచి ఆరుద్ర దాకా సాగిన చర్చల్లో వేమన్న 17 వ శతాబ్దం వాడనీ, రాయలసీమ ప్రాంతానికి చెందినవాడని తేలింది, (1) వేమన పద్యాల్లో దొర్లిన సులతాను, మక్కా,

అల్లా మహమ్మదు, గులాము, బిక్కలు, జింజిరీలు వంటి పర్షియా పదజాలంవల్ల మహమ్మదీయ పాలన రాయలసీమలో నెలకొన్న తర్వాతనే వేమన్న కాలం మొదలయ్యిందని చెప్పవచ్చు. (2) బ్రౌన్ సేకరించిన ప్రతుల్లో అతి ప్రాచీన ప్రతి కాలాన్ని (1691) బట్టి కూడ వేమన 1650 ప్రాంతంలో జీవించి ఉన్నాడని ఊహించటానికి వీలు కలుగుతుంది.

ప్రత్యేకంగా ఊరుపేరు చెప్పటం కష్టం కాని వేమన్న రాయలసీమవాడని చెప్పటానికి ఆధారాలున్నాయి. (1) రాయలసీమకే ప్రత్యేకమై, ఇతర ప్రాంతాల్లో వాడుకలో లేని పదాలు, ప్రయోగాలు కొన్ని వేమన పద్యాల్లో కనిపిస్తాయి. ఉదా:- సంబళము, సొడ్డు, దుడ్డు, తాళిక, బిత్తలి, బైసి, వలికి, మెట్ట, వల్లదప్పట మొ॥ వి. (2) కర్నూలు, గండికోట, క్రిష్టిపాడ్, చిట్వేల్ ప్రాంతాలతో వేమన సంబంధాన్ని బ్రౌన్ పేర్కొన్నాడు. (3) అనంతపురం జిల్లా కటారుపల్లెలో వేమన "పేరుతో" సమాధి ఉంది. (4) వేమన పద్యాల్లో వచ్చే బసివిరాండ్ర ప్రసక్తి రాయలసీమలోనే ఎక్కువగా కనిపిస్తుంది. (ఉదా. సంత బసివి, ఊరబసివి etc). (5) మొన్న మొన్నటి దాకా "వేమనోళ్ల" మంటూ బక్క గుఱ్ఱాలమీద ఊరూరు తిరిగే ఘరానా భిక్షుకులుండేవారు. (6) ఇంతే కాక రాయలసీమలో సంచారం చేసిన వారికి మిగిలిన ప్రాంతాల్లో కన్న "వేమన్న స్పృహ" అక్కడ అధికం అని తెలుస్తుంది.

వేమన్న భావాలు, ఆలోచనలు అతని కాలమే పునాదిగా లేచిన గోపురాలు, సమకాలంలో వేళ్ళూన లేని కవి ఎంత ప్రతిభావంతుడైనా కాల మారుతాల ఆఘాతాలకు తట్టుకోలేడు - స్వానుభవం వేమన్న కవిత్వానికి జీవ ధాతువు.

పోతన రాజులను "కర్ణాట కిరాట కీచకులు" అని తిడితే, వేమన అటువంటి రాజులను ఆశ్రయించి కవిత్వాన్ని ఎంత తక్కువ వెలకైనా అమ్మే దరిద్ర గొట్టు కవులను చీదరించుకున్నాడు.

తోటకూరకైన దొగ్గలి కైనను
తవిటి కూరకైన తవిటికైన
కావ్యములను చెప్పు గండ్యాలు ఘనమైరి
విశ్వదాభిరామ వినురవేమ (D. 1723, 579).

అయితే ఆనాటి రాజులలో కవులు సొమ్ము ఎగవేసే హీనులు కూడ ఉండే వారు. వారిని 'గండమైన దొంగ'లని తిట్టాడు వేమన. వారు ''కండకావరాన కదియబలిసి, గండు కుక్కవలెను కాటుకు తిరిగే'' వారు (D 1773 III 1365)

వేమన పద్యాలలో మనకు కనిపించే రాజులను, వారి స్వభావాలను బట్టి మూడు రకాలుగా చెప్పుకోవచ్చు.

1. పిరికిపందలు 2 దుర్మార్గులు 3. అజ్ఞానులు.

ఈ రాజులను గూర్చి వర్ణించేటప్పుడు వేమన్న తరచుగా రెండు ఉపమానాలను వాడుతాడు. 1. పాములు 2. కోతులు. ఈ పోలికలమీద వేమన్నకున్న మక్కువ అతని లోకానుభవం వల్ల పుట్టిందే.

వేమన్న కాలంలో పాలకులు ప్రజలకు 'పట్టుకొమ్మలు' (D 1721 86)గా ఉన్నవారు కాదు. ''పెట్టి పొయ్యలేక తిట్టువారే'' కాక కనీస రక్షణ నందించలేని అసమర్థులు. అది రణనినాదాలతో, అశ్వరింఖలతో మృత్యుధూళి పైకెగసిన కాలం. పరసైన్యాలు గుర్రాలపై వచ్చి ఊళ్లను దోచుకొని, జనులను హింసించి, చంపి, శ్మశానాలను మిగిల్చి వెళ్లేవి. అప్పుడు ప్రజలను కాపాడ వలసిన అధికారులు పలాయనం చిత్తగించేవారు.

పరబలంబు జూచి ప్రాణరక్షణమున
ఉరికి పారిపోవు పిరికినరుడు
యముడు కుపితుడైన నడ్డంబు మెవరయా
విశ్వదాభిరామ వినురవేమ. (D 1773-I-410)

శత్రుసైన్యాలు రాకముందే పారిపోయిన వారు కొందరైతే కదనరంగం దాకా వెళ్లి కాళ్లకు బుద్ధి చెప్పేవారు మరికొందరు.

పంద నధికు జేసి బవరంబునకు బంప
పారిపోవు కార్య భంగమవును. (D 1721; 241)

కాని ఇటువంటి వారికే బిరుదు గొడుగు లుండేవి. ("పిరికి బంటుకేల బిరుదు గొడుగు'' D 1721; 250.)

ప్రజలను సంరక్షించ వలసిన అధికార్లు పిరికిపందలు కావటం వలన ప్రజాకంటకులైన అధికార్లకు అడ్డులేక పోయింది. ఈ అధికార్లు ఎవరో కాదు— విజయనగర సామ్రాజ్యం అస్తమించిన నాటి నుండి ప్రజలను హింసించి, దోచు కోవటానికి అలవాటుపడిన పాలెగార్లు. రాయలసీమను ఆక్రమించిన నవాబులు ఎవ్వరూ ఈ పాలెగార్లను అణచి శాంతిని స్థాపించలేక పోయారు. పాలెగార్లు విజయనగర కాలంలో ఎప్పుడూ కొంత స్థిర సైన్యాన్ని పోషించి రాజులకు అవసరమైనప్పుడు సైనిక సేవ చేసేవారు. విజయనగర రాజుల కాలపు పాలె గార్లలో మట్లవంశపు పాలెగార్లు ముఖ్యులు. వీరు 17 వ శతాబ్దంలో సిద్ధవటం కోటను నిర్మించారు. విజయనగరం సమసిపోగానే వీరు తమ సైనికబలంతో యధేచ్ఛగా దోచుకొని ప్రజలను నానా అవస్థలకు గురి చేశారు.

పెక్కు జనుల జంపి పేదల వధియించి
డొక్క కొరకు ఊళ్లు దొంగిలించి
యెక్కడికిని బోవ నెరిగి యముడు జంపు
విశ్వదాభిరామ వినురవేమ. (D 1773-I-815)

పాలెగార్లు స్వతంత్రంగా వ్యవహరిస్తూ కేంద్రాధికారాన్ని సాగనివ్వలేదు. దేశంలో అరాచకం తాండవించింది. ఈ బాధల నుండి విముక్తి చేసే బలవంతు డైన రాజుకోసం ప్రజలు ఎదురు చూశారు.

పుడమి నుప్పరంబు పురికొల్పి జగముల
రక్షజేయ గల్గు రాజులెవరు?
మహిపతి యను పేరు మనుజున కేడదో
విశ్వదాభిరామ వినురవేమ. (D 1773 V 2155)

కాని ప్రజల కడగండ్లు పాలెగార్లను అణచిన బ్రిటిషు పాలన వచ్చేదాకా తీరలేదు.

వేమన్న ప్రకారం అప్పటి రాజులు ''తరచు కల్లలాడు ధరణీశులు'' (D 1723; 278). వారు "దండ సాధ్యులే'' కాని ''ధర్మ సాధ్యులు'' కారు

(D 1721; 53). 1662 లో రాయలసీమ గుండా ప్రయాణం చేసిన Tavernier అనే వజ్రాల వ్యాపారి గండికోట నవాబు ప్రజలను ఘోరంగా శిక్షించే పద్ధతిని వర్ణించాడు. (చూడు. Tavernier's Travels in India P. 218, 219).

అందుకే వేమన్న "అల్పబుద్ధి వాని కధికారం" (D 1721, 8) ఉండ రాదు అన్నాడు. 'రాచమూక'లను, (D 1773 I, 322), "భూపతి కృపల"ను (D 1721, 44), "నమ్మరాదు" అని ప్రజలను మేలుకొలిపాడు. 'ఎరుకలేని దొరల'ను (D 1721, 136) కొల్వరాదని హెచ్చరించాడు. క్రూరులైన పాల కులు "ప్రజల ఉసురు తాకి" నశిస్తారని హెచ్చరించాడు.

ఒక్క రాజే కాదు వారి కొలువులోని వారందరూ వారికి తగినవారే. పాములవలె కాటు వేసే వారే కాక కోతులవలె చీకాకు పరిచిన వెర్రివెంగళప్పలు కూడ ఆనాడు రాజ్యాలేలారు. అధికారుల చుట్టూ వ్యాపించి ఉండే అవాంఛనీయ వ్యక్తులు నేటి ప్రజాస్వామ్యంలో కూడ ఉన్నారు.

కొండముచ్చుకెన్న కోతి పేరంటాలు
బడుగు దొరకు మంత్రి బందవాడు
బంద వాని కరయ కొండీడు చుట్టము
విశ్వదాభిరామ వినురవేమ (D 1773, I, 309)

కోతి బట్టి దెచ్చి కొత్త పుట్టము గట్టి
కొండ ముచ్చు లెల్ల గొలిచినట్లు
నీతిహీనులొద్ద నిర్భాగ్యులుందురు
విశ్వదాభిరామ వినురవేమ. (D 1721, 64)

వేమన్న కాలానికి దేశమంతా నానా శకలాలుగా చెదిరి పోయిఉంది. ముస్లిం పాలన అప్పటికి బాగా స్థిరపడి పోయిందని చెప్పవచ్చు, కాని వారి పాలన అంతా యుద్ధాల్లో నిమగ్నమై ఉండటం వల్ల వారి ప్రభావం గాఢతరంగా పడలేదనే చెప్పాలి. ముస్లింల ప్రస్తావనతో వేమన్న చెప్పిన పద్యాలు నాలుగైదు

మాత్రమే కనపడు తున్నాయి. బ్రిటిష వారిని గురించి వేమన్న బహుశా విని ఉండలేదనే తలచవచ్చు. అప్పటికే మద్రాసులో కోట కట్టుకున్నా, 1625 నాటికే నెల్లూరు జిల్లాలో తూర్పిండియా వారు ఫ్యాక్టరీని స్థాపించినా ఆ గొడవ లేవీ వేమన్న చెవిని పడినట్లు లేదు.

ఉదాత్తమైన ఆశయాలతో ప్రారంభమైన మత సిద్ధాంతాలు కాలక్రమంలో దిగజారటం చరిత్రలో చూడవచ్చు. కులభేదాలతో సంబంధం లేకుండా ప్రారంభ మయిన వీరశైవానికికూడా అదే గతి పట్టింది. ''చిత్తశుద్ధి లేని శివపూజ లేలరా'' అని గద్దించవలసినంతగా దిగజారింది. కులాలేవద్దని తిరస్కరించిన శైవులు 'లింగాయతులు' అనే మరో కొత్తకులం ఏర్పడటానికి కారకులైనారు. వీరశైవు లలో అనేక వర్గాలేర్పడి హిందూ సంఘములోని వర్ణవ్యవస్థ మార్గంలోనే అనేక కులాలేర్పడ్డాయి. ముఖ్యంగా బ్రాహ్మణ, అబ్రాహ్మణ భేదం ఆధారంగా ఆరాధ్యులు, జంగాలు వెలిశారు. కొత్త ఆచారాలు, గురువులు, కొత్త విశ్వా సాలు ఏర్పడ్డాయి లింగధారణ, క్షేత్ర సందర్శనం, శివభజన, పైపూతలు మొదలైన వాటిపట్లనే పట్టింపు లెక్కువైనాయి కాని ఈ అలజడిలో తత్త్వం అడుగున పడిపోయింది. ("Religion in a word becomes organised hypocracy" Vemana; V.R. Narla, P.48).

నొసలు బత్తుడయ్యె నోరు తోడేలయ్యె
మనసు భూతమువలె మలయగాను
శివుని గనియెనన్న సిగ్గెట్లు గాదొకో !
విశ్వదాభిరామ వినురవేమ. (D1721, 154)

వీరశైవ మత సిద్ధాంతాలను అభిమానించేవారు కూడ ఆ కాలపు వీరశై వులను అసహ్యించుకున్నారు.

ఇక వైష్ణవమత పరిస్థితి కూడ ఇదే విధంగా ఉన్నది. దీనిలోకూడ తెన్‌గల, వడగల భేదాలు ఏర్పడ్డాయి నొసళ్ళపైన ధరించే 'నామ' రూపభేదం కూడ వివాదానికి కారణమైంది. ఆ నామం గోపీచందనంతోనా, తిరుమణితోనా అనేది విభేదాలు సృష్టించజాలింది.

పట్టుచీరగట్టి పట్టె తిరుమణిబెట్టి
సృష్టివైష్ణవంబు శిఖలు మించె
చిన్నెలెన్నొ జేసి చెరచె వైష్ణవమిట్లు
విశ్వదాభిరామ వినురవేమ. (D 1721-412).

జంగాలు, బైరాగులు బిక్షాటన తమ హక్కుగా భావించేవారు. దురుసు ప్రవర్తనకు వీరు పెట్టింది పేరు.

వైష్ణవులు నిత్యవ్యవహారంలో కూడ తరచుగా విష్ణుపారమ్యాన్ని ఉద్ఘాటిం చేవారు. శివుని జన్మకు, స్థితికి అతడే హేతువు. అనేక పరిస్థితుల్లో శివుణ్ణి విష్ణువే ఆదుకోకపోతే అతడు ఎప్పుడో నశించి ఉండేవాడు. ఏ విధంగా చూసినా శివుడు విష్ణువుతో తుల తూగలేడని వాదించేవారు.

ఇక శైవుల దృష్టిలో విష్ణువు చేసినవన్నీ అకార్యాలే. శివుడే సకలా రాధ్యుడు లింగధారణం అసహ్యకరమని వైష్ణవులు భావిస్తే, నామధారులైన వైష్ణవులు నరకంలో అదే ఆకారంలో ఉన్న శూలాలతో గుచ్చబడతారని శైవులు ప్రచారం చేసేవారు. వీరి పరస్పర దూషణలు తరచుగా హింసాత్మకమయిన కలహాలతో ముగిసేవి. ఒక గుంపు తమ దైవ పారమ్యాన్ని ఉద్ఘాటిస్తూ పరదైవ దూషణకు పాల్పడేది. వెంటనే పరస్పర దైవ దూషణలతో శాపనార్థాలతో ముష్టిఘాతాలకు దిగేవారు రక్తపాతం కూడ జరిగేది. ఒకరి తలపాగను మరొకరు లాగివేయటం, బట్టలు చింపుకోవటంలోనే ఇదెక్కువగా ముగిసేది.

ఇటువంటి మతోన్మాదుల మూలంగా అలజడులు రెచ్చిపోగానే రాజులు వీటిని తమ రాజకీయ ప్రయోజనాలకు వాడుకునేవారు. వీలునుబట్టి ఆయా మతాలను స్వీకరించేవారు.

మత సామరస్యాన్ని బోధిస్తూ వేమన్న చెప్పిన ఓ పద్యాం తప్పకుండా ఉదాహరించ తగి ఉంది,

విష్ణు భక్తులెల్ల వెలిబూది పాల్రైరి
వాదమేల మత విభేదమేల
వెలయ లింగధరులు వెలిబూది పాల్రైరి
విశ్వదాభిరామ వినురవేమ (D 1721, 64)

వేమన పద్యాల్లో బసివిరాంద్ర ప్రసక్తి కనిపిస్తుంది. బసివి సంప్రదాయాన్ని వేమన్న నిరసించాడు.

ఎప్పుడైతే జీవసారం నశించి శుష్కించిన మ్రోళ్ళవలె తత్త్వరహితమైన మతాలు శేషించాయో దంభమే జీవిత విధానమైంది. తమ మతం, తమ జాతి, తమ కులం ఘనతరమనే అహంకారం ముండ్లచక్రాలవలె మనుష్యులచుట్టు నిర్మించబడింది. తరచుగా ఈ ముండ్ల చక్రాల ఘర్షణ విస్ఫులింగాలను వెదజల్లి సంఘశాంతిని పరశురామ ప్రీతి గావించేది. అంతకుముందు వినని జాతులు, కులాలు శాఖోపశాఖలుగా సృష్టించబడ్డాయి.

''బ్రాహ్మణులు మొదలు చండాలురవరకును అందరును తమకన్ననొక తక్కువ జాతిగలదనుకొని సంతోషించిరి. చండాలురను బ్రాహ్మణు లెంత దూరమున నుంతురో యంత దూరమున చండాలురచే సుంచబడిన 'దొక్కల వారు' అను అడవి జాతివారిని నా చిన్నతనమందు చూచినాను''అని రాళ్లపల్లి వారు రాశారు. (చూ. వేమన. పేజి 77).

వేమన్న కులం మూలాన్ని ప్రశ్నించాడు. అక్కడక్కడ తలలెత్తిన ప్రతిఘటనా ధోరణుల కీ కింది పద్యం మచ్చుతునక.

కులము చేతబట్టి గుంపించనేటికి
పాదు ఉన్నచోట ప్రబలు విత్తు
ఏటి కులంబింక ఎక్కడి ద్విజుడయా
విశ్వదాభిరామ వినురవేమ

వేమన్న కాలంలో మంత్రతంత్రాలు, స్వర్ణవాద విద్య విపరీతంగా ప్రబలి పోయినవి. వేమన మంత్రతంత్రాలను నిరసించినా, స్వర్ణవాదం మీద మాత్రం ఆశలు పెట్టుకున్నట్టు కనిపిస్తుంది.

ఇహమున సుఖియింప హేమతారక విద్య
పరమున సుఖియింప బ్రహ్మవిద్య
కడమ విద్యలెల్ల కల్ల మూఢుల విద్య
విశ్వదాభిరామ వినురవేమ.

"మానవ సుఖజీవితానికి ధనం, సంపద అత్యవసరమనే ఒక వాస్తవికత, బహుశ ఈ వికృత రూపంలో వేమనలో ప్రతిబింబించి ఉండవచ్చు" అని శ్రీ ఏటుకూరి బలరామమూర్తి అభిప్రాయపడ్డారు (చూ. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర— పేజి 222).

బీదరికాన్ని పోగొట్టుకోవటానికి సామాన్య ప్రజలు సిద్ధులవెంట బడ్డారు. రసవాదాన్ని 'గుప్త విద్య'గా భావించేవారు. కావున శుశ్రూషలు చేయించుకొని ఆ సిద్ధులు ఎవరికీ అర్థంకాని ప్రతీకల్తో రసవాదవిద్యను బోధించేవారు. తత్త్వోపదేశం కోసం కాక బంగారం మీది ఆశచేత సిద్ధులకనేకులు శిష్యులయ్యేవారు.

భూముల అమ్మకాలు వేమన్న కాలంలో తక్కువగా జరిగేవి. తరతరాలుగా వస్తున్న భూమిని వదిలి కొత్త భూములకు తరలిపోవటానికి ఆమోదం లభించేదికాదు "భూమి కొత్తయైన భుక్తులు కొత్తలా?" (D1721, 251) అంటూ వలసలను ప్రోత్సహించేవారుకాదు. వ్యవసాయం మాని రాజోద్యోగాల నాశించేవారిని వేమన్న నిరసించాడు.

భూపతి కృపనమ్మి భూమి జెరచువాడు
ప్రజల యుసురుదాకి పడును పిదప
యెగురవేయు బంతి యెందాక నిలుచురా
విశ్వదాభిరామ వినురవేమ (D1722, 44)

భూమి సరిహద్దుల తగాదాలు వచ్చినప్పుడో, భూముల అమ్మకం జరిగినప్పుడో భూమిని కొలిచే విధానం ప్రాధాన్యం వహించేది. భూమిని కొలిచే నిపుణులు ప్రత్యేకంగా ఉండేవారు. వారిని గణికులు అనేవారు.

గడల పగ్గములను గణితమానంబున
నేరుపునను యెంజవారదెరిగి

భూమిగొల్వజేయు పురుషులు గణికులు
విశ్వదాభిరామ వినురవేమ (D1778-III 1228)

న్యాయంగా భూమిని కొలిచేవారు ''ప్రజల దీవెనొందే''వారు (D1778-II 240).

వేమన్న గ్రామీణకవి. గ్రామ జీవన సరళి వేమన్న స్వభావానికి ప్రత్యేకతలు దిద్దింది. పల్లె'సీమ'ను దాటిన వేమన పద్యం ఒక్కటి కూడ కనిపించదు. నాగరిక వాసనలు వేమన పద్యాల్లో మచ్చుకైనా కనిపించవు. వ్యావసాయికమైన ఉపమానాలు వేమన పద్యాల్లో కొల్లలు. రాయలసీమలోని కొండలు వేసిన ముద్రలేమో పద్యాల్లో 'కొండ' పోలికలు చాలాచోట్ల కనిపిస్తాయి. (ఉదా:- "కొండ అద్దమందు కొంచెమై ఉండదా?'')

వేమన్న కులాలను నిరసించినప్పటికి గ్రామ జీవనంలో భాగస్వాములైన అన్ని కులాలవారి ప్రసక్తి వస్తుంది. గ్రామపాలనలో ముఖ్యులైన రెడ్డి. కరణాల గురించి పద్యాలు కనపడతాయి. రెడ్డిని వేమన 'గ్రామకర్త' అని వ్యవహరించాడు (కల్లలాడువాని గ్రామకర్త యెరుంగు D1721, 2-20). గ్రామాధికారి అన్నమాట! ఒకచోట 'రెడ్డితనం' మీద ఓ విసురు కనపడుతున్నది. (''చెడ్డచేని కింత రెడ్డితనంబేల'' D1723, 864)

కరణాల గురించి మాత్రం వేమన విపులంగానే వర్ణించాడు. నాటి రైతు వ్యవహారాలలో కరణాల ప్రమేయానికి చాలా ప్రాధాన్యముండేది.

కాకతీయుల కాలం వరకు కరణాలు విశ్వబ్రాహ్మణకులానికి చెంది ఉండేవారు గణపతి దేవుని కాలంలో బ్రాహ్మణుల నియామకం మొదలైంది. వేమన్న కాపు కరణాల పరస్పర సంబంధాన్ని నిర్వచించాడు.

కాపులేని ఊరు కరణానికి కీడు
కరణముపగచేత కాపు కీడు
కాపు కరణములును కావలి కుండలు
విశ్వదాభిరామ వినురవేమ.

స్వభావాన్ని బట్టి వేమన్న రెండు రకాల కరణాలను గూర్చి చెప్పాడు, 1. అధమ కరణం 2. బిరుసు కరణం. (D 1773-I-266) కాపులు అధమ కరణాన్ని లెక్క చేసేవారు కాదు. అధికారం చెలాయించే కరణానికి భయపడే వారు. కరణాన్ని కాదని నడచిన "కాపు కాపురము తాడులేని గాలిపటం"వంటిది (D 1727, 543). అదే విధంగా కాపులేనిది కరణానికి విలువలేదు.

వేమన పద్యాల్లో కాపు జీవితానికి ప్రాధాన్యం కనిపిస్తుంది. ఆనాటి కాపులను వేమన 'వెర్రివారు' గా, కోర్టులో నాలికలేని వారిగా ("వాకెరుంగరు" D 1762-55) వర్ణించాడు.

కాపుకులజులెంత కర్ములైనా గాని
పాపరాశి కొంత పరిగిపోవు
వివరమెరుగనట్టి వెర్రిజీవులు గాన (D 1727, 633)

కులం తగాదాలు, భూమి తగాదాలు వచ్చినప్పుడు గ్రామ పెద్దలు తీర్పు చెప్పేవారు. వీటిలో ధర్మబలం కన్న మంద బలానికే పైచేయి ఉండేది. "తగవు చెప్పుచోట ధర్మము బలుక" ని ప్రభువులే విచ్చల విడిగా ఉండేవారు. వీరి తీర్పులు ఎటూ తెగనివిగా ఉండేవి. ఆలోచించక చేసే స్వార్థ నిర్ణయాలే కాని విచక్షణతో చేసే నేర్పు వీరికి ఉండేదికాదు. వేమన్న వీరిని కూడ సవాలు చేయక వదల్లేదు.

ఆర్పు తీర్పులేని తీర్పరితనమేల
కూర్పు విప్పలేని నేర్పుదేల
పెట్టిపోయలేని వట్టిబీరము లేల
విశ్వదాభిరామ వినురవేమ. (D 1727, 186)

స్థూలంగా వ్యవసాయమే వేమన నాటి ప్రజల జీవనాధారం. రైతు పండించింది వృత్తి పనుల వారికి కొంతపోగా గ్రామ పంచాయతి ద్వారా పన్నుల రూపంలో ప్రభుత్వానికి కొంత ముట్టేది ప్రభుత్వానికీ రైతుకూ మధ్య ఇంకెంత మందో ఆ భూమికి బాధ్యులుగా ఉండేవారు. ప్రతి వాడు తన లాభం చూసుకుంటాడు కాబట్టి రైతుకు మిగిలేది కొంచెమే

ఆదాయాన్ని బట్టి గ్రామాలు మూడు రకాలుగా ఉండేవి. 1. రాచ ఊళ్లు 2. అగ్రహారాలు 3. నాయంకరులు. సాధారణ గ్రామాలన్ని మూడో రకానికి చెందినవి. వ్యవసాయం పన్నే కాక వ్యాపారం, ప్రయాణం, పశువులు, విలాసాల మీద పన్నులుండేవి.

నాటి ఆర్థిక వ్యవహారాలు వస్తురూపేణా మాత్రమే కాక ధనరూపేణ కూడ జరిగేవి. వేమన్న ఐదారు రకాల నాణాలను పేర్కొన్నాడు. కాసు (కాసుతీర్చ లేక మోసపోరె?'' D 1721, 243); వీసం (''కాసు వీసమేని కనని జనుడు'' D 17з7, 201); దమ్మిడీ (తటుకు చనులనాడు దమ్మిడీచేయదు D1773-5-3177); తారము (''తటుకు చనులనాడు తారంబు సేయదు'' D 1723, 138); రూక (''ఒరుల మోసపుచ్చి ఒక రూక పాతికె'' D 1727, 460) వీటినేకాక కనీస విలువ గల గుల్లకాసు (గవ్వ) ను కూడ వేమన్న పేర్కొన్నాడు. పై నాణాలన్ని విజయనగర సామ్రాజ్యం చివరిదాకా వాడుకలో ఉన్నాయి.

ఆర్థిక స్థితిగతులను బట్టి నాటి ప్రజలను సౌకర్యంకోసం మూడు వర్గాలు చెయ్యవచ్చు (1) పేదవాళ్లు (2) గ్రామాధికారుల, (3) సంపన్నులు.

ఈ వర్గం వారిలో అనేక రకాలు. మొదటి వారు అట్టడుగువారు. పేద రికానికి ఇంకా కిందివారు. దేశ జనాభాలో సగం వీరే. అస్పృశ్యులు, చర్మ కారులు, దేశదిమ్మర్లు, బిచ్చగాళ్ళు మొ॥ వీరిలో అధికులు అతి స్వల్ప వేతనానికి అత్యధిక శ్రమచేసే వ్యవసాయ కూలీలు. రెక్కాడితే డొక్కాడే వారు వీరు. ఇటువంటి వారినే 'నడపీనుగలు' అంటూ చులకన చేస్తారని వేమన్న పేర్కొన్నాడు.

కుడువ ముడువ లేక కూడు బెట్టగలేక
విడువ ముడువ లేక విద్యలేక
నడువనేరనివాని నడపీనుగందురు
విశ్వదాభిరామ వినురవేమ. (D 1723, 309)

వీరు చేసేది ''వెట్టి''. ఆ కాలంలోని మూడు రకాల వెట్టులను ఏటుకూరి బలరామమూర్తి పేర్కొన్నారు.

''రాచవెట్టి, గ్రామవెట్టి, కులవెట్టి, రాజులకు చేసే సేవ గ్రామానికి చేసే సేవ, కులానికి చేసే సేవ. ఈ శ్రమ కంతా ప్రతిఫలంగా గ్రామస్తులు వారికి ఏదో కొంత ముట్టచెప్పేవారు.'' (చూ. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర. పేజి. 168).

వీరికన్న కొంచెం మెరుగైనవారు బక్క రైతులు, నేతగాండ్లు, మంగలి, చాకలి మొ॥ వీరంతా శూద్రులే. దేశ జనాభాలో దాదాపు ముప్పైశాతం. ఈ వర్గం రైతులు కూలీలను పెట్టుకునే స్తోమత లేక ప్రభుత్వ భూములను దున్నుకుని పన్ను కట్టేవారు. యేడాదికి నాలుగు నెలలు మాత్రమే కడుపునిండా తిని మిగిలిన కాలం పస్తులుండేవారు. అప్పులు కట్టటానికి ధాన్యం అమ్ముకునేవారు.

వీరేకాక రెండు మూడు నాగళ్ల వ్యవసాయంతో ఓ మాదిరిగా ఉన్నవారు కూడ ఓ ఐదుశాతం ఉండేవారు. పశువులు కూడ వీరికుండేవి.

పేదవారి పట్ల వేమన్నకు అపారమైన సానుభూతి, పక్షపాతం. ఈ వర్గంలో పుట్టకపోయినా ఈ జీవితం లోతుపాతులు బాగా ఆకళింపు చేసుకున్నాడనటానికి వేమన పద్యాల్లో చాలా సాక్ష్యాలు దొరుకుతాయి. దారిద్ర్యాన్ని తలచుకోవటమే పాపమంటాడు.

ధనము లేమి యనెడి దావానలంబది
తన్ను చెరచు దాపువాని చెరచు
ధనములేమి చూడ తలపనే పాపంబు
విశ్వదాభిరామ వినురవేమ (D 1721, 62)

''విత్తహీనుడెంత రిత్తయై పోవును'' (D 1721, 26)
''గోచి పాత కన్న కొంచెంబు మరి లేదు'' (D 1727, 280)
''పేదవాని యింట పెండ్లైన నెరుగరు'' అని అంటాడు.

కాబట్టి ఉన్నవారు లేని వారి నాదుకోవాలంటాడు. దాన గుణంలేని లోభులను తిట్టే పద్యాలు వేమన్న చాలా చెప్పాడు. ''ఐనుగు నెనుగలేని ప్రాభవంబదియేల?''

పేదవారిలో ఎన్ని వైరుధ్యాలున్నప్పటికీ అవసరం వచ్చినప్పుడు అందరూ ఏకమవుతారని వేమన్న అనాడే గుర్తించాడు.

కనులు పోయినవాడు కాళ్లు పోయినవాడు
ఉభయులరయ గూడి యుండినట్లు
పేద పేద గూడి పెనగొని యుండును
విశ్వదాభిరామ వినురవేమ (D 1721, 127)

అన్ని వర్గాలకన్నా గ్రామాధికారుల వర్గం చాలా ముఖ్యమైంది. ఆర్థిక ప్రమాణాలనుబట్టేకాక ప్రజలపైన వీరికున్న ప్రభావం వలన కూడ ప్రాచీన గ్రామ జీవన వ్యవస్థలో ఈ వర్గం చాలా ప్రాధాన్యం వహిస్తున్నది. జనాభాలో పది శాతం లోపే వీరు. కూలీలను విచ్చలవిడిగా నియమించుకోదగిన స్తోమత వీరిది. వ్యవసాయం, వ్యాపారం, వడ్డీలకివ్వటం చేసేవారు. వీరు తినగా, నలుగురికి పెట్టగా కూడ సద్దిమిగిలే సంసారాలు వీరివి. ("సద్ది మిగుల నింట సంసారమేలయా?")

నేయిలేని తిండి నీయాన కసువది
కూరలేని తిండి కుక్క తిండి (D 1731, 186)

అని అనజాలిన వారు.

వేమన పద్యాల్లోని వేమన్న గొంతును, స్వభావాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే అతడీ ఆర్థిక వర్గంవాడే అనిపిస్తుంది. అయితే అతని దృష్టి ఎక్కువగా కింది వారిపైనే కేంద్రీకరించబడింది. తన వర్గంతో ఐక్యం కాక, అవధులు లేని చైతన్యంతో అడుగు వారి న్యాయం కోసం పోరాడిన వేమనలో జన్మతః వచ్చి ఇంకా మిగిలి ఉన్న తన వర్గస్వభావపు నీడలు స్పష్టాస్పష్టంగా కనిపించి అతడే వర్గం నుంచి వచ్చాడో ఊహించటానికి వీలవుతుంది.

ఇక అపారమైన భూసంపద కలవారు, పెద్ద రాజోద్యోగులు, అగ్రహారీకులు సంపన్నుల కోవలోకి వస్తారు. వీరిని గురించి వేమన్న వందలాది పద్యాలు చెప్పాడు.

వేమన భౌతిక జీవితాన్ని గురించి కొంచెమయినా చెప్పుకోడానికి వేమన పద్యాలే ఆధారం. ఏ కవి కవిత్వమయినా కొంతవరకు అతని ఆత్మకథ వంటిదే అని ఒప్పుకుంటే దానిలో ఆ కవి అభిరుచులు, అభ్యంతరాలు, పుట్టి పెరిగిన వాతావరణం, స్వభావాన్ని తీర్చిదిద్దిన పరిస్థితులు, అభిప్రాయాలు, వాటి పరిణామం మొదలైనవన్నీ భావుకుని రచనల్లో ఏదో ఒక ప్రమాణంలో, రూపంలో బయటపడక తప్పదని అంగీకరించాలి. కాని వేమన వంటి ఆశుకవిని గురించి స్పష్టమైన వివరాలు సేకరించటంలో చాలా చిక్కులున్నాయి. ఆధారాల మీద నిర్మించే ఊహాసౌధమే కాని, తిరుగు లేని సాక్ష్యాలను ప్రదర్శించటం కష్టం.

కాని వేమన చెప్పినవన్నీ తాను జీవితంలో చూచినవీ, అనుభవించినవీ అని చెప్పటానికి ఆయన పద్యాలలోని తీవ్రతా, సూటిదనం ఆధారాలు. జీవితంలో చాలా ఒడిదొడుకులకు లోనయినాడు. జీవితపుటుత్తరార్థంలో దేశ సంచారం చేశాడు. దేశ సంచారంలో అతనికి అన్యాయాలు బాగా అర్థమయినాయి తాను చూచిన ప్రతి అన్యాయానికి, చెడుకీ 'రియాక్షన్'గా వేమన కవిత్వం కనిపిస్తుంది. వేమన పద్యాల్లో ఆత్మచరిత్ర శకలాలను ఏరితే, ఆయన జీవితాన్ని సమర్థవంతంగా re-construct చేయవచ్చు.

## ఉపయుక్త గ్రంథాలు


1. అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి. 1929. వేమన. వాల్తేరు : ఆంధ్ర విశ్వకళాపరిషత్తు.

2. బలరామమూర్తి, ఏటుకూరి. 1953. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర. విజయవాడ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

3. లక్ష్మీరంజనం, ఖండవల్లి, బాలేందుశేఖరం, ఖండవల్లి. 1974. ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి మద్రాసు: బాల సరస్వతీ బుక్ డిపో.

ఇంకా—రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మకు సి.ఆర్. రెడ్డి రాసిన లేఖ (తేది ఫిబ్రవరి 9, 1928) బంగోరె సౌజన్యంతో.

4. Duboir, Abbe J. A. 1806. Hindu Manners, customs and cermonies. (Translated by Henry Beauchamp) 1906. Oxford at Clarendon Press.

5. Humayun Kabir. 1955. Our heritage. Bombay: Asian Publishing home.

6. Meckenzie Manuscripts Vol 142, with courtesy of A. P. Sahitya Akademi.

7. Narla, V.R. 1969. Vemana. New Delhi: Sahitya Akademi.

8. Sewel, Robert. 1962. Forgotten Empire. Delhi: National book trust of India.

9. 1897. Tavernier's Travels in India (originally published in London. Republished in 1905) Culcutta: "Bangabani" Office.



# దక్షిణదేశీయాంధ్ర సాహిత్యం-చారిత్రక, సామాజిక నేపథ్యం

—ఎన్. కోటేశ్వరి

క్రీ. శ. 1565 లో జరిగిన రక్షస తంగడియుద్ధం దక్షిణదేశ చరిత్రలో చాలా ముఖ్యమైనది. ఈ యుద్ధంవల్ల విజయనగర సామ్రాజ్యం పతనమై సామ్రాజ్యంలోని దక్షిణ భాగంలో చిన్న చిన్న స్వతంత్ర రాజ్యాలు ఏర్పడ్డాయి. ఉత్తరభాగం పరరాజుల హస్తగతం అయింది. క్రీ.శ. 1600 నాటికి రాయ సామ్రాజ్యాన్ని పునర్నిర్మించాలని ఆర్వీటి తిరుమలరాయలు చేసిన ప్రయత్నాలు ఎప్పటికీ సఫలమయ్యే సూచనలు కూడా లేకుండా పోయాయి. అనేక రాజ్యాలు, వాటిమధ్య పరస్పర ఆధిక్యత కోసం ఎడతెగకుండా జరుగుతుండిన యుద్ధాలు, స్వదేశ రాజకీయాలలో విదేశీ వ్యాపార సంస్థల ప్రవేశం, ఆర్థిక వ్యవస్థలోనూ సామాజిక వ్యవస్థలోను అప్పుడప్పుడే చోటు చేసుకుంటున్న మార్పులు వీటన్నిటితో చాలా గందరగోళంగా ఉన్న చరిత్ర ఈ కాలానిది.

దక్షిణదేశంలో సామ్రాజ్యకాలంలో ఆంధ్రేతర ప్రాంతాలలో కూడా ఆంధ్ర నాయకులే రాజ ప్రతినిధులుగా ఉండడంవల్ల అనేక తెలుగు కుటుంబాలు ఆ ప్రాంతాలకు వలసపోవడం అక్కడి తెలుగు నాయకులు తెలుగుసాహిత్యాన్ని పోషించడం జరిగింది. ఆంధ్రదేశంలోని రాజకీయ పరిస్థితికి ఆంధ్రేతర ప్రాంతంలోని ఆంధ్ర రాజ్యాల రాజకీయ పరిస్థితికీ భేదం ఉంది. 17 వ శతాబ్దం మధ్యకాలంనాటికి దాదాపు తెలుగు దేశమంతా గోల్కొండ కుతుబ్ షాహీల పాలనలోకి వచ్చింది. అంటే ఆంధ్ర దేశంలో ఆంధ్రేతరుల పాలన ఆంధ్రేతర దేశంలో ఆంధ్రుల పాలన నెలకొన్నాయన్నమాట.

భిన్న పరిస్థితులలో ఏక కాలంలో, వచ్చిన తెలుగు సాహిత్యం స్వభావ స్వరూపాల్లో భేదాలున్నాయి అనుకుంటే ఆ భేదాలకు, ఆ భిన్న పరిస్థితులకు,

ఏమైనా సంబంధం ఉందా అని విచారించవలసి ఉంటుంది. ఆంధ్రేతర ప్రాంతాల్లోని తెలుగు సాహిత్యం స్వరూపస్వభావాలను అర్థంచేసుకోడానికి ఆ ప్రాంతాల రాజకీయ సామాజిక చరిత్రను కొంత తెలుసుకోవడం అవసరం.

తంజావూరు, మధుర, చెంజి మొదలైన దక్షిణ రాజ్యాలు క్రీ.శ. 16వ శతాబ్దపు ప్రారంభంలో సామంతరాజ్యాల ప్రతిపత్తినిపొందాయి. అంతకు పూర్వపు విజయనగర రాజులు ఈ ప్రాంతంలో రాజ కుమారుల్ని, సమర్థులైన మంత్రుల్ని రాజ ప్రతినిధులుగా నియమిస్తూ వచ్చారు. 16 వ శతాబ్దంనుంచీ ఏర్పడ్డ సామంత రాజవంశాలు, వంశపారంపర్యంగా ఈ భూభాగాలపై అధికారాన్ని పొందాయి. సామ్రాజ్యం బలహీనమైనప్పుడు స్వతంత్రరాజ్యాలయ్యాయి. వీటిలో ముఖ్యమైన రెండు రాజ్యాలు తంజావూరు, మధుర. మూడో రాజ్యం చెంజి ఎప్పుడూ మధురనే అంటిపెట్టుకునుంది. ఈ రాజ్యాల చరిత్రను సంక్షిప్తంగా పరిచయం చేస్తాను.

తంజాపుర ఆంధ్రనాయక రాజుల్లో మొదటివాడు పినచెవ్వప్పనాయకుడు. విజయనగర చక్రవర్తి అచ్యుత దేవరాయల తోడల్లుడు. ఇతని కుమారుడు అచ్యుతప్ప నాయకుడు 1580 నుంచి 1614 దాకా, తరువాత రఘునాథ నాయకుడు 1614 నుంచి 1630 వరకు, విజయరాఘవ నాయకుడు 1633 నుంచి 1673 దాకా పరిపాలించారు. ఆ తరువాత మహారాష్ట్ర రాజులు 1676 నుంచి పరిపాలించారు. తెలుగు చరిత్రల్లో సాధారణంగా ఈ రాజుల గుణగణాలను పొగడ్డమే గాని వారసత్వ యుద్ధాలు, తండ్రీకొడుకులు, అన్నదమ్ముల మధ్య జరిగిన రక్తపాతాలు కనిపించవు. విజయనగర, తంజావూరు రాజుల చరిత్ర చూస్తే రాజ్యాధికారంకోసం జరిగిన మారణకాండ స్పష్టంగా కనిపిస్తుంది. రఘునాథ నాయకునికి అచ్యుతప్ప అనే అన్న ఉన్నాడు. ఈ విషయాన్ని సమకాలీనులైన విదేశీయులు చెప్పారు. తండ్రి ఇతన్ని చెరసాలలో పెట్టినట్లు, రఘునాథ నాయకుడు రాజ్యానికి వచ్చినతరువాత అన్నను చంపించినట్లు కూడా వీళ్ళు పేర్కొన్నారు. అయితే రఘునాథ నాయకుడిని గూర్చి రాసిన సమకాలీన కావ్యాల్లో ఎక్కడా ఈ ప్రసక్తి లేదు.

విజయ రాఘవ నాయకుడు ''రఘునాథ నాయకాభ్యుదయం''లో తన సోదరు లిద్దరినీ పేర్కొన్నాడు. కాని బహుశా అది అతను రాజు కాకముందు

చేసిన రచనై ఉంటుంది. తరువాతి రచనల్లో వీళ్ళ ప్రసక్తి లేదు. జెసూట్ ఫాదరీలకథనం ప్రకారం ఇతడు సోదరుల కళ్ళు పీకించి కారాగారం పాలు చేశాడని; 1659 లో జరిగిన యుద్ధంలో వీళ్ళు విముక్తి పొందారని తెలుస్తున్నది.

తంజావూరు నాయకరాజుల్లో రఘునాథనాయకుడు సమర్థుడు. చుట్టూ వున్న చిన్న చిన్న సామంతుల్ని జయించాడు. రామదేవరాయల్ని విజయనగర సింహాసనం మీద కూర్చోపెట్టాడు. విజయరాఘవ నాయకుడు అసమర్థుడు. రఘునాథనాయకుడు తాను సర్వస్వాతంత్ర్యాన్ని వహించి కూడా విజయనగర అధికారాన్ని నామమాత్రంగా అంగీకరించాడు. బహుశా దక్షిణదేశంలో రాజకీయ ఏకత ఉండడం అవసరమని భావించాడేమో ! పైనించి వచ్చే మహమ్మదీయ దండయాత్రలను ఎదుర్కొని నిలబడడానికి ఈ ఐకమత్యం పనికొస్తుంది. విజయరాఘవ నాయకుడు ఏమాత్రం ముందుచూపు లేనివాడు. చంచల మనస్కుడు. విజయనగరానికి ఎదురుతిరిగే ప్రయత్నంలో మధుర నాయకులతో చెయ్యి కలిపి తీరా సమయం వచ్చినప్పుడు తప్పుకొని మధుర నాయకులతో శత్రుత్వం తెచ్చిపెట్టుకున్నాడు. శత్రువులు దండెత్తివచ్చినప్పుడు వాళ్ళని ఎదుర్కొనే ప్రయత్నం చెయ్యక తాత్కాలికంగా రాజధాని నుంచి తప్పుకోవడం, లేకపోతే వాళ్ళు అడిగినంత డబ్బు ఇచ్చి బయటపడడం అతడవలంబించిన విధానం.

అయితే ఈ శత్రువులకు లంచం ఇవ్వడానికిగాను ప్రజలనుంచి బలవంతంగా ద్రవ్యాన్ని పోగుచెయ్యవలసిఉండేది. తన క్షేమమే తప్ప మరొకటి పట్టని విజయ రాఘవ నాయకునికి ఈ విషయంలో ఏ హింసాచర్యలు అవలంబించడానికైనా వెనుకాడవలసిన అగత్యం కలగలేదు. గోల్కొండ సైన్యాలు తంజావూరిపై దాడి చేసినప్పుడు లంచమిచ్చి రాజీ పడ్డాడు. బీజాపూరు సుల్తాను దండెత్తివస్తే వల్లంకోటకు పారిపోయాడు. 1673 లో మధుర చొక్కనాథుడు దండెత్తి వచ్చినప్పుడు శత్రు సైన్యాలు కోటలో ప్రవేశించిన తరువాత కూడా విజయరాఘవనాయకునిస్థితి ఎలాఉందో తంజావూరి కైఫీయత్తు ఇలా చెప్తున్నది:

"ఈ సంగతులు నడిచే తరుణమందు అచ్యుత విజయరాఘవనాయకుని వారు నామతీర్థం కొలువులో ఉండి తదేకధ్యానంతో జపం చేస్తూనే ఉన్నారు. అప్పుడు వారి ఇలాకా మనుష్యులు ఓ మహారాజా! పగతులు మన కోటవహల్లా చేసి లోజొచ్చినారు అని విన్నవించారు. అతడు మహానారాయణభక్తి గలవాడు కనుక ఆ పూజ విడిచి లేవక రానీ చూచుకొందామని సన్న చేసినారు.'' ఇది భక్తి కాదు, ఉన్మాదం.

నాయక రాజుల బహుభార్యాత్వం అతిక్రమించి రాగాన పడింది. కౌటిన్హో ఫాదరీ ''ఇటీవలనే అచ్యుతప్ప నాయకుడు చనిపోయెను. బ్రతికిఉన్న 370 మంది భార్యలతో అతని శవమును చందన కాష్ఠములమీద నుంచి దహనము చేసిరి" అని రాశాడు. రఘునాథనాయకుని విషయంలో ఈ లిష్టు ఎవరూ పేర్కొనలేదు. కాని పర రాజ్యాలను జయించినప్పుడు అక్కడి స్త్రీలను చెరపట్టి నట్లు మాత్రం విజయరాఘవ నాయకుడు ''రఘునాథ నాయకాభ్యుదయం''లో గర్వంగా చెప్పుకున్నాడు—

''............పాండ్యావనిపాలు
పాళెంబుడాసి తద్బాలికామణులు
మొరవెట్టగా తన మూకలచేత
చెరవట్టి తెప్పించి చెలగె''

ఇక విజయరాఘవనాయకుని విషయానికివస్తే 700 మంది భార్యలు, 3500 మంది ఉంపుడుకత్తెల వివరాలు తెలుస్తున్నాయి. చాలామంది భార్యలను కలిగిఉండడం, పైగా వేశ్యల్ని ఉంచుకోవడం గౌరవనీయమైనప్పుడు, ఆ రాజుల ఉంపుడుకత్తెల సంధానాలను కవులు కావ్యాలుగా చెప్పి ఆనందించడంలో చిత్రమేమీలేదు. కొడుకులే తండ్రుల శృంగార జీవితాన్ని కావ్య వస్తువుగా తీసుకుంటూఉండగా, అటువంటి శృంగార జీవితం రసికతను పారమ్యంగా భావిస్తూ ఉండగా, మోహశృంగార కావ్యాలు రావడంలో వింత ఏమీలేదు. క్రీ శ. 1676లో తంజావూరు మహారాష్ట్రరాజుల వశం అయింది. 1676 నుంచి 1763 వరకు 8 మంది మహారాష్ట్ర రాజులు తంజావూరుని పరిపాలించారు వీరిలో శహాజీ, తుక్కోజీ, ఇమ్మడి ఏకోజీ స్వయంగా కవులు.

1529లో మధురలో విశ్వనాథ నాయకునితో ఒక సామంత రాజ్యం ఏర్పడింది. 17వ శతాబ్దం ప్రారంభంలో వీరప్ప నాయకుడు, 1623 నుంచి 1659 వరకు తిరుమల నాయకుడు, కొద్దికాలం ముత్తువీరప్ప నాయకుడు, 1659 నుంచి 82 వరకు మొదటి చొక్కనాథనాయకుడు, 1682-89 మధ్య వీరప్ప నాయకుడు, తరువాత రెండవ చొక్కనాథ నాయకుని ప్రతినిధిగా ఆతని నాయనమ్మ రాణి మంగమ్మ 1706 వరకు, అప్పటినుంచి 1732 వరకు రెండవ చొక్కనాథ నాయకుడు, 1739 వరకు అతని భార్య మీనాక్షి మధురను పరిపాలించారు. 17వ శతాబ్దం ప్రారంభం నుంచి మధురనాయకులు స్వతంత్రులు కావడానికి ప్రయత్నించారు. 1617 లో రామదేవరాయలకు వ్యతిరేకంగా గొబ్బూరి జగ్గరాజును సమర్థించాడు వీరప్ప. తిరుమల నాయకుడు శ్రీరంగ దేవరాయలతో శత్రుత్వాన్నే కొనసాగించి గోల్కొండ, బిజాపూరు సుల్తానులతో కలిసి కుట్రలు చేశాడు. ఇతని కాలంలోనే క్రైస్తవ మత ప్రచారం ఎక్కువగా జరిగింది.

పూర్వ సంప్రదాయాన్ని అనుసరించే,దాక్షిణాత్యాంధ్ర రాజుల పరిపాలనా విధానం ఉండేది. అధికార యంత్రాంగంలో కొన్ని మార్పులు కనిపిస్తాయి. దళవాయి రాజ్యంలో ముఖ్యాధికారి. పూర్వం మంత్రి, సేనాపతి ఇద్దరూ నిర్వహిస్తూ ఉండే బాధ్యతలను ఇప్పుడు దళవాయి నిర్వహించడం మొదలుపెట్టాడు. అప్పటి విదేశీయులు దళవాయిని Governer General అని పేర్కొన్నారు. తరువాత ప్రధానాధికారి ప్రధాని. రాయసం అనే పదవికి ఈ కాలంలో చాలా ప్రాముఖ్యం వచ్చింది. రాజుకు ఆంతరంగిక కార్యదర్శి లాంటి ఈ అధికారి కాలక్రమేణా ప్రధాన పరిపాలనాధికారిగా రూపొందాడు. రాయసాల కుట్రలవల్లి రాజ్యాలు పతనమయ్యాయి. తంజావూరు నాయక రాజ్య పతనంలో రాయసం వెంకన్న పాత్ర చాలా ముఖ్యమైనది. కణక్కన్ (గణకుడు), స్థానాపతి మొదలైన వాళ్లు ఇతర ప్రధానాధికారులు. అంతకుముందులాగే పాలెగాళ్ళ పద్ధతి అమలులో ఉంది. అయితే ఈ చిన్న రాజ్యాలలో పాలెగాళ్ళు ఒక్కొక్కసారి కేంద్రప్రభుత్వం కంటె బలవంతులుగా కనిపిస్తారు.

పాలెగాళ్ళ పద్ధతిలో రాజు కొన్ని గ్రామాలను పాలెగాడి కిస్తాడు. ఆ గ్రామాల మీద వచ్చిన ఆదాయాన్ని మూడు భాగాలు చేసి ఒక భాగాన్ని రాజుకు,

ఒక భాగాన్ని సైన్య పోషణకు, మూడవ భాగాన్ని ఇతర సేవా కార్యక్రమాలకు వినియోగించాలి. కాని రాజులు, తమకు పంపించే డబ్బుకాక తక్కినదాన్ని ఎట్లా వినియోగిస్తారన్న విషయాన్ని పట్టించుకోకపోవడం వల్ల, వాళ్లు పోషించే సైన్యం సరిగా లేకపోవడం, ఉన్న సైన్యంమీద రాజుకు అధికారం లేకపోవడం జరిగింది బలవంతులైన పాలెగాళ్లు అప్పుడప్పుడూ రాజుమీద తిరగబడడం కూడా సాధారణమే. రాజ్యం బలహీనం కావడానికి ఈ పాలెగాళ్ళ పద్ధతి ప్రధాన కారణం.

తంజావూరంతటా వైష్ణవమే ప్రచారంలో ఉంది. అచ్యుతప్ప నాయకుడు, రఘునాధ నాయకుడు వైష్ణవులే కాని ఇతర మతాలను ఈసడించలేదు. అద్వైతులు పరమశివావతారంగా భావించే అప్పయ దీక్షితులవారిని అచ్యుతప్ప సత్కరించాడు. రఘునాధుడు సురేంద్ర, సుధీంద్రులనే ఇద్దరు మాధ్వ గురువులను గౌరవించాడు. వీరిలో సుధీంద్రులకు కనకాభిషేకం కూడా చేశాడు. స్మార్తుడైన గోవింద దీక్షితులను రఘునాధుడు మంత్రిగా పూజించి అర్ధాసనం ఇచ్చాడు. విజయ రాఘవుని వైష్ణవం కొంచెం ముదిరిన వైష్ణవం, దీన్ని గొప్పగా—

''పరమతంబులనెల్ల నిరసించి యే మేటి

వైష్ణవ మతము శాశ్వతము చేసె'' అని రంగాజమ్మ ఉషాపరిణయంలో పొగిడింది. విజయరాఘవుని పరిపాలనలో వైష్ణవుడు నేరం చేస్తే వాడిమీద చర్య తీసుకోవడానికి అధికారులు జంకేవాళ్ళు. మధురలో మాత్రం క్రైస్తవులు మత ప్రచారం చేసుకోవడానికి నాయకరాజులు ఏ విధమైన అడ్డంకులు పెట్టలేదు. 1600 ప్రాంతంలో రాబర్టు డీ నొబిలి మత ప్రచారం చేశాడు. మధుర నాయకులు క్రైస్తవులతో సఖ్యాన్నే అవలంబించారు.

వర్ణాశ్రమ ధర్మాల పేరిట బ్రాహ్మణులపై నాయకరాజులు గొప్ప భక్తి గౌరవాలు చూపారనడానికి చాలా తార్కాణాలున్నాయి. రఘునాధుడు ఈ విషయంలో చాలా పేరు పొందినట్లు అనేక నాటకాలలో ఉంది. రఘునాధుడు తన వాల్మీకి చరిత్ర గద్యలో రోజుకు 50,000 మంది బ్రాహ్మణులకు అన్నదానం చేస్తున్నానని చెప్పుకున్నాడు.

విజయ రాఘవుడు పూతనా హరణ నాటక గద్యలో "ప్రతిదిన బ్రాహ్మణ బహుళ సహస్రాభీష్ట మృష్టాన్నదాన దీక్షాధురీణ" యని చెప్పుకొన్నాడు. ఈతని బ్రాహ్మణభక్తిని చెంగల్వకాళకవి రాజ గోపాల విలాసంలో వివరించాడు. మన్నారుదేవుడు లక్షమందికి అన్నదానం చేశాడు. ఈ విషయాన్నే "తంజా పురాన్నదాన మహా నాటకం" చివర భరత వాక్యములో పురుషోత్తమ దీక్షితుడు ఇలా వ్రాశాడు —

"ఇవ్విధంబున అనవరత లక్ష బ్రాహ్మణాన్నదాతయగు మన్నారుదాస నృపాలునకు హేమాబ్జనాయికా రాజ గోపాలకులు ఆయురారోగ్యంబులు అమిత భోగభాగ్యములు పాలించి లాలించి రక్షింతురు గాక."

17వ శతాబ్దంనుంచే విదేశీ పెట్టుబడి దేశంలో ప్రవేశించింది. 18వ శతాబ్దం చివరి నాటికి దీని స్పష్టమైన ప్రభావం సమాజంమీద కనిపిస్తుంది. గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో స్పష్టమైన పరిణామం వచ్చింది. విదేశీ వ్యాపారుల ప్రవేశంవల్ల ఆంధ్రదేశంలో కంటే దక్షిణాంధ్రలోనే మార్పులు మొదట ప్రారంభ మయ్యాయి దక్షిణదేశపు రేవు పట్టణాలలో ఫ్రెంచి, ఇంగ్లీషు, డచ్చి, పోర్చుగీసు వ్యాపారులు స్థావరా లేర్పరచుకున్నారు. మన ముడి సరుకుల్ని కొని తయారైన వస్తువులను మనకు అమ్మి వీళ్ళు లాభాలు సాధించారు. దక్షిణ దేశంలోని క్షామాన్ని ఆధారంగా తీసుకుని డచ్చి వ్యాపారులు బానిస వ్యాపారం కూడా చేశారు. మరొకవైపు క్రైస్తవ మత ప్రచారం కూడా ప్రారంభం అయింది.

అతివృష్టి అనావృష్టిలాంటి సహజమైన ఈతి బాధలుండగా, దొంగలు, క్రూరమృగాల బాధ ప్రజలకు ఎక్కువగా ఈ కాలంలో ఉన్నట్టు కనిపిస్తుంది. ఈ రెండింటికంటె ఎక్కువగా పాలెగాళ్ళ బాధ భరించరానిది. పెరుగుతూ ఉన్న పన్నుల్ని భరించలేక కరువు కాటకాలకు తట్టుకోలేక శత్రు సైన్యాల దోపిడిని, హింసనూ భరించలేక తంజావూరునుంచి ప్రజలు మధుర, శాంతోమ్ లకు వలస పోయారు. డచ్చివాళ్ళు అన్నార్తులైన ఈ నిర్భాగ్యులకు అన్నం పెడుతున్నట్లు నటించి బానిసలుగా ఇతర దేశాలకు ఎగుమతి చేశారు ఈ విష యాన్ని జెసూట్ ఫాదరీల్లు—

"సిగ్గుపడాలి. డచ్చివారు శాశ్వతంగా సిగ్గు పడాలి. భారతీయుల దౌర్భాగ్యాన్ని తిండి ఆశ పెట్టి తమ వ్యాపారానికి, లాభాలకు ఘోరంగా ఉప యోగించుకున్నవాళ్ళు తలలు వంచుకోవాలి" అని విమర్శించారు. కాని నిజానికి డచ్చివారికంటే ఎక్కువ సిగ్గు పడాల్సింది విజయ రాఘవ నాయకుడు. తన ప్రజలు కూటికి గతిలేక అష్ట కష్టాలు పడి అమ్ముడు పోతుంటే శృంగార పదాలు చెప్పుకుంటూ ఆనందించాడు ఈ నాయకరాజు. ఇది ఇలా ఉంటగా చెంగల్వ కాళ కవి 'రాజగోపాల విలాసం'లో దేశాన్ని—

"సస్యశ్యామలముగా సన్నధాన్యములతో చక్కగా పండెడి భూములు, పాటుపడు రైతులు. ఆ ప్రజలు కరువు కాటకాలను పేరే యెరుగరు —

నిండి యెల్లెడ జూచిననెగడుచుండు
క్షామమను పేరె యెరుగరా భూమిజనులు"

అని వర్ణించాడు.

సమకాలీనులైన విదేశీయులు కళ్ళారాచూసి వ్రాసిన అనేక విషయాలు, శాసనాలు, కవిలెలు మొదలైన వాటి నుంచి తెలిసే విషయాలు పండితుల, చదువుకున్నవాళ్ల సాహిత్యంలో కనిపించవు. సమాజంలో ఉన్న భిన్న వర్గాల జీవన విధానాన్ని చిత్రించడానికి బదులు, తెలుగు సాహిత్యం పాలక వర్గా న్నొక్కదాన్నే ఆశ్రయించింది. చారిత్ర కాధారాల మూలంగా మనకు తెలిసిన ప్రతి విషయమూ సాహిత్యంలో కూడా లభిస్తుందేమోనని వెదికిచూస్తే నిరాశే ఎదు రౌతుంది. కవులలో ఎక్కువ భాగం స్తోత్రపాఠకులే. అయితే కొంతమంది కేవలం వ్యక్తులుగా రాజాధికారాన్ని తిరస్కరించినా దానికి ప్రత్యామ్నాయంగా భగవంతుడినే ఎన్నుకున్నారు. తన పూర్వుల వైభవాన్ని గానం చెయ్యమని విజయరాఘవ నాయకుడు కోరగా—

"నారసింహుని పాడిన నోటను
ఊరసింహమును పాడన్" —అని స్పష్టంగా నిరాకరించిన పెద్దిదాసు లాంటి వాళ్లు దైవాన్ని మాత్రమే ఆశ్రయించి సమాజానికి దూరం అయ్యారు.

దక్షిణాంధ్ర సాహిత్యానికి ఒక విశిష్టత ఉంది. యక్షగానాలు బాగా ప్రచారంలోకి వచ్చి Popular Stage ఏర్పడింది. కాబట్టి అనేకరకాల పాత్రల్ని ప్రవేశపెట్ట వలసి వచ్చింది. హాస్యంకోసమో జనాకర్షణ కోసమో ఇక్కడి యక్షగానాలు సామాన్యుడికి దగ్గరగా వచ్చాయి. కావాలనో లేకపోతే అనుకోకుండానో నాటి సమాజంలోని నిమ్న వర్గాల జీవితాన్ని కూడా వర్ణించాల్సి వచ్చింది. అందుకే అంతకు పూర్వపు తెలుగు సాహిత్యంలాగా కాకుండా ఈ కాలపు యక్షగానాలు ప్రజా జీవితాన్ని ఎక్కువగా ప్రతిబింబించాయి. వాటి నుంచి చరిత్ర నిర్మాణానికి ఆధారాలను మనం గ్రహించే అవకాశం కలిగింది.

భారతదేశ చరిత్రలో బ్రాహ్మణ వర్గం చాలా ప్రధాన పాత్ర వహించింది. ఒకప్పుడు పాలక వర్గం వీళ్ళ మీదే ఆధారపడింది. విజ్ఞానాన్నంతా తమ చేతుల్లో పెట్టుకుని అగ్రవర్ణంగా అనేక రకాల గౌరవాలను పొందారు. అయితే కాల క్రమంగా పాలక వర్గంలో వచ్చిన మార్పులు బ్రాహ్మణుల ప్రాధాన్యాన్ని కొంత తగ్గించాయి. రానురాను ఈ వర్గం పాలకుల్ని ఆశ్రయించుకొని బ్రతకవలసిన అవసరం ఏర్పడింది. పాలకవర్గ దయాధర్మాలమీద ఆధారపడిన బ్రాహ్మణులు అంతకుముందు తాము పొందుతూ ఉన్న గౌరవాలను కోల్పోయారు. పైగా ఏ విద్యల మూలంగా గౌరవింపబడ్డారో అవి సమాజంలోని ఇతర వర్గాలు కూడా నేర్చుకొనడంతో ప్రత్యేకతను కోల్పోయారు. అధికారంలో ఉన్న బ్రాహ్మణేతరులు చాలామంది పండితులై కావ్యరచన చేశారు. సమాజంలోని సామాన్యుల్లో కూడా చదువుకున్నవాళ్ళు ఉన్నారు. ముఖ్యంగా వేశ్యలు పండితురాండ్రై కవిత్వం చెప్పడం సర్వసామాన్య మయింది. బ్రాహ్మణు డనగానే పండితుడని, నియమ నిష్ఠా గరిష్ఠుడని అనుకోవడానికి వీల్లేదు. రాజకీయంగా సామాజికంగా పతనమైనప్పటికీ అనేక శతాబ్దాలుగా పొందుతూ వున్న గౌరవం వల్ల వచ్చిన స్వాతిశయం మాత్రం పోలేదు. అయినా నాయక రాజులు అన్న సత్రాలు పెట్టి బ్రాహ్మణులని పోషించారు. ఈ పోషణకి బ్రాహ్మణుడు కావడమే అర్హత. తంజాపురాన్నదాన మహానాటకంలో సత్రంఅధికారి నెల్లూరి యెల్లమరాజు మాటలు దీని కుదాహరణ-"మన యేలినవారు...వీర వైష్ణవ సార్వభౌములు. అటుగనుక బ్రాహ్మణులకు అన్నపానాదులపట్ల కొదువ వచ్చేనా తాళరు. తంతు మాత్రపు వాడైనా తంజావూర ఉపవాసం ఉండ

రాదు''. (195) వాళ్ళ శాస్త్ర పాండిత్యంగాని, ఇతర యోగ్యతలుగాని పరిశీలించాల్సిన అవసరం లేదు. ''మా యేలినవారు బ్రాహ్మణ్య ప్రభువులు గనుక మేము బ్రాహ్మల పరీక్షించరాదు. నీవు యెట్లా ఉన్నా పూజ్యుడవే అటు గనక సకలమైన వారున్ను సాపడ విచ్చేయరయ్యా'' (227) యక్షగానాలలో చదువురాని బ్రాహ్మణులను అపహాస్యం చేస్తూ ఉన్న ఘట్టాలెన్నో ఉన్నాయి. సత్రం అధికారిని ఆశీర్వదిస్తూ పప్పు తిప్పాభట్లు—

తిప్పా:- హరిః ఓం, కోశం దక్షిణః పక్షః కుప్ప
ఉత్తరః పక్షః, నులుపెశాంతం తూర్పె
త్తు శ్లోకోభవతి, గంపం నింపయితి''

అధి:- పప్పు తిప్పాభట్లూ! ఇది ఏ వేదమయ్యా ?

తిప్పా:- యెల్లమరాజుగారు! అయిదో వేదమయ్యా...ఎనిమిది అట్టాలకు
అవతలి అట్టమయ్యా''— (198) అంటాడు.

పంచాంగం చెప్పే విధానం:

అధి:- నేటి దినశుద్ధిచెప్పండ.

తిప్పా:- ఓహోహో! మహాచెప్పేమే తాదనం సంవత్సర తాచేటు మాసం అరవ త్తెట్టిందేది పంచమీ శుక్రవారం పంచమీ నూట దెబ్బై రెండున్న రాబరక. మరిన్ని, మంచిగా, ఈ అక్షరమేందిరా తెలియలేదు.

మంచి:- అన్నగారూ ఈ అక్షరం 'చా' గా దషవే ?

తిప్పా:- ఓరీ ఆ గుడి సేదిరా !

మంచి:- అదా, చాకు గుళ్ళోదీర్ఘమిస్తే చీ

తిప్పా:- నీవంటి కొడుకు కలిగినందుకు తండ్రిని 'చీ' అనక మరెవరిననేవు! ఒరి, అది గాదురా! 'పా' వలె ఉందిరా.

మంచి:- అన్నగారూ! ఆ అక్షరం 'పా' అవునే.

తిప్పా:- ఓరి! ఆ గుడు సేదిరా ?

మంచి:- అన్నగారూ ! పాకు గుళ్ళో దీర్ఘమిస్తే 'పీ'.

తిప్పా:- ఓరిమంచిగా ! చియ్యో పియ్యోపేకదేరా శుద్ధిచేసి చూతాం—
ఇలా సాగుతుంది.

ఇక రాశి ఫలం చెప్తూ—

తిప్పా.- ఉదయారూఢ ఛత్రాలుచూచి చెప్పేము. ఉదయం తూర్పునను, ఛత్రం రాజు దగ్గరను, ఆ రూఢం మేషం, అశ్వని భరణికృత్తికాః పాదం మేషం. భరణి పెట్టెలోను, మేషం మేకలమందలోను, వృషభం ఆవులమంద లోను, మిథునం స్త్రీ పురుషులు గూడినచోటను, కర్కాటం బొక్కలోను, సింహం అడవిలోను, కన్య పుట్టింటను, తుల సెట్టివాని ఇంట్లోను, వృశ్చికం, పిడుకలకుచ్చెలోను. ధనుస్సు పట్టినవానిచేతను, మకరం సముద్రంలోను, కుంభం కుమ్మరివానియింట్లోను, మీనం చెరువులోను. పంద్రెండు రాసులున్ను యెక్కడివక్కడనే ఉండేది'' (200)—అంటాడు.

ఇక అనాచారం చెప్పనవసరంలేదు. శాహజీకృత 'శచీపురందరము'లో ఇలా ఉంది- ''పూజారి:- ఓరీ పరిచారిక భ్రష్టుముండా కొడుక, మొన్న విఘ్నేశ్వరునికి అభిషేకం చేసిన యరటిపండుమ్రుక్కవొక మ్రుక్కమన యేడ్చు చిన్నవాడైన మహాగణప నిచేత కొంటపోయి యియ్యమంటే వోపన్న నీవు, మణివగాని వెంటనైతే తునకలు, నైవేద్యమైన పదార్థాలు యివన్నీ నెత్తి మీద పెట్టుకొనిపోయి, మణివగాని గుత్తలంజకున్ను యిచ్చి, కొనిపోయిన పదార్థాలలో, కొన్ని జిల్లేడు పొదలలో వేసిపెట్టి మణివ గాని గుత్త లంజతొత్తుకు యిచ్చి దాని దగ్గఱ పండుకో ఉండి స్నానమున్ను చేయకనే తడి బట్టతో ఒళ్లు తుడుచుకొని తారుమారుగా విభూతి పూసుకొని విఘ్నేశ్వరమూర్తికి పరిచారిక ము సేయవస్తివి''-(146)

ఇది ఇద్దరు పూజారులు దెబ్బలాడుకుంటే బయటపడిన విషయం. రెండో పూజారికి పొగతోట కూడా ఉంది. పొగతోట పాలనలో వినాయకుని పూజించడం మానేస్తాడు, ఇంతకంటే అసభ్యమైన అనాచారాలు కూడా యక్ష గానాల్లో కనిపిస్తాయి.

పండిత సభల్లో సైతం వాదులాడుకునే వాళ్ళు. విజయరాఘవ కల్యాణంలో కోనేటి దీక్షితుడీ విషయాన్నిలా చెప్పాడు.

''సోమయాజులు:- అదిగాదయ్యా, నేను సమానాధికరణంగా ప్రసంగం చేస్తే వీడు వ్యధికరణంగా కూతలు పెట్టుచున్నాడు. ఓరీ! నీవే విద్వాంసుని కొడకవురా ?

గోవిందభట్టు:- ఓరి, నీవు నిన్నటివరకు పిళ్ళగాడి తనము చేసి నేడు కుళ్ళాయి పెట్టుకుంటేనే విద్వాంసుని కొడకవైతివిరా ?

సోమయాజులు:- ఓరి, నీవు సామంతుని పాళేన నుండి కాలికి గజ్జెలు కట్టుకొని సత్రానికి కట్టెమోపులు మోస్తివే. నేడు తలపాగ చుట్ట నెత్తి కట్టుకొంటేనే సభలో మాట్లాడేటట్టాయెనా?

గోవిందభట్టు:- ఓరి, నీవు నిన్నటివరకు సత్రాన పుల్లాకుల గంపలు మోచి మోచి దలబట్టు గట్టిందే. కాగానే కద కుళ్ళాయి నెత్తి బెట్టుకొంటివి.

వీళ్ళిట్లా వాదులాడుకుంటుంటే-వచః కందళిత మందహాస వదనారవిందులై మన్నారు దాసభూపాలుడేమనుచున్నాడు.

నాయని వారిమాట:- వీరి ప్రసంగాలకేమి, ఉన్నదే కద "ప్రసంగం సేయమంటే సిగలు పట్టుకొని తన్నులాడుదురు".

ఆంధ్ర దేశంలోని బ్రాహ్మణుల పరిస్థితి దాదాపు ఇటువంటి దే అయినప్పటికీ అన్న సత్రాలుపెట్టి భోజనాలు పెట్టే దాతలు లేక పోయారు. అందుకే చెడిపోయిన అగ్రహారాలవల్లా ఇతర విధాలుగా జీవనాధారం కోల్పోయిన వాళ్ళు తమకు కలిగిన దౌర్భాగ్యపు స్థితికి బాధపడుతూ భగవంతునికి విన్నవించు కున్నారు. ఆధునిక యుగ ప్రారంభంలో సంఘ సంస్కరణ ధ్యేయంతో రాయ బడ్డ ప్రహసనాల కోవలోకి వస్తాయి యక్షగానాలు.

ఈ యుగరాజకీయ చరిత్రలో చెప్పుకున్నట్లు రాజులు, ధనవంతులు, అధికారులు అనేక మంది భార్యల్ని ఉంపుడు కత్తెల్ని, కలిగి ఉండటం ప్రతిష్ఠా హేతువుగా భావించారు. తమ రసికతకు చిహ్నమని తలచారు. ఆటా పాటా తెలిసిన వేశ్యలకు రాజాస్థానాలలో చాలా గౌరవముండేది. రామభద్రాంబ, మధురవాణి, రంగాజమ్మ, కృష్ణాజమ్మ, ముద్దుపళని మొదలైనవాళ్ళు పొందిన సత్కారాలు ఇందుకుదాహరణలు. పూర్వకాలంలో ఏ శ్రీనాధుడికో కనకాభిషేకం జరిగింది-గాని నాయక రాజుల ఆస్థానంలో ఈ గౌరవం చాలామంది వేశ్యలకు కలిగింది.

రంగాజమ్మ కులానికి వేశ్య అయినా ఏక చారిణీ వ్రతం అవలంబించి పతివ్రతగా విజయరాఘవుని అంతఃపురకాంతల్లో చేరింది. పట్టమహిషి ఈర్ష్యతో

దూషిస్తూ వార్తపంపుతే రంగాజమ్మ పౌరుషంతో ఈ కింది పద్యం వ్రాసి పంపిందట—

''ఏవనితల్ మముందలప నేమిపనో ? తమరాడు వారుగా
రో ? వంపించునేర్పెఱుగరో ? తమకౌగిటిలోన నుండగా
రావదియేమిరా ? విజయరాఘవ యంచిలుదూరిబల్మిచే
దీవరకత్తె నైయిటుల దీసుకవచ్చితినా? తలోదరీ!''

చాలామంది స్త్రీలు పెద్ద పదవుల్లోకూడా ఉన్నట్లు ఆధారాలున్నాయి. రాజ్య వ్యవహారాల్లో ప్రధాన పాత్ర వహించిన రాయసాలుగా కూడా స్త్రీలున్నారు. రాజగోపాలస్వామి రథోత్సవ శ్రీముఖాన్ని విజయరాఘవ నాయకుడు చెంతనున్న రాయసం తోయజముఖికి అందించాడని రాజగోపాల విలాసంలో ఉంది. రాయసంపుచెలి కమ్మవక్కణం చదివినట్లు హేమాబ్జనాయికా స్వయంవరంలో ఉంది. మధురను పరిపాలించిన వారిలో స్త్రీలుకూడా ఉన్నారు.

రాజాస్థానాల్లో వేశ్యలకున్న గౌరవం కవి పండితులకు లేకపోయింది సామాన్య స్త్రీ మాత్రం యధా తథంగానే ఉంది. కాబట్టి కొంతమంది కవుల 'విద్వాంసులైన విప్రులుగా పుట్టడం కంటే వేశ్య అయి పుడితే బాగుండేది' అని కూడా అన్నారు. దీనికి నాయకరాజుల భోగలాలసతయే కారణం.

ఆశ్రితపక్షపాతం పైనించి కిందివరకు విస్తరించింది. చివరకి సత్రాలలో భోజనంపెట్టే అధికారికూడా ముందు తన బంధువుల్నే పిల్చి భోజనంపెడతాడు

తిప్పా :— ఓరి మంచిగా! ఆ కుంటి బ్రాహ్మణ్ణి పిలుస్తున్నాడు. ఆ కుంటి బ్రాహ్మణుడు సత్రమధికారికి ఏమిగావలెనురా ?

మంచి :- వాడె అధికారికి మేన పిన్నమ్మ మనమరాలి మొగని బావ మరది.

తిప్పా :-ఓరి మంచిగా ! అధికారి అల్లపొట్టి బ్రాహ్మణ్ణి పిలుస్తున్నాడు ఆయధికారికి వాడేమి కావలెరా ?

మంచి :-వాడే వాళిపిన తండ్రికి తోడబుట్టిన యన్న''

రాజాస్థానాన్ని చేరుకోవడానికి సులభమైన మార్గం లేదు. అధికారులలో లంచగొండి తనం ఎక్కువగా ఉండేది. అవినీతి పరులైన అధికారులు ప్రజల సొమ్మును అపహరించడానికి ఏ మాత్రం వెనుకాడేవారు కాదు. చాలా మంది అడ్డుపుల్లలు వేసే వాళ్ళు ఉండేవాళ్ళు. నిజానికి అందమైన ఆడవాళ్ళకు మాత్రమే తేలికగా ప్రవేశం లభించేది.

శచీపురందరంలో దేవేంద్రుని వాకిలి కావలి వాండ్లు గొల్లలు. ఇంద్రుణ్ణిచూడ డానికిమునులు వస్తే-

కటిక :- మీరెవరు నన్నడిగేందుకు? ఎవని కొడుకులు? కాసంతా సేయరు మీరు మీరడిగితే చెప్పుచున్నామా? తొత్తుకొడుకుల్లారా ! యావలపొండు''- అని అదలించిన వాడు రంభరాగానే ''నీ కుత్తరువాయెను, నీవు లోపలికిపోవే'' అంటాడు.

దక్షిణాంధ్రయుగంలో అనేక ప్రక్రియల్లో రచనలు వచ్చినా వాటిలో కొన్ని మాత్రమే నాటి రాజకీయ సామాజిక వ్యవస్థను ప్రతిబింబించేవి. తక్కిన రచనలు గతాను గతికంగా ప్రాచీన కావ్యాల అనుకరణలో వచ్చినవి. కాబట్టి వాటిని గురించి ప్రత్యేకంగా చెప్పుకోవలసిందేమీలేదు.

దక్షిణాంధ్ర దేశంలో వచ్చిన కొన్ని ప్రబంధాలను 'కవిత్వవేది' మోహ శృంగారకావ్యాలన్నాడు. సంఘ ధర్మానికి వ్యతిరేకంగా వివాహానికి వెలుపల శృంగారాన్ని మోహమని, అది ప్రధానంగా ఉండడంచేత అహల్యాసంక్రందనం, తారా శశాంక విజయాదులు మోహశృంగార కావ్యాలని ఆయన నిర్వచించాడు. ఈతరగతి కావ్యాలు ఈ కాలంలో చాలా ఎక్కువగావచ్చాయి. నీతి, భోగం ఈ రెండింటిలో రెండవ దానికే ప్రాధాన్యత యిచ్చినదశయిది. భోగాన్నిపొంద దంలో నీతిని త్యజించడానికి కూడా వెనుకాడరు. దక్షిణాంధ్రయుగ భోగ లక్షణం సాహిత్యానికి వ్యాపించింది. స్త్రీవ్యామోహం పరాకాష్ఠనందుకున్న కాల మది. తమ శృంగార జీవితాన్ని గర్వంగా బయట పెట్టుకున్నారు రాజులు. కొడు కులే తండ్రుల శృంగార జీవితాన్ని వర్ణించడాన్ని ఈ కాలంలో చూడవచ్చు. విజయరాఘవ నాయకుని ''రఘునాథ నాయకాభ్యుదయం'' మన్నారుదాసుని

"విజయరాఘ వాభ్యుదయం", "హేమాబ్జనాయికా స్వయంవరం" ఇందుకు తార్కాణాలు. ఈ పరిస్థితికి అనుగుణంగానే కావ్యాలువచ్చాయి.

తారాశశాంక విజయము, అహల్యాసంక్రందనం, రాధికాసాంత్వనము, సత్యభామా సాంత్వనము,బిల్హణీయం, యువజన హృదయానందం,రాధామాధవం వచ్చిశృంగార కావ్యాలు. వీటిని పోలినవి ఇదే కాలంలో ఆంధ్రదేశంలో వచ్చినవి చాలా తక్కువ. కనుపర్తి అబ్బయామాత్యుని "కవి రాజ మనోరంజనం" లాంటివి ఏవో ఒకటి రెండు వచ్చాయి. అదీ దక్షిణాంధ్ర కావ్యాల ప్రభావం వల్లనే అయ్యుంటుంది.

తెలుగుదేశంలో మహమ్మదీయ పరిపాలకులు ఉండడంవల్ల ఆస్థానాల్లోని కవులు చేసిన రచనల్లో స్వీయరాజుల శృంగార వర్ణనకు అవకాశం లేకపోయింది. ముస్లింలలో బహుభార్యాత్వం ఉన్నప్పటికీ ఆ శృంగారాన్ని బహిరంగం చేయడాన్ని వాళ్లు ప్రోత్సహించలేదు. అచ్చ తెనుగు కావ్యాలు వచ్చాయి. దీనికి ముస్లింల పాలన కారణం కావచ్చు లేదా కేవలం ఒక ప్రయోగం కావచ్చు. ఇవి దక్షిణాంధ్ర సాహిత్యంలో రాలేదు.

తెలుగులో ప్రత్యేకంగా వచన కావ్యాల రచన దక్షిణాంధ్ర యుగంలోనే మొదలైంది. చంపూ కావ్యాల్లోని వచనాలూ, పదకవితల్లాంటి సింహగిరి వచనాలూ విడిచిపెడితే సిద్ధేశ్వర చరిత్రలో కొంత భాగం, ప్రతాప చరిత్ర, రాయవాచకము మొదలైనవి దక్షిణాంధ్రయుగానికి ముందు వచ్చాయి. ఇవి వాడుక భాషలోనే ఉన్నాయి. వేంకటేశ్వర వచనాల్లాంటి వాటిల్లో కూడ కొంత కావ్య భాషాధోరణి కనిపిస్తుంది. దక్షిణాంధ్రయుగంలో కొన్ని వచన గ్రంథాలు వ్యావహారిక భాషలో వచ్చాయి. కాని ఎక్కువగా మధుర నాయకరాజుల పోషణలోని వచన కావ్యాలు కావ్యభాషలోనే రచింపబడ్డాయి.

నాటి రాజాస్థానాల జీవన విధానం ఎంత భోగ ప్రధానమైందో తక్కిన అన్ని ప్రక్రియలు సూచించినట్లే యక్షగానాలు సూచిస్తాయి. వీటితో పోటీపడే మరో ప్రక్రియ పదకవిత. భక్తిప్రధానమైన పదకవితలో శృంగారం అవసరానికిమించే ఉందనడంలో సందేహమేమీలేదు. కొందరు కేవలం శృంగార పదాలే రచించారు.

రాజకీయ సామాజిక వ్యవస్థలు రెండింటిచేత నిరాశానిస్పృహలకు లోనైన కవులు ఆ రెండింటినీ నిరసిస్తూ ఈ కాలంలో కవిత్వం చెప్పారు. 17, 18వ శతాబ్దాలలో ఆంధ్రదేశంలోనూ, దక్షిణంలోనూ ఉన్న రాజకీయ సామాజిక వ్యవస్థ చాలావరకు ఒకలాంటిదే. అంతటా చిన్న చిన్న రాజ్యాలే ఉన్నాయి. రాజులు, సంస్థానాధిపతులు బలహీనులు. 18వ శతాబ్దం వచ్చేటప్పటికి విదేశీయుల మీద ఆధారపడి సంస్థానాలు నిలబెట్టుకోవలసిన స్థితిలోఉన్న సంస్థానాధీశులు, సాహిత్య పోషణచేసే తీరికనీ, ఓపికనీ పోగొట్టుకున్నారు. రాజకీయ అస్థిరతవల్ల సమాజంలో వర్ణ వ్యవస్థలో కొంత సడలింపు వచ్చింది. చిన్న కులాలవాళ్ళు అంతకు పూర్వంలాగా వంశపారం పర్యమైన వృత్తుల్నే అవలంబించాల్సిన అవసరం లేకపోయింది. ముఖ్యంగా బ్రాహ్మణాధిక్యం దెబ్బతిన్నది. అంతవరకూ పొందుతూ ఉండిన ప్రాధాన్యత తొలగిపోవడం, జీవనాధారానికి ఒక ప్రత్యేకవృత్తి లేకపోవడం, విపరీతమైన పేదరికం కవుల్లో నిరాశా నిస్పృహలకు కారణమైంది. తమ దుస్థితికి కారణమైన అసమర్థులైన రాజుల్నీ, తాము భ్రష్టమైందనుకుంటున్న సమాజాన్ని తిట్టసాగారు. అట్లా వచ్చిన దూషణ రచనలు దేశమంతటా వచ్చాయి. దక్షిణదేశంలో వచ్చిన రచనల్లో కవిచౌడప్ప శతకం, మధురమంగా పుంశ్చలీ విలాసమనే వికటకవి గోపాలయ్య వచన రచనా ఉన్నాయి.

తమకు ఆశ్రయమివ్వని రాజును అన్ని రకాలుగా తిట్టి పోయడం సాధారణ లక్షణంగా కనిపిస్తుంది. అదే రాణి అయితే తిట్టే పద్ధతిలోని మార్పు 'మధురమంగా పుంశ్చలీ విలాసం'లో కనిపిస్తుంది.

మహారాష్ట్రి రాజైన ప్రతాప సింహుణ్ణి దారిలో పెట్టడానికి "కుట్టికవి వాంఛేశ్వరుడు "మహిష శతకం" అనే శ్లేషరచన చెప్పాడు. దున్నపోతు లాంటి వాడు రాజయ్యాడనీ, దున్నపోతుల్లాంటి రాజోద్యోగులు చెలరేగారని తిట్టి పోశాడు. కవి చౌడప్ప కూడా అధికారులను, కరణాలనూ తిట్టాడు. కవి చౌడప్ప దక్షిణాంధ్ర యుగంలోని కవిత్వాన్నిలా సమీక్షించాడు -

పది సీతులు, పది బూతులు,
పది శృంగారములు గల్గుపద్యములు, సభం

జదివినవాడే యధికుడు
గదరప్పా కుందవరపు కవిచౌడప్పా !

యాచకులకు దానం చెయ్యనివారిని తిట్టిపోశాడు —

బందగులాములు యాచక
తండంబునకివ్వలేరు తముదండించే
మిండలకిత్తురు, ధగిడీ
గండలు, మఱి కుందవరపు కవిచౌడప్పా !

అయ్యా, ఇప్పించంగల,
యయ్యలకేగాని మీసమన్యులకేలా ?
రొయ్యకులేవా బారెడు
కయ్యానికి కుందవరపు కవిచౌడప్పా !

శ్లేషచిత్ర కావ్యాలు అంతటా వచ్చాయి కేవలం పాండిత్య ప్రకర్షా సూచకాలయిన చిత్ర కావ్యరచనకూడా ఈకాలంలో విస్తృతంగానే జరిగింది. ప్రాచీన కివుల్లో బంధ చిత్ర కవిత్వాలున్నాయి కాని అవి మహా కావ్యంలో ఎక్కడో ఒక చోట ప్రత్యేక సందర్భాన్ని పురస్కరించు కొని మాత్రమే కనిపిస్తాయి. 16 వ శతాబ్దంలో పింగళి సూరన, రామరాజ భూషణుడు ద్వ్యర్థి కావ్యాలు వ్రాశారు. 16 వ శతాబ్దం తర్వాత ఆంధ్రదేశంలో కేవలం ద్వ్యర్థికావ్యాలే కాక త్ర్యర్థి కావాలు, చతురర్థిక కావ్యాలు కూడా వచ్చాయి.

గణపవరపు వెంకటకవి "ప్రబంధరాజ వెంకటేశ్వర విజయ విలాసము" చిత్ర, బంధ, గర్భ కవిత్వాలకు లక్ష్యగ్రంథం. ఒక సీసపద్యంలో 80 రకాల పద్యాలని మిడ్చి చెప్పడం లాంటి ప్రక్రియని సర్కస్ ఫీట్లలో తలమానికమని చెప్పవచ్చు. అందులోను సంస్కృత శ్లోకాలని, ఏలలు, దరువులు, రేకులు మొదలైన తెలుగు ఛందస్సుల్ని, భాషా శ్లేషకంద పద్యాన్ని, 20 రకాల బంధాలున్న కంద పద్యాన్ని ఇమిడ్చి చెప్పటం ఎటువంటి ఫీటో పాఠకులు ఊహించవచ్చు. అమితాశువు, మధుర, చిత్ర, విస్తరములనే చతుర్విధ కవితలను రచింపగలనని ఈ కవి చెప్పుకున్నాడు. ఈ విధమైన కవిత్వానికి ఆదరణం లభించిందన

డానికి నాటి ప్రబంధ కవుల మాటల్ని ఉదాహరించవచ్చు. తారాశశాంకకర్త ''చిత్ర విస్తర మధురాశు లీలకవితల్ రచియింపగ నేర్చే'' అని, ముద్దుపళని ''ఆశుకవిత్వంబు లల్లితేనే సరా చిత్ర ప్రబంధముల్ చెప్పవలదె'' అని, శాహజీ "సకలభూషిత సకలార్థ సంభరిత విద్వద్భ్రమర చాతురీ, సుధాప్రద త్యాగ వినోదచిత్ర ప్రబంధము సంపూర్ణము'' అని చెప్పారు. కృష్ణాధ్వరి, కాళకవి మొదలైన వాళ్ళు ఈ విధమైన కవిత్వం వ్రాసినవాళ్ళే.

మొత్తం దక్షిణాంధ్ర యుగ లక్షణాలను ఈ విధంగా సమీక్షించుకోవచ్చు—

సామ్రాజ్యాలు పతనమై చిన్న చిన్న రాజ్యాలు, సంస్థానాలు ఏర్పడ్డాయి. గందరగోళంగా ఉన్న రాజకీయ అస్తవ్యస్త పరిస్థితిలో ఆర్థిక వ్యవస్థ కుంటుపడింది. విదేశీయుల ప్రవేశంతో విదేశీ పెట్టుబడి ప్రవేశించి, క్రైస్తవ మతం క్రమ క్రమంగా విస్తరించు కుంది. నాయక రాజులు పాతవర్ణ వ్యవస్థను అంగీకరించి నిలబెట్టే ప్రయత్నం చేసినా పాత విలువలు మారడం ప్రారంభించాయి. భూస్వామ్య వ్యవస్థ పతనం వైపు పురోగమించింది. అనేక వందల సంవత్సరాలుగా చెప్పుకోదగిన పరిణామం లేని రాజకీయ, సామాజిక, ఆర్థిక వ్యవస్థ మార్పుపొందసాగింది. తమిళ,కన్నడ దేశాలలో వచ్చిన తెలుగుసాహిత్యం,కన్నడ, తమిళ సాహిత్యాలతో ఎంతవరకు ప్రభావితమైంది అంటే, స్పష్టమైన సమాధానం చెప్పడం కష్టమే. పాపులర్ సాహిత్య ప్రక్రియలు యక్షగానం, పదకవిత్వం, వచన కావ్యం. వీటి విషయంలో మాత్రం కొంత ప్రభావం ఉందనక తప్పదు. భక్తులు చాలా మంది రచనలు చేసినా వారి భక్తి సాహిత్యం దేశంలోని ఇతర ప్రాంతాలలో వచ్చినటువంటిది కాదు.కుల,లింగ భేదాల నిరాకరణ ప్రాచీన తెలుగు కవుల్లో పాల్కురికి సోమనాథుడిలో కనిపించినా ఈనాటి కవిత్వంలో అది కనిపించదు. కొంతమంది అబ్రాహ్మణ కవులు వచ్చారు. కానివారి సంఖ్య సోదర భాషలైన తమిళ, కన్నడాలతో పోలిస్తే చాలా అల్పమే. పైగా క్రైస్తవ, మహమ్మదీయ కవులు ఈ భాషల్లో కనిపిస్తారు. తెలుగులో ఒకటి అరాకంటె కనిపించరు. స్త్రీలు చాలామంది కవిత్వం చెప్పారు. లలిత కళలు నేర్చుకోవడంలో వేశ్యలకు, రాజకుటుంబాల

లోని స్త్రీలకు మాత్రమే ఎక్కువ అవకాశం ఉండేది. ఆట పాటలు తెలిసిన వేశ్యలకు కనకాభిషేకాలు జరిగాయి. రాజాస్థానాల్లో గౌరవాలు పొందిన ఈ స్త్రీలు ఏ విధంగానూ ఉత్తర దేశపు భక్తురాండ్రతో పోలరు ఉత్తరదేశంలో స్త్రీ పురుష భేదం లేదన్న వాళ్ళ అభిప్రాయం స్త్రీకి పురుషునితో సమంగా సమాజంలో స్థానాన్నివ్వడానికి చేసిన ప్రయత్నంలో భాగంగా కనిపిస్తుంది. కాని దక్షిణాంధ్రయుగ తెలుగు రచయిత్రులు మాత్రం రాజులభోగవస్తువులుగా మాత్రమే గోచరిస్తారు. ఆర్థిక సామాజిక రంగాల్లో ఎంతో మార్పు వచ్చినా రాజాస్థానాలను అంటిపెట్టుకుని ఉన్న కవులలో ఆ మార్పులు ప్రతిబింబించవు తక్కిన కవులు పూర్తిగా వ్యక్తులు. సమాజంతో సంబంధంకంటె దేవుడిపై భక్తి భావమే వీళ్ళలో ఎక్కువ. అందువల్ల సమకాలీన సమాజం మొత్తాన్ని ఈ సాహిత్యంలో దర్శిద్దామంటే కుదరనిపని. అందుకే ఆ కాలపు పరిస్థితుల ప్రభావం సాహిత్యంపై ఎంత ఉందో ఆ కొంతనే, చూపించడానికి వీలుంటుంది.

వ్యావహారిక భాషను విస్తృతంగా వాడడం, పాపులర్ సాహిత్యంగా యక్షగానాలు, వచన గ్రంథాలు రావడం ఆధునిక సాహిత్య లక్షణాలఛాయలు దక్షిణాంధ్ర యుగంలోనే పడ్డాయనడానికి నిదర్శనం.

## ఆధార గ్రంథాలు


1. Antonova, K, Bongard-Levin, G, Kotovsky G. 1979. History of India-2 Parts, Moscow.
2. Salatore. 1934. Social and Political life in the Vijayanagara Empire. 2 Volumes, Madras.
3. Satyanarayana Iyer. History of the Nayakas of Madhura. Madras.
4. Sreenivasan, M.N. 1972. Social Change in Modern India. New Delhi.
5. Vridhagirisan. The Nayakas of Tanjore. Madras.
6. తెలుగు భాషా సమితి. విజ్ఞాన సర్వస్వము. 3, 4 సంపుటాలు. ఇతర తెలుగు సాహిత్య చరిత్ర గ్రంథాలు, కన్నడ, తమిళ సాహిత్య గ్రంథాలు, దక్షిణాంధ్ర వాఙ్మయయుగం నాటి రచనలు.

# తెలుగు శతకాలు (క్రీ. శ. 1700-1850)
# రాజకీయ సామాజిక భూమిక

-డి. చంద్రశేఖరరెడ్డి

భారతదేశ చరిత్రలో 18వ శతాబ్దం చాలా ముఖ్యమైంది. కొన్ని శతాబ్దాలుగా మారకుండా స్థిరపడిన రాజకీయ సామాజిక వ్యవస్థ ఈ శతాబ్దంలో విప్లవాత్మకమైన మార్పును పొందింది. 1707 లో ఔరంగజేబు మరణించాడు. ఢిల్లీ సింహాసనం కోసం వారసుల మధ్య పోరాటం సాగింది. బహదూర్ షా సింహాసన మెక్కాడు. సయ్యదు సోదరుల కుతంత్రాలవల్ల వెంట వెంటనే రాజులు మారారు. ఈ మొగలాయీ చక్రవర్తులు పర్షియన్, ఆఫ్ఘన్ దండయాత్రలను ఎడతెరిపి లేకుండా ఎదుర్కోవలసి వచ్చింది. మొదట పర్షియన్ చక్రవర్తి నాదిర్‌షా, ఆ తర్వాత ఆఫ్ఘాన్‌షా అహ్మద్‌షా అబ్దాలీ దండెత్తి వచ్చారు. అబ్దాలీ 1750-60 మధ్య ఢిల్లీపైకి 5 సార్లు దండెత్తి వచ్చాడు. బందబహదూర్ నాయకత్వంలో సిక్కులు తిరుగుబాటు చేశారు. మధ్య భారతంలో అధిక భాగాన్ని అప్పటికే మహారాష్ట్రు లాక్రమించు కున్నారు. పీష్వా బాజీరావు ఢిల్లీని ఆక్రమించుకుంటే మొత్తం భారతదేశం మహారాష్ట్రుల అధికారంలోకి వస్తుందని భావించి ఢిల్లీపైకి దృష్టి సారించాడు. ఈ ప్రయత్నంలో ఢిల్లీ మీదికి దండెత్తి వచ్చిన అహ్మద్‌షా అబ్దాలీతో 1761 లో పానిపట్టువద్ద జరిగిన యుద్ధంలో మహారాష్ట్రులు చిత్తుగా ఓడిపోయారు.

ఢిల్లీ సుల్తాను ప్రతినిధిగా హైదరాబాదులో పరిపాలన సాగిస్తున్న నిజాముల్‌ముల్క్ తిరగబడి స్వతంత్రుడయ్యాడు. 17వ శతాబ్దం ప్రారంభం నాటికే సామంత రాజుల దయాధర్మాల మీద నిలబడ్డ విజయనగర సామ్రాజ్యం 1742 నాటికి పతన మయింది. 1687 నాటికి గోల్కొండ కుతుబ్షాహీలు పడిపోయారు. అంతకుముందే తంజావూరు నాయక రాజ్యం అంతరించింది. 1789 కి మధుర నాయక రాజ్యం కూడా అదృశ్య మయింది. తంజావూరులో మహా

రాష్ట్రాలు, ఆర్కాటులో నవాబులు, మైసూరులో ఒడయార్లు, ఆంధ్ర దేశంలో నిజాములు పరిపాలిస్తున్నారు. కాని వీటిలో ఏ ఒక్క రాజ్యమూ స్థిరంగా లేదు. అన్నిచోట్లా వారసత్వ వివాదాలు తలయెత్తాయి సామంతరాజులు, పాలెగాళ్ళు స్వతంత్రత వహించారు.

17వ శతాబ్దం ప్రారంభంలోనే యూరోపియను వర్తకుల ముఠాలు దేశంలో అడుగుపెట్టాయి. తమ తమ ప్రభుత్వాల మద్దతుతో ఈ వర్తక సంఘాలు త్వరిత గతిని వ్యాపించాయి. బ్రిటీషు ఈస్టు ఇండియా కంపెనీ బ్రిటీషు ప్రభుత్వం నుంచి అనేక అధికారాల్ని పొందింది. 1657,61 ఛార్టర్లు ఈస్టిండియా కంపెనీ యుద్ధం ప్రకటించడానికీ, శాంతి ఒడంబడికలు చేసుకోవడానికీ అధికారమిస్తే, 1686 ఛార్టర్ సొంతంగా నాణాలు ముద్రించుకోడానికి, న్యాయ విచారణ జరపడానికి, సొంత సైన్యాన్ని కలిగి ఉండడానికి బ్రిటీషు ప్రభుత్వం అధికారమిచ్చింది. మొగల్ చక్రవర్తులు, బెంగాల్ నవాబులు తదితరులు తమ అవసరాలకు కంపెనీ వనరుల్ని ఉపయోగించుకున్నారు. దానికి ప్రతిఫలంగా కంపెనీకి రాయితీలు ఇవ్వాల్సి వచ్చింది. చాలా వేగంగా పెరుగుతూన్న కంపెనీ ప్రభావాన్ని తగ్గించడానికి ఢిల్లీ సుల్తానులు, బెంగాల్ నవాబులు చేసిన ప్రయత్నాలు ఘోరంగా విఫలమయ్యాయి. కంపెనీవాళ్లు మద్రాసులో సెయింట్ జార్జి కోటను, కలకత్తాలో ఫోర్ట్ విలియమ్ కోటను కట్టుకున్నారు. కలకత్తా చుట్టుపక్కల మూడు గ్రామాలకు కంపెనీని జమీందారుగా గుర్తించవలసి వచ్చింది. 1717 లో ఫారూక్ షియర్ కంపెనీకి మరో 38 గ్రామాలను ఇచ్చాడు. కంపెనీ ఏడాదికి 3,000 రూ॥లు మొగల్ ఖజానాకి చెల్లించే షరతుమీద వారి సరకుల మీద కస్టమ్స్ సుంకం రద్దు చేయబడింది. కంపెనీ ఆదాయం, ఆదాయంతోపాటు అధికారం విపరీతంగా పెరగసాగింది.

అయినా భారత దేశంలో వలసరాజ్యం స్థాపించుకోడానికి మొదట ప్రయత్నించింది ఇంగ్లీషువాళ్ళు కాదు; ఫ్రెంచివాళ్ళు. స్వదేశీరాజుల వారసత్వ వివాదాల్లో తలదూర్చి వలస రాజ్యస్థాపనకు ప్రయత్నించారు. తమకు ప్రత్యర్థులుగా ఉన్న ఇంగ్లీషు వాళ్ళను తరిమివెయ్యడానికి మద్రాసులోని సెయింట్ జార్జి కోటను పట్టుకున్నారు కూడా. కాని ఫ్రెంచి కంపెనీ అధికారులు, సైన్యాధికారుల మధ్య పరస్పర స్పర్థ కారణంగా ఫ్రెంచివాళ్ళు ప్రారంభంలో సాధించిన

విజయాలను తొందరలోనే కోల్పోయారు. వాళ్ళు మొదట జోక్యం కల్పించు కున్న రాజ్యవివాదాలు రెండు. ఒకటి హైదరాబాదు, రెండు ఆర్కాటు. హైదరాబాదులో తమ అనుకూలుణ్ణి సింహాసనం మీద కూర్చోబెట్ట గలిగారు. ఆర్కాటు సింహాసనం కోసం ఫ్రెంచివాళ్ళు సమర్థించిన చందాసాహెబ్ మధ్య లోనే చనిపోవడంతో initiative కోల్పోయారు. మద్రాసులో ఇంగ్లీషు వాళ్ళతో పోరాటానికి హైదరాబాదులో ఉన్న బుస్సీని సహాయంగా పిలుచు కోవడంతో హైద్రాబాదు నవాబు ఇంగ్లీషు వాళ్ళ పక్షంలో చేరిపోయాడు. యూరపులో ఇంగ్లాండు, ఫ్రాన్స్‌ల మధ్య జరిగిన యుద్ధాలు, ఒడంబడికలు వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకోవడంలో వెనకబడటం, ఫ్రెంచి అధికారుల మధ్య వైరుధ్యాలు ఇవన్నీ ఫ్రెంచివారి పతనానికి కారణాలయ్యాయి. తమ వైఫల్యానికి Scapegoats గా డూప్లేని, లా బోర్డొనే ని ఫ్రెంచి ప్రభుత్వం శిక్షించింది.

1757 లో బెంగాల్ బ్రిటిషువాళ్ళ అధీనం అయింది. 1759 కి హైదరాబాదు నవాబు ఇంగ్లీషువాళ్ళ చేతిలోకి వచ్చారు. 1766 లో హైదరాబాదు నిజాం గుంటూరు, కొండవీడు, ఏలూరు, రాజమండ్రి, శ్రీకాకుళం పరగణాలను ఇంగ్లీషు వారికి కౌలు కిచ్చాడు. నిజాంకు అవసరమైనప్పుడు సహాయంగా కంపెనీ వారు సైన్యాలను పంపించేటట్లూ, అటువంటి అవసరం రాని సంవత్స రాలలో ఏడాదికి 9 లక్షల రూపాయలు కౌలు పైకంగా చెల్లించేటట్లూ ఒడంబడిక జరిగింది. మచిలీ పట్నంలోని కంపెనీవారి దుబాసీ కాంద్రేగుల జోగి పంతులు ఈ ఒడంబడికను కుదిర్చాడు.

18 వ శతాబ్దం చివరికి బ్రిటిషు ఈస్టిండియా కంపెనీ కొత్త భూభాగా లను ఆక్రమించుకునే కార్యక్రమాన్ని కొంత నిలిపి, ఆక్రమించుకున్న ప్రాంతంలో అధికారాన్ని స్థిరం చేసుకునే ప్రయత్నాన్ని ప్రారంభించింది. స్వతంత్ర రాజ్యాలమీద తమ ప్రభావాన్ని పెంచుకోవడానికి ప్రయత్నం మొదలు పెట్టింది. తమతో సంబంధాలు పెట్టుకునే (అంటే తమ రక్షణను, సహాయాన్ని ఆశించే) స్వతంత్ర రాజ్యాలతో ఒడంబడికలు చేసుకుంది. ఈ ఒడంబడికల వల్ల ఆ రాజ్యాలు విదేశీ వ్యవహారాల్లో అంతటా కంపెనీ ద్వారానే వ్యవహరించవలసి ఉంటుంది. ముఖ్యంగా ఫ్రెంచి జాతీయులకు ఉద్యోగాలివ్వడం గాని, వారితో వ్యాపారం చేయడం కాని చేయకూడదు. కంపెనీ సహాయంగా

పంపే సైన్యాల ఖర్చును ఆ రాజ్యాలే భరించాలి. అవసరమైతే ఆ సైన్యాలు స్వయంగా పన్నులు వసూలు చేసుకునే హక్కును కలిగిఉంటాయి. స్వదేశీ రాజ్యాలకు కంపెనీ సైన్యాల అవసరం ఎల్లప్పుడూ ఉంటుంది కాబట్టి వాటిని భరించే సాధనం లేక కంపెనీకి కొత్త భూభాగాలను దఖలు పరచుకోవలసి రావడం సహజ పరిణామమే. స్వదేశీ రాజ్యాలు క్రమక్రమంగా అప్పుల పాలై, ఆర్థికంగా చితికిపోయింతర్వాత 'దుష్పరిపాలన' అన్న నెపంతో కంపెనీ వాటిని లాగివేసుకుంది.

ఈ విధంగా కంపెనీ స్వాధీనపరచుకున్న భూభాగాలనీ, కౌలుకు తీసుకున్న భూభాగాలనీ తమ స్నేహితులకు మళ్ళీ కౌలు కిచ్చింది. ఇట్లా కౌలుకు తీసుకున్నవాళ్ళలో ఇంగ్లీషువాళ్ళకూ, నిజాముకూ ఒప్పందం కుదిర్చిన జోగి పంతులు కూడా ఉన్నాడు. ఈ పద్ధతి 1769లో రద్దయి వేలంవేసే పద్ధతి ప్రారంభమయింది. ఈ వేలం మూడేళ్ళ కొకసారి జరిగేది.

1802లో శాశ్వత కర నిర్ణయ పద్ధతి (Permanant Revenue Settlement) వచ్చింది. సంవత్సరానికి ఇంత అని ఒక్కొక్క సంస్థానం కట్టవలసిన పేష్కుము నిర్ణయించబడింది. సంస్థానాధీశుల సైన్యాలను Disband చేశారు. పాత జమీందారుల జమీందారీలను ఖాయం చేశారు. పడమటి సంస్థానాలలో అమరకం పద్ధతిని రద్దుచేసి సైనిక దళాలను తొలగించేశారు. దాంతో అవి కూడా ఉత్తర సర్కారుల్లోని జమీందారీల స్థాయికి వచ్చాయి. ఈ పాలెగాళ్ల అంతకుముందు సైన్యపోషణకోసం ఖర్చుపెడుతూ ఉండిన డబ్బును కూడా లెక్క గట్టి కంపెనీకి చెల్లించే ఏర్పాటు చేశారు. తెలంగాణాలోని సంస్థానాలు మాత్రం పూర్వంలాగే నిజాంకు కప్పంకట్టే అధీన రాజ్యాలుగా ఉండిపోయాయి.

రాజకీయ పరిస్థితులిట్లాఉంటే ఆర్థిక పరిస్థితులెట్లా ఉన్నాయో చూద్దాం. అనేక శతాబ్దాలుగా (దాదాపు 6వ శతాబ్దం నుంచి కావచ్చు) పరిణామరహితం (Stagnant) గా ఉన్న భారతదేశ ఆర్థిక వ్యవస్థలో కూడా విశేషమైన మార్పులు సంభవించాయి. మనది స్వయం సమృద్ధమైన గ్రామీణ వ్యవస్థ. ఈ వ్యవస్థకు రైతు వెన్నెముక. గ్రామ ప్రజలకు కావలసిన అన్ని ముడి పదార్థాలను రైతే ఉత్పత్తి చేస్తాడు. కమ్మరి, కుమ్మరి, సాలె మొదలైన వృత్తి పనుల

వాళ్ళు అవసరమైన సాధనాలను తయారు చేస్తారు. ఏ వస్తువు కోసమూ గ్రామస్తుడు మరో గ్రామానికిగాని, పట్టణానికిగాని పోవలసిన అవసరం లేదు. అధిక జనాభా ఉన్న కొన్ని పట్టణాలు ఉండేవి. ఈ పట్టణాల ప్రజలు ఆహార ధాన్యాలు మొ॥ అన్నింటి విషయంలోనూ గ్రామాల మీదే ఆధారపడి ఉంటారు. రైతుకు తన సరుకులు అమ్ముకోవడానికి తన గ్రామం (Local) కాక ఉన్న మరో అవకాశం దగ్గరలో ఉన్న పట్టణం. పట్టణ ప్రజల కొనుగోలు శక్తి రైతులు చెల్లించే పన్నుల మీద ఆధారపడి ఉంటుంది. రైతులు కట్టే పన్నులు పట్టణ ప్రజలకు, వాళ్ళు వస్తువులను కొనుక్కోవడం ద్వారా అది మళ్ళీ రైతులకూ తిరుగుతూ ఉండేది. రైతు తన ఉత్పత్తులపై ధర పెంచితే Balancingగా పన్నులు కూడా పెరిగేవి

17 వ శతాబ్దంలో ఈ పరిస్థితి కొంత మారింది. ఉదాహరణకు 1630-32లో క్షామం తర్వాత ధాన్యం ధరలు విపరీతంగా పెరిగిపోవడంవల్ల గుజరాతులోని రైతులు పత్తి పంటను మానివేసి ఆహార పంటలే వేశారు. దీనివల్ల గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో Balance దెబ్బతిన్నది. యూరోపియన్ వాణిజ్య సంస్థల ప్రవేశంవల్ల ఇది మరింత ఎక్కువయింది. ఇంతకుముందు దేశంలోని పట్టణాలు మాత్రమే మనకు వాణిజ్య కేంద్రాలు కాగా ఇప్పుడు విదేశాల్లోని పట్టణాలు కూడా కేంద్రాలయ్యాయి. మొదట్లో ఇంగ్లీషువాళ్లు బెంగాల్‌లో బట్టలు నేయించి తమ దేశంలో అమ్మి డబ్బు చేసుకున్నారు. తర్వాత ఇక్కడ నూలు కొని తమ దేశంలో నేయించి మన దగ్గర అమ్మడం మొదలుపెట్టారు. మన ముడిసరుకులను కొని తయారయిన వస్తువులను మనకు అమ్మడంతో మన దేశంలోని వృత్తికారుల వృత్తులు దెబ్బతిన్నాయి. మనం పెట్టుబడిదారీ సమాజంలో అడుగుపెట్టాం. ద్రవ్య సంబంధాలు పెరిగాయి.

మొదట ఆంగ్లేయులు స్వదేశీ సంస్థానాధిపతులను జయించిన సందర్భంలో వీలైనంతవరకు దోచుకున్నారు. దోచుకున్న సంపదను స్వదేశానికి తరలించారు. ఇది అంతకుపూర్వానికీ అప్పటికీ ఉన్న మరోభేదం. ముస్లిములు దేశాన్ని జయించినా ఇక్కడ స్థిరపడిపోయారు కాబట్టి సంపద దేశంలోనే ఉంది. ఇంగ్లీషు వాళ్ళు ఇక్కడినుంచి సంపదను స్వదేశానికి చేరవేయడంవల్ల దేశం మరింత క్షీణించింది. ఇది మొదటి దశ. రెండోదశలో తమ అధికారం స్థిరపడిం

తర్వాత పన్నులద్వారా సాధ్యమైనంత ధనాన్ని సేకరించి తరలించారు. ఇంతకు పూర్వం పన్నులద్వారా రైతులు చెల్లించిన ధనం, ఉత్పత్తుల అమ్మకంద్వారా తిరిగి రైతుకు చేరేది. ఇప్పుడు అది తగ్గిపోయింది. శాశ్వతకర నిర్ణయం (Permanant Revenue Settlement) వల్ల పన్నులు స్థిరంగా నిర్ణయించడం జరిగింది. అంతకుముందు పన్నుల విధానం సమయానుకూలం (Flexible)గా ఉండేది. ఎందుకంటే రైతుల ఆదాయం స్థిరంకాదు కాబట్టి. అతివృష్టి, అనావృష్టి వంటి ప్రకృతి బీభత్సాలూ, అప్పుడప్పుడూ ధరలు పడిపోవటాలూ సర్వ సాధారణం కాబట్టి చాలాసార్లు పన్నుమినహాయింపు (Tax exemption) ఇవ్వవలసి వచ్చేది. ఇప్పుడు కొత్తగా ప్రవేశపెట్టిన పన్నుల విధానం వల్ల పూర్వపు భూస్వామ్య వ్యవస్థలో కంటే రైతుల పరిస్థితి ఘోరంగా పరిణమించింది. దేశంలోని పెద్ద వ్యాపారులు దళారులు, ఏజెంట్లు అయ్యారు.

ఇక మన సంస్థానాలూ, సంస్థానాధిపతుల సంగతి ఏమిటి ? కంపెనీ ప్రభుత్వం సంస్థానాధిపతుల సైన్యాలను తొలగించేటప్పటికి మన సంస్థానాధీశులు కోరలు పీకిన పాములయ్యారు. 1794 పద్మనాభ యుద్ధం తర్వాత అప్పటివరకూ చాలా బలంగా ఉండిన విజయనగర సంస్థానం కూడా కూలబడింది. కంపెనీ విధించిన పేష్కుష కట్టలేక అప్పులపాలయిన సంస్థానాలెన్నో. పైగా ఈ సంస్థానాలు అప్పుచేసింది ఇంగ్లీషు, ముస్లిము అధికారులవద్ద, బాకీలు పెరిగి సమయానికి అప్పుతీర్చలేని పరిస్థితివస్తే ఈ అధికారులు (గ్రామాల) సంస్థానాల మీదపడి దోచుకున్నారు. ఈ పరిస్థితిని భరించలేక అప్పుడప్పుడూ కొన్ని సంస్థానాలు మొదట్లో తిరగబడ్డాయి. కాని శత్రువుల బలాధిక్యత (Superior Military force) ముందు నిలబడలేక పోయాయి. వంశపారంపర్యంగా సంస్థానాధీశులయినవారు కొందరైతే, సంస్థానాలను కౌలుకు తీసుకున్నవాళ్ళు మరికొందరు. కొంచెం డబ్బుఉంటే సంస్థానాధిపతి కావడానికి క్షణం పట్టదు. సంస్థానాధిపతులు కంపెనీవారికి పన్ను వసూలుచేసిపెట్టే రెవిన్యూ ఆఫీసర్ల స్థాయికి వచ్చారు.

కంపెనీకి చెల్లించే పేష్కుషలో ఎటువంటి లోపమూ రావడానికి వీల్లేదు. కాబట్టి సంస్థానాధిపతులు దయాకరహితంగా పన్నులు వసూలు చేశారు. అగ్రహా

రాదులకు అంతకుముందున్న పరిహారాలు పొయ్యాయి. పన్నులు సరిగా కట్టకపోతే అగ్రహారాలు లాక్కున్నారు. డబ్బుకు సంబంధించిన లావాదేవీలతోనే తీరికదొరకని సంస్థానాధిపతులు వారసత్వ వివాదాలతో కోర్టులచుట్టూ తిరుగవలసి రావడంతో మరింత ఇబ్బందుల్లో పడ్డారు. అంతకుముందు బలప్రయోగం ద్వారా ఈ వారసత్వవివాదాలు తేలిగ్గా తేలిపోయేవి. ఇప్పుడు కోర్టుల్లో సంవత్సరాల తరబడి వ్యాజ్యాలు సాగడం, వకీళ్ళ ఫీజులకే సంస్థానం ఆదాయం చాలక పోవడాలతో కవులు, పండితులు, బ్రాహ్మణులు, అగ్రహారాలు, దేవాలయాలు వీటి సంగతి పట్టించుకొనే నాథుడు లేకపోయాడు. పైగా జమీందారీలను కౌలుకు తీసుకోవడం డబ్బు సంపాదనకే అయితే వీటికి డబ్బెవడు ధారపోస్తాడు? ఎక్కడన్నా ఒక దాత ఉంటే వాడి దృష్టిని మరల్చడానికి సవాలక్షమంది అధికారులు.

ఈ పరిస్థితుల్లో వచ్చిన శతక సాహిత్యం ఎటువంటిది ? శతకం నిర్మాణ వర్ణన (Structural description) ఇవ్వడం ఇక్కడ అనవసరం. తెలుగులో శతకం ప్రారంభం కావడానికి పూర్వమే ఇరుగుపొరుగు భాషల్లో శతకాలున్నాయి. తెలుగు సాహిత్యంలో బలమైన ఆత్మాభివ్యక్తి సాధనంగా శతకం తయారయిందని మాత్రం చెప్పక తప్పదు. పైన చెప్పిన పరిస్థితుల్లో అనేక బాధలకు గురయిన కవులు శతకాల్లో తమ బాధల్ని వెళ్ళబోసుకున్నారు. ఆ బాధలకు కారణమైన వ్యక్తుల్ని వ్యవస్థనూ ఇష్టంవచ్చినట్లు తిట్టిపోశారు. ఈ కాలంలో వచ్చిన శతక సాహిత్యంలో రెండు స్పష్టమైన ధోరణులు కన్పిస్తాయి. ఒకటి వ్యవస్థ, వ్యక్తులు కారణంగా బాధపడి నిరాశానిస్పృహలకు లోనైన కవుల ధోరణి. రెండు గతానుగతికంగా పాత పద్ధతిలో సాగిన రచనా ధోరణి.

మొదటి పద్ధతిలో వచ్చిన రచనలు కవుల్లోని అసంతృప్తిని ప్రతిబింబిస్తాయి. ఈ అసంతృప్తి ఒక క్రమపద్ధతికి చెందిన ఉద్యమరూపాన్ని ధరించలేదు. వ్యక్తి అసంతృప్తిగానే మిగిలిపోయింది. క్రమబద్ధమూ, సుసంఘటితమూ కాకపోవడాన ఇది ఏమీ సాధించలేకపోయింది. ఈ అసంతృప్తికి, నిరాశా నిస్పృహలకు కారణమైన వ్యక్తుల్నీ, వ్యవస్థలో వచ్చిన మార్పుల్నీ

మాత్రమే ఈ కవులు దూషించారు తప్ప వాటికి మూలమైన హేతువుల్ని విచారించడానిక్కానీ, పరిష్కారాన్ని సూచించడానిక్కానీ ప్రయత్నించలేదు.

ఆనాడు కోస్తాజిల్లాల్లోనూ, రాయలసీమలోనూ ఉన్న సంస్థానాధీశుల పరిస్థితిని ఇంతకుముందే చూశాం. రాజకీయంగా అస్వతంత్రులూ, రక్షణ పరంగా అసమర్థులూ, ఆర్థికంగా దివాలాకోరులూఅయి కేవలం సుంకర్ల స్థాయికి చేరుకొన్న ఈ సంస్థానాధిపతులు ఏవిధంగానూ ప్రజల క్షేమాన్ని చూడడానికి పనికి రాని వాళ్ళయ్యారు. పన్నుల విషయంలో, అగ్రహారాల విషయంలో, అగ్రవర్ణాల విషయంలో అంతకుముందుండిన రాయితీలు రద్దయ్యాయి. వాటిని కాపాడలేకపోయినందుకు కవులు సంస్థానాధీశ్వరుల్ని ఎన్ని తిట్టాలో అన్ని తిట్టారు.

కట్టవలసిన పన్ను కట్టలేకపోవడంచేత దివానుల సలహామీద తన అగ్రహారాన్ని లాక్కున్న వేంకటగిరి సంస్థానాధీశుడు గోపాలకృష్ణ యాచేంద్రుణ్ణి శార్దూలాకారంతో వచ్చి చంపమని యముణ్ణి ప్రార్థిస్తూ వికృరాల రంగాదార్యులు శార్దూల శతకం చెప్పాడు.

కాలా! కంఠగతాసువున్ చన హతుంగావింపవే రాజగో
పాలున్ వేంకటగిర్యధీశ్వరుని విప్రక్షేత్రబాధాకరున్
శూలి ద్రవ్యహరున్ సమాదృత మహాశుంఠాప్త వేగంబ శా
ర్దూలాకారము దాల్చి సాధుజన సంతోషమ్ము వర్ధిల్లగన్.

ఏమయ్యా! ఇట్లాగేనా తిట్టేది అని అడుగుతారేమోనని ఈ విధంగా సమాధానం కూడా చెప్పాడు-

ఏ నీ రాజును దిట్టినాననుచు నన్నెగ్గెంచియుః బల్కకం
డో నిష్ఠా గరిష్ఠులార! వీడు మహిపై నున్నంత కాలంబు నే
మైనన్ విప్రుల బాధ తీరదు గదా!.........

ఆవిధం సూరకవి రాజును గంగిరెద్దుతో పోల్చాడు రామలింగేశ శతకంలో-

కడు వింతయగు స్థూలకాయంబు గలుగుట
చిత్రభూషాంబరస్థితి నలరుట
తూర్యనాదంబులతో జనుదెంచుట
వాలవ్యజనసమవాప్తి గనుట
శృంగవేత్రోద్ధతి జేరరాకుండుట
చూపరుల్ పదుగురు చుట్టికొనుట
స్వనియంత్ర్య వాద్యంబు విని తలయూచుట
మౌనముద్ర వహించు మతము గనుట
గంగిరెద్దునకు మూర్ఖ భూకాంతునకును
భేదమించుకయును గానిపించ దట్టి
ప్రభుని వేడిన సత్కవి పదవి చెడదె......

మరో అడుగు ముందుకువేసి—

పదుగురు కోతివెంబడి సంచరింపరే
వాహకుల్లేరె శవంబునకును
గంగిరెద్దుకు లేవె ఘనతూర్యరావముల్
కలిమి గల్గదె వార కామినులకు
పులి గోవు జంపి నక్కల బోషింపదె
స్థూలకాయము లేదె దున్నలకును
పుప్పిపంటికి లేదె పుట్టంబు జుట్టుట
వేణుధరుం డెద్దు వెంటరాడె
న్యాయ పద్ధతి నడువని యవనిపతికి
నెన్ని చిన్నెలు గలిగిన నెందుకొరకు......

తన పొట్టకై ప్రజల గలచు దురితరతుడు వాడొక్క రాజా! పెను తరాజు గాక!-అంటాడు కూచిమంచి తిమ్మకవి కుక్కుటేశ్వర శతకంలో.

కవులకు దానాలివ్వని సంస్థానాధీశుల్ని అతిదారుణంగా దూషించిన కవులున్నారు. హీన ప్రభువులు కవులకు పీటీ ఘోటక హాటకాదు లియ్యక ఎట్లా చుట్టూతిప్పుకొంటారో తన భక్తమందారశతకంలో చెప్పాడు కూచిమంచి జగ్గకవి.

గడియల్ రెండిక సైచిరా, వెనుకరా కాసంత సేపుండి రా
విడిదింటం గడె సేద దీర్చుకునిరా, వేగంబె భోంచేసిరా
యెద పొద్దప్పుడు రమ్మటంచు సుకవిన్ హీన ప్రభుండీ గతిన్
మదతల్ పల్కుచు ద్రిప్పు గాసిదక రామా ! భక్తమందారమా!

జగ్గకవి తిట్లు తిట్టే కావు తక్కిన వాళ్ళతో పోలిస్తే. ఉదాహరణకు మరో కవి——

వయసు తీరిన కాంత వక్షోజముల భంగి
సంగమంబైన శిశ్నంబు కరణి
గర్భిణి యగు వారకాంత యుండెడి తీరు
పాండు రోగి ముఖంబు భంగి, ముసలి
యెద్దు ముడ్డిని పేడ యెళ్ళొచ్చు కైవడి
ఈన బోయిన గాడ్దె యోని కరణి
అగ్గి దాకిన వాని యండాల పోలిక
మగడు పోయిన లేమ పగిది, లుబ్ధు
యాచకుల జూచి తల వ్రేలవేసి పెద్ద
సున్నబుట్టుకదా ముందగన్న కొడుకు......

అని విజృంభించి బండబూతులు తిట్టాడు. దాన ధర్మాలు, గౌరవాదరాలు లభించలేదన్న కసి అటువంటిది.

పూర్వం లాగా వంశపారంపర్యంగా వచ్చిన సంస్థానాధిపతులు గాక, సంస్థానాల్ని కౌలుకిచ్చే పద్ధతివల్ల కొత్తగా కొంతమంది సంస్థానాధిపతులయ్యారు. ఏదోవిధంగా డబ్బు సంపాదించి దానితో ఒక సంస్థానాన్ని కౌలుకు తీసుకొని సంస్థానాధీశుడనిపించుకోవచ్చు. ఈ విధంగా సంస్థానాధిపతులయిన వాళ్ళను గురించిన ప్రశంస కూడా ఎక్కువే.

పంచాంగములు మోసి, బడవాతనము జేసి
పల్లెకూటము జెప్పపసుల గాచి

హీన వృత్తిని బిచ్చమెత్తి గోడలు దాటి
ముద్దకూళ్ళకుబోయి మొత్తుల బడి
విస్తళ్ళు గుట్టి, కోవెల నంబివాకిట గసవూడ్చి
లంజెల కాళ్ళుపిసికి
కన్నతొత్తుల తమ్మ కళ్ళెత్తి గతిచెడి
ఆలుబిడ్డల పరులంట జేసి
నట్టి దేబెకు సిరిగల్గెనేని వాడు కవి
వరులదూరు బంధువర్గములగేరు
పరుని పని మీరు నౌకరిని చెఱుపగోరు...

**అంటాడు వేణుగోపాల శతక కర్త పోలిపెద్ది వేంకటరాయ కవి.**

అంగడంగడ బిచ్చమడిగి వేసాల్ వేసి
జాబులు దెచ్చి పైజార్లు బట్టి......

ఇంకా ఏమేమో చేసి ప్రభువులయ్యారట.

కలిపురుష ప్రతీకాశులై దగుమోట
పశుల గాపరులు భూపతులైరి
చెడుగు కొంటెలకెల్ల బొడమిన గడుతొత్తు
కొడుకులు దొరలైరి గురుతు దనర......

అని విమర్శించాడు శ్రీ మదనగోపాల శతకకర్త వంకాయలపాటి వేంకట కవి.

నీచుల్ భూపతులైరి, వారి కడ దుర్నీతుల్దురాచారులే
వాచాలత్వము గాంచి మించిరి......

అన్నాడు శ్రీకృష్ణ శతకకారుడు ముండుబై వేంకట కృష్ణమాచార్యుడు.

ఈ సంస్థానాధీశ్వరులకు తగినట్లే వారి భృత్యవర్గమూ. రాజు దానం చేయ దలచుకుంటే ఎంత మంది అడ్డు పడడానికి వీలుందో ఈ కింది పద్యం చెప్తుంది.

ఆవనీశ్వరుడు మందుడైన నర్థుల కీయవద్దని
వది దివాను చెప్పు,
మునిషీ యొకడు చెప్పు బికిషీ యొకడు చెప్పు,
తరువాత నా మజుందారు చెప్పు,
తల ద్రిప్పుచును శిరస్తా చెప్పు, వెంటనే కేలు
మొగిడ్చి వకీలు చెప్పు,
దేశపాండ్యా తాను తినవలెనని చెప్పు, మునరద్ది
చెవిలోన మొనసి చెప్పు,
యశము గోరిన దొరకొడుకైనవాడు
ఇన్ని చెప్పులు గడద్రోసి ఇయ్యవలయు......

కవుల కిచ్చే దానాల కడ్డుపడే అధికారిని ఎంత జుగుప్సావహంగా కవి వర్ణించాడో ఈ కింది పద్యం చూస్తే తెలుస్తుంది.

తల్లి రంకున పుండ్లు తాకివచ్చిన యట్లు
మూల నిక్షేపంబు మునిగినట్లు
కూతురు ముదుపెల్లి కొల్లబోయిన యట్లు
కాణాచి పల్లెలు కాలినట్లు
చెల్లెపైబడి దొంగ చేసిపోయిన యట్లు
కొడుకు నప్పుడె తలగొట్టి నట్లు

దిగులు పడిచూచి, మూర్ఛిల్లి, తెప్పిరిల్లి
కవుల కీయగవద్దని కన్నుమీటు......

ఇటువంటి దృష్టాంతాలు మరెన్నో చూపించవచ్చు.

తనకు గతిలేక ఒకరిచ్చుతరిని వారి మతుల చెరచెడి రండకు గ్రతువులేల?
దుష్టుడు మంత్రైన రాజు చెఱచు-
ధర్మవిదులైన రాజ సంస్థానములను జేరుకదా నొక్కొక్క చీవాట్లమారి
శుంఠ-
మంత్రులమని బొంకు మాటలాడిన గాదు ఇప్పింపనేర్చి తామీయవలయు-

వంకర పాగాలు వంపు ముచ్చెలజోళ్లు
చెవిసందు కలములు చేరుమాళ్లు
మీగాళ్ళపై పింజలూగెడు ధోవతుల్
బిగితరంబైన పార్షీ మొహర్లు
చేపలవంటి పుస్తీమీసముల్ కలందా
న్వెట్టెలంగ వస్త్రములచుంగు
సొగసుగా దొరవద్ద తగినట్టు కూర్చుండి
అంకులాంధ్రకు సిఫారసులు చేసి
కవి భటుల కార్యములకు విఘ్నములు చేయు
రాయసాల్పిండములు దిను వాయసాలు—

ఈ పద్యంలో రాయసాల వేషం కూడా చక్కగా వర్ణించబడింది. బీద రికాన్ననుభవిస్తూ తమ ప్రతిభకు గుర్తింపు లేక గౌరవాదరాలు లేక కవులు పొందిన నిస్పృహ ఇంతంతని చెప్పరానిది. సంస్థానాధీశుల సభల్లో తమకంటే వేశ్యలకే గౌరవమెక్కువ. సుకవి కావడం కంటే వేశ్యయై పుడితే బాగుండేది అన్న కవులూ, మరీ జుగుప్సతో ఆమె అలచోటై ఉండినా మేలన్న కవులూ కూడా ఉన్నారు. తను రాజసభకు వస్తే లేచి గౌరవించని వేశ్యను గూర్చి కవి-

ఆస్థానమందు విద్వాంసులగని లేచి మ్రొక్కబూనని వార మోహినులను
తలగొరిగించి, మెత్తని సున్నమును బూసి, బొగ్గుగందంబున బొట్టమర్చి
చెప్పుల మెడగట్టి, చింపిచేటల గొట్టి, గాడిదపై బెట్టి, కాలమెట్టి
తటుకున గ్రామ ప్రదక్షిణం బొనరించి నిల్చిన చోట పేణ్ణీళ్ళు చల్లి
విప్రదూషకులను వారి వెంట నిచ్చి

సాగనంపవలయును శమను పురికి...—అంటాడు. ఇంత మందిని తిట్టినవారు తోటి కవుల్ని మాత్రం విడుస్తారా! రాజులనాశ్రయించి సన్మానాలు పొందే కవుల్ని తిట్టారు. కూచిమంచి తిమ్మకవి కుక్కుటేశ్వర శతకంలో—

పరమ లోభిని దివాకర తనూభవుడంచు
ధర్మచిత్తుని హరిశ్చంద్రుడనుచు

నిర్దయాత్ముని రామనృప శిఖామణి యంచు
కడుకురూపిని రతికాంతుడనుచు
పాపకర్మునభంగ పాండవాగ్రజుడంచు
సమరభీరుని సవ్యసాచియనుచు
కుందబీదను మరున్మండలేశ్వరుడంచు
మతిహీనుని భోగిపతి యటంచు

కవులు కక్కుర్తి నిసుమంత కడుపు కొరకు
పొగడుచుందు రవివేక బుద్ధులగుచు...
కూదదనగను గవితల గూర్చి బలిమి
గుమతుల కిచ్చు వాడొక కూళసుమ్ము...

...క్రూర నృపాల కాథములనమ్మి
సిరుల కాసించు వాడొక్క చెనటి గాడె...

తమ కవిత్వం కాక మరో బతుకు తెరువులేని కవులేంచేస్తారు ?

సామాన్యులను కూడా దానాలియ్యలేదని తిట్టారు. మారుతున్న ఆర్థిక వ్యవస్థలో విలువలు మార్తాయి గదా! పాతికేళ్ళ కిందటిలాగా ఇప్పుడు పాలు, పెరుగు ఊరికే ఇస్తున్నారా ఎవరన్నా! దానధర్మాలు పూర్తిగా తగ్గిపోలేదా?

అబ్బబ్బ! కిందదేడప్పయ్య ఏర్రాన శోలెజంగముకిస్తి సోలెడుప్పు
సాతాని జియరయ్య సతికితేపోయిస్తి కొల్లగా గుల్లెడు సల్లబొట్టు
లంక సత్తెలవాడు పొంకాన హొగిడతే మాలదాసరికిస్తి మానెదూద
వేదాయి వాగితే యెల్లు బొట్టయ్యకు కొలకుంద దోసెడు కొఱ్ఱలిస్తి
నొర తమ కన్న కూసుగాడవల నింక
గలడె యను మూర్ఖ గిద్దరకామవైరి...

ఒక్కొక్కజాతి ఒక్కొక్కరికి దానం చేస్తుంది కాని కవుల కిచ్చే వాడు మాత్రం లేదని మొత్తుకుంటారు.

జంగాలపాలు దేవాంగుల విత్తంబు
కాపు విత్తము పంబకాని పాలు
వ్యాపారి విత్తంబు వారకాంతల పాలు
కవుల కీగల జాతి యొక్కటియు లేదు...

వ్యవస్థ చెడిపోయిందనీ,కలికాలం వచ్చిందనీ,కులధర్మాలు మారిపోయాయనీ, బ్రాహ్మణులకు గౌరవంపోయిందనీ వాపోయారీ శతక కవులు - రాజకీయ ఆర్థిక వ్యవస్థల్లో వచ్చినమార్పు సమాజంలో సాంఘిక వ్యవస్థలో కూడా వస్తుందన్న సత్యాన్ని గుర్తించకపోగా పాత వ్యవస్థ పాడైపోయిందని కడివెడు కన్నీళ్లు కారుస్తారు.

కాపు కవీశ్వరుల్ కంచజ యోగులు సాతాని వైష్ణవుల్ సాలెభటులు
కోమటి దాతలు కొంచె భాగోతులు మాలవెజ్జులు బోయమావటీలు
గొల్ల పౌరాణికుల్ పల్లె దైవజ్ఞులు జానిస వేశ్యలు జైనజాప
లాఁడు దీర్పరులుగ్రయవన ధరాధీశ్వరులు వైదిక ప్రధానులును మిగుల
భూతలంబున కలిదోష హేతుకమున
ప్రబలురై రింక నేమిచెప్పంగవలయు......కుక్కుటేశ్వర.

కలికాలంబున వైద్యలక్షణ పరీక్షాశూన్య మూఢావనీ
తలనాథుల్ బలుమోట కాపుదొరలున్ దట్టంబుగా బిల్చి, మం
దులు సేయించ, భుజించి, క్రొవ్వి కడువైద్యుల్గారె, సిగ్గేది త
మ్మళులున్, నంబులు, క్షౌరకాంత్యజులు రామా! భక్తమందారమా!
-భక్తమందార

అక్షరం బెఱుగని యాకారపుష్టిచే వర్ణసంకరులు విద్వాంసులైరి
బాజారి రంకుకు పంచాయతీ చెప్పు పాతలంజలు వీరమాతలైరి
గోమాత లరువగ కోసివండుకతిను మాలమాదిగలు భూపాలులైరి
మానాభిమానముల్ మాని ప్రవర్తించు మంకు గులాములు మంత్రులైరి
అహహ! కలియుగ ధర్మమేమనగవచ్చు
ఇన్నిటికి నోర్చి యూరక యుండదరమె... -వేణుగోపాల

జారచోరులు దురాచారుల న్యాయ ప్ర
చారులు ప్రబలులై గేరుచుండ్రి
మాలలు తమ్మళ్ళు మంగళ్ళు నంబులు
బలువెజ్జులైరి భూతలమునందు

సౌరయుగ ధర్మంబులరయ మదికి
విస్మయ కరంబులై గనుపించుచుండె...

-శ్రీ మదనగోపాల

అగ్రహారములు నామావశిష్టములయ్యె
మాన్యంబులన్నియు మంటగలిసె
....................
ధార్మిక స్థానమునకిట్టి తళ్లుపుట్టె
కఠిన చిత్తుని రాజ్యాధికారిచేసి
యింత పీడించితివి సత్కవీంద్రకోటి...

-రామలింగేశ

తండ్రి మధ్వాచారి, తనయుడారాధ్యుడు, తల్లి రామానుజ
మతస్థురాలు, ఆలు కోమటి జాతిది, తమ్ముడు బౌద్ధుడు,
సద్ధకుడు సర్వేశ్వర మతస్థుడు, అక్క జంగమురాలు,
బావగారిది బలిజకులము, మరదలు కోడలు
మార్వాడి అని విమర్శిస్తాడు వేణుగోపాల శతకకారుడు

పైమాటలన్నీ బ్రాహ్మణ కవులవి. బ్రాహ్మణులకు గౌరవం పోయిందనీ, అగ్రహారాలు చెడిపోయాయనీ, వర్ణవ్యవస్థ కూలిపోయిందనీ, వృత్తులు తారుమారయ్యాయనీ ఈ కవులు దుఃఖించడం సహజమే. ఈ కాలంలోనే బ్రాహ్మణేతర కవులు కూడా శతకాలు చెప్పారు. పైమార్పులకు వాళ్ళు సంతోషించినట్లు కనపడదు. దేవుడిముందు కులభేదాలులేవనే సామాన్య నీతివాక్యంగా ఎప్పుడన్నా ఒకమాట అన్నా దానిమీద ఆశ పట్టింపు, నమ్మకమూ ఉన్నట్లు కనిపించదు. బ్రాహ్మణేతర కవులు మాత్రమే అక్కడక్కడా ఇటువంటి మాటలు చెప్పారు. కులభేదాలను నిరసించిన వీరశైవుల తీవ్రత వీళ్ళలో మచ్చుకు కూడా కన్పించదు. వీళ్ళు చాలా Passive గా కనిపిస్తారు. వర్ణవ్యవస్థలో కొట్టవచ్చి

నట్లు కన్పిస్తున్న అస్తవ్యస్తతను చూస్తూ ఊరుకున్నారే తప్ప ఉపయోగించుకో లేదు. నృసింహశతకంలాంటివి ఇందుకుదాహరణలు.

'సీతులకేమి యొకించుక బూతాడక దొరకు నవ్వుపుట్టదు' అని కవి చౌడప్ప అన్నట్లుగా మనసు దీరశృంగారశతకాలు రాయించుకున్నారు కొందరు. గోపీనాథం వేంకట కవి బ్రహ్మానందశతకం లాంటివి ఐదారు వచ్చాయి. కొందఱు దొరలు తమ ఉంపుడుకత్తెలమీద కవిత్వం చెపితే డబ్బిస్తామని ఆశ పెట్టారు. కక్కుర్తి పడి కవులు కావ్యాలురాస్తే ఎడమొగం పెడమొగం పెట్టి దబ్బొగ్గొట్టారు. దాంతో విలాసాలు విలాపాలయ్యాయి. కూచిమంచి జగ్గ కవి చంద్రరేఖా విలాపం ఈ కోవలోదే. బ్రహ్మానందశతకంలాంటి వాటిల్లో గూఢంగా ఏదో పారమార్థికత ఉందని పండితులు సమర్థింప యత్నించినా అందులో (Perverted sex) తప్ప మరేమీలేదనడంలో సందేహంలేదు. ఈ కాలంలోనే కొన్నిదేవాలయాలను ముస్లిములు చెడగొట్టగా, చూచే దిక్కులేక మరికొన్ని చెడిపోయాయి. శ్రీకాకుళ ఆంధ్రవిష్ణు దేవాలయం దుస్థితినిచూచి భరించలేక కాసుల పురుషోత్తమ కవి ఆంధ్రనాయక శతకం రాశాడు.

విజయనగరం విజయరామరాజు తన బాకీ సమయానికి తీర్చనందుకు ఫకీర్ అలీఖాన్ అనేవాడు సింహాచలంమీద దండెత్తాడు. అప్పుడు గోగులపాటి కూర్మనాథ కవి సింహాద్రి నారసింహ శతకం చెప్పాడు. శత్రు సంహారశతకం, బాలసుబ్రహ్మణ్యశతకం, భద్రగిరిశతకం, వేంకటాచలరమణశతకం, రంగధామ శతకం, కస్తూరిరంగశతకం ఇట్లాంటివే.

మారుతున్న వ్యవస్థలో భౌతికంగా, నైతికంగా, ఆర్థికంగా అన్నివిధాలా కుంగిపోయింది బ్రాహ్మణులు. వైదిక మతానికి బ్రాహ్మణులు ప్రతినిధులుకాబట్టి ముస్లిం దండయాత్రల్లో వారిని బాధించినట్లు మరెవరినీ బాధించలేదు. ఇది ఆనాటి శతకాల్లో స్పష్టంగా ప్రతిఫలిస్తున్నది.

సీరు హుక్కాపకడోరే గద్దాయని యాహితాగ్నుల నెత్తుల బచకుండ
పాము ధోనేకు తుం పానిలారేయని తివిరి శ్రోత్రియుల మర్దింపకుండ

ఘాసులారే అరేగాంఢూయనుచు శిష్టతతులపైబడి వడిదన్నకుండ
కులితీ పకావురే జలిదీయటంచు మాధ్వులమెడ వడిబట్టి త్రోయకుండ
బహుల కోలా మదావిల పరుషయవన
రాజి నిర్జింపు నీవంటి ప్రభువుగల్గి
బ్రాహ్మణులకిన్నిపాట్లు రారాదుగాదె—

సింహాద్రినారసింహ

బేగి అరే అరబ్బీపడోరే యని
బోడిసన్యాసుల బొడుచువారు
మత్రభోమూపరు మూటీయనుచు వైష్ణ
వులబొట్లు తుడువబోవువారు......

తురకల దండయాత్రలవల్ల సింహాచలం ప్రాంతం ఏ విధంగా నాశనమయ్యిందో కవి ఇలా వర్ణించాడు.

గ్రామముల్ నిర్ధూమధామములాయెను
సస్యంబులెల్ల నాశనము జెందె
దొడ్లలో శాకముల్ దుంపశుద్ధిగబోయె
దోచిరి సర్వంబు గోచితక్క
చెట్టొక పిట్టయై చెదరిరి దిక్కుల
బిలువెత పడరానిపాట్లు బడిరి
అన్నమందరకును నమృతోపమంబయ్యె
వరుసగానట మీద వానలేదు

ప్రజల పసతీరెనిక మొదల్పదిలమయ్యె
దరిదరికి వచ్చెనిదె మెండు తురకదండు...

ఈ దండు నెదుర్కొనగల తెలుగునాయకుడు లేకపోవడంచేత ఆ పనేదో నువ్వే చెయ్యమని ఆంధ్ర నాయకుణ్ణే ప్రార్థించాడు కాసుల పురుషోత్తమ కవి. ఈ దాడులకు భయపడి ఆలయం నుంచి విగ్రహాలను తొలగించి దాచిపెట్టడం కూడా జరిగింది. ధంసా అనేవాడు దండెత్తి రాగా భద్రాచలంలో రాములవారి

విగ్రహాన్ని పూజారులు రహస్యంగా పోలవరానికి తీసుకునిపోయారు. ఆ సందర్భంలో భల్లా పేరయకవి రాసిన శతకం భద్రగిరి శతకం.

సొమ్ములు బీబీల సొగసు కర్పణజేసి
వాహనంబుల నశ్వవాహనులకు
పంచపాత్రలు సురాపానవర్తనులకు
పళ్ళెరంబులు మాంస భక్షకులకు...

విడిచిపెట్టి పారిపోయావని రాముణ్ణి అధిక్షేపించాడు కవి. తెలంగాణా అంతటా మహమ్మదీయుల పరిపాలనే. సంస్థానాధిపతులు మాత్రం ఎక్కువ భాగం హిందువులే. మహమ్మదీయ రాజ్యంలో హిందూ దేవాలయాల విధ్వంస కాండ కొంత తక్కువే. తెలంగాణా 14వ శతాబ్దంలోనే మహమ్మదీయుల అధికారంలోకి పోయింది. ఆ కొత్తలో దేవాలయాలను ధ్వంసంచేసినా అధికారం స్థిరపడింతర్వాత ప్రజల్లో అధిక సంఖ్యాకులు హిందువులుగా ఉన్న తమ రాజ్యంలో ఇటువంటి కృత్యాలు సాగించడానికి మహమ్మదీయులు సాహసించలేదు. వాళ్ళ అధికారంలోకి చాలా ఆలస్యంగా వచ్చిన, అదీ అస్థిరంగా ఉన్న రాయలసీమ, సర్కారు జిల్లాల్లోని గ్రామాలు, దేవాలయాల మీద మాత్రం చాలా దాడులు జరిపారు. అందుకే అధిక్షేప శతకాలు ఆ ప్రాంతంలోనే ఎక్కువ వచ్చాయి. తెలంగాణాలో ప్రసిద్ధమైన సంఘటన భద్రాచలం.

బ్రిటిష సామ్రాజ్యవాదుల పెట్టుబడి దేశంలో ప్రవేశించిన ఫలితంగా పెట్టుబడిదారీ సమాజ లక్షణాలు సూచనప్రాయంగా మన సమాజంలో కనిపించసాగాయి. ద్రవ్య సంబంధాలు పెరిగాయి. సంస్థానాధిపతుల సర్వం సహాధిపత్యం నశించిందనడానికి సామాన్యులు తిరగబడ్డ సందర్భాలెన్నో ఉన్నాయి. పెద్ద భూస్వాముల తరహాలో సంస్థానాధిపతులు వ్యవహరించారు. కూచిమంచి తిమ్మకవిని గూర్చి ఒక చిన్న కథ ఉంది. ఆయనపై ఆగ్రహించిన ఒక సంస్థానాధిపతి బావ మరిది నీలాద్రిరాజనేవాడు తిమ్మకవి పొలానికి నీరు రాకుండా నిరోధించాడు. తిమ్మకవి గంగాభవాని స్తోత్రం చేయగా కట్టలు తెంచుకొని నీరు పొలంలోకి ప్రవహించిందట. పొలంలోకి నీరు ఎట్లా వచ్చిందన్న విషయాన్ని పక్కకు పెడితే సంస్థానాధిపతుల అశక్తత స్పష్టంగా గోచరిస్తుంది. ప్రభు

భృత్య సంబంధం వెనకబడి ద్రవ్య సంబంధం (Money relations) ప్రధానమయింది. ఏ విధంగానైనా డబ్బు సంపాదించడమే ప్రధాన లక్ష్య మయింది.

తల్లిని వేరుంచి తమ్ముల విడదోలి
అక్కచెల్లెండ్ర సొమ్మపహరించి...
— మదనగోపాల

ఇంతా ఏమేమోచేసి డబ్బు సంపాదించడం సర్వసాధారణమైంది. అప్పు లివ్వడాలూ, ఎగ్గొట్టడాలూ మామూలే.

అప్పుపుచ్చుకొని లేదనుమొండి కొయ్యకు
పత్రంబు చింపుకోభారమగునె......
అప్పిచ్చి యిమ్మని యడుగునాత డధర్మ
డెగ దొబ్బు నాతడు తగవు పెద్ద...
— శ్రీ మదన గోపాల

అప్పు దీర్పగనైన నపహరింపగనైన
దలచువానికి బత్రంబు వలదు...
—రామలింగేశ

మరి కొన్ని శతకాలున్నాయి. ఇవి భక్తి శతకాల వర్గంలో చేరతాయి. ఏ దేవుణ్ణి స్తుతిస్తూ వచ్చాయో ఆ దేవుణ్ణి గురించిన పౌరాణిక కథాంశాలను తడుముతూ నీవే తల్లివి, నీవే తండ్రివి, నీవే గురుడవు,-నీవే దిక్కని సాష్టాంగ దండప్రమాణాలు చేస్తాయి. వీటిలో కొన్నింటిని విష్ణు సహస్రనామాలుగా విభాగించినా విభాగించవచ్చు. కేవల సంబోధనలతోనే మూడు వంతులు శతకం నడిచిపోతుంది. మిగిలిన ఒక వంతు నేను పాపిని, అల్పుణ్ణి, రక్షించ మని ప్రార్థించడంతో పూర్తవుతుంది. అధిక ప్రచారం ఉన్న కృష్ణశతకం కూడా దీనికి అపవాద మేమీ కాదు. ఈ కవుల్లో చాలామంది సమకాలీన సమాజంతో విసిగిపోయి, నిరాశానిస్పృహలకులోనై విరక్తి చెంది దేవుడనే భావనలో శాంతినీ, తృప్తినీ వెదుక్కొనే ప్రయత్నం చేసి ఉంటారు. అందుకే

భక్తిభావంలో అంత తాదాత్మ్యత. నిత్యం ఎదుర్కోవలసి ఉన్న లౌకిక సమస్యల నుంచి పారిపోయే ప్రయత్నం ఈ విధమైన భక్తిగా పర్యవసించి ఉండవచ్చు.

సంస్థానాలను ఆశ్రయించుకొనీ, ఆశ్రయించుకోనకా కావ్యాలూ శతకాలూ రాసిన కవులు చాలా మంది ఈ కాలంలో ఉన్నారు. గతాను గతికంగా వచ్చిన ఇటువంటి రచనల్ని గురించి తెలుసుకోవడానికేమీ లేదు. స్వయంగా బహు గ్రంథ రచనగావించిన సంస్థానాధీశులు కూడా ఉన్నారు.

18 వ శతాబ్దానికి చెందిన శతకకారులు దాదాపు 50 మంది శతక వాఙ్మయ చరిత్రల్లో కనిపిస్తారు. కాని విశేషమేమంటే ఇందులో ఏ నలుగురైదుగురో మాత్రం తెలంగాణా ప్రాంతం వాళ్ళు. రాజదూషణ పరమైనవీ, సాంఘిక చరిత్రకు విశేషంగా పనికి వచ్చేవీ అయిన శతకాలను ఈ నలుగురైదుగురు కవులు కూడా రాయలేదు. భద్రగిరి శతకం రాసిన భల్లా పేరయ్య తెలంగాణా వాడైతే అదొక్కటే మహమ్మదీయుల ఆగడాలను వర్ణించింది.

పద్దెనిమిదో శతాబ్దంలో ఉత్తర సర్కారుల్లోని సంస్థానాలలో కలిగిన మౌలికమైన మార్పు తెలంగాణా సంస్థానాలలో కలగలేదు. వాటి రాజకీయ, ఆర్థికస్థితిలో మార్పు రాలేదు. ఇక్కడి శతకాలు మరో విధంగా ఉండడానికి అదే కారణమై ఉండాలి.

వస్త్వాశ్రయమైన రచనలకీ, ఆత్మాశ్రయమైన రచనలకీ భావ వ్యక్తీకరణ విషయంలో ఒక భేదం ఉంటుంది. వస్త్వాశ్రయమైన రచనల కంటే, ఆత్మాశ్రయమైన రచనలు ఎక్కువ informal గా ఉంటాయి. అందుకే వ్యావహారికమూ, స్వాభావిక లక్షణాలపైన కృత్రిమ ఆచ్ఛదనా లేని రచనల్లో వ్యక్తీకరణలో కూడా కృత్రిమతకు చోటుండదు. భాష స్వాభావికంగా ఉంటుంది. పండితులైన కవుల భాష విషయంలో కూడా ఇదివర్తిస్తుంది. ధూర్జటినే ఉదాహరణంగా తీసుకుంటే కాళహస్తి మాహాత్మ్యం, కాళహస్తీశ్వర శతకాల భాషలో కన్పించే వ్యత్యాసమే వస్త్వాశ్రయ, ఆత్మాశ్రయ రచనల్లో భాషకున్న భేదాన్ని నిరూపిస్తుంది. పైగా 18వ శతాబ్దపు కవుల శతకాల్లో మరింత స్వేచ్ఛ చోటు

చేసుకుంది. భాష ఛందస్సుల విషయంలో సడలింపు (laxity) స్పష్టంగా కనిపిస్తుంది. లక్షణ బద్ధంగానే రాయాలన్న పట్టుదలలేదు.

ప్రధానంగా ఉపయోగించుకున్న రచనలు : 

సుబ్బారావు, వంగూరి — శతక కవుల చరిత్రము, నరసాపురము, 1957.

గోపాలకృష్ణరావు, కె — ఆంధ్ర శతక సాహిత్య వికాసము, హైదరాబాదు, 1976.

వేంకటకృష్ణశర్మ, వేదం— శతక వాఙ్మయ సర్వస్వము, 1954.

లక్ష్మీరంజనం, ఖండవల్లి— ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి, హైదరాబాదు.

దొణప్ప, తూమాటి — ఆంధ్ర సంస్థానములు - సాహిత్య పోషణము, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు, 1969.

— శతక సంపుటము 1,2,3,4, వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్స్, మద్రాసు.

— శతక సంపుటము 1,2, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు.

Antinova K., Bongard - Levin G. Kotovsty G— A History of India, Progressive Publishers, Moscow, 1978.

Damodaran, A. D— "The real cause of Poverty in India today", An unpublished article.

Pavlov, Rastyannikov, V. Shirokov, G. India : Social and Economic Development. Progressive Publishers, Moscow 1975.



# ముఖ్యమైన తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | ఉన్నది | ఉండవలసింది |
|---|---|---|---|
| 25 | 24 | ప్రతిహత విక్రముఁడు | ప్రతిహత శత్రు విక్రముఁడు |
| 27 | 5 | గ్రావఁగ | గావఁగ |
| 27 | 13 | ప్రథివీంభ్రాత్రభిస్సహ | పృథివీంభ్రాతృభిస్సహ |
| 28 | 17 | సర్వాస్వపత్యాన్ని | సర్వాస్వపత్యాని |
| 31 | 22 | సంత్య | సత్య |
| 44 | 23 | - లేదా | - పాశుపత లేదా |
| 54 | 5 | ఉత్తరామాయణం | ఉత్తర రామాయణం |
| 59 | 2 | విజృంభించగ | విజృంభించగల |
| 59 | 13 | జాగృతమైన | జాగృతమై |
| 64 | 25 | 9 | 1 |
| 65 | 22 | 10 | 1 |
| 66 | 8 | భారతరంభంలో | భారతారంభంలో |
| 70 | 14 | తిక్క | తిక్కన |
| 76 | 20 | నీరుగ్రోలి | నార[illegible]గ్రోలి |
| 77 | 3 | వాఖ్య | వ్యాఖ్య |
| 79 | 6 | బులిపుచ్చుట | బులిమిపుచ్చుట |
| 81 | 18 | తిక్క | తిక్కన |
| 82 | 13 | పయల్ | పతుల్ |
| 82 | 14 | 'య' | 'తు' |
| 90 | 25 | ''పేరాటాంధ్ర'' | ''పేరటాంధ్ర |
| 91 | 12 | పదార్థమును నీగి పెట్ట - | పదార్థమున నీగి పెట్టరాదు |
| 104 | 6 | సంతోషించడిని | సంతోషించాదని |
| 113 | 1 | నొకొక్కక్కడై | తాహొక్కక్కడై |
| 123 | 5&11 | వస్సైక్యము | వస్త్రైక్యము |
| 146 | 12 | దాడుకనే | వాడుకనే |
| 179 | 28 | గామాల | గ్రామాల |
| 201 | 24 | ఆడిదం | ఆడిదం |

—: ం :—